## చారిత్రక శ్రీశైలముపై అభిప్రాయములు

లిఖిత చరిత్రకు పూర్వంనుంచి అనాదిగా ప్రఖ్యాతిగాంచిన ప్రదేశము శ్రీశైలము. భారత భూఖండములో ఏచోటును గురించి చెప్పినా అది శ్రీశైలానికి ఉత్తరమనో, దక్షిణమనో, ఈశాన్యమనో నిర్దేశితమగుతూ వస్తూవున్నది. ఎన్ని శతాబ్దాలనుంచో అటువంటి ప్రదేశమునకు సంబంధించిన తగిన చారిత్రక ఆధారములతో కూడిన విశేషములను తెలిపిన ఈ గ్రంథము చాల విలువైనది. అనేక వంశముల రాజులూ అనేకతరముల కవులూ యాత్రికులూ శ్రీశైలాన్ని గురించి చెప్పిఉంచిన విషయాలను ఇందు పొందుపరచి మిక్కిలి వైవిధ్యముగల ప్రమాణగ్రంథాన్ని మనకు అందించి కృతకృత్యులయినారు శ్రీ కొడాలి లక్ష్మీనారాయణ.

ఆంధ్రజ్యోతి నవంబర్ 19_1967



## READABLE NARRATIVE

The author has culled titbits of information from various sources and succeeded in weaving it into a readable historical narrative. It contains a mine of information about the noted pilgrim centre and its picturesque environment. Till a few years ago the place was almost inaccessible what with wild animals and difficulties of ascent. Nowadays there is a regualr bus service to Srisailam which is a boon to the Saivites and other visitors who have faith in Malikarjuna and Bhramaramba. By the way the author was felicitated for his historical research by the Andhra Pradesh Government a couple of years ago with a purse and two shawls.

D. S. M.

The Indian Express-
Sunday Standard D. 1—9—'68
A part of the Review on the author's book

జనవరి 1972

రెండవ కూర్పు

వెల : రు. 10-00

శ్రీ శారదా ప్రెస్, తెనాలి_2



ప్రతులు : 1000

# చారిత్రక శ్రీశైలము

## 1. శ్రీశైలనామ విచారణ

శ్రీశైలము కర్నూలుజిల్లాలో నందికొట్కూరు తాలూకాలో నల్లమల పర్వతముల మధ్య నున్నది. 16 డిగ్రీలు 12' ఉత్తర అక్షాంశములోను 78 డిగ్రీలు 5' పూర్వ రేఖాంశములోను ఈ ప్రదేశమున్నది. ఇది కృష్ణవేణీతీరమున నొక లోయలో నున్నది. గౌతమీపుత్ర శాతకర్ణి (క్రీ. శ. 117-142) అను ఆంధ్ర శాతవాహనరాజు తన శాసనములో శ్రీస్థానమని పేర్కొనెను. కాని అది శ్రీశైలముకాదు. శాతవాహనరాజుల అనంతరము ఆంధ్రభూమిలో కొంతభాగము క్రీ.శ. 3 వ శతాబ్దమున పాలించిన ఇక్ష్వాకురాజులు తమ శాసనములలో గుంటూరుజిల్లాలోని శ్రీపర్వతమును పేర్కొనిరి. వీరే శ్రీపార్వతీయులు. 18 శాసనములు వీరివి కలవు. వీరి రాజధాని విజయపురి అని పేర్కొనబడినది. ప్రఖ్యాత బౌద్ధమతాచార్యులు 'నాగార్జునుడీ' పర్వతము మీదనే వసించి, గొప్ప ప్రయోగశాలలను, విశ్వవిద్యాలయమును స్థాపించుటచేత దీనికి నాగార్జునకొండయను పేరు గలదు. కనుక శ్రీశైలము వేరు, శ్రీపర్వతము వేరు అని తెలిసికొనవచ్చును.

శ్రీశైలము గొప్ప శైవక్షేత్రము. శ్రీశైలము, ద్రాక్షారామము, కాళేశ్వరముల మధ్యప్రదేశమును 'త్రిలింగ' మని పేర్కొనిరని ఈ పదమునుండియే తెలుంగు ఆవిర్భవించిన దని కొందరు పండితులు వ్రాసిరి. ప్రతాపరుద్రుని ఆస్థానకవి 'విద్యానాథుడు' ప్రతాపరుద్ర యశోభూషణమున దీనిని పేర్కొనెను. అప్పకవి కాళేశ్వరమునకు బదులు 'కాళహస్తి' యని పేర్కొనెను ఈ నిర్ధారణకు మారు చారిత్రకాధారములు లభ్యము కాలేదు. మొత్తముమీద శ్రీశైలమునకు పడమర కర్ణాటక దేశముండుటచేత, తూర్పున పూర్వనాడు అనుపేరుతో తెలుగు దేశముండుటచేత, దక్షిణమున తమిళ లేక ద్రవిడ దేశముండుటచేత ఆయా భాషా రాష్ట్రములకు శ్రీశైలము పొలిమేరగా నున్నట్లు కాన్పించుచున్నది. సమతలముగా నున్న శ్రీశైలము తూర్పు పడమరలు మూడు మైళ్ళు, ఉత్తర దక్షిణములు ఆరు మైళ్ళుండును. ఇచటి ప్రకృతి సౌందర్యము, దృశ్యములు, వాగులు, కొండలు, అడవి, పక్షులు, మృగములు మున్నగు వానిని జూచిన కన్నుల పండువుగా నుండును.

దీనికి 'సిరిగిరి, శ్రీగిరి, శ్రీపర్వతము, శ్రీశైలము,' మున్నగు నామములు గలవు. ఆంధ్రము, సంస్కృతము, కన్నడము, తమిళభాషలలోని గ్రంథజాలములో దీని ప్రశంస గలదు. శ్రీ అనగా సంపద (Wealth). శైలము అనగా పర్వతము, (Mount) కనుక శ్రీ పర్వతము అనగా సంపదగల పర్వతమని (Mount of wealth) చెప్పవచ్చును. ఆ సంపద ఏమిటో తరువాత విచారింతము. క్రీ. శ. 1313 లోని ఒక శాసనమునుబట్టి దీనికి శ్రీకైలాస (శ్రీశైలము) అని పేరున్నట్లు కాన్పించును. మహేశ్వరులు 'శ్రీకైలాసము' (శ్రీశైలము) పైన నివసించిరని యున్నది. మైసూరులోని కదంబరాజుల తాల్గుండి శాసనములో మొదటిసారిగా శ్రీశైలముపేరు గాన్పించుచున్నది. ఈ శాసనము క్రీ శ. 6 వ శతాబ్దినాటిది. దీనినిబట్టి శ్రీశైలము క్రిందవరకుగల అరణ్యములు అతనిపాలనలో గలవని తెలియుచున్నది. అంతకు పూర్వమే క్రీ. శ. 5 వ శతాబ్దిలోని 'త్రిలోచన పల్లవుడు (ముక్కంటి కాడువెట్టి) శ్రీశైల పర్వతమునకు ఆగ్నేయభాగమున అరణ్యమును ఛేదించి, నివాసయోగ్యమగు ప్రదేశముగజేసి, బ్రాహ్మణాగ్రహారముల నెలకొల్పెనని, తరువాత చోళులు వీరి నణచి, ఆక్రమించిరని చరిత్రలు నుడువుచున్నవి. శైవకవియైన పాల్కురికి సోమన (క్రీ. శ. 14 శ.) తన 'పండితారాధ్య చరిత్రము' లో 'కర మొప్పు దక్షిణ కైలాసమనగ' అని పేర్కొనెను. దీనికి 'మల్లిపురము, మల్లికాపురము, మల్లికార్జునపురము' అను పేర్లుకూడ గలవు. 'ఇది శైవులకు ముఖ్యకేంద్రమని, ఆంధ్రదేశములోని కర్నూలు జిల్లాలోగలదని, 'తేవరం' పద్యములలో నిది 'తిరుప్పారుప్పరం' (శ్రీపర్వత) అని పేర్కొనబడినదని విద్వాంసులు వ్రాసినారు*. 'తేవరం' (దేవహారము) అను తమిళ గ్రంథములో అప్పర్, సుందర్, సమ్మందర్' అను వారు శ్రీశైలమును గూర్చి గానముచేసిరి. వీరు గొప్ప శైవభక్తులు. వీరితోబాటు 'తిరుతొండార్' అను శైవభక్తుడుకూడ ఆ కాలమున ప్రసిద్ధిగాంచెను. 'తేవరం' అను భక్తికావ్యము. క్రీ. శ. 6, 7 శతాబ్దులనాటిది.

ఆదిమ పల్లవరాజులు జైనులు. తర్వాత వీరు శైవులుగా మారి కంచిలో శైవాలయముల గట్టించిరి. పల్లవరాజు సింహవిష్ణుకుమారుడు 1 వ మహేంద్ర

---

* N. Subrahmanya - South Indian Temple Inscriptions I Sri Sailam - "The place, a famous pilgrim centre for the Saivites, is in the Kurnool District of Andhra State. This is referred to as Tirupparupparam (Sri parwata in the Tevaram Hymns");

వర్మన్ (క్రీ. శ. 600-630) ఆదిలో జైనుడు. కొండలు తొలిపించి గుహావిహారములను నిర్మించి జైనయోగులకు నివాసయోగ్యములుగాజేసెను ఈయన కందుచేత 'చైత్యకారి' యను బిరుదుండెను. 'అప్పార్, సంబందార్' అను శైవయోగులు జైనుల నోడించి జైనమతము నణచుటయేకాక, మహేంద్రవర్మను శైవునిగా మార్చిరి. ఈరాజు శైవుడైన తర్వాత 'మత్తవిలాస ప్రహసనము' అను గ్రంథమును రచించి అందు కాపాలికుల పాశుపతుల విమర్శించెను. కనుక ఈ శైవ యోగులు శ్రీశైలమును గూర్చి గానముచేయుటచేత శ్రీశైలమును దర్శించిరని చెప్పవచ్చును 'కలైక్కలంచియం' అను తమిళ గ్రంథములో శ్రీశైలమును గూర్చి వ్రాయుచు దీనికి మల్లిపురమని మరియొక పేరు గలదని, నందిదేవరకు సంబంధించిన పురాణకథను పేర్కొనుచు, 'పరుప్పవనాదర్, పరుప్పదనాయకీ' ఈ కొండపైన గలరని, వీరినిగూర్చి 'ముమ్వరం' పాడిరని 'తిరుపరుప్పదమ్' (శ్రీశైలము) అని దీనికి పేరు గలదని, ఇదియే మల్లికార్జునపురమని వ్రాయబడియున్నది*. తమిళభాషలో 'ముమ్వరం' అను పేరు అప్పర్, సుందర్, సమ్మందర్' అనువారికి జెందును. 'మాణిక్యవాచకర్ అను మరియొక శైవభక్తుడు కలడు; కాని ఈయన 'మువ్వరం' అను వారిలో జేరడు. ఈప్రకారము క్రీ. శ. 6 వ శతాబ్దములో ప్రస్తుతము శ్రీశైలమని పేర్కొనబడు అరణ్య ప్రదేశముల త్రిలోచన పల్లవుడు (క్రీ. శ. 458-80) ఛేదించి బ్రాహ్మణులకు నివాసయోగ్యము లొనరించి బ్రాహ్మణుల కగ్రహారములుగా జేసెను. కావేరి పట్టణమును రాజధానిగా జేసికొని పాలించిన కరికాలచోళుడు ఈయననోడించి, ఆయన అధీనములోని రాజ్యమును లోబరచుకొనెను. అప్పుడు శ్రీశైలము చోళరాజులక్రింద నుండవచ్చును. పిమ్మట కదంబరాజులు శ్రీశైలప్రాంతమును స్వాధీనపరచుకొని అచటనేయుండి పల్లవ, బాణ, గాంగరాజులపైకి దండెత్తిరని 'తాళ్గుండ' శాసనాధారమున జెప్పవచ్చును.

"Mayura Sarma made Sriparavata Region for the base of his operations against Pallavas"

శాతవాహనుల తర్వాత ఇక్ష్వాకులు, బృహత్పలాయనులు, శాలంకాయనులు, ఆనంద గోత్రజులు, పల్లవులు, విష్ణుకుండిన వంశములవారు ఆంధ్రదేశములోని వేరు వేరు భాగముల బాలించసాగిరి. వీరిలో పల్లవులు, విష్ణుకుండిన వంశములవారు ఉత్తర భారతవర్షమును బాలించిన వాకాటకులు, గుప్తుల బోలినవారు;

---

* పెరియసామిత్తురన్-కలైక్కలంచియం-6 నం. - పుట 11

ఉభయులకు అనేక సామ్యములున్నవి బ్రాహ్మణమత ప్రచారము, సంస్కృత భాషావ్యాప్తి, యజ్ఞయాగాది కర్మకాండవ్యాప్తి ఉభయులలోను కలదు. ఇంకను బౌద్ధ, జైనమతముల విధ్వంసము కూడ పల్లవ, విష్ణుకుండిన రాజులవలన జరిగెను.

పల్లవరాజులు క్రీ శ. 200-630 వరకు 21 మంది పాలించిరి. ఇందులో 'శివస్కందవర్మ' ఆంధ్రదేశమును జయించెను. వీరికాలములో బౌద్ధారామములు పోయి హిందూదేవాలయములు వెలసెను. విష్ణుకుండిన రాజులు మొదట త్రికూటము, మలయాద్రి. ధాన్యకటకములలో నుండి, బలపడుచున్న వేంగి నాక్రమించిరి. వీరు శైవులై ఆలయ నిర్మాణమునకు గడంగిరి. విష్ణుకుండినులకు బూర్వము ఆంధ్రలో బౌద్ధుల ఉపయోగార్థము, గుహావిహారములు, స్థూపములు, సంఘారామములు నిర్మించబడెను అత్యద్భుతమైన బౌద్ధశిల్పము అనేకచోట్ల వెలసినది. క్రీ. పూ. 300—క్రీ. శ. 300 వరకు బౌద్ధమతము ఆంధ్రదేశములో నుచ్ఛస్థితిలో నుండెను క్రీ. శ. 420—611 వరకు 9 మంది విష్ణుకుండినరాజులు ధాన్యకటకము రాజధానిగా జేసికొని పాలించిరి. వీరి శాసనములు 6 మాత్రము లభ్యమైనవి. ఈ శాసనములు ఈపూరులో 2, పోలమూరు, చిక్కుళ్ల, రామ తీర్థములలో ఒక్కొక్కటి లభ్యమైనవి. వీనిలో 'త్రికూట మలయాధిపతి' అని 'భగవత్ శ్రీ పర్వతస్వామి పాదానుధ్యాతస్య' అని ఉన్నది. వీనినిబట్టి వీరు మల్లికార్జునస్వామి పాదభక్తులని శ్రీ పర్వతస్వామి వీరి ఇష్టదైవమని తేటతెల్లమగు చున్నది. విష్ణుకుండిన రాజగు 1 వ మాధవవర్మకాలమున ధాన్యకటకము అను బౌద్ధస్థూపముగల ప్రదేశము అమరేశ్వరస్వామిగల అమరావతిగా మారినది. ఈ కాలమున శైవమతము రాజమతముగా మారినది. బౌద్ధజైనుల నణగద్రొక్కుటకు కాలాముఖశైవులు విజృంభించిరి. కాలాముఖులకు బెజవాడ, అమరావతి ముఖ్య కేంద్రములై యుండెను. శైవులు కాలాముఖ మఠముల స్థాపించి, మత ప్రచారము చేయుచు, ఉచిత విద్య, ఉచిత వైద్యము, ఉచిత భోజనము ఏర్పాటుచేసిరి.

విష్ణుకుండిన రాజులలోనివాడు 'విక్రమేంద్రవర్మ' క్రీ. శ 500-525 వరకు ఉండెను. చివరివాడగు 2 వ విక్రమేంద్రవర్మ (క్రీ శ. 625-630) కాలమున చాళుక్యరాజగు పులకేసి దండయాత్రచేసి, విష్ణుకుండిన రాజుల నోడించెను. శ్రీ పర్వత దేవతారాధకులమని చెప్పుకొను ఈ విష్ణుకుండిన రాజులకాలములో, అమరావతిలోని బౌద్ధస్థూపము నాశనమాయెను. వీరు బౌద్ధ జైనులకు బద్ధవిరోధు

లని, ఆయామత నాశనమునకై వీరికాలమున సింహ పరిషత్తులు ముఖ్యనగరము లలో నేర్పడినట్లు కాన్పించుచున్నది. కాలాముఖము శైవములోని, 'లకులీశములో' నొకశాఖ. కాలాముఖులు అమరావతి మున్నగుచోట్ల నుండి శైవమత ప్రచార మొనర్చిరి. వీరి సింహపరిషత్తు బెజవాడలో నుండెను. 2 వ అమ్మిరాజు తాడికొండ శాసనములబట్టి ప్రభుత్వరాశియను కాలాముఖ సన్యాసికి మూడు చతుశ్శాలలుగల ఒక మఠము కట్టించెనని తెలియుచున్నది. రామ్పూరు శాసనములలో గోవిందవర్మ (క్రీ. శ. 540-546) 'భాగవత శ్రీ పర్వతస్వామి పాదానుధ్యతస్య విష్ణుకుండినం మహారాజస్య శ్రీ గోవిందవర్మనాః-" అని పేర్కొనెను. విష్ణుకుండినరాజులు, వారి వంశమువారు శ్రీశైలస్వామిని కులదేవునిగా వర్ణించుకొనిరి. E I XVII శ్రీ పర్వతస్వామిన్ భక్తులముని యిందు పేర్కొనబడినారు. (R se to Power in the 5th century A. D. as the worshippers of the feet of the holy Lord 'Sree Porwatha swamy established on Sree Parwatha") మాధవవర్మ శాసనములలోగూడ 'భాగవత శ్రీ పర్వతస్వామి పాదానుధ్యాతః' అని కలదు. (who meditates on the feet of the holy Lord of Sreeparvatha) వారు శ్రీ పర్వతస్వామి పాదముల నారాధించిరని తేలుచున్నది. వీరి వంశ వృక్షము క్రిందాగున ఉన్నది.

1 వ మాధవవర్మ :- (క్రీ. శ. 420-455) వాకాటకుల సాయమున ఆంధ్రను జయించి, వారి కుమార్తెను పరిణయమాడెను

|

దేవవర్మ :- (క్రీ. శ, 455-458)

|

2 వ మాధవవర్మ :- (క్రీ. శ, 458-488)

|

1 వ విక్రమేంద్రవర్మ :- (క్రీ. శ. 500-525)

|

ఇంద్రవర్మ - గోవిందవర్మ :- (క్రీ. శ. 540-546)

|

3 వ మాధవవర్మ (క్రీ. శ. 546-611)

|

మంచన భట్టారకుడు

2 వ మాధవవర్మకు సమకాలములో కంచిలో పల్లవరాజు త్రిలోచన పల్లవుడు (485-510) కావేరి పట్టణము రాజధానిగా కరికాలచోళుడు, వాతాపి రాజధానిగా చాళుక్యరాజు విజయాదిత్యుడు పాలించిరి. త్రిలోచన పల్లవుడు చోళదేశమును. ఆంధ్రదేశమును జయించవలెనని తలంచెను. పశ్చిమ చాళుక్య రాజగు విజయాదిత్యుని ఓడించి, సామ్రాజ్యవిస్తీర్ణతకు ప్రయత్నించుచుండెను. కరికాల చోళుడు ఆంధ్రదేశములోని రెండవ మాధవవర్మ కలసి త్రిలోచన పల్లవుని ఓడించి, అతని సామ్రాజ్యతృష్ణను ధ్వంసముచేసిరి. కావేరినది. కానకట్టకట్టిన 1 వ కరికాలుడు ఈయనయేయని కొందరు వ్రాసిరి; కాని అదిసరికాదు. ఇంతకు ముందొకరు కరికాల చోళులు కూడ గలరు. పల్లవరాజుల శాసనములలో శ్రీపర్వతస్వామి పేరు కన్పించదు. కదంబరాజుల శాసనములో శ్రీశైలము పేరు మాత్రమున్నది. కాని మల్లికార్జునలింగ ప్రస్తావనలేదు కనుక ప్రప్రథమముగా విష్ణుకుండినరాజుల శాసనములలో శ్రీపర్వతస్వామి పాదభక్తులమని యుండుటచేత వారే ఈ పూజకు ఆరంభకులుగా గాన్పించుచున్నారు. మరియొక విశేషమేమనగా వీరి శాసనములలో 'మల్లికార్జునస్వామి' పాదభక్తుల మని ఎచటను తగులలేదు. కాని 'మల్లికార్జునస్వామి పేరు' క్రీ. శ. 5 వ శతాబ్దములో నావిర్భవించినట్లు కాన్పించును. విష్ణుకుండినుల మొదటి శాసనములగు 'ఈపూరు' శాసనములలో 'శ్రీపర్వతస్వామి పాద భక్తులము' ని ఉండుటచేత వారు శ్రీశైలములోని లింగము లేక స్వామి అనుగ్రహముచే తమకు రాజ్యప్రాప్తిగల్గినదని భావించి ఆస్వామి నారాధనకు గడంగిరని నేను ఊహించుచున్నాను. ఇది స్వయంభూదేవలింగమని, సోమనాథాది కవులు చెప్పు నుటచేత, బహుశ యిది సహజముగా లింగాకారముగా నేర్పడి యుండుటచేత దీని పూజకు విషుకుండిన రాజులు ఆరంభించిరని తోచుచున్నది. [illegible] లింగమే ఈ లింగమని విద్వాంసుల అభిప్రాయము. కనుక క్రీ. శ. 5 వ శతాబ్ది నాటికి శ్రీశైలము మీద లింగము ఒకటేగలదని దానిని శ్రీపర్వతస్వామి అని పిల్చుచుండిరని, తర్వాత క్రీ. శ. 6 వ శతాబ్దిలో సోమవంశరాజైన చంద్రగుప్తుని కుమార్తె 'చంద్రవతి' స్వామిని మల్లికా పుష్పములలో బూజించి, మల్లికార్జునుని పేరును వెలయించెనని, తన పేరుతో భ్రమరాంబ విగ్రహమును ఎవరో ప్రతిష్ఠించిరని చెప్పవచ్చును. గోవిందవర్మ (540-640) శ్రీపర్వతస్వామిని పేర్కొనుటచేత అప్పటికే లింగము గలదని చంద్రవతికాలము నాటికి ఆమె మల్లికా పుష్పములతో బూజించుటచేత, మల్లికార్జునస్వామి అని పేరు వచ్చినదని చెప్పవచ్చును. ఇంతకు క్రీ. శ. 6 వ శతాబ్ది మధ్యకాలమునుండి 'లింగము' శ్రీశైలముమీద కలదని చెప్ప

వచ్చెను. బౌద్ధులు స్థూపములు నిర్మాణముచేసి పవిత్ర స్థలములుగాజేసి వానిని పూజించుచుండిరి. ఈ స్తూపములు లింగాకారముగా నుండుటచేత కాలాముఖ శైవులు చూచి లింగాకారముగా రాళ్ళనుచెక్కి వానిని స్వామిగా పూజించసాగిరి. ఇట్లు బౌద్ధులస్థూపముల ననుకరించి, శైవులు లింగముల చేయుచున్నట్లు, వాని పూజ నారంభించినట్లు విద్వాంసు లభిప్రాయపడుచున్నారు. ఈ ఊహ సత్యముగానే ఉన్నది. "కనూజిగుప్తులు క్రీ. శ. 4 5 శతాబ్దులలో, ఆనాడు వ్యాప్తిలోనున్న మహాయాన బౌద్ధములోని విగ్రహారాధనను తమ మతములో గలుపుకొనిరని, బౌద్ధస్థూపములలో పాతిపెట్టిన శవముస్థాన ముట్టిపట్టి పూజనుకూడ హిందువులు కలుపుకొనిరని, ఇదియే 'లింగపూజ'యను శైవులు దీని కారంభమని" 'హావెల్' మున్నగు విద్వాంసులు వ్రాసినారు ఇది సత్యముగానే కాన్పించుచున్నది.

(Kanuj Guptas-4th and 5th century-absorbed the prevailing Mahayana and Buddhist idol worship of the burial mound or votive Sthupa, has also been hold to have been absorbed into Hinduism in the form of the worship of the Linga by Saivas. Havell – The ideals of Iudian art-1911)

కనుక బౌద్ధుల స్థూపాకారముల ననుకరించి, లింగాకారముల నేర్పరచి, శివపూజ నారంభించుటను. క్రీ. శ. 5 వ శతాబ్దములో నారంభమైనది. ఈసమయము లోనే బ్రాహ్మణమతము హిందూమతముగా మారుచున్నది

(M. Sreenivasayyamgar-, From the beginning of the 5 th century of our era, when Brahmanism was passing into Hinduism Quoted by James Hastings in 'Encyclopaedia of religions Vol 11.)

సముద్రగుప్తుని దక్షిణదేశ దండయాత్రవలన (క్రీ. శ. 344) పల్లవులు విచ్ఛిన్నులై బలహీనులైరి. ఈసమయములోనే మానవ్య గోత్రులు, హారీతి పుత్రులునగు బ్రాహ్మణులు, కదంబులనువారు శ్రీశైలారణ్యమునుండి రాజ్యస్థాపన చేసిరి. వారి మొదటి రాజధాని వైజయంతి (వనవాసి) తర్వాత రెండవ రాజధాని 'పాలాశికా' బ్రహ్మాత్ రాజులనుండి పల్లవసామంతులనుండి పెక్కు పన్నులు వసూలు చేసికొని పాలించసాగిరి. బలవంతులైనందున కదంబ రాజులా వైల గుప్తులకు వాకాటకులకు పశ్చిమ గాంగులకు కొనంగి తమ రాజ్యమును సుస్థిరమొనరించుకొనిరి. వీరిలో చివర రాజైన 'మృగేశ్వరవర్మన్' పల్లవులతో గాంగులతో యుద్ధములు

చేయుచుండెను. ఈయన విద్వాంసుడు. తన తండ్రి జ్ఞాపకార్థము ఒక జైన ఆలయమును (పాలాశిక) అను చోట నిర్మించెను. వీరు మతమును రాజకీయము లలో జొప్పించినట్లు కాన్పించదు. వీరి కాలములో మైసూరు ప్రాంతమున జైన మతము వర్ధిల్లుచుండెను. ఆదిమ పల్లవులు "అప్పారు, సంబంధార్" వచ్చువరకు శైవమతమును స్వీకరించలేదు. వారు కూడ జైనమతము నాదరించుచుండిరి. అప్పార్, సంబంధార్ అనువారు క్రీ. శ. 6 వ శతాబ్దిలో జైనుల వాదనలో నోడించిరి. రాజకీయములలో మతమును జొప్పించి బౌద్ధ జైనమతముల నణచి, అశ్వమేధ, రాజసూయ, నరమేధములను యజ్ఞముల జరిపి, అనేకమంది బౌద్ధ జైనులవధించి, వారిస్థూప సంఘారామముల నాశనమొనర్చి, ఆయాచోట్ల శైవ లింగముల ప్రతిష్ఠచేసినట్టి, శ్రీపర్వతస్వామిని తమ కులదేవతగా చెప్పుకొన్న, అమరావతిని రాజధానిగా జేసికొని పాలించిన విష్ణుకుండిన ప్రభువులు శ్రీశైలములో లింగప్రతిషచేసి యుండవచ్చునని, లేదా ఆచోట సహజముగా ఏర్పడిన జ్యోతిర్లింగ మును (పర్వతలింగమును) పూజించుట ఆరంభించిరని నేను తలంచుచున్నాను. మతసహనములేని ఈ ప్రభువుల మూలముగానే దక్షిణాపథములో బౌద్ధ — జైన మతములు ఖిలమైపోయినవి.

పి. వి. జగదీశ అయ్యర్ తన గ్రంథములో (South Indian shrines) కృష్ణకు దక్షిణమున 'రుషభగిరి' అను శ్రీశైలము లేక శ్రీపర్వతము గలదనెను. హిందువులు, బౌద్ధులు దీనిని పవిత్రమైన దానినిగ జూచెదరనెను. రిషభ లేక శివుని పవిత్రమైన వృషభము తపసుచేసెనని, మల్లికార్జున భ్రమరాంబ ఆలయము వెలసెనని, శ్రీశైలరాజ్య అధికారి ఒక వృషభమును భృంగిని, బంగారు నిర్మితముల బహుమతిగా నొసంగెనని వ్రాసినారు. బౌద్ధుల కెట్లు పవిత్రక్షేత్రమో ఈయన వ్రాయలేదు. బహుశః నాగార్జునుని శ్రీపర్వతమును గూర్చి పొరపాటు పడియుండవచ్చును.

## 2. చంద్రగుప్తుడు, కుమార్తె చంద్రవతి కథ

(క్రీ. శ. 6 వ శతాబ్దము)

స్కాందపురాణమునుబట్టి "చంద్రగుప్తి" యను పట్టణము గలదని. దానికి రాజు "చంద్రగుప్తుడని", భార్య "విమలాదేవి" యని ఆయన కుమార్తె "చంద్రవతి"యని, ఆమెకు చిన్నతనమునుండి శివభక్తిగలదని, ఆమెను వివాహ

మాడుటకు పలువురు రాకుమారులు వచ్చినను, ఆమె నిరాకరించెనని, శ్రీశైల మల్లికార్జున స్వామియందు ఆమెకు భక్తియుండుటచేత ఆయనను మల్లెపూలతో నిచ్చలు పూజించుచు కాలము గడపెనని, తెల్లని మల్లెపూల మాలికలు ధరించుట వలన పర్వతలింగమునకు, 'మల్లికార్జున' అను పేరుగల్గినదని (అర్జున=తెల్లనిది) ఆమె కోర్కె ప్రకారము స్వామి ఆమెను భార్యగా గ్రహించెనని, చంద్రవతి తనతోపాటు జనులను భక్తులుగా జేయుటచేత ఆమెకు "భ్రమరాంబ" యను పేరు గల్గినదని తెలియుచున్నది ఈ పురాణగాథ క్రీ. శ. 16 వ శతాబ్దిలోని శిలాశాసనము లోనికి కూడ ఎక్కినది. శ్రీశైలము కైఫీయతులో గూడ (L R. XVI) బ్రహ్మగిరి, కనకశృంగముల గూర్చి చెప్పుచు చంద్రగుప్త పట్టణము నిర్మించ బడెనని, కుమార్తె చంద్రవతీదేవియని, 14 ఏండ్ల తరువాత తండ్రి వచ్చెనని, మోహావేశములో నామెను దాసిబోగా ఆమె శాపమిచ్చెనని వున్నది. ఇచ్చటి మల్లికా గుండము దక్షిణకాశి అనదగినదని వున్నది. ఈ పర్వతమునకు శ్రీపర్వతమని, లింగమునకు మల్లికార్జున లింగమని పేర్లుగల్గుటకు కారణములు అనేకములు చెప్ప బడినవి. భ్రమరాంబాదేవి అను పేరు గల్గుటకు కూడ కారణములు దేవీభాగవతము మున్నగుచోట చెప్పబడినవి. ఇంకను శ్రీ పర్వత పురాణాదులందు ఈ పర్వత మహాత్మ్యము భిన్నభిన్న విధముల వర్ణించబడినది. కాని యివి చారిత్రక దృష్టి కోణముతో లిఖించబడనందున, వీనిని వదలినాను.

ఇక పైనచెప్పబడిన చంద్రగుప్తుడెవరు ? ఆయన కుమార్తె చంద్రవతి ఎవరు ? ఈ విషయమును చారిత్రక ఆలోచనా సరళితో విచారించగా (Historic way of thinking) కొన్ని సత్యములు బయల్పడినవి. ఈ చంద్రగుప్తుడుమౌర్య చంద్రగుప్తుడని (క్రీ. పూ. 322—298) కొందరు వ్రాసిరి. కాని అది చారిత్రక సత్యముకాజాలదు. ఏలననగా మౌర్య చంద్రగుప్తుడు. దక్షిణాపథమునకు చరమ దశలో వచ్చియుండెను. మగధదేశములో 12 యేండ్ల క్షామము వచ్చినపుడు ప్రజల, పశువుల మరణములు కండ్లారచూడ జాలక 'భద్రబాహుడను' జైనగురువుతో గలసి మైసూరులోని శ్రావణ బెళ్గోలాకేగి అచటనే మరణించి నట్లు జైన గ్రంథములు చెప్పుచున్నవి. (రాజావళికథ—కన్నడము) ఈయన పేరుతో చంద్రగుప్త పట్టణము కట్టబడుటకాని ఈయన కుమార్తె చంద్రవతి యని కాని, ఆమె శ్రీశైలములోని లింగమును బూజించుట కాని ఎచటను వ్రాయబడి యుండలేదు.

కనుక పాల్కురికి సోమనాథకవి (క్రీ. శ. 14 వ శతాబ్ది) వ్రాసిన వాక్యములు సత్యములుగావు. ఆంగ్లవిజ్ఞాన సర్వస్వములోగూడ దీని నాధారముచేసి కొని విద్వాంసులు మౌర్య చంద్రగుప్తుని కూతురు స్వామిని మల్లికా పుష్పములతో బూజించెనని వ్రాయబడియున్నది. ("4th century B. C the daughter of Chandra Gupta, that she presented Jessamine flowers") చంద్రగుప్తమునియని, మునిపతియని, చంద్రగిరియని చంద్రగుప్త బస్తీయని క్రీ. శ. 600 నాటి శాసనములో జేర్లున్నవి. గుప్తవంశపు రాజైన చంద్రగుప్తని పేరుతో చంద్రగుప్త పట్టణము కట్టబడెనని, ఈయన కుమార్తె "చంద్రవతి" యని, ఈమె మల్లికార్జున లింగమును బూజించెనని కొందరు వ్రాసిరి కాని యిది కూడ వాస్తవముకాదు. 1 వ చంద్రగుప్తుడు కాని, 2 వ చంద్రగుప్తుడు కాని ఈప్రాంతమును జయించెనని కాని, ఇచటకు వచ్చిరని కాని తెలుపుటకు శాసనాధారములు, గ్రంథాధారములు లభ్యముకాలేదు. తర్వాత గుప్తరాజులలో చంద్రగుప్తుని పేరే కనిపించదు. కనుక ఈ చంద్రగుప్తుడెవరు? విష్ణుకుండిన రాజు (ఈరాజుల కాలము 350—611) మూడవ మాధవవర్మ (క్రీ. శ. 546—611) అత్యంత పరాక్రమోపేతుడు. ఈయన మహాకోసల (ద. కోసల) వరకు తన రాజ్యమును విస్తరింపజేసెను. ఆ కాలమున సోమవంశీయులు ఉత్తర కళింగను "త్రిపుర నగరమును" రాజధానిగా జేసికొని పాలించుచుండిరి. త్రిపురరాజు సోదరుడే చంద్రగుప్తుడు. (555—590) సోమవంశపు రాజైన చంద్రగుప్తుడు మాధవ వర్మచే నోడింపబడి, తనకుమార్తె "చంద్రవతీదేవి"ని విష్ణుకుండిన రాజగు 3 వ మాధవవర్మకిచ్చి వివాహ మొనర్చెను. శాసనములలో నీయన "త్రిపురనగరి భవనగత పరమయువతీజన విహరణ రతిః", అని పేర్కొనబడెను. ఈయనకు "త్రిపురసుందరీప్రియుడు" అన్న బిరుదుకలదు. తర్వాత కళింగరాజు లీయనకు కప్పము చెల్లించిరి. ఈయన కుమారుడగు 'మంచన భట్టారకుని' కాంచీపురరాజు పల్లవసింహ విష్ణువు (560—600) ఓడించుటచేత విష్ణుకుండిన రాజ్యము నశించెనని చరిత్రకారుల ఊహయైయున్నది. సోమవంశ రాజయిన చంద్రగుప్తుడు మౌర్యవర్మ కుమార్తెయగు 'వాసతాదేవిని' పెండ్లాడెనని తెలియుచున్నది. ఈ ప్రకారము వివాహ సంబంధములు కాన్పించుచున్నవి. చంద్రగుప్తు డోడింపబడి, చంద్రవతిని మాధవవర్మకిచ్చిన తర్వాత ఆమెకు వివాహమందు యిచ్చు లేకపోగా, ఆమె తల్లి దండ్రులతోబాటు శ్రీశైలమునకు దగ్గరగానున్న పాతాళగంగ, (సీలగంగ) ప్రాంతమునకేగి అచ్చట చంద్రగుప్తుని పేరుతో నొక నగర నిర్మాణ మొనర్చి

యుండవచ్చును. పాతాళగంగకు వాయువ్యముగా 'మల్లికాపురము' అను పేరుగల చంద్రగుప్త పట్టణము గలదు. అది ఇపుడు కూడ కలదు. దాని నీనాడు చెంచులు 'ఈగలపెంట' యని పిలుచుచున్నారు. స్కాందపురాణములోని చంద్రగుప్త పట్టణమిదియే. క్రీ. శ. 700 ప్రాంతపు విశాఖదత్తుని వాసస్థలము 'చంద్రగుప్త నగరు లేక చంద్రగుప్త పట్టణము' యిదియే కావచ్చును. కొందరు మైసూరులోని 'చన్‌రాయి' పట్టణమనిరి. పాతాళగంగకు ఎగువను దక్షిణముగా 'చుండుపెంట' అను ఊరుగలదు. అది శ్రీశైలము ప్రాజెక్టుకు, కాపర్‌డామ్‌కు చేరువనేయున్నది.

ఆనాటి చంద్రగుప్తపట్టణము ఈనాడు శిథిలావస్థలో ఉన్నది. కొన్ని శిథిల మందిరములు, ఆలయములు, ఇండ్లతో నిది ఉన్నది. ఉద్యోగస్థుల గృహము లతో, విద్యుద్దీపములతో నేడిది శృంగారముగానున్నది. దీని వద్దకు హైద్రాబాదు నుండి, అచ్చంపేట మన్ననూరు మీదుగా బస్సులు నడచుచున్నవి. బ్రహ్మచర్య వ్రతముతో గాలము గడుపుచు, చంద్రవతీదేవి ఈపట్టణమునుండియే బయలుదేరి పాతాళగంగలో స్నానమాచరించి. పాత్రతో నీళ్ళు మల్లికాపుష్పములుగైకొని పోయి, జ్యోతిర్లింగమును లేక స్వయం భూదేవలింగమును (పర్వతలింగమును) పూజించి యుండవచ్చును. ఈ లింగము నేడు 'వృద్ధమల్లికార్జున లింగము' అను పేర పిలువబడుచున్నది. ఇది మూలశిలాలింగము. ప్రస్తుతము ఆలయము నకు ఉత్తర దిశలోనున్నది. సోమనాథుడు మున్నగు కవులు దీనిని 'స్వయం భూదేవ లింగ'మని పేర్కొనిరి. ఇది కొండలో సహజముగా లింగాకారముగా నేర్పడినదైన కావచ్చును, లేదా అరణ్యమును గొట్టించి బ్రాహ్మణాగ్రహారము లుగా జేసినపుడు బుద్ధిసంపన్నుడైన ఒక శిల్పి, శైవభక్తి తత్పరుడు అచట ఒక రాతిని లింగాకారముగా చెక్కించి, స్వయం భూదేవలింగమని పేర్కొని, దానికి పూజా పునస్కారము లారంభించి యుండవచ్చును. లేదా పాతాళగంగలో నుండి ఒక శైవుడు ఒక స్వయంభూలింగమునుదెచ్చి భక్తి ప్రపత్తి వృద్ధి కాగలందుల కచట ప్రతిష్ఠించియుండ వచ్చును.

మల్లికార్జున దేవుడు తనకొక ఆలయమును గట్టించుమని స్వప్నమున గాన్పించి చంద్రవతీదేవితో జెప్పగా నామె ఈ ఆలయమును గట్టించెనని, అచటనే శివభక్తురాలై జీవితశేషమును గడపెనని, గుప్తరాజుల తర్వాత వ్రాయబడిన స్కాందపురాణాదులలోను, శ్రీశైల దేవాలయ ప్రాకారమునకు బయట ప్రక్క నున్న రెండు స్తంభముల మీద నున్న శాసనములలో లిఖించబడియున్నది. దీనిని

బట్టి క్రీ శ. 6 వ శతాబ్దపు ఉత్తరార్ధములో చంద్రవతీదేవి మల్లికార్జునాలయమును గట్టించి యుండవచ్చును కదంబరాజులు దీనిని కట్టించిరనుట కాధారములులేవు. క్రీ. శ. 566 వ సంవత్సర ప్రాంతమున కదంబరాజ్య మస్తమించినది. త్రికూట రాజు చంద్రగుప్తుడు (555—590) ఆయన కుమార్తె చంద్రవతీదేవి, ఆమెను పెండ్లాడిన 3 వ మాధవవర్మ (546—611) సమకాలీనులు కదంబరాజ్య మస్త మించుటకు పూర్వమువారిలో నెవరును మల్లికార్జున లింగప్రతిష్ఠగాని, ఆలయ నిర్మాణముగాని చేసిన ఆధారములు లభ్యముకాలేదు. అట్టి ప్రతిష్ఠలేమైన జరిగిన చో క్రీ. శ. 450 ప్రాంతమున జరిగియుండవలెను. దీనికి విరుద్ధంతిసు లారంభములు. చంద్రవతి జీవితానంతరము ఆమె పేరుతో అనగా క్రీ. శ. 610 ప్రాంతమున భ్రమరాంబాలయము వెలసి యుండవచ్చును. హిందువుల దేవాలయ నిర్మాణాదులు క్రీ. శ. 3 వ శతాబ్దిలో నారంభమైనట్లు గాన్పించుచున్నదని శాసనాధారములను ఐతిహాసిక లేఖకులు వ్రాయుచున్నారు. దేవాలయ నిర్మాణముయొక్క శకము దక్షిణ హిందూస్థానమున క్రీ. శ. 500 ప్రాంతమున ప్రారంభమైనదని మధుర, రామేశ్వరములలోని గొప్ప దేవాలయములలో నిది గాన్పించుచున్నదని, క్రీ. శ. 7 వ శతాబ్దిలో బ్రాహ్మణ మత పునర్వికాస మారంభమైనది లగాయతు, మొత్తము ఉపఖండమంతయు నూత్నమైన కళాపుణ్యమును వాంఛించుచుండెనని; ఇతిహాస పురాణములనుండి వీనిని గైకొనుచుండిరని చరిత్రకారులు వ్రాయుచున్నారు.

(Publication division — Temples of South India P 7 "The great era of temple building which started on modest lines about A D. 500 and culminated in the great temple at Madura or Rameswaram with the revival of Brahmanism in the 7 th century, the entire sub-continent craved for new art forms based on familiar times from the epics and the Puranas")

ఇది సత్యముగానే యున్నది. కనుక క్రీ. శ. 6 వ శతాబ్దిలో మల్లికార్జున స్వామి దేవాలయ నిర్మాణము చంద్రవతీదేవి వలన జరిగెనని, తరువాత భ్రమరాంబాలయ నిర్మాణము చంద్రవతి అనంతరము జరిగెనని చెప్పవచ్చును.

(Madhava II-Epuru plates - "He ruled over Thrikuta and Malaya and was a great devotee of the Siva of Sriparwatha" K. R. S - History of the Andhras) మాధవ 2 యొక్క శివభక్తి నిది తెల్పును.

ఈ సోమవంశ చంద్రగుప్తుడు, చంద్రవతీదేవి కాక ఇంక నెవరికైన ఈ పేర్లు గలవా ? యని అనేక శాసనముల, రాజుల సంబంధ బాంధవ్యముల బరిశీలించితిని కాని ఈ పేర్లెచట తగులలేదు. గుప్తచక్రవర్తి రెండవ చంద్రగుప్తునికి సమకాలీనముగానున్న వాకాటక రాజు 1 వ పృథ్వీసేనుని (క్రీ. శ. 348–375) సూనుడగు రెండవ రుద్రసేనునికి (375–395) రెండవ చంద్రగుప్తుడు తన కుమార్తెయగు "ప్రభావతిగుప్త" నిచ్చి బహుశ క్రీ. శ. 390 ప్రాంతమున వివాహము చేసినట్లు కన్పించుచున్నది. ఈమె కుమారగుప్తుని జ్యేష్ఠ సోదరీమణి. ఈమె పేరు చంద్రవతీదేవి కానందున, పై చంద్రగుప్తుడు ఈ ప్రాంతములో నగరనిర్మాణము చేయనందున, వీరికేమి ఈ లింగముతో సంబంధములేదని స్పష్టముగా చెప్పవచ్చును. పై రుద్రసేనుడు చనిపోగా 'ప్రభావతిగుప్త' యే తన కొమరుల కిద్దరికి గార్డియనుగా (395–415) వ్యవహరించెను.

'తాళ్గుండ' శాసనమునుబట్టి పశ్చిమ గంగారాజు 1 వ మాధవ (తాడంగల మాధవ) కదంబరాజగు 'కాకుస్థవర్మ' కూతురును బెండ్లాడెనని తెలియుచున్నది. కృష్ణవర్మ (కొందరు కాకుస్థవర్మ అనిరి) కూతురగు 'అజితభట్టారక'ను వాకాటక నరేంద్రసేనుడు పెండ్లాడెను. ఈమెయే 2 వ పృథ్వీసేనునితల్లి కాకుస్థవర్మ కూతురును గుప్తరాజున కిచ్చినట్లు తెలియుచున్నది. వీరిలో నెవరు 'చంద్రవతీ దేవి' కాన్పించదేమి. పశ్చిమ గాంగులు జైనులు. కదంబరాజులు బ్రాహ్మణులు. కదంబ చెట్లను తమ ఇండ్ల ఎదుటనుంచుటచేత వీరికి కదంబులను పేరు వచ్చినది. బెంగుళూరు కనరాజిల్లాలు, మైసూరు పడమటి భాగము వీరి ఏలుబడిలో నుండెను. వీరి రాజధాని వనవాసి (వైజయంతి) ఈవంశము "త్రిలోచనకదంబ"తో నారంభము.

మయూరశర్మన్, గురువు వీరశర్మ, ప్రవచనము నేర్చుకొనుటకు కాంచీ నగరములోని ఒకఘటిక కేగిరి, అచట అశ్వశాలలో నుండు సేవకుడు ఎగతాళి చేయగా వీరు శాస్త్రములు వదలి, శస్త్రములచేపట్టి, శ్రీపర్వతము ఎదుట అడవిలో సైన్యములనుంచి మెరుపు యుద్ధమును సాగించి, పల్లవుల పైకి రాత్రివేళల దండెత్తుచుండిరి. పల్లవులతోడి రాజీచేసికొనిరి. బాణరాజులు మున్నగువారి మీద పన్నులువేసి, కదంబులు రాజ్యమేలు చుండిరి. పల్లవులు వారికి 'పట్టాబంధ' నొసంగి వారి కోలికి రాకుండ వాగ్దానముచేసి, పశ్చిమ సముద్రప్రాంతమును వారికి సర్వహక్కులతో నొసంగిరి. 'మయూరవర్మన్' (345–370) అను మొదటిరాజు తమ దేశములో బ్రాహ్మణులు తక్కువగానుండుట గమనించి, ఆర్యా

వర్తమునుండి బ్రహ్మణుల రావించి, దేశమును 64 భాగములుగా విభజించి వారి కొసంగెను.

కాకుస్థవర్మ క్రీ. శ. 435_450 ప్రాంతమున గుప్త, గంగరాజులకు తన కుమార్తెల నొసంగెనని తాళ్ళగుండి శాసనము తెల్పును. వీరు పల్లవరాజులకు బద్ధ విరోధులై యుండిరి. వీరు జైనమతాభిమానులై, జైనుల బోషించుచు అనేక ధర్మములొసంగిరి. వనవాసిలోని "మధుకేశ్వర" వారి కులదేవత. క్రీ. శ 600 నాటికి పశ్చిమ చాళుక్యుల విజృంభణవలన కదంబ రాజ్యము స్తమించెను. కదంబ రాజులు శైవులనుటకుగాని, శివలింగముల బూజించిరనుటకుగాని, శ్రీశైలము లోని స్వామిభక్తులనుటకుగాని ఆధారములులేవు. వీరి తాళ్ళగుండి శాసనములో "శ్రీశైలము" అను నామము మాత్రము పెర్కొనబడెను.

పల్లవరాజులకు, విష్ణుకుండి రాజులకు సంతతము విరోధములున్న, బౌద్ధ జైన మతముల నాశనమే వారి ప్రధానాశయము. పల్లవరాజులు 21 మంది "కంచి" రాజధానిగా జేసికొని కృష్ణకు దక్షిణభాగమంత క్రీ. శ. 200 నుండి క్రీ. శ. 630 వరకు పాలించిరి. వీరిలో రెండవ 'శివస్కందవర్మ' ధాన్యకటకము, విజయపురి, నాగార్జునకొండలను నాశనముచేసి అశ్వమేధ, రాజసూయ యాగములుచేసి, బౌద్ధ స్థూపములున్నచోట హిందూ ఆలయముల ప్రతిష్ఠ చేసిరి. వీరు శ్రీశైలస్వామిని ఆరాధించినట్లు ఆధారములు లేవు

ఆకాలమున కడప, కర్నూలుజిల్లాలను రేనాటి చోళులు పాలించిరి. వీరు స్వామిభక్తులని చెప్పవీలులేదు విష్ణుకుండిన రాజులు పల్లవరాజుల నోడించి క్రీ. శ. 350 నుండి 610 వరకు రాజ్యపాలనచేసిరి. మాధవవర్మ మున్నగురాజులు అశ్వమేధ, రాజసూయాది యాగములు చేయుటయేగాక బౌద్ధులదగు అమరావతి స్థూపమును ధ్వంసముచేసి, ఆ స్థానములో 'అమరేశ్వరాలయము'ను నిర్మాణ మొనర్చిరి. త్రిలోచన పల్లవుని, కరికాలచోళుడు, రెండవ మాధవవర్మ కలసి ఓడించిరి. వేదపండితులకు గోదావరి తీరములో సనేర అగ్రహారము లిచ్చినది, విష్ణుకుండిన రాజులే. అగ్రహార, దేవాలయాది ప్రతిష్ఠలవల్ల విద్యాసంపన్నులైన బ్రాహ్మణుల కుపాధి హెచ్చుగా గలుగునని ఉద్దేశించి, అనేకచోట్ల బ్రాహ్మణాగ్రహారముల నొసంగిరి.

శ్రీశైలముమీద శివలింగపూజ వీరికాలమునుండి ఆరంభమైనట్లు కాన్పించు చుండుటచేత, వీరే శ్రీశైలస్వామి పాదభక్తులమని చెప్పుకొనుటచేత రేనాటిచోళులు

పల్లవులు, ఈ విషయమును పేర్కొనకుండుటచేత క్రీ. శ. 450 ప్రాంతమునుండి శ్రీశైలస్వామి పూజ ఆరంభమని, క్రీ. శ. 550 నుండి చంద్రవతీదేవి పూజవలన భ్రమరాంబపూజ ఆరంభమని నేను తలంచుచున్నాను.

## 3. శ్రీశైల రాజ్యము

క్రీ. శ. 5 వ శతాబ్దమునుండి, ఇచట అరణ్యము ఛేదించబడి ఒక పట్టణ మేర్పడినట్లు కాన్పించుచున్నది. చోళులు, పల్లవులు, కదంబుల శాసనములలోను, తమిళ గ్రంథములలోను, శైవీయతులలోను, "శ్రీశైలము" పేరు కాన్పించినది. శ్రీనాథుని కాలమునాటికిది గొప్ప పట్టణమని చెప్పవచ్చును. ఇది ఒకప్పుడు గొప్ప నగరమని, ఇచట శిథిలముల, ప్రాచీన పట్టణముల, కోటగోడల, పవిత్రమైన ఆలయముల, చెరువుల, బావుల జూచి నప్పటి ప్రాచీన పౌరులు మహోన్నత భాగ్యము ననుభవించిరని చెప్పవచ్చును.

(Kurnool Dt. manual-P 5 "Srisaila plateau which is in the vicinity of the above was in former times inhabited The remains of ancient towns, fort wa'ls, sacred temples, revived tanks and walls testify to the prosperity of the form r residents.")

రత్నమైదానము నెల్లూరు, కృష్ణాజిల్లాల వారికి పశువుల బీడుగానుండెడిది. క్రీ. శ. 16 వ శ. నాటి శాసనములలో శ్రీశైలము తీర్థయాత్రాస్థలముగా పేర్కొన బడినది. శివాజీ గోపురమునకు వాయువ్యదిశగా నరణ్యములో బయనించగా నచట ఆలయములు, గుహలు, శాసనములు కాన్పించినవని, నామిత్రుడొకడు చెప్పినాడు. ఈ శిథిలమందిర భాగములన్ని శ్రీశైలరాజ్యమునకు ముఖ్యనగరమైన శ్రీశైల పట్టణమునకు చెందియున్నవని చెప్పవచ్చును: కడప, చాగలమర్రి, సిరువేలు, నంద్యాల, శ్రీశైలముగలసి శ్రీశైల రాజ్యముగానున్నట్లు కాన్పించుచున్నది. అచ్యుతదేవరాయల కాలములో (క్రీ. శ. 1530) నిది ఆయన 17 రాజ్యములలో నొకటిగా గాన్పించినది. కృష్ణరాయల కాలములో శ్రీశైల రాజ్యమునకు ప్రత్యేకాధికారి 'చంద్రశేఖరు' డుండెను. క్రీ. శ 1839 నాటికిది బ్రిటిషువారి హస్తగతమైనది.

## 4. సాహిత్యములో శ్రీశైల ప్రశంస

ఆంధ్రభాషలో మొదటిసారిగా శ్రీశైల ప్రశంసచేసిన కవీంద్రుడు "నన్నయ

భట్టు". (క్రీ. శ. 1000—1050) అర్జునుని తీర్థయాత్రా సందర్భములో "వాగను శాసను" డిట్లు వ్రాసెను.

దక్షిణగంగ నాదద్దయు నొప్పిన
గోదావరియు జగదాదియైన
భీమేశ్వరంబును బెడగగుచున్న శ్రీ
పర్వతంబును జూచి యుర్విలోన
ననఘమై శిష్టాగ్రహార భూయిష్ఠమై
ధరణీసురో త్త మాధ్వరవిధాన
పుణ్యసమృద్ధమై పొలుచు వేఁగిదేశ
విభవంబుఁ జూచుచు విభుడు దక్షి

ణాంబు రాశితీర్థంబున కరిగి దురిత
హారియైన కావేరీ మహాసముద్ర
సంగమంబు భూసురేశ్వరుల కభిమ
తార్థదానంబుసేసి కృతార్థుడగుచు.

అని శ్రీపర్వతంబును బేర్కొనెను.

**కవిరాజ శిఖామణి** నన్నెచోడుడు. క్రీ శ. 1100—1135 తన 'కుమార సంభవము'లో తన గురువగు 'జంగమమల్లయ'ను శ్రీశైలముతోడాటు వర్ణించెను. 'శ్రీనగోత్తుంగమణి శ్రీసంగత మల్లికార్జున దేవతాత్మకంబై జగంబులం బ్రఖ్యాతముగ ప్రవర్తిల్లుట జంగమ మల్లికార్జున దేవుండై, తన గ్రంథమును గురువగు 'జంగమ మల్లయ' కంకితమిచ్చుచు గురువుకు, మల్లికార్జున దేవున కభేదము చెప్పెను.

చ॥ గురువున కిష్టదైవమునకుం బతికి గృతిచెప్పి పుణ్యమున్
వరమును దేజముం బడయవచ్చు జగంబుల నిశ్చయంబు మ
ద్గురువును నిష్టదైవమునుగూర్చు నిజేశుడు దాన నాకుగా
కొరునకునిట్లు సేకురునె యొక్కట లాభములెన్ని యన్నియున్.

దీనినిబట్టి గురువు, ఇష్టదైవము, నిజేశుడు అందరు ఒకేపేరు గలవారని, తనకు గాక మరెవ్వరికి యిట్టి లాభము చేకూరదని నన్నెచోడుడు వ్రాసెను. ఈ 'జంగమ మల్లయ' శ్రీశైలములోనే తన జీవితశేషము గడపెను.

శైవకవి "పాల్కురికి సోమనాథుడు" తన బసవపురాణములో పండితారాధ్య చరిత్రలో శ్రీశైల ప్రశంసచేసెను. ఈ రెండు గ్రంథముల నీయన త్రిపురాంతకము లోను శ్రీశైలములోను ఉండి రచించెను. బసవ పురాణము తృతీయాశ్వాసములో.

"శ్రీ గిరి కేగి సచ్చింతా సమాధి
నాగిరిబిల్వ వనాభ్యంతరమున."

అనికలదు. పిడపర్తి సోమన తన బసవపురాణములో "ఒల్లక శ్రీగిరి కరిగి మహోల్లాసత నచట యోగయుక్తుండగుచో." అనెను.

యట్టి శ్రీగిరి పడమట నమరుచుండు
మేటి సంపదఁ బొదలి కర్ణాటకంబు.

అని బసవపురాణములో గలదు, "సకలేశ మాదిరాజయ్యకూడ కల్యాణి కటకములో బసవని కలసి, తర్వాత శ్రీపర్వతము మీద ఉండి అచటనే మరణించెను." తమిళ, కర్ణాట, ఆంధ్ర, మహారాష్ట్ర దేశములవారు మహాశివరాత్రికి శ్రీశైలమునకేగు చుండిరి. పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణములో శ్రీగిరి వర్ణనగలదు.

సింగిరి మల్లికార్జుననె
ప్రాణేశ, నెమగె, శ్రీపర్వత దొడయ
మాణిపె నిన్నిభో మల్లికార్జునగె
సింగిరి మల్లయ్య ! శరణెన్నిరయ్య !

మల్లికార్జున పండితారాధ్యులు "శ్రీమల్లికార్జున శతకము" రచించెను దానిలో నొక పద్యమిట్లున్నది.

ఉ॥ లోకములెల్ల నీ తనువులో నివ, నీవట ఎంతగల్గుదో
నాకప పద్మసంభవ జనార్దనులాదిగ నెల్ల పెద్దలున్
నీ కొలదింత యంత యననేరక మ్రొక్కెదొడంగిరన్న ని
న్నే కరణిన్ నుతింతు పరమేశ్వర శ్రీగిరిమల్లికార్జునా.

శివపర్వత మల్లికార్జునా ! అనుదాని మకుటమిట్లున్నది.

ఉ॥ శ్రీపతి వాక్పతి ప్రముఖదేవతగళ్ వేదసారవా
గ్రూప గళింద కాణదిహ శైవమహత్వమలన్ప బుద్ధియిం

రూపిసలాసమర్థన కృతార్థన దంతహానల్ల దిర్కొంచి
ద్రూపన వాచ్యనం నుతిపనై శివపర్వత మల్లికార్జునా ॥

భక్తులు మల్లికార్జునుని ప్రార్థించు విధానమును "పాల్కురికి సోమనాథకవి" పండితారాధ్యచరిత్రలో నిట్లు వ్రాసెను.

"చిక్కుచు మోకాళ్ళ జేతులూదుచు
వంగుచు వ్రాలుచు తొంగుచుఁ జనుచు
చేదుకో మల్లయ్య చేదుకొమ్మనుచు
గనుకని పాటలగట్టి పాడుదుము."

అట్లే కోటప్పకొండ ఎక్కునపుడు 'చేదుకో కోటయ్య' అని పాడుచుందురు.

పాల్కురికి సోమనాథుడు తన బసవపురాణములో నిట్లు వ్రాసెను.

'సకల తీర్థములకు' జనయిత్రి యగుచు
బ్రకటింప నొప్పు శ్రీపర్వతేంద్రంబు.'

త్రిపురాంతకమున "మహేశ్వరులు" కూర్చుండిరి. సోమన పండితారాధ్య చరిత్ర వ్రాయ సంకల్పించెను.

కరమొప్పు దక్షిణ కైలాసమనగ
జను సర్వపర్వత సార్వభౌమాఢ్య
తను బేర్చు శ్రీగిరీంద్రంబు దానవియు

ఆ శ్రీశైలశిఖర

కలితత్రిలోక విఖ్యాతయశః ప్ర
పూర్తియా శ్రీస్వయంభూలింగ చక్ర
వర్తి............శ్రీమల్లికార్జున లింగ
మూర్తి యొప్పారు సమున్నత మహిమ॥

త్రిపురాంతకములో సోమన బసవ పురాణము వ్రాసెను. (1267) మల్లికార్జున మంటప స్థలిలో శివగోష్ఠి సందర్భమున మహేశ్వరులుండ వారు పండితారాధ్యచరిత్ర వ్రాయుమన సోమన ఆరంభించెను. 'నాగులూటి శేషనారాధ్యుడు' నాగులూటివాసి. ఈయన 'శ్రీపర్వత పురాణము' అను ఆరు ఆశ్వాసముల గ్రంథము రచించెను. 'పిడుపర్తి సోమనాథకవి', చామరసను కర్ణాటకకవి రచించిన 'ప్రభులింగలీల' అను గ్రంథమును

ఆంధ్రభాషలోని కనుపడించెను. అల్లమ ప్రభుని లీలలు, శ్రీశైలవృత్తాంత మీ గ్రంథమున గలదు. చక్రపాణి రంగనాథకవి "శ్రీగిరినాధ విక్రమము" అను గ్రంథమును రచించుచు శ్రీశైలక్షేత్రమును వర్ణించెను. ఈయ నింకను మల్లికార్జునుని బ్రశంసించుచు కొన్ని గ్రంథములు వ్రాసెను. పైవానిని నేనుచూడలేదు.

ఇంకను 'శ్రీగిరికవి' 'శ్రీగిరీశ' అను మకుటముతో నొక శతకమును, శివరాత్రి మాహాత్మ్యమను గ్రంథమును రచించెనని, అక్కనార్యుడనుకవి "శివరాత్రి మాహాత్మ్యమును" రచించి శ్రీశైలమల్లికార్జునుని కంకిత మిచ్చెనని, క్రీ. శ. 1750 ప్రాంతమున "అత్తలూరి పాపకవి" శ్రీశైలఖండమును రచించెనని 'నూతలపాటి పేరరాజు'గారు వ్రాసిరి. శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్యమును నేను జూచినాను. పింగళి సూరన్న తన 'ప్రభావతీ ప్రద్యుమ్నము' ను తన తండ్రికే కృతియొసంగి అట్లొసంగుటకుగల కారణముల నిట్లు వ్రాసెను.

మ. గయలోఁ గాశిప్రయాగ శ్రీగిరిని గంగాద్వార, నీలాచలో
జ్జయినీద్వారకలం దయోధ్యమథురన్ సంస్తుత్య పుణ్యస్థలా
గ్రియతన్ వెందియుమించు నైమిశ కురుక్షేత్రాదులంధ్దర్పణ
క్రియచే నాపినతమ్ము దెర్రన యొనర్చెన్ దండ్రికాహ్లాదమున్.

పరలోకములోని తండ్రులకిట్లు తర్పణము లిడుటచేత వారు ఆనందము చెందుదు రని ప్రాచీనులు నమ్ముచుండిరి.

ఒకకవి శ్రీశైలము నిట్లు వర్ణించెను.

రస, రత్న, ధాతుకందర
మసమాంబక మందిరంబు — సకలైశ్వర్య
ప్రసవావనదము — భ్రమరా
వసధానము శ్రీ గిరీశ్వరము గిరిపంక్తిన్.

విన్నకోట పెద్దనకవి తన 'కావ్యాలంకార చూడామణి' లో నిట్లు వ్రాసెను.

క॥ ధరశ్రీ పర్వత, కాశే
శ్వర, దక్షారామ సంజ్ఞవరలఁ ద్రిదాలిం గా
కరమగుట నాంధ్రదేశం
బరుదారఁ ద్రిలింగదేశ మనదగు గృతులన్.

అప్పకవియూడ శ్రీశైల ప్రశంసచేసెను.

శ్రీనాధుడు కాశీఖండమున నీక్షేత్రము నిట్లువర్ణించెను:—

"రససిద్ధి, రసాయనసిద్ధి, మూలికాసిద్ధి, పాదుకాసిద్ధ్యాదులగు సిద్ధిక్షేత్రంబుల చేతను, శోభితంబై దివ్యామృత నిర్మల శ్రీస్వయం జ్యోతిర్లింగ మూర్తియగు మల్లికార్జున శ్రీమన్మహాదేవునకు నిలనివాసంబై యధిరామంబై దివ్యంబునగు శ్రీశైలంబు జేరవచ్చె."

బ్రాహ్మణ సంకల్పములో నిట్లున్నది,

'శ్రీశైల శిఖరాగ్ర .. ... చంద్రగుప్త నిరుపమ సంభ్రమ చంద్రవతీ కన్యాపుష్ప.........శిఖరేశ్వర, హాటకేశ్వర, ఘంటాసిద్ధేశ్వర.........బహుదివ్యౌష ధీనాం' ........ విశల్యకరణీ, సౌవర్ణకరణీ, సంధానకరణీ, సంజీవకరణీత్యాది దివ్యమూలికాదీనాం.

కల్పతరు, కామధేను, చింతామణి, స్పర్శవేది అను వీనినిబట్టి అచటి దివ్య క్షేత్రముల, మూలికల పేర్లు కాన్పించును. 'శ్రీగిరీశ్వరసన్నిధౌ' అని కలదు. సంస్కృత గ్రంథములలో మహాభారతములోను, స్కాంద, బ్రహ్మాండ, వాయు, మత్స్య, పద్మ, శివ పురాణములలో శ్రీశైలము పేరు కాన్పించినది. శ్రీశైలఖండము (3426) శ్రీశైలస్థల రహస్య వివరణము (3432) అను గ్రంథములు గలవు. పురాణముల నన్నిటి బరిశీలించిన ఒక విద్వాంసు డిట్లు వ్రాసెను. (V. K. Ramachandra Dikshit Puranic Indix III) శ్రీపర్వతమొక కొండయును, భారత భూమిలోగలదని, శివునికి ప్రియమైన శ్రాద్ధాది క్రియలుజరుపుటకు అర్హమైనదని ఈయన వ్రాసెను. గుప్తరాజుల కాలములో పురాణరచన అరంభమని విద్వాంసులు వ్రాయుచున్నారు. కనుక క్రీ. శ. 5 వ శతాబ్ది నాటికి ప్రజలు శ్రీశైలము నెరింగి రని, తీర్థయాత్రాస్థలముగా గుర్తించిరని చెప్పవచ్చును. 'రసరత్నాకరము' అను వైద్యగ్రంథములో గూడ శ్రీశైలము పేరు కాన్పించుచున్నది. రసఖండము, రసేంద్రఖండము, వాదఖండము, రసాయనఖండము, మంత్రఖండము అని దీనిలో 5 భాగములున్నవి. నిత్యనాథసిద్ధుడు, సిద్ధనాగార్జునుడు అను వారు రసరత్నాకరమును వ్రాసిరి. నిత్యనాథుని రసరత్నాకరములోని రసాయనఖండములో నిచటి మూలికల, రాళ్ళ, మట్టి వర్ణన గలదు. రసాయనఖండమునుబట్టి చూడగా ఇచట నొక పరిశోధనా కేంద్రముగలదని చెప్పవచ్చును. బ్రాహ్మణసంకల్పములో శ్రీశైలముపేరు పలుమార్లు తగులున్నది. భారతదేశములో గల ద్వాదశలింగములలో శ్రీశైలము పేర్గాంచియున్నది.

1. సోమనాథ (సౌరాష్ట్ర) 2. మహాకాళేశ్వర (ఉజ్జయిని) 3. మల్లికార్జున (శ్రీశైలము) 4, అమరేశ్వర (ఓంకార మంధాత) 5. వైద్యనాథ 6. భీమశంకర 7. రామేశ్వర (రామేశ్వరము) 8. నగేశ (దారుకావనం) 9. విశ్వేశ్వర (కాశి) 10. త్ర్యంబక 11. కేదారేశ్వర 12. ఘుశ్రుణేశ. ఇంకను శైవక్షేత్రములు అని పేర్గాంచిన 1. శ్రీపర్వతము 2. ద్రాక్షారామము 3. కాళేశ్వరములలో శ్రీపర్వతము ముఖ్యమైనది. వీనిని బట్టియే 'త్రిలింగ' యనుపేరు వచ్చినదని కొందరు వ్రాసిరి. 'శ్రీశైలశిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే' అను ఆర్యోక్తి చాల కాలమునుండి వచ్చుచున్నది. శంకరాచార్యుల వారు వ్రాసిన 'ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రములో' శ్రీశైల ప్రశంస గలదు.

శ్రీశైల సంగే విబుధాతిసంగే
తులాద్రి తుంగేఽతిముదా వసంతమ్
తమర్జునం మల్లిక పూర్వమేకం
నమామి సంసార సముద్ర సేతుమ్.

ఇంకను శ్రీశైల శిఖరమును దర్శించిన మాత్రమున జన్మరాహిత్యము గల్గునని ఆర్యోక్తి గలదు.

"దర్శనా దేవ శ్రీశైలే పునర్జన్మ న విద్యతే."

'భ్రమరాంబాష్టకము' అను చిన్న పుస్తకములో 'భ్రమరాంబాదేవి' ప్రశంస గలదు. "శశిచేతువు ద్రూరజనులను శ్రీగిరి భ్రమరాంబికా।" అను పద్యపాఠములో భ్రమరాంబ స్తవము గలదు. ఇంకను కన్నడ భాషలో అక్కమహాదేవి, అల్లమ ప్రభువు, సిద్ధరామున్న మున్నగు వారు వ్రాసిన తత్వములు గలవని పండితులు వ్రాసినారు. అందు శ్రీశైల ప్రస్తావన గాన్పించుచున్నది. 'హేమారెడ్డి - మల్లమ్మపురాణము, దేవర సాంగత్యము, శివరాత్రి మహిమ, రేణుక విజయము, అక్క మహాదేవి వగడ మున్నగు కన్నడ గ్రంథములలోను ఈ క్షేత్రమహిమ వివరింపబడినది' అని శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు 'తన శ్రీశైలక్షేత్రము' అను గ్రంథమును వ్రాసినారు. ఈ కన్నడ గ్రంథములను నేను చూడలేదు.

తమిళములో 'తేవారం' (దేవహారము) అను గ్రంథములో అప్పర్, సుందర్, సమ్మందర్' అనువారు రచించిన పద్యములు గలవు. వీరు శ్రీశైల క్షేత్రమును ప్రశంసించిరి.

ఈ ప్రకారము సంస్కృత, ఆంధ్ర, కన్నడ, తమిళ భాషలలోని గ్రంథము లలో శ్రీశైల ప్రశంస గలదు. అయా సందర్భములలో శాసనములలో నీపేరెట్లు ఉదాహరింపబడినది వ్రాయబడినది.

## 5. తేవరం

(క్రీ. శ. 7 వ శతాబ్దము)

క్రీ. శ. 6 వ శతాబ్దములో జైనమతము వృద్ధిలోనుండెను. I వ మహేంద్ర వర్మ (క్రీ. శ. 600—630) మొదట జైనుడు. ఈయన 'మత్తవిలాస ప్రకరణము'లో కాపాలికుల పాశుపతుల విమర్శించెను. కొండరాళ్ళతో దేవాలయము లారంభము చేయటము ఈయన కాలములో నారంభమాయెను. 'అప్పార్' అను శైవయోగివలన 'మహేంద్రవర్మ' అను పల్లవరాజు శైవుడాయెను. సంబందార్ అను శైవయోగికూడ జైనుల సిద్ధాంతముల ఖండించుచు మధుర ప్రాంతముల దిరుగుచుండెను. అప్పార్ (తిరునావుక్కరసర్) పల్లవదేశములో శైవమత ప్రచారము చేయుచుండెను. అప్పార్, సంబందార్, సుందరార్, అనువారు కొన్ని భక్తిరస సంబంధమగు పద్యములు రచించిరి. ఇవియన్ని 'తేవరం'లో నున్నవి. శ్రీశైల మల్లిఖార్జునస్వామిని గూర్చి పాడిన పద్యములు 'తేవరం'లో నుండుటచేత, అప్పార్, సంబందార్' అనువారు శ్రీగిరిస్వామిని దర్శించిరని స్పష్టముగా జెప్పవచ్చును. మాణిక్యవాచకర్ అను మరియొక శైవ భక్తుడు 'తిరువాచకము' అను గ్రంథమును లిఖించెను. ఈయన శ్రీశైలస్వామిని జూచినట్లు అందులేదు. కనుక శ్రీశైల దేవాలయము ప్రథమముగా నేర్పడిన తరువాత, క్రీ. శ. 7 వ శతాబ్దములో ప్రథమపర్యాయము శ్రీశైలస్వామిని దర్శించిన భక్తులు, 'అప్పార్, సంబందార్' అనువారుగా గాన్పించుచున్నారు. మహేంద్రవర్మ గొప్పమేధావియని, సైనికుడుగానుండి కవియాయెనని, సంగీత విద్వాంసుడని, శిల్పియని, మతసంస్కర్తయని, కాలాముఖుల ఆచారముల దన గ్రంథమున బేర్కొన్నవాడని, ఈయననుగూర్చి విద్వాంసులు ప్రశంసించిరి. ఈయన కాలమున శైవభక్తుల గేయములు తేవరములో గూర్చబడినవి.

# 6. శ్రీ శంకరాచార్యులు

(క్రీ. శ. 788—820)

మండన మిశ్రుని ఓడించిన తర్వాత, శ్రీ శంకరుడు ఆయనను సురేశ్వరాచార్యుడను పేరుతో శిష్యుడుగా స్వీకరించి దిగ్విజయమునకు బయలుదేరెను. ఆయన వెంట ఇతర శిష్యులుకూడ నుండిరి. కొంతకాలమునకు శంకరుడు శ్రీశైలమునకు జేరెను. హాటకేశ్వరమునకు దగ్గరగా ఆయన తపస్సుచేసికొనెను. (పాలధార, పంచధార—మఱ్ఱిచెట్టు గలదు) మనోహరమైన ఆ ప్రదేశములోజేరి, శ్రీశైల మల్లికార్జునుని, భ్రమరాంబను సేవించి, మల్లిఖార్జునునిమీద "శివానందలహరిని' 'భ్రమరాంబమీద' భ్రమరాంబాష్టకమును రచించెను. శివానందలహరిలోని రెండు శ్లోకములలో శంకరుడీ క్షేత్రమును ప్రశంసించెను.

సంధ్యారంభ విజృంభితం శ్రుతిశిరస్థానాంతరాధిష్ఠితం
సప్రేమ భ్రమరాభి రామమసకృత్ సద్వాసనాశోభితం
భోగీంద్రాభరణం సమస్తసుమనః పూజ్యంగుణావిష్కృతం
సేవే శ్రీగిరి మల్లికార్జున మహాలింగం శివాలింగితమ్.

క్రీ. శ. 8వ శతాబ్దమున నీ ప్రాంతమున 'కాపాలికు'లుండిరి వారిని గూర్చి మహేంద్రవర్మ (క్రీ. శ. 600—630) అను పల్లవరాజు తన 'మత్తవిలాస ప్రహసనము'లో నుల్లేఖించెను. 'కాపాలి' పేరుతో వీరు శివునారాధించుచు నరుల బలియిచ్చుచుండిరి. "హుయాన్‌సాంగు" వ్రాతలబట్టికూడ ఆయన లోకాయతుని 40 వాదనల ఖండించెనని, హాష్టని నదిలో భూతులు నిర్గ్రంధులు, కాపాలికులు, సాంఖ్యులు, వైశేషికులుండిరని తెలియుచున్నది. ఒకనాడు శ్రీశైలములో శంకరుడు ధ్యాననిమగ్నుడై యుండెను. కర్ణాటక ప్రాంతము కాపాలికాకీర్ణమై యుండెను. ఒక కాపాలికుడచట కేతెంచి, శంకరుని సుందరాకృతిని గాంచి, ఆనందము జెంది 'కాపాలికి తగిన నరబలి దొరకినదని. మనంబున దలచి, శంకరుని ధ్యానము నుండి లేపి, ఒక చక్రవర్తి శిరంబునుగాని, గొప్ప సన్యాసి తలనుగాని ఒసంగినచో 'కాపాలి' మిక్కిలి ప్రసన్నుడగునని చెప్పి అతనిని బలియిచ్చుట కనుమతికోరెను. శంకరుడు మందస్మిత సుందర వదనారవిందుడై, తనకు సంబంధించినంతవరకు తనకెట్టి అభ్యంతరములేదని, తనశిష్యులేమైన అభ్యంతరము పెట్టవచ్చని, వారిని తొలగించు ఉపాయము చేసికొనవలె నని చెప్పెను. కాపాలికుడు దీని కంగీకరించి, ఒక ఖడ్గమునుతెచ్చి శంకరుని శిరంబును ఖండింప బోయెను. ఆ సమయమున

శంకరుని శిష్యుడు "పద్మపాదుడు" ఆయనకు రక్షకుడుగానుండెను. తన గురువు కేదో ఆపదగల్గనున్నదని ఆయన యోగశక్తివలన నెరింగి, నృసింహ మంత్రమును జపించి శంకరుని చెంత కరిగెను లక్ష్మీనృసింహస్వామి వెంటనే ప్రత్యక్షమై, కాపాలకుని దేహమును ఖండించి, శంకరుని రాపాడెను. నరసింహస్వామి సగము సింహము, సగము మనుష్యుని ఆకృతిలో నుండెను. శంకరుడు చూచి ఆనందించి ఆశువుగా 'నృసింహస్తోత్రమును' జదివెను. తరువాత అహోబలమేగి నృసింహస్వామిని దర్శించి వచ్చెనని కొన్ని గ్రంథములు, శ్రీశైలమునుండి గోకర్ణమేగెనని కొన్ని గ్రంథములు తెల్పుచున్నవి. 'చిద్విలాసీయ శంకర విజయము' లోను, ఆనందగిరి శంకర విజయము' లోను శంకరుడు శ్రీశైలమును దర్శించిన వృత్తాంతము గలదు.

శంకరుని జన్మ తేదీని గూర్చి భిన్నాభిప్రాయములు గలవు. 'శంకర మందార సౌరభమును, బట్టి ఈయన క్రీ. శ. 788 విభవనామ సంవత్సర వైశాఖ శు. ౧౦ న జన్మించెనని తేలుచున్నది పాశ్చాత్య విద్వాంసు లనేకులు దీని నంగీ కరించిరి. కనుక శంకరుని శ్రీశైలయాత్ర క్రీ. శ. 815 ప్రాంతమున జరిగి యుండును. కాపాలికుడు శంకరుని వధించబోయిన వృత్తాంతము 'ఉజ్జయినీ' ప్రాంతమున జరిగెనని కొన్ని గ్రంథములు వ్రాయుచున్నవి; కాని శ్రీశైల ప్రాంతము ననే జరిగెనని నేను తలంచుచున్నాను. 'శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ వివద్యతే' అని చాలకాలమునుండి వినవచ్చుచున్నది.

శ్లో॥ శ్రీశైల శృంగే వివిధ ప్రసంగే
శేషాద్రి శృంగేఽపి సదావసంతమ్
తమర్జునం మల్లిక పూర్వమేనం
నమామి సంసార సముద్రసేతుమ్.

శంకరులవారు శ్రీశైలమును గూర్చి యిట్లు గానముచేసిరి.

సిద్ధిం తథా విభమనో నిలయాం సమాధౌ
శ్రీశైల శృంగకుహరేషు కదోపలప్స్యే
గాత్రం యదామమంతా పరివేష్టయాతి
కర్ణే యదా విరచయంతి ఖగాశ్చనిద్ధమ్॥

నాదేహమును శ్రీశైలములో మొలచిన తీగలు ఎపుడు కప్పునో, నా చెవిగూడలలో గూళ్ళుకట్టుకొని ఎప్పుడుండునో। శ్రీశైలశిఖరములోని గుహలలో మనోలయము అయ్యే సమాధిసిద్ధిని ఎపుడు పొందుదును ?

# 7. కల్యాణి ప్రభువు త్రైలోక్య మల్లచాళుక్యుడు

(క్రీ. శ. 1058)

శ్రీశైలమును దర్శించిన రాజులలో మొదటివాడు ఈ ప్రభువుగా గాన్పించు చున్నాడు. క్రీ. శ. 1058 మాఘ బ. 2 న ఈ స్వామినిదర్శనము చేసికొన్నట్లు శాసనాధారములు లభ్యమగుచున్నవి. స్వామికి కొన్ని ఈనాము లిచ్చుటయే కాక, యాత్రికులమీద పన్నులు వసూలుచేయు ఏర్పాటొనరించెను. పశ్చిమ చాళుక్యరాజు సోమేశ్వర త్రైలోక్యమల్ల (క్రీ. శ. 1042–1068) చోళరాజ్యమును జయించి, కాంచీనగరమును దగ్ధముచేసి, కంచి చోడరాజు నోడించి కుంతలదేశ దక్షిణ పరిసోద్దులలోనికి ప్రవేశించెను వెనుకకుతిరిగి సిద్ధవాడినాడు (సిద్ధవటం) దాటి తన ముఖ్యసేనానికి కొన్ని గ్రామములొసగి శ్రీశైలమున కేగెను. అచ్చట ఈయన భార్య "మైలాలదేవి" ఒక సత్రమును స్థాపించి, వేదపఠనమున కొక పాఠశాల నేర్పరచి, దీని పోషణార్థము శివపురము, జూటూరు, కలుగొట్ల గ్రామముల నొసంగెను. ఈయన కుమారుడు 'భువనైకమల్లుడు' ఈ దానమును తిరిగి స్థిరపరచి, (క్రీ. శ. 1069) ఎర్రమరం గ్రామ ఆదాయమును గూడ పైవానికి జేర్చెను. 1922 మార్చి Annual Epigraphy లో ఈవిషయము గలదు. "పశ్చిమ చాళుక్య ప్రభువు 1వ సోమేశ్వరుని పట్టమహిషి మైలాలదేవి, సేనాని, బల్లవరుస అనువారు శ్రీశైలములోని మల్లికార్జునదేవుని, పాతాళగంగను దర్శించి, కాలాముఖాచార్యుడగు గంగరాశి భట్టారకుని శిష్యుడగు 'సురేశ్వర పండిత దేవుని' హస్తములలో ఉదకమును బోసి, దేవుని ఎదుట అనేక దానధర్మములుచేసిరి. ఈ ఆచార్యుడు మోసంగిలోని బ్రహ్మేశ్వర ఆలయమునకు ప్రధాన అర్చకుడు. రెండవ సోమేశ్వర భువనైకమల్లుడు కూడ (1068–76) శైవభక్తుడు. జైనుల నణచుటకు కాలాముఖ శైవుల నత్యధికముగా నాదరించసాగెను. ఆకాలములో కాలాముఖ శైవులు విశేషమైన పలుకుబడి గల్గియుండిరి వీరి నివాసము శ్రీశైలము' అగుటచేత ఆక్షేత్రము కాలాముఖులకు నిలయమైయుండెను. ద్రవిడ, కర్ణాటక దేశములోని బౌద్ధ జైనమతముల నణచుటకు దక్షిణమున శ్రీశైలమును, కృష్ణకు దక్షిణముగా బౌద్ధ జైనమతముల నణచుటకు ధాన్యకటకమును, (అమరావతి) కృష్ణకు ఉత్తరముగా ఆ మతప్రచారము జరుగుచుండుటకు విజయవాడను (బెజవాడ) తీవ్రవాద శైవులైన కాలాముఖులు శైవకేంద్రములను, కాలాముఖ మఠముల నేర్పరచిరని తెలియుచున్నది.

శ్రీశైలము కైఫీయతులలో త్రిభువన మల్లరాయలు జగదేక మల్లదేవ రాయలు, గర్భగుడి, ముఖమంటపములోను స్తంభాలపైన 'హాళె కన్నడము'లో వ్రాయించిరని, అవి జిడ్డుతగిలి ఉన్నవని వ్రాయబడియున్నది.

ఇంకొకచోట 'త్రైలోక్య మల్లరాయలవారి పాదపద్మ శ్రీమత్పరియురాళి మైళాదేవియరు శక 980 విళంబి వైశాఖ పౌర్ణమి సోమవారము — శివపురం శిలాశాసనము, కంపనోలు, శివపురం ఉ. చెరువు, సిద్ధేశ్వరుని దేవాలయము ఉత్తరము ధారాపూర్వకముగా పాతిఉన్నరాయి—కన్నడ అక్షరములు" అనిఉన్నది.

2 వ భాగము : బ్రహ్మేశ్వరాచార్యరు గంగరాశి భట్టారక శిష్యరు సురేశ్వరా పండితులు — గ్రామములు. చతుర్దిశలు — పొలిమేరలు.

3 వ శాసనము : కపిలహాదేవి.

991 — సౌమ్య సం. ఆషాఢ ౩౦ మంగళవారం సూర్యగ్రహణము—శ్రీశైల సత్రము, శివపురం సత్రము — గంగరాజు శిష్యుడు సురేశ్వరాచార్యులు — ఉభయులకు బ్రహ్మేశ్వరాచార్యులు శివపురము యిచ్చెను" కొలది దోషములున్నను, పాశ్చాత్య విద్వాంసులు 160 ఏండ్లనాడు శ్రీశైలములోని వివిధభాషలలోని శాసనముల బరిశీలించి, కైఫీయతులోని కెక్కించిరి. పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్ర'లో పర్వత ప్రకరణములో 'బల్లాహు మహారాజవంశజులు శ్రీశైలమును దర్శించి యిచట మఠములను గట్టించిరని వ్రాసినారు. ఆలయమునకు దగ్గరనే ఈమఠములున్నవి.

## 8. జంగమ మల్లయ్య

### (క్రీ. శ. 1050 — 1160)

ఈయన 'నన్నెచోడుని గురువు. జంగమమల్లికార్జునుడని, జంగమ లింగంబగు మల్లికార్జునుడని, జంగమమల్లయ్యయని, జంగమ మల్లికార్జున దేవుడని మల్లికార్జున మునియని, మల్లికార్జున మునినాథుడని, నన్నెచోడుడు కుమారసంభవములో ప్రశంసించెను. కవీంద్ర గాయకబుధస్తుతుడని, మునిపుంగవుడని, సుజనస్తుతుడని, అఖిల జగద్గురువని, సకల విద్యాగురుండని, నిర్వాణ యోగియని, మహిష్ఠనవర శరీరుడని, ఆత్మతత్వజ్ఞుడని, నిర్మలమతియని, సదాకల్యాణి అని మునిశిఖామణియని, హంసుండు,

పరమహంసుండు అని, అచల భావముగల జంగమ మల్లయయని, సంసార పద విముక్తుడని, వేదషడంగ శాస్త్రపురాణేతిహాసాగమాది సకల కళాస్వరూపా పార వాణీధరుడని, భూదేవకుల శేఖరుడని, సమ్పాసుర ముఖ్యుడని, విప్రమునిపుంగవుడని, మునీంద్రవర శిఖామణియని, నస్మునీంద్రారాధ్యుడని, శివయోగతత్పరుడని, మితభాషి యని, సుధీలోకస్తుతుడని, మహాత్ముడని నన్నెచోడుడు తనగురువును వర్ణించెను. కొన్నిచోట్ల శివునితో నభేదమును వర్ణించెను ఈ వర్ణనలబట్టి జంగమమల్లయ్య కాలా ముఖ తపోధనుడని ఎచటనులేదు. శివయోగి యని ఆరాధ్యుడని ఉండుటచేత శైవమతములోని మరియొకశాఖకు జెందిన వాడని స్పష్టపడుచున్నది. కాలాముఖ మను పదము నన్నెచోడుని కుమారసంభవములో నెచటను గాన్పించదు. కాలా ముఖమునకు మహావ్రతమని నామాంతరము గలదు. ఈ పదమొక్కచోట మాత్రము తగులుచున్నది.

ము॥ హరికంకాలము చేతిముద్ర దివిజేంద్రాస్థుల్ సుధాషావళుల్
గరళం బభ్యవహార మంతర తనుక్షారంబు మైపూత పం
కరుహాసీన శిరః కపాల మురు భిక్షాపాత్రగా విశ్వసం
హరువర్తించు మహావ్రతో పహతి సేయంబూన నీప్రాప్తియే.

ధ్యానముద్వారా నిర్వాణము లభించునని దానికి ఆరుముద్రలు గలవని క్రీ. శ. 12 వ శతాబ్దిలోని శ్రీరామానుజాచార్యులు వర్ణించిరి. అవి 1) హారము, 2) స్వర్ణభూషణము, 3) చెవిపోగు, 4) శిరోభూషణము, 5) బూడిద, 6) పవిత్రమైన జన్నిదము. మల్లయ్యకు నిర్వాణయోగిఅని పేరుండుటచేత, పైవానిని ధరించి ధ్యానయోగము ద్వారా నిర్వాణము పొందుటచేత ఈయన కాలాముఖయోగికాదు.

కాలాముఖులకు ఈక్రింది వ్రతములున్నట్లు రామానుజాచార్యులవారు వ్రాసిరి. (1) పానార్థమై మనుష్యుని పుఱ్ఱె (2) మృతులైన వారి భస్మమును శరీరముమీద పూయుట (3) నరమాంసము భక్షించుట (4) ఒక గదనుచేత ధరించుట (5) మద్యముతో నిండిన పాత్రను దేవతారాధన కుపయోగించుట. వీరి ముఖ్య దేవాలయము శ్రీశైలములో గలదని పాశ్చాత్య విద్వాంసులు వ్రాసినారు.

(James Hastings - Ency. of religions. II)

కాసి ఈఆలయము సమస్త శైవులకు పూజ్యనీయము. దక్షిణ దేశములోని ఈఒక్క దేవాలయములోనే సమస్త జనులు, అన్ని మతములు, కులములవారు, స్త్రీ పురుష

లెల్లరు లింగభేదము లేకుండా, ఈ స్వామి పూజలో బాల్గొందురు. ("It is however, the only temple in the south where all castes and creeds both men and women can join in the worship") శ్రీశైలములో లింగమునుకూడ తాకి ప్రతిభక్తుడు, భక్తురాలు పూజించవచ్చు. నేను కండ్లార గాంచి నాను. అట్టి పవిత్రస్థలమునకు 'జంగమమల్లయ్య' వచ్చి యిచట జీవితశేషమును గడపెను. కాలాముఖుల వ్రతములేమి జంగమమల్లయ్య నున్నట్లు కాన్పించును. క్రీ.శ.5-11 శతాబ్దమువరకు ఉన్న 63 మంది శైవభక్తులవలెనే జంగమమల్లయ్య యోగానుష్ఠాన పరుడై కాలము గడపెను. క్రీ. శ. 2 వ శతాబ్దినుండి అనేక శైవశాఖలు భారతావనిలో నావిర్భవించినవి. లకుల (లకులిన్, లకుటిన్, లకులీశ, నకులీశ) పాశుపత, మహేశ్వర, ఆరాధ్య, కాపాలిక, కాలాముఖ మున్నగు శాఖలు శైవములో గాన్పించుచున్నవి. ఇందులో జంగమమల్లయ్య ఏశాఖకు జెందినవారు ? "పరమ శ్రీనగోత్తుంగమణి శ్రీసంగత మల్లికార్జున దేవతాకంబై జగంబులం బ్రత్యక్షంబై ప్రవర్తిల్లుట జంగమ మల్లికార్జున దేవుండై" అను నన్నెచోడుని వచనమునుబట్టి మల్లికార్జునస్వామియే జంగమ మల్లికార్జునుడై వెలసెనని, ఆయన కూడ శ్రీశైలమున నుండెనని స్పష్టపడుచున్నది.

ఈ మల్లయ్య శ్రీశైలములోని 'బిల్వవనము' లో నున్నట్లు కాన్పించు చున్నది. ఈ గురువే నన్నెచోడునికి వివిధ భాషలు, కవిత్వము, ఆధ్యాత్మిక విద్య బోధించియుండెనని తోచుచున్నది. 'మల్లయ్య' ఎవరో మనము పరిశోధించి కనిపెట్టవలయును. కె. వెంకటనారాయణగారు, ఈ మల్లయ్య పశ్చిమచాళుక్యుల యొద్ద దండనాధుడుగా నుండెనని తన ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో వ్రాసెను. బసవపురాణమునుబట్టి ఈయన కర్ణాటక దేశీయుడని కొన్నాళ్ళు 'బిజ్జలునికి ప్రభుత్వగా' జేసెనని, తర్వాత సన్యసించి శ్రీశైలములో దపం బాచరించి శిష్యుల నుపదేశి చె యాయెనని తెలియుచున్నది. చిలుకూరి వీరభద్రరావుగారిట్లు వ్రాసిరి. "ఈయన పశ్చిమచాళుక్యులకడ దండనాధుడుగానుండి సన్యసించి శ్రీశైలక్షేత్రమున మల్లికార్జున దేవుని సమ్ముఖంబున నివసించుచు ననేకమంది శిష్యులకు వీరశైవ మతంబును బోధించి మతవ్యాపనముకై, వారిని దేశదేశములకు బంపెను. బసవేశ్వరునీయన శిష్యుడు. ఈయన శిష్యుడు పాల్కురికి సోమనాథుడు," నారాయణరావుగారు, శివతత్వసార గ్రంథకర్త 'పండితారాధ్య మల్లికార్జునుడని' నన్నెచోడుని గురువు 'మల్లికార్జునయోగి యని ఈయన పశ్చిమచాళుక్యుల యొద్ద దండనాథుడుగానుండి సన్యసించి శ్రీశైలములో దపంబాచరించి శిష్యుల నుపదేశి చె యుండెను, క్రీ. శ.

1030–1140 వరకుండెనని నన్నెచోడు డితనిని గురువుగాను, కృతికర్తగాను చెప్పుకొనెనని ఇంకను బసవేశ్వరుడు కూడ యితని బోధనామృతము గ్రోలెనని, శైవవాఙ్మయమునకు బ్రహ్మయని, ప్రథమ కవిశిష్యుడు నన్నెచోడుడని వీరు వ్రాసిరి. ఈ విషయములు కొంతభాగము చారిత్రక సత్యములుగా గాన్పించినవి. బసవేశ్వరుడు క్రీ. శ. 1167 లో మరణించుటచే ఈయన తండ్రి క్రీ. శ. 1100 ప్రాంతమునుండి యుండవలెను. ఈయన జంగమమల్లయ్యతో క్రీ. శ. 1100 ప్రాంతమున మాటాడి యుండవచ్చును. వీరభద్రరావుగారు, వేంకట్రావుగారు వ్రాసినట్లు మల్లయ్య శిష్యుడు నన్నెచోడుడు క్రీ. శ. 1130–1140 ప్రాంతపు వాడని చెప్పవచ్చును: కాని దండనాథుడైన మల్లయ్య ఈయన ఒక్కరేనా? ఈ విషయము చాలాకాలమునుండి నామనంబున ఘనంబుగ బాధించుచున్నది.

పాల్కురికి సోమనాథ కవి రచించిన బసవపురాణము ద్వితీయాశ్వాసములో నిట్లున్నది.

మల్లరసను నొక మండలేశ్వరుడు
దొల్లి యిట్టుల రాజ్యమొల్లక విడిచి
శ్రీగిరికేగి సచ్చింతాసమాధి
నాగిరి బిల్వవనాభ్యంతరమున
నున్నవారని వారి యురుభక్తిగుణము
నోన్నతికయు ధ్యానయోగసంపదయు
శివభక్తి తత్త్వానుభవ సమగ్రతయు
శివభక్తి గణములచే వినఁబడుచు
నప్పుడు శ్రీగిరి కరుదెంచి రర్థిఁ
జొప్పడు మల్లరసును జూచువేడ్క-
నమున లవగా నాటి రాజయ్యగారు."

ఇక నరు "నగరేశ్వరు నాటి రాజయ్య: పిడుపర్తిసోమన" కూడ నీ విషయ మును తన 'పద్య బసవపురాణము' లో నుల్లేఖించెను.

క॥ మల్లయనెడి దొల్లి మహీ
వల్లభుఁడే రతి రాజ్యవైభవము మడిన్
ఉల్లమున శ్రీగిరి కరిగి మ
హోల్లాసత నట యోగియై యుండఁగుతున్.

క॥ ఆగిరి బిల్వవనంబున
యోగంబున శంభుభక్తి యోగంబును జె
న్నె గరిమంబుగ నొందుట
బా గొప్పుగ వినియె శంభుభక్తులచేతన్.

సకలేశమాది భూపాలుడు వచ్చి, మూడేండ్లుండెనని ఆయనను 'మల్లరసతి భక్తిని గౌగిలించెనని, మాదిరాజు, మల్లరాజుతో నిట్లనెనని, తరువాత భాగము వ్రాయబడెను. వీరి వంశవృక్షమిట్లున్నది.

మల్లరసు (శివయోగి మల్లికార్జునుడు—కల్లకురికి ప్రభువు)
|
సకలేశ మాదరసు (కల్లకురికి ప్రభువు)
|
మాయిదేవుడు (భార్య మంగళ)
|
కెరెయపద్మరసు (భార్య మాదేవి)
|
కుమార పద్మరసు

కనుక దీనినిబట్టి 'మల్లరసు' మహీవల్లభుడని, కల్లకురికి ప్రభువని, వైరాగ్యభావము గల్గగా శ్రీగిరికేగి బిల్వవనంబులోనుండి ధ్యానయోగముచేత సమాధినిబొంది కాలముగడపెనని అనేకమంది శిష్యులు చేరుచుండిరని, తెలియుచున్నది. కనుక ఈ మల్లరసు పశ్చిమచాళుక్యుల రాజగు 'త్రైలోక్యమల్లుని' దండనాథుడు కావచ్చునని ఊహగల్గుచున్నది. ఇక తెలుగుచోడ రాజులలో కోడూరు శాఖకు జెందినవారు, త్రిభువన మల్లుడను పశ్చిమచాళుక్య చక్రవర్తి యొద్ద 'మహామండలేశ్వరుడుగా' నున్నవారు అయిన 'మల్లరస చోడరాజు' పశ్చిమ చాళుక్యరాజుల సేనాధిపతిగానుండి అనేక యుద్ధములలో బాగొన్నట్లు జయములు పొందినట్లు, సర్వజిత్తు సంవత్సరములో మప్పళపూడి శ్రీ బ్రహ్మేశ్వరస్వామికి పంచోపచార పూజకై 'వితరణేంద్రరాశి' యను పండితునికి కొంత భూదాన మొసంగి శాసనము లిఖించినట్లు తెలియుచున్నది. ఈ శాసనములు 'తెలంగాణా శాసనములలో' నున్నవి. కనుక వీరభద్రరావుగారు, నారాయణరావుగార్లు దండనాథుడని పేర్కొన్న 'మల్లరసచోడరాజు' ఈయనయే. కొన్నాళ్లు పాలించి, సన్యసించి

శ్రీశైలమునందుండి శిష్యులకు విద్య నేర్పెనేమో అని తెలిసికొనుట కాధారములు లభించలేదు. ఈచోడరాజు బిరుదులలో మహామండలేశ్వర, కోడూర్పురవరేశ్వర' కల్కుడీపురవరేశ్వర, అనేక సమర సంఘట్టనోపలబ్ధ విజయలక్ష్మీ సమాలింగిత విశాలవక్షస్థలం, క్షత్రియకుల పవిత్ర, భువనత్రినేత్ర' అను బిరుదులు కాన్పించుచున్నవి. కనుక ఈ 'చోడరాజు' బిరుదులబట్టి క్షత్రియుడుగా గాన్పించుచున్నాడు. నన్నెచోడుని గురువు జంగమమల్లయ్య 'హంస, పరమహంస అని పేర్గాంచిన బ్రాహ్మణోత్తముడు. మల్లరసు కల్లకురికి ప్రభువని బసవపురాణము పేర్కొనుచున్నది. ఈయన బిరుదులలో 'కల్కుడీపురవరేశ్వర' అని ఉన్నది. కల్కుడీ పురము కల్లకురికి ఒక్కటియా ? ఉభయులు క్రీ. శ. 11 వ శతాబ్దిలోని వారే ! కాని పై భేదముచేత జంగమ మల్లయ్య మల్లరస చోడరాజు కాదేమో అని శంకించుచున్నాను. ఇంకను ప్రబలమైన పరిశోధనలు చేయవలసియున్నది. ఈ దండనాథుడు శ్రీశైలమున కేగిన ఆధారములు లభ్యముకాలేదు. కనుక బసవపురాణములో వర్ణించబడిన జంగమ మల్లయ్య 'మల్లరసు' అని నేను తలంచుచున్నాను. త్రైలోక్యమల్లుడు శ్రీశైలమునకు క్రీ. శ. 1058 లో వచ్చుటచేత, ఈయన వెంట సామంతుడు 'మల్లరసు' కూడ వచ్చియుండి, తర్వాత సన్యసించి ఉండవచ్చును.

నన్నెచోడుడు కుమార సంభవములో 'తత్ప్రభునాజ్ఞ పెంపున' అని క్రింది పద్యములో వాడెను.

ఉ॥ పూని మహాగ్రహార పురపుత్ర సమున్నతి దేవతాలయో
ద్యాన తటాక సత్కృతి నిదానము లాశశితారకంబు ను
స్థానములై మహింబరఁగు జంగమ మల్లయపేర సత్ప్రసం
తానములొప్ప సల్పుడు ముదంబునఁ దత్ప్రభు నాజ్ఞపెంపునన్.

ఈ ప్రభువెవరు ? మరితోంటనార్య రచితంబగు 'వీరశైవానంద చంద్రికా'లో (క్రీ. శ. 15 శ.) శ్రీశైలములోని శైవపీఠాధిపతుల పేర్లున్నవి. వారు వరుసగా 1. గురుసిద్ధః 2. శ్రీరంగసిద్ధః 3. మంచెన పండిత 4. సంగమ 5. అప్పయ 6. విశ్వారాధ్యపండిత 7. శివ 8. మాధవ 9. శ్రీపతి 10. ప్రభువు 11. మల్లికార్జున. శ్రీపతికి మల్లికార్జునునికి మధ్యనున్న ప్రభువే క్రీ. శ. 12వ శతాబ్దిలోని జంగమ మల్లయ్య అని నేను తలంచుచున్నాను. ఈయన కల్లకురికి ప్రభువగుటచేతకాని, లేక బిరుదములలో ప్రభువని పిలువబడుటచేతకాని ఈయనను

నన్నెచోడుడు ప్రభువుగానే సంబోధించియుండెను. ఈ చారిత్రక సత్యము నింతవరకు ఏ చరిత్రకారుడు కనిపెట్టి యుండలేదు. కనుక జంగమమల్లయ్య అను ప్రభువు నన్నెచోడుని గురువు, పశ్చిమ చాళుక్య ప్రభువగు త్రైలోక్య మల్లునితో (క్రీ శ. 1058) వచ్చి శ్రీశైలములోని బిల్వవనములో స్థిరపడి శిష్యులకు విద్యను జెప్పుచు శైవమత ప్రచారముచేసెనని తోచుచున్నది. నన్నెచోడ చరిత్రలో ఇతర మల్లికార్జునుల ప్రశంస కలదు. కాన నిచట వదలినాను. నన్నెచోడుడు "జంగము మల్లయ్య" అని తనగురువును పేర్కొనెను. జంగములకే మహేశ్వరులను పేరు గలదని, బ్రాహ్మణులు హిందువులలో నెట్లు పూజ్యనీయులో అట్లే లింగాయతులలో వీరు పూజ్యనీయులని, లింగధారులైన అన్ని జాతులు, కులములవారితో వారు భోజనపానీయాదులు జరుపుదురని, మాంసాహారమును భుజించు 'గణము తెన్న' అను వారితో గలసి భుజించరని 'కర్నూలుజిల్లా మాన్యుయల్' లోనున్నది. కనుక మహేశ్వరుడైన మల్లయ్యయే జంగము మల్లయ్యగా నన్నెచోడునిచేత పేర్కొనబడినట్లు కాన్పించుచున్నది.

## 9. మల్లికార్జున పండితారాధ్యులు

### (క్రీ. శ. 1100—1170)

పాల్కురికి సోమనాథకవి పండితారాధ్య చరిత్ర, బసవపురాణము మున్నగు గ్రంథముల రచించెను. పండితారాధ్య చరిత్రలో పర్వత ప్రకరణములో, బసవ పురాణములో శ్రీశైల వృత్తాంతము గలదు. తూర్పుగోదావరి జిల్లాలోని ద్రాక్షారామము 'దక్షిణకాశి' వంటిది. ఇచట భీమేశ్వర లింగమును పూజించుచు, భీమన పండితుడు పూజారిగానుండి కాలము గడపుచుండెను. ఈయన భార్య గౌరాంబ. వీరికి పండితారాధ్యులు గల్గెను. వీరికి మొదట సంతానములేదు. భీమన, గౌరాంబ కలసి సంతానాపేక్షతో శ్రీశైలయాత్రచేసి, అచట మల్లికార్జునస్వామిని సేవించి, తమకు సంతానముగల్గిన స్వామిపేరు పెట్టుకొనెదమని మ్రొక్కి ఇంటికి వచ్చిరి. కొన్నాళ్ళకు సంతానము గల్గుటచేత, ఆనందించి ఆస్వామి పేరును కుమారునికి పెట్టిరి. ఈయన విద్యావంతుడై, పెరిగి పెద్దవాడైన తర్వాత స్వామిపేరుతో 'శ్రీగిరి మల్లికార్జున శతకమును' రచించెను. కాని ఈనాడది లభ్యము కాదు. 'శివతత్వ సారము' అను గ్రంథము కందపద్యములలో రచించెను. దీనిలో నేడు 488

కందములున్నవి. ఈయనను పండితారాధ్యులని పిల్వసాగిరి. పండిత త్రయములో అనగా శ్రీపతి, మంచెనకవి, పండితారాధ్యులు అను వీరిలో నీయన చివరివారు. ఈయన గురువు కోటిపల్లి ఆరాధ్యదేవరయని, ఆయన గురువు 'అవాంతరయ్య' అని తెలియుచున్నది. కాలాముఖ మల్లికార్జునుని గురువు తపోరాశి. క్రీ. శ. 1050 లో 'వనవాసి' లో నొక కాలాముఖ మఠమును స్థాపించెను. ఈ కాలాముఖ మల్లికార్జునుడు, నన్నెచోడుని గురువు జంగమమల్లయ్య, ఒకరు కాదని తోచుచున్నది.

పండితారాధ్యులు తన దేశమందుండగా, కర్ణాటకమునుండి శైవభక్తులగు 'బలిదేవ వేమనారాధ్యుడు, బోరండ్ల సూరసానమ్మ' వచ్చి బసవేశ్వరుని మహిమలు చెప్పగావిని ఆయన బసవేశ్వరుని జూడ వాంఛించుచుండెను. కొన్నాళ్ళకు బసవేశ్వరునిజూడ కల్యాణి నగరమునకు బయలుదేరెను. మధ్యలో, వెలనాటికి ముఖ్య నగరమగు 'చందవోలు'లో నాగెను. 'రెండవ వెలనాటి రాజేంద్ర చోడప నాయకుడు' (క్రీ. శ. 1161–70) దీని పాలకుడు. ఈ ప్రభువు, ఈయన బావమరది "కొండపడమటి బుద్ధరాజు" బౌద్ధులు అని చందవోలు కైఫీయతు, పండితారాధ్య చరిత్ర తెల్పుచున్నవి. బౌద్ధపండితుడైన 'బౌద్ధపదాచార్యుని' పండితారాధ్యుని శిష్యులు 'రేమయ్య, బోమయ్య' అనువారు చంపుటచేత 'కొండపడమటి బుద్ధరాజు' ఆగ్రహావేశపరవశుండై పండితారాధ్యుని నేత్రద్వయంబును పీకించెను. అంతట పండితారాధ్యులు 'చోడరాజ్యవంశము' నశించునట్లు శపించెను. పండితారాధ్యులు క్రీ. శ. 1165 ప్రాంతమున చందోలు వచ్చి యుండవలెను. అచటనుండి 'పండితా రాధ్యులు' అమరావతికి జేరి అమరేశ్వరుని గూర్చి 'అమరేశ్వరాష్టకము' రచించెను. ఈయనకు స్వామి అనుగ్రహంబున ఊర్ధ్వనేత్ర లాభము గల్గెనని, సోమనాథుడు పండితారాధ్య చరిత్ర "మహిమ ప్రకరణములో" వ్రాసెను ఇది సత్యమైయుండదు. తర్వాత పండితారాధ్యులు 'నిడుముగుల, పానుగల్లు, వని పురము' మీదుగా పెల్లటూరుకేగెను. పానుగంటిలో ధవళేశు నామయ్యను గలిసికొనెను. తరువాత శ్రీశైల ప్రాంతముచేరు నప్పటికి 'బసవేశ్వరుడు' లింగైక్యము (1167) చెందెనని విని పండితుడు చింతించెను. తరువాత కొద్దికాలమునకు పండితా రాధ్యులు శ్రీశైలప్రాంతమున పెల్లటూరులో జనిపోయెను, చనిపోవుముందు బోనయ్యను గిరి ప్రదక్షిణమునకు బంపెనని, సమగ్రముగా విని దానిని వర్ణించుచు శిష్యులకు చెప్పెనని తెలియుచున్నది. కండ్లు లేనందున ఈయన శ్రీగిరి ప్రదక్షిణము చేయలేకపోయెను. శ్రీగిరి మల్లికార్జున శతకములోని ఈ పద్యము లభ్యమగు చున్నది.

ఉ. లోకములెల్ల నీ తనువులోనివ, నీ వటయెంత కల్గుదో
నాకప పద్మసంభవ జనార్దనులాదిగనెల్ల పెద్దలున్
నీ కొలదింత యంతయన నేరక మ్రొక్కఁదొడంగిరన్న ని
న్నే కరణి న్నుతింతు పరమేశ్వర శ్రీగిరి మల్లికార్జునా.॥

వినుకొండ తాలూకా తంగెడుమల్లి గ్రామ కైఫీయతునుబట్టి 'మలరాజు పెద సూరన్న' బాకీపడి వాసిరెడ్డి చంద్రమౌళిగారికి దీనిని విక్రయించెనని, ఈ గ్రామము కర్ణాటకములో శ్రీపతి పండితపండితారాధ్యులవారి కగ్రహారముగా నడచెనని తెలియుచున్నది. (L. R. Vol 56 - తంగెడుమల్లె కైఫీయతు) ఇదిసత్యమగుచో, పండితారాధ్యునికి అగ్రహారము లివ్వబడినట్లు తేలుచున్నది. దోనయ్యద్వారా శ్రీశైలమును గూర్చి వినివానిని వర్ణించెనని పాల్కుఁరికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో వ్రాసెను. కండ్లులేకుండుటచేత శ్రీశైలము మీద తిరిగియుండలేదు.

## 10. బ్రహ్మనాయుడు

(క్రీ. శ. 1140–1182)

క్రీ. శ. 12 వ శతాబ్దములో వెలమవీరులు బ్రహ్మనాయుడు మున్నగువారు మాచెర్ల రాజునకు అనగా నలగామరాజు సవతి తమ్ములగు మలిదేవాదులకు బదులుగా పాలించుచుండిరి. నలగామరాజుకు మంత్రియైన నాయకురాలు నాగమ్మకును, బ్రహ్మనాయుడుకు జరిగిన కారంపూడి యుద్ధము క్రీ. శ. 1181–1182 ప్రాంతములో జరిగినట్లు కాన్పించుచున్నది. కాకతీయ రుద్రుడుకూడ నలగామరాజుకే సహాయము పడెను; కాని వెలమ వీరులధాటికి వీరు ఆగలేకపోయిరి. ఈ నలగామరాజు వెలనాటి చోడరాజగు రెండవ రాజేంద్రచోడుని మేనల్లుడు. (క్రీ. శ. 1161–1170) కల్యాణి రాజగు వీరసోముడు, శివపురి కోటలోనుండి తనరాజ్యమును పాలించుచుండెను. శత్రుసేనలు వచ్చి కోటను ముట్టడించి ఆరాజును పారదోలుటకు విశ్వప్రయత్నముల జేయుచుండిరి. వీరసోముడు తనకీ ముప్పును దప్పించ సమర్థుడైన వీరుడు ఒక్క బ్రహ్మనాయుడేయని మిత్రులద్వారా తెలిసికొని ఆయనకు జాబువ్రాసి చారులద్వారా పంపెను. 'బ్రహ్మనాయుడు' అపుడు మాచెర్లనగరము

లోనే ఉండెను. జాబుచూచి సంతోషిత స్వాంతుడై 'శీలమ్మ' చెంతకరిగి, తనకు భోజనము పెట్టి శివపురికోట యుద్ధములో తాను గెల్చునట్లు తల్లిని దీవించుమని కోరెను.

ద్వి. "వినవమ్మ ! యోతల్లి ! విన్నపం బొకటి
శివపురి కోటను శీఘ్రంబె గెలువ
నన్ను దీవింపుము ననుకన్నతల్లి !"

షడ్రసోపేతమైన భోజనమును శీలమ్మ, వీరాగ్రేసరుడైన బ్రహ్మనాయునికి వడ్డించెను. ఆయన భుజించి తల్లి ఆశీస్సులగైకొని, అనేకమంది వీరుల తోడ్కొని శివపురికి బయలుదేరెను. మనోవేగంబున బయనించి బ్రహ్మనాయుడు తన బలగంబుతో 'వెలుగోటి కనుమ' చేరెను.

ద్వి. అచ్చోట వెడలియు నతి రయమ్మునను
శ్రీగిరి చేరిరి శ్రీ వీరవరులు
జాజుల మల్లెల సంపెంగ పూల
మల్లెల మందార్ల మంచిగన్నేర్ల
కొల్లగా పూచిన గొజ్జంగి విరుల
శ్రీశైలనాథుని చెలగి పూజించి
శివపురి కోటను చేరిరివేగ.

కోటనుగెల్చి, శత్రురాజుల సైనికులను చీల్చి చెండాడి కోటను రాజు కప్పగించి బ్రహ్మనాయుడు స్వసైన్యంబులతో నిజరాజధానికి వెంటనేబయలుదేరెను. మధ్యలో వెలుగోటి కనుమనుదాటెను.

ద్వి. అడవి చెంచులపల్లి అవలీల దాటి
చెన్ను మల్లునిపల్లె చెలువమరగడచి
మల్లికార్జునిపల్లె మహాదేవి వీడి
కోనసింగరి తరలి కొండలు దాటి
శ్రీశైలమువరకు శీఘ్రంబె రాగ
అంతట సప్తాద్రి కరిగె భానుండు
అప్పుడా బ్రహ్మన్న యతులితభక్తి
మల్లికార్జును ముఖమంటపము చేరి

హస్తముల్ ముకుళించి యతులితభక్తి
దేవ ! మహాదేవ ! దేవతారాధ్య !
నన్ను కరుణచూడు నగపుత్రితోడ ॥
అని యిట్లు నుతియించి యా బ్రహ్మనీడు
యామముల్ నాలుగు నచ్చోట గడుప
కుక్కుటంబులు కూసె గువ్వలు కూసె
చుక్కతాపొడిచెను సూర్యుడుదయించెను
అంతట బ్రహ్మన్న యతి వేగమునను
పర్వతమ్ములపల్లె ప్రాంతముల్ గడచి
ఎగువ పల్లెను దాటి యెనసిన పేక
మొగుళపల్లెకు వచ్చి మోలేరు దాటి
దిగువపల్లెలు గడచి దీమసం బొప్ప
త్రిపురాంతకమునకు దిన్నగా వచ్చి
ఆవేళ మహాదేవునతి భక్తి మ్రొక్కి ॥

ఈ ప్రకారము శ్రీనాధుడు, బ్రహ్మనాయని శివపురము కోటయుద్ధమును వర్ణించుచు, శ్రీశైలస్వామిని దర్శించిన విధమును వర్ణించెను. బ్రహ్మనాయుడు మరణించి దాదాపు 800 ఏండ్లు అయినను, తల్లి శీలమ్మ పేరుతో 'శీలాల' బ్రహ్మనాయుని పేరుతో 'నాయుడుపేట' పేరినీడు పేరుతో 'పేరాల' గుంటూరు మండలమున తీర్థయాత్రాస్థలములై విలసిల్లుచున్నవి. పైవర్ణనల చూడగా శ్రీనాధుడు నాటి ఈ మార్గముననే త్రిపురాంతకము వచ్చి, శ్రీశైలమునకు చేరెనని తెలిసి కొనవచ్చును.

## 11. కుళోత్తుంగ చోళగొంకరాజు

(క్రీ. శ. 12 వ శతాబ్ది)

వెలనాటి రాజైన ఈయన రాజ్యము శా. శ. 1022 (క్రీ. శ. 1100) నాటికి నందికొట్టూరు తాలూకా వరకు వ్యాపించియున్నది. 'ఆయుబూరుగునికాట' పకారము సదరు గ్రామము విస్తృతము చేయబడెనని, ఒక చోళమహారాజుచే [illegible]

శ్రీశైలస్వామికి ధర్మార్థమివ్వబడినదని కర్నూలుజిల్లా మాన్యుయల్ తెల్పుచున్నది. ఇంకను సదరు మాన్యుయల్‌లోనే పాండవ ఉత్తుంగభోజుని సూనుడు నందన చక్రవర్తి కలి 2000 ల సంవత్సరమున ఈ అరణ్యమును ఛేదించి శ్రీశైలమును నివాస ప్రాంతమొనర్చెనని వ్రాయబడియున్నది. ఈయన ఎవరో సరిగా తెలియకున్నది. శాలి 856 (క్రీ. శ. 934) శాలి 1030 (క్రీ. శ. 1108) శాలి 1045 (క్రీ. శ. 1123) శాసనములబట్టి చోళమహారాజు సిద్ధేశ్వరం (నందికొట్కూరు తాలూకా) అను గ్రామమును శ్రీగిరిస్వామి కిచ్చినట్లు తెలియుచున్నది.

ఇంకను వెలనాటి రెండవ గొంకరాజు గోదావరి యుద్ధములో "గోవింద దండాధిపుని" జయించెను. ఈ యుద్ధమున ఈయన చూపిన బలపరాక్రమములకు మెచ్చి, చాళుక్య విక్రమచోడుని కుమారుడు రెండవ కుళోత్తుంగ చోడుడు ఈయనను శ్రీశైల ప్రాంతదేశమునకు గూడ పాలకుడుగా నియమించినట్లు తెలియుచున్నది. అందుచేతనే ఈయన బిరుదు "త్రిశతోత్తర షట్సహస్రావనీ నాథ సంపాదిత' అని చెప్పబడుచున్నది. శ్రీశైల ప్రాంతమున వీరి శాసనము లేమి కాన్పించలేదు. తూర్పు చాళుక్యరాజుల కాలములో శ్రీగిరి స్వామికి ధర్మములుచేయు పద్ధతి కలదని చెప్పవచ్చును

## 12. హొయసలరాజు సామంతుడు

(క్రీ. శ. 12 శ)

హొయసల ప్రసిద్ధుడైన ఒక సామంతరాజు 'నరసరాజు' లింగ ప్రతిష్ఠకు శ్రీశైలములోని పిలగంగి (పాతాళగంగ) నుండి లింగములు తెప్పించెనని ఒక శాసనప్రమాణము గలదు. ఈ లింగములు 'స్వయంభూలింగములు' అని పేరువడసియున్నవి. వీనిని రాజప్రతినిధియగు "నరసరాజు" శ్రీశైలములో ఎనిమిది దిక్కుల ఎనిమిది మహాలింగముల ప్రతిష్ఠించెను.

## 13. సాగి రెండవ పోతరాజు

(క్రీ. శ. 13 వ శతాబ్ది)

ఈయన గుడిమెట్ట సీమ ప్రభువు. బెజవాడ రాజధానిగా జేసికొని పాలించెను. ఈయన శాసనములు క్రీ. శ. 1197-1230 వరకు గలవు. ఈయన త్రిపురాంతకము మున్నగుచోట్ల బంగారు కలశముల బెట్టించెను. శ్రీగిరి మల్లికార్జున

దేవుని ముందర నందికేశ్వర విగ్రహమును స్థాపించి, స్వామిభోగముల నిమిత్తము "కంభముపాడు. ముచ్చింతలు, బూదవాడ" మున్నగు గ్రామములను ధర్మము చేసెను.

## 14. కాకతీయ రాజులు

(క్రీ. శ. 12—14 వ శతాబ్దము)

కాకతీయ ప్రభువు 1 వ ప్రతాపరుద్రుడు (క్రీ. శ. 1158—1195) త్రిపురాంతక శ్రీశైలముల గెల్చెను ఈయన క్రీ. శ. 1162 వ సంవత్సరమున "వెలనాడు" పై దండయాత్రచేసి పిమ్మట దక్షిణదేశ దండయాత్రల కేగెను. ఈసమయములోనే దక్షిణమున శ్రీశైలమును గెల్చియుండెను. క్రీ. శ. 1162 నాటి అనుమకొండ శాసనములో నిట్లున్నది. ఆనాటి హద్దులు కూడ దీనినిబట్టి తెలుచున్నవి.

రాజ్యం ప్రాచ్యాం లవణ జలధే
స్త్రీర పర్యంత మస్య శ్రీశైలాన్తం
ప్రచరతి సదా దక్షిణాశాం సమగ్రాం
ప్రాతీచ్యాన్తా కటకనికట స్థాయినీ రాజ్యలక్ష్మీః
కౌబేర్యాశాతట విలసితే మాల్యవంతం ప్రదేశే.

కనుక క్రీ. శ, 1162 నాటికి ఈయన రాజ్యము శ్రీశైలము వరకు వ్యాప్తిచెందెనని చెప్పవచ్చును. తరువాత 'శ్రీశైలము' కాకతీయరాజుల పాలనలో నుండెను. కాకతీయ గణపతి త్రిపురాంతకమేగి క్రీ. శ. 1260 లో నొక శాసనము వేయించెను. ఈయన గురువు 'విశ్వేశ్వరశివాచార్యులు'. ఈయన శ్రీశైలములో శివాలయములు, మఠములను గట్టించెను. గణపతి కుమార్తెయగు రుద్రమదేవి (1261 — 1295) ఆంధ్రదేశమును సమర్థవంతముగా బాలించెను. చోళ, పాండ్యరాజులు అసూయాయత్త చిత్తులై దక్షిణ దేశముపై దండెత్తిరాగా. వారిని వెనుకకు బారదోలెను. శ్రీశైలములో నీమె, ఆసమయమున ఒక కల్యాణమంటపమును గట్టించినట్లు చరిత్రలు నుడువుచున్నవి.

ఈమె మనుమడు 'వీరప్రతాపరుద్ర దేవుని' (క్రీ. శ. 1295—1323) కాలమున అగస్త్యమహాకవి యుండెను. ఈయననే 'విద్యానాథుడ'ందురు. ఈయన 'ప్రతాపరుద్రయశో భూషణము' అను గ్రంథమును రచించి, ఖ్యాతిగాంచెను.

"యైర్దేశ స్త్రిభిరేష యాతిమహతీంఖ్యాతింత్రిలిఙ్గాఖ్యయా
యేషా కాకతి రాజకీర్తి విభవైః కైలాస శైలాఃకృతాః
తేదేవాః ప్రసరత్ప్రసాద మధురా శ్రీశైల కాళేశ్వర
ద్రాక్షారామ నివాసినః ప్రతిదినంత్వచ్ఛ్రేయ సేజాగ్రతు.."

ఆంధ్ర సామ్రాజ్య వైభవమును వర్ణించు నీకవి శ్రీశైలమును పేర్కొనెను. ప్రతాపరుద్ర మహారాజు శ్రీశైలయాత్రచేసి, కొన్ని ఉత్సవ విగ్రహములను బహుమతిగా శ్రీశైల దేవాలయమున కొసంగెను. ఈయన గొప్ప భక్తుడు. ("He was of a religious turn of mind") శ్రీశైలము వరకు ఈయన రాజ్యము గలదు. శ్రీ పర్వతస్వామిని దర్శించి తూర్పు వైపుగా కనుమలగుండా దిగి, కంబము, బద్వేలు లోయల మీదుగా గండికోటరాష్ట్రము దాటి వచ్చెను. ఈ ప్రాంతమునకు అతని మంత్రి 'గొంకయను' పాలకునిగాజేసెను. రుద్రవరములో నాగి, నరసింహ విగ్రహమును 'అహోబలము'లో ప్రతిష్ఠించెను. కొచ్చెర్ల కోటలో నాగి, తన విలుకాండ్రయిన 'ఇరికప్ప, కేతినాయక' అనువారిని అరణ్యమును ఛేదించుమనిచెప్పి ఆ ప్రదేశమున 'దుప్పిపాద' (దూపాడు) అను గ్రామమును నిర్మించెను. అనుముకొండ వాసియగు "శ్రీనాథరాజు"ను దీనిపాలన కప్పగించెను. ఆరాజు అచట నొక గృహమును గట్టించెను. ఈ కొండవీరపాలన 15 వ శతాబ్దిలో గజపతిరాజులు వచ్చువరకు కొన్నాళ్లుసాగెను.

శ్రీశైలము కైఫీయతునుబట్టి (L R XVI) ఈ రాజ్యము కాకతి గణపతి వశములో నున్నట్లు, తర్వాత ప్రతాపరుద్రుడు మహేశ్వరులకు గణమఠము, వీరభద్రదేవుని ముఖమండపము కట్టించెనని, మఠపోషణకు శివపురం మొదలైన కర్ణాటకములోని 18 గ్రామములను, కమ్మనాడులోని 8 గ్రామములను, అయిజనాడు, రేనాడు, మురికినాడులోని కొన్ని గ్రామములను మల్లికార్జునదేవుని కిచ్చెనని తెలియుచున్నది. ఈయన మొత్తము 70 గ్రామములను స్వామి కిచ్చినట్లు తెలియుచున్నది. శా. శ. 1240 కాళయుక్తి మాఘ శు. ౨ న ప్రతాపరుద్రుడు తన దేవితో వచ్చి ఇచట తులాభారము తూగెనని, ధర్మములు నడిపించే లాగున నిర్ణయించెనని సింగనపోలి తాలూకా వెలుగోడి కైఫీయతు తెల్పుచున్నది.

కాకతీయ ప్రతాపరుద్ర మహారాజు మహాప్రధాని శాసనమొకటి శా. శ. 1234 పరీధావి ఫాల్గుణ శు. ౫ గురువారము నాటిది కాన్పించుచున్నది. పేపటి కమ్మయ్య అను మంత్రి, కమ్మనాడులో కొంత భూదానమును, శ్రీగిరిస్వామి వారికి

మధ్యాహ్ననైవేద్యముల కొసంగెనని తెలియుచున్నది. మరియొక శాసనమునుబట్టి శ్రీగిరిమీద భీమవిగ్రహమును రాజమంద్రి గౌరవర్తకుడైన ముద్దనశెట్టి గంగమల్లిశెట్టి యిచ్చినట్లు తెలియుచున్నది. మరియొక శాసనమునుబట్టి భృంగినాథ విగ్రహమును ఈ వర్తకుడే ప్రతిష్ఠించెనని, తన మామయు గౌరముద్దనశెట్టి మల్లిశెట్టి కొరకు దీనినేర్పాటు చేసెనని తెలియుచున్నది.

శా. శ. 1382 విక్రమ ఆషాఢ శు. ౧౫ గురువారము చంద్రగ్రహణము రోజున యివ్వబడిన దానిని గూర్చి వ్రాయబడిన శాసనము అసంపూర్తిగానున్నది. దక్షిణపువైపు స్తంభముమీద విరోధి శ్రావణ బ. ౩౦ నాటిది తెలుగులో గాన్పించుచున్నది. ఇందులో తూర్పువైపున స్తంభముమీద కృష్ణరాయలవారి ప్రశస్తి ఉన్నది. చివర 'కీర్త్యయస్యశమంతరాహ' అని కలదు. ఇది తరువాత కాలమునాటిది. ఒకానొక యల్లసాని అన్నప ఆయన అనువాడు మల్లికార్జున, త్రిపురాంతలకు ఆలయములలో నిత్యకైంకర్యముల కేర్పాటుచేసినట్లున్నది. సిద్ధేశ్వరునికి ముందు 'ముఖమండపము' నిర్మించెనని దక్షిణమున ప్రాకారము మరమ్మత్తు చేసెనని, లోహ స్తంభముల నిర్మించెనని తగిన స్థలములలో శిలలవేయించెనని, దక్షిణ గోపురమంటపమును మరమ్మత్తు చేయించెనని ఇందున్నది. ఈ శాసన భాగము కాకతీయ ప్రతాపరుద్రదేవ మహారాజు కాలమునాటిది.

'ప్రతాపరుద్రదేవ మహారాజు' కాలమునాటి తెలుగు శాసనమొకటి శా. శ. 1235 ప్రమాదీచ చైత్రశుద్ధ పాడ్యమి సోమవారము నాటిది కాన్పించుచున్నది. శ్రీశైలముమీది గొప్ప మహేశ్వరులందరుకలసి గణపతి ఆలయము ప్రక్కనున్న వీరభద్రస్వామి ఆలయము ముఖమంటపములో గలసి, మల్లికార్జునస్వామి ఆలయ వ్యవహారములు గూర్చి, చర్చించుటకు గూర్చుండగా 'ఈశ్వర శివాచార్య, ఆరాస ఆరాధ, ఆరాధ్యప్రగ్గడ' అనువారు ఒక ప్రకటన జేసిరి. పూర్వకాలములో మల్లికార్జునస్వామి పూజకు, క్రొత్తగా వచ్చిన భక్తులకు, సన్యాసులకు భోజన వసతులు గల్గించుటకు, చక్రవర్తులు, మహామండలేశ్వరులు, ఇతరులు యిచ్చిన 70 గ్రామముల పేర్ల జాబితాను వారు అందరి సమక్షములో జదివిరి. ఆకాలమున అరసి శైవమతాధిపతి ఈశ్వర శివాచార్యులని తెలియుచున్నది.

ఆలయమునకు ఈశాన్యదిశలో నొక బలిపీఠము గలదు. రాజమహేంద్రవరము వాస్తవ్యుడైన 'గౌరముద్దనశెట్టి మల్లిశెట్టి కుమారుడగు గంగమల్లిశెట్టి' చేత నిది నిర్మించబడెనని యిచటి శాసనము తెల్పును. వీరభద్రస్వామి ఆలయమును

ఎదురుగానున్న రాతిబండమీద శా. శ. 1237 (క్రీ. శ. 1315) రాక్షస శ్రావణ బహుళ దశమి మంగళవారము నాటి తెలుగు శాసనము గలదు. దీనినిబట్టి మహేశ్వరులు శ్రీకైలాసము' (శ్రీశైలము) మీద నివసించుచుండిరని, గాన మఠమునకు జెందిన వీరభద్రస్వామి ముఖమంటపములో అందరును గలసికొనిరని స్వామివారి పూజారులు, అరసి మఠము, కాలాముఖమునకు జెందిన ప్రగ్గడలు కూడ గలరని వారందరియుందు వారు స్వామివారి పూజాపురస్కారములు, ఉత్సవములు నిత్యము జరిపించెదమని వాగ్మూలము లొసంగిరని తెలియుచున్నది. ఈ శాసనములన్ని కాకతీయ ప్రతాపరుద్ర మహారాజుకాలము నాటివి.

## 15. కొండవీటి రెడ్డిరాజులు

### (క్రీ. శ. 1325–1428)

కాకతీయ ప్రతాపరుద్రుడు పడిపోయిన తర్వాత రెడ్డి ప్రభువులు పాలనకు వచ్చిరి. రెడ్డిరాజులలో మొదటివాడు ప్రోలయ వేమారెడ్డి. అద్దంకి రాజధానిగా జేసికొని సర్వస్వతంత్రముతో నేలించుచుండెను. కొండపల్లినుండి బంగాళా ఖాతము వరకు ఈయన జయించెను గుంటూరు మండలము, కందుకూరు ప్రాంతము తర్వాత త్రిపురాంతక, శ్రీశైల అహోబలముల స్వాధీనపరచుకొని, దక్షిణ హద్దుగా శ్రీశైలము నేర్పరచెను. (1335) తరువాత తురుష్కులతో యుద్ధముచేసి, నల్లగొండ దగ్గరనున్న పద్మనాయకులతో పోరాడి, శ్రీశైలము మీదుగా నద్దంకి చేరెను. తన తండ్రి సంపాదించిన ద్రవ్యముతో నీయన సైన్యమును కూర్చుకొనెనని వ్రాసెను. క్రీ. శ 1335 చిమకుర్తి శాసనములో 'మద్భుజాదండ పరిపాలనమయిన సామ్రాజ్యమందు శ్రీశైలభూమిని అమ్మనబ్రోలి సీమలో రామతీర్థం సర్వాగ్రహారంగా నొసంగితినని దానపత్రం వ్రాయించెనని ఉండుటచేత అప్పటికే శ్రీపర్వత, అహోబల పర్వత సోపానముల నిర్మాణము పూర్తియైయుండెనని చెప్పవచ్చును. ఈయన వీరుడే కాకుండా గొప్ప భక్తుడుగా గూడ పేరొందెను. శ్రీశైలమునకు పాతాళగంగ (నీలగంగ) దగ్గర సోపానముల నిర్మించెను. దీనికి శాసనాధారములు లభ్యమగుచున్నవి.

శ్లో॥ సోపానాని కృతానిఏన కృతినా పాతాళ గంగాతటే
శ్రీశైలస్య మహేశమౌళి మణినా తాన్యేవ చిత్రం పునః
సోపానాని భవన్తి మేరుశిఖరారోహాయ నాకాపగా
శాహోయత్రిదశాంగనా జనమహా సౌధాధిరోహాయచ.

ఈ రెడ్డిప్రభువు అహోబలమునకు కూడ భవనాశి నదీతీరమున సోపానముల నిర్మించి అచంద్ర తారార్కమగు కీర్తిగడించెను. (S. I. I VI. No. 243, and Epi. Indi vol. IV) శ్రీశైలమునందలి మల్లికార్జునస్వామి భక్తుడగు 'ఘోడెరాయ గంగ' అను గురుపుత్రపాకటాక్ష వీక్షణములచేత నీయన సామ్రాజ్యస్థాపన చేసెనని "ఎర్రాప్రెగడ" హరి వంశము తెల్పుచున్నది.

క. శ్రీ పర్వతేశ భక్తి
ఖ్యాపిత గుణ ఘోడెరాయ గంగగురు కృపా
స్థాపిత సామ్రాజ్య సము
ద్దీపిత వేమక్షితీశ దీప్తి నరేంద్రా ॥

(Epi. Indi Vol - 21 Chimakurthi plate of Vema. (He gave food in charity houses, (Satra) in many places & built steps to the famous shrines of Sri Parvata and Ahobalam, the Lord of the Eastern sea - Bala Saraswathi court - poet )

(G. Mackenzie K. D. M-P, II - Polaya Vemareddy dedicated 108 temples to the worship of Siva)

శ్రీశైలస్వామి భక్తుండగు ఈగురు "ఘోడెరాయగంగు" ప్రోత్సాహము ననే ఆ యా తీర్థస్థలములలో నీరెడ్డి ఘోరమణుండు యాత్రికుల నిమిత్తము సోపానమార్గముల నేర్పరచెను. అద్దంకిరాజు వేమయరెడ్డి శిలాశాసనము శ్రీశైలము లోని గర్భగుడి తూర్పుద్వారానికి ఎదురుగానున్న మంటప స్తంభముమీద నిల్లున్నది. "అనవరత పురోహిత కృత సోపాన, శ్రీపర్వత అహోబల నిర్మాత సోపాన పంచారామ పతిస్సేవిత" - ఇంకను అనేకాగ్రహారము లిచ్చినవాడని ప్రశస్తియందులో వర్ణించబడినది. ఈ శాసనము శా. శ. 1281 ప్లవసంవత్సరమునాటిది. అమరావతి యందలి శాసనములో గూడ యిందలి కొంతభాగమున్నది. శ్రీనాథ మహాకవి రచించిన హరవిలాసములో గూడ శ్రీ పర్వతసోపాన స్థాపకుడగు రెడ్డి "వేమ జగతీపతికిన్" అని ప్రోలయ ప్రశంసించబడెను. ప్రోలయ వేమారెడ్డి "చీమకుర్తి శాసనముల'లో నున్న Epi. Indi Vol 21. P. 269) ఈయన ధర్మముల

గూర్చి విద్వాంసులిట్లు వర్ణించిరి. "ఈయన అనేక పుణ్యస్థలములలోని సత్రము లలో నుచితముగా భోజనము పెట్టించుచుండెను. ప్రఖ్యాతిగాంచిన శ్రీపర్వతము, అహోబలములోని ఆలయములకు సోపానములు గట్టించెను. ఈయన పూర్వ సముద్రాధీశ్వరుడు." ఈయన దైన ఇంకొక శాసనము శ్రీశైలములో గలదు. ఇది 1915 వ సంవత్సరపు Annual reports లో ప్రకటితమైనది. హేమాద్రి చెప్పిన ప్రకారము అన్ని ధర్మముల జేయుచుండెనని ఈయన శాసనములలో గలదు.

'Prolaya Vema who constructed the flight of steps leading to Sri Saila and made all the gifts enumerated by Hemadri" ( V—4 )

ఇది అన పోతారెడ్డి శీర్షిక క్రింద వ్రాయబడినది. L R. 57 లో ప్రోలయ వేమారెడ్డి కుండినీ నగరములో 108 శివాలయములు కట్టించెనని, చెదలవాడలో రాఘవస్వామికి శ్రీరామ సింహాసనమును గట్టించెనని, గజపతి ఖిల్లాలు మరమ్మతు చేయించి శ్రీశైల అహోబిల పర్వతాలకు సోపానములు కట్టించి 14 దుర్గములు నిర్మాణము చేయించి 12 సంవత్సరములు ప్రభుత్వము చేసెనని యున్నది. దొంతి వారు అను యింటిపేరుగల ఈ కొండవీటి రెడ్డిరాజుల మూల నివాసము తెనాలి తాలూకాలోని 'చదలవాడ' అని, పొలముదున్నుచుండ నిక్షేపము దొరకెనని, అచటి ప్రజలు పీడించుటచేత అనుమకొండకేగిరని, తర్వాత దొంతి అల్లారెడ్డి కొండవీటికి వచ్చి అటనుండి కొండపల్లి దగ్గరఉన్న "కవులూరు" చేరి వింధ్య పర్వతములకేగి వచ్చుచున్న 'వేమన' అను కోమటివల్ల పరుసవేది సంపాదించు కొని ఆ కోమటిపేరుతో 100 ఏండ్లు రెడ్లు పాలించిరని L. R. 57 తెల్పుచున్నది. 'ప్రోలయ వేమారెడ్డి' జ్యేష్ఠకుమారుడు అనపోతారెడ్డి (1353) తర్వాత రాజ్య పాలనకు వచ్చెను. అద్దంకినుండి ఈయనయే తన రాజధాని నగరమును కొండవీటికి మార్చెను. శాసనములబట్టి ఈయనకూడా శ్రీశైలమునకు కొన్ని సోపానముల నేర్పరిచెనని తెలియుచున్నది. బాలసరస్వతి వ్రాసిన శాసనమిట్లున్నది.

"హేమాద్రి దానైర్ధరణీ సురాణాం
మహాచలం హస్తగతం విహాయ
యశ్చారు సోపాన పథేన చక్రే
శ్రీపర్వతం సర్వజన ప్రగమ్యమ్."

'అనపోతారెడ్డి' తర్వాత, ధర్మ వేముడని పేర్గాంచిన 'అన వేమారెడ్డి' రాజ్యము

నకువచ్చెను. ఈయనకు 'జగనొబ్బగండ' అనుబిరుదు గలదు. ఈయన శ్రీశైలములో క్రీ. శ. 1377 లో వీర శిరోమంటపము గట్టించెను. ఈయన 'దూపాడు' గెల్చిన తర్వాత ఈ వీరమంటపమును గట్టించెనని తెలియుచున్నది. ఈయన కూడా శ్రీశైలములో గొన్ని సోపానములు గట్టించియుండెను ("Anavemareddy conquered Dupadu He is said to have built the cause way on Sri Saila") ఈ విషయము 'మున్యమూపుర శాసనము' బట్టి తెలియుచున్నది. శ్రీశైలములోని శాసనమునుబట్టి 'అనవేమారెడ్డి' రాజమహేంద్రవరము, నిరవాద్యపురము మున్నగు స్థలదుర్గముల నాశనముచేసెనని (1361-62) తెలియుచున్నది. ఉత్తరమున రాజమండ్రి, దక్షిణమున కంచి, పడమట శ్రీశైలము వరకు ఈయన రాజ్యము కలదని, అమరావతి దేవాలయము పునరుద్ధరణచేసెనని, శ్రీశైలములోని సోపానముల మరమ్మత్తు చేసెనని తెలియుచున్నది.

(G. Mackenzie — K D M "Brother Anavema Reddy extended to Rajahmundry North, Kanchi South, Sri Sailam west. He repaired the temple of Amaravathi and the cause way at Srisailsm")

ఈయన విజయనగరరాజుల పారదోలి శ్రీశైలమువరకు పాలించెను. శ్రీశైలములోని 'వీరశిరోమంటపము' వద్దనున్న శాసనములో పై విషయము చెప్పుచున్నది

సింహాచలాది వింధ్యపాద ప్రతిష్ఠాపిత కీర్తి స్తంభ
సాగర గౌతమీ సలిల సంగమ సకల జలదుర్గసాధక
బలరామ రాజమహేంద్రవర నిరవద్య నగరాది
బహువిధ స్థలదుర్గ విదళన బలరామ."

వేమారెడ్డి, దండయాత్రలుచేయు సమయములో శ్రీశైలము (శ్రీపర్వతము) లో నుండెను. బ్రహ్మచారి, శైవగురువైన శ్రీ విశ్వనాథునికి, కౌశికగోత్ర సంజాతునికి, శ్రీపర్వత వాసికి శా. శ. 1277 లో 'ఖాండవకోలను' అను గ్రామమును ధర్మముచేసెను. ఈ సమయములోనే 'అతుకూరు' అను గ్రామమును శ్రీమల్లికార్జునస్వామియను పర్వతేశ్వరునికి ధర్మముగానిచ్చెను. శైవభక్తుడు శ్రీశైల వాసియగు శాంతభిక్షావృత్తి యతీశ్వరుని ముఖ్యసేవకుడైన 'పోలిదేవయ్య' ప్రార్థన మీద ఈ ధర్మము జరిగినట్లు కాన్పించుచున్నది. ఈ శాసనము క్రీ. శ. 1356 నవంబరు 7 నాటిదని (కార్తీకశుద్ధ ౧౩ సోమవారము) తెలియుచున్నది. (Sri M- S Sarma – History of the Reddy kingdoms.)

L. R. 23 లో క్రీ. శ. 1361 శాసనములోని కొంత భాగము వ్రాయబడినది.

వేమ భూపతిః అన్నమాంబా తనూజేన
ధృతినా వేమ భూభుజా
అహోబలౌ సత్యగిరౌ నిత్య శ్రీపర్వతేపిచ
జాపానానాం మనాటిభ్యే సుదృఢౌ పంక్తి రాత్మనః
సహా రురుక్షో కైలాసం నిశ్రేణి రివ నిర్మితా.

L. R. 49 కొండవీటి లేని గోపీనాథ పురము కైఫీయతులో

"వేమ భూపతి అన్నమాంబా తనూజేన
అహోబలౌ సత్యగిరౌ నిత్య శ్రీపర్వ తే పిచ"

అని కలదు. దీనిలో త్రిపురాంతకము పేరున్నది.

ఈ దేవాలయములో నంది మంటపమువద్ద కుడి ఎడమ ప్రక్క స్తంభముల మీద ఈ శాసనమున్నది. ఇది శా. శ. 1299 పింగళ మాఘశుద్ధ సప్తమి బుధవారము నాటిది. ఈ శాసనము సంస్కృతము, తెలుగు భాషలలోనున్నది. ప్రోలయ వేమారెడ్డినుండి రెడ్డి వంశవృక్షమున్నది. తన తండ్రి అన్నయ్యారెడ్డి అభీష్ట పుణ్యముకొరకు ఈ వీరమంటపము నిర్మించబడినదని, ఈ మంటపములో నవేరముంది వీరులు ఇచ్ఛా పూర్వకముగా దమ శిరస్సులు, నాల్కలు ఛేదించుకొనిరని యున్నది. కుడివైపు స్తంభము రెండు తలముల మీద అన్నవేముని బిరుదావళితోపాటు శాసనదానము పేర్కొనబడినది. ఆనాటి భాష తెలిసికొనుటకీ శాసనభాగమును జూడుడు — శ్రీపర్వతస్థలి చెలువగు శ్రీమల్లికార్జునస్వామి గేహాంగణమున మహాసియ్య మగు వీరమంటపం అనేక ప్లవిలసితంబగు పుణ్యస్థలి నొప్ప రెట్టించి జగనొబ్బగండన్న —

"వేమభూపతుని శ్వేరధర్మ విభవకీర్తిస్ సకల దిక్కులునిండి సాంద్రమై చంద్రతారార్క స్థితిసుర్వి ఉనరజేసె శంకరా .... అన్న వేమయ్యారెడ్డింగారు తమ తండ్రి అన్నయ్య రెడ్డింగారి పుణ్యముగా కట్టించె....మంటపము." ఈ మంటపములోనే 'కొంగువీరులు' తమతలల, నాల్కల ఛేదించుకొని బొందితో కైలాసమునకు పోవుచుండిరట। క్రీ. శ. 1377 లో శ్రీశైలయాత్రచేసి గొప్ప మంటపమును 'అనవేముడు' నిర్మించెనని, కర్నూలుజిల్లా మాన్యుయల్ నుడువుచున్నది. ఈ వీర మంటపము కట్టిన శిల్పినామము 'పంచభిక్షం మల్లయ్య' ఈయన రామన కుమారుడు.

శైవాగమవేత్త. మంటపదాత అన్నయరెడ్డి సూనుడు 'అన్నవేమయ': నాలసరస్వతి శాసన లేఖకుడు. క్రీ. శ. 14 వ శతాబ్దములోని నరబలుల గూర్చిన ఈ వృత్తాంత మును 'కృష్ణశాస్త్రి' అను విద్వాంసుడిట్లు పేర్కొనెను.

"కొంగువీరులు మతావేశ పరవశత్వంబున తమ శిరసుల, నాల్కల దేవునికి బలిగా నర్పించుకొని, కావలసిన అంగములతో ప్రత్యక్షమగుచుండిరి. మరుక్షణ ములో మూడు నేత్రములు, ఐదు ముఖములు, ఐదునాల్కలు గల్గి అష్టవిధాకృతి గలిగిన శివుని రూపమగుచుండిరి."

("Krishna Sastry – Indian images of Gods and godesses. "Hosts of Kongu heroes highly excited under religious fervour, cut off their heads and tongues as offerings and obtained a brilliant body of blessed limbs. The next moment they shine with **3 eyes 5** faees and 5 tongues and become the eight embodied Siva,")

ఈ విధముగా గండకత్తెరలతో శిరసులను, నాల్కలను కత్తిరించుకొని కైలాసమున కేగుచుంటిమని వారు తలంచుచుండిరి. ఈ శాసనములోని పూర్తి తెలుగు పద్యము ఇట్లున్నది.

సీ. శ్రీపర్వతస్థలి చెలువగు శ్రీమల్లి
కార్జునస్వామి దేహాంగణమున
మహానియ్యమగు వీరమంటపం అనేక ప్ల
విలసితంబగు పుణ్యస్థలి నొప్పు
కట్టించి జగనొబ్బ గండన్న వేమవిభుని
........శ్వరధర్మకీర్తి
సకల దిక్కులనుండి సాంద్రమె ఆచంద్ర
తారకస్థితి నుర్వి తనరచేసె
శాంకరాగమ మంత్రదీక్షావిభూతి
దంచి తాచారుండగుచున్న పంచభిక్షం
రామన సుతుండు – నిర్మ——వంశుండు
మల్లనాఖ్యుండు శివభక్తిమార్గరతుండు.

'ప్రోలయ వేమన' కాలమున పాతాళగంగకు సోపానములుకట్టిన 'పంచభిక్షం రామలింగం' కొడుకు మల్లన, ఈ వీరశిరో మంటపము గట్టియుంచెను. ఈ

వంశీకులు గొప్ప శిల్పులుగా గాన్పించుచున్నారు. శ్రీశైల, అహోబల సోపానముల కట్టించిన ఈ ముప్వురు రెడ్డిప్రభువులు అనగా ప్రోలయ వేమారెడ్డి, అన వోతారెడ్డి అన వేమారెడ్డి' అనువారల నామములు ఆచంద్రతారార్కము చరిత్రలో వెలయుచుండును. ఇంకను

'శ్రీపర్వత సోపాన స్థాపకుండగు రెడ్డివేమ ।
శ్రీపర్వత సోపాన స్థాపక వేమక్షితీశ ।

అని అనేకచోట్ల తగులుచున్నది. ప్రోలయ వేముని కాలములో అద్దంకిలోనుండి ఎర్రాప్రెగడ హరివంశ, రామాయణాదుల ముగించెను. 'ఎర్రాప్రెగడ' తన ప్రభువుతో శ్రీశైల యాత్రచేసె నేమో తెలియకున్నది. శ్రీనాథుడు మాత్రము అనేక తీర్థయాత్రలు తన ప్రభువుతో చేసెనని చెప్పచ్చును. రెడ్డిరాజులలో వైదవవాడు పెదకోమటి వేమారెడ్డి: (1402–1420) శ్రీనాథుడీ వేమారెడ్డి ఆస్థానమున విద్యాధికారియై వెలసెను.

విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీ వేమభూపతేః
అకరోదాకరో వాచాం నిర్మలం ధర్మశాసనమ్ ॥

ఈ శ్లోకమునుబట్టి పైవిషయము తేటతెల్లమగుచున్నది. 'పెదకోమటి వేమన' కాశీవిశ్వేశ్వరస్వామి భక్తుడు. ఈయన కాశీరామేశ్వర యాత్రలను చేయుచు మధ్యలో నున్న 'శ్రీశైలము, పంచారామము సింహాచలము' మున్నగు యాత్రలను జేసెను. క్రీ. శ. 1406 న పెదకోమటి వేమనతో శ్రీశైలమునకు శ్రీనాథుడేగెను. యాత్రా స్థలములలో వేమన అనేక ధర్మము లొనరించి, కాశీలో విశ్వేశ్వరస్వామికి నిత్య నైవేద్యమున కేదియో ధర్మముచేసినట్లు కాన్పించుచున్నది. ఈయాత్రలలో కవిసార్వభౌముడు శ్రీనాథుడు, మంత్రి మాముడి సింగనామాత్యుడు పాల్గొని యుండవచ్చును. శాసనములలోని కొన్ని పట్టిలు పై విషయముల జెప్పుచున్నవి. సూరాంబ వ్రాయించి శా. శ. 1331 విరోధి ఫాల్గుణ బ. పదియనాటి పిరంగిపురము శాసనములో నిట్లున్నది

శ్లో॥ శ్రీశైలే స్థిరమూలతాముపగతావృద్ధింకుమారాచలే
పంచారామతలే ప్రతానసుమ మాసింహాచలేంద్రేతతః
శ్రీనాథ్మపురుషో త్తమే కుసుమితా యద్ధర్మకీర్తిల్లతా
కాశ్యాం విశ్వపతేః ఫలం ఫలవతీ నిత్యోపహారోచితమ్.

ఇంకను మరియొకచోట ఇట్లున్నది.

"కావేర్యాం త్రిపురాంతకే జయపురే కాశీపురే గోపులే
పంచారామ పురేషు పట్టనపురే మార్కండశంభోఃపురే
చాళుక్యామయుతాన్న దారనిరతశ్శ్రీ వేమభూపప్రభుః"

శా. శ. 1327 పార్థివ సం. మాఘ. శివరాత్రి దినంబున తెనాలిలోని చినపాడను ఈరాజు, శంకర గురునకు ధర్మముచేసి శాసనము వ్రాయించెను.

"కాలశ్చేచ్ఛివరాత్రి పుణ్యసమయస్స్వామీమహాన్ శ్రీగిరి
శ్చైత్రియం కిం నతువర్ణ్యతే సుః విభిత్ర్యుణ్యంతుతచ్చాసనమ్"

ఇందు శ్రీగిరి పేరువచ్చినది. కోమటి వేమారెడ్డి భర్తృడు దానపంతుచే కొండా ప్రజోపకార్యముల పెక్కింటినిజేసెను. "ఈ చుట్టూవున్న కొండలలో యుతులైన సన్యాసులకు మఠాలు ఏర్పరచిరి. అట్టీలు, రాళ్లులు, తూములు, కొండలమీద రాతికట్ట. ఒక 'పుష్కరిణి' కట్టించిరి." అని L R 57 లో ఉన్నది. దీనిని బట్టి రెడ్డిప్రభువుల ఉదారభావము తేటతెల్లమగుచున్నది ఈనాడుకూడా వీరిలో నిట్టి భావముగలదు.

మద్రాసు చిత్రవస్తు ప్రదర్శనశాలలో కొన్ని తామ్ర శాసనములు లభ్యమైనవి. క్రీ. శ. 1416 ఫిబ్రవరి 13 వ తేది తామ్రశాసనమునుబట్టి, బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు శ్రీగిరిలో తగాదా గల్గినదని, అందు బ్రాహ్మణ క్షత్రియులొక పక్షమున, వైశ్యులొక పక్షమున నుండిరని కొన్ని హక్కులు, అధికారములగూర్చి రీతిగాదా వచ్చినదని, తీర్పు వైశ్యుల కనుకూలముగా నివ్వబడినదని తెలియుచున్నది.

(T V Jagadisa Ayyar - South Indian shrines)

శ్రీశైలము క్రింద ప్రత్యేక అధికారిని విజయనగరరాజు లేర్పరచిరి: అయిన ఈ నందిని, భృంగిపీఠమును బంగారుతో తయారుచేయించెను. ఈభృంగిగిరి మూడు కాళ్ళుగలవని, పై గ్రంథములో వ్రాయబడియున్నది కృష్ణరాయల పాలిగాపు చంద్రశేఖరయ్య వీనివి సమర్పించెను. పైన చెప్పబడిన తీర్పు క్రీ. శ 1416 లో జరుగుటచేత అది రెడ్డిప్రభువులకు సంబంధించిన తీర్పు అయి ఉన్నదని చెప్ప వచ్చును.

కొండవీటి రెడ్డిరాజులుగాక, మరియొక రెడ్డిరాజుల శాఖవారుకూడ శ్రీశైల ములో గొన్ని పుణ్యకార్యము లొనరించినట్లు కాన్పించుచున్నది. శా. శ. 1327

(క్రీ. శ. 1406) పార్థివ సంవత్సర చైత్ర శు. ౧౦ న శ్రీశైల మల్లికార్జునుని దక్షిణ ద్వారమునుండి శిఖరేశ్వరమువరకు మెట్లను 'కుమార వేమారెడ్డి' తనయుడైన కాటయవేమారెడ్డి నిర్మించినట్లు శాసనప్రమాణము లభ్యమగుచున్నది.

రెడ్డిరాజుల తర్వాత అన పోతానాయుడు గోదావరి శ్రీశైలపర్యంతము ఆంధ్రను పాలించెను. కాని శ్రీశైలస్వామికి ఈయన చేసిన పనులు తెలియకున్నవి

## 16. విజయనగరరాజులు

(క్రీ. శ. 14 వ శతాబ్దము 17 వ శతాబ్దము)

కాకతీయరాజులు పడిపోయిన తర్వాత క్రీ. శ. 1336 లో 'సంగము' యొక్క ఐదుగురు సూనులలో మొదటి మువ్వురు 'హరిహర, కంప, బుక్క' అనువారు శృంగేరి మఠాధిపతి 'మాధవవిద్యారణ్యుని' సాయంబున విజయనగర నిర్మాణ మొనర్చిరి. మూడు శతాబ్దుల కాలము ఈ నగరము హిందూధర్మమునకు నిలయమై వర్థిల్లెను. 1 వ హరిహరరాయలు, తర్వాత బుక్కరాయలు, తర్వాత 2 వ హరిహర రాయలు (క్రీ. శ. 1377—1404) విజయనగర సామ్రాజ్యమును పాలించిరి. చివర రాజు 27 ఏండ్లు పాలించెను. ఈయన గొప్ప శైవభక్తుడు సంస్కృత కర్ణాటక భాషలను, సర్వమతములను సమదృష్టితో జూచిన రాజు. మొదటివారు 'హరిహర—1, బుక్కరాయలు—1 అనువారు పాశుపత శైవశాఖకు జెందిన 'క్రియశక్తి' అనువాని శిష్యులు. రెండవ హరిహర రాయలు 'వనవాసి' ప్రభువగు ఒక కదంబ రాజకుమారుని తనయను పెండ్లాడెను. ఆమె శ్రీశైలమును దర్శించి, దేవాలయముదగ్గర మైదానమునుండి నీలగంగవరకు 1000 అడుగులలోన నున్న నదియొక్క పడకవరకు సోపానపంక్తిని నిర్మించెను "

(Kurnool Dt, Manual P 24)

ఈమెయే చరిత్రలో 'కదంబ విఠలాంబ' యని పేర్గాంచియున్నది. శా. శ. 1316 శ్రీముఖ మాఘ బ ౧౫ న ఈసోపాన నిర్మాణము జరిగినది. శా. శ. 1316 శ్రీముఖ మాఘ బహుళ ౧౪ శివరాత్రి సోమవారమున (1393) దేవాలయమునకు ముందు ముఖమంటపము కట్టబడి స్వామివారికి సమర్పించబడినది. ఇది విజయనగర ప్రభువు రెండవ హరిహరదేవ మహారాజుచే నిర్మించబడినది. దక్షిణముననున్న

మంటపమును శా. శ. 1328 ధాత మాఘ బ. ౧౪ సోమవారము దినమున (1404) హరిహరదేవ మహారాజు నిర్మించెనని ఒక శాసనము తెల్పుచున్నది. ఈయన తనసోదరీమణి, పరివారజనులతో గలిసి యిచ్చటికి వచ్చెను. ఈయన అనంతరము మరియొక శాసనము శా. శ. 1344 శుభకృత్తు నామ సం. కార్తీక శు. ౫ గురు వారము నాటిది. (క్రీ. శ. 1422) ఉదయగిరి దేవనయ్యంగారి కుమారుడు అప్పణయ్యంగారు దక్షిణ ముఖద్వారములో (గవని) నున్న నంది స్తంభమునుండి, దుర్గాదేవి ఆలయమువరకు సోపానములు నిర్మించెనని ఇందు ఉల్లేఖించబడియున్నది. ఈశాసనము పెద్దచెరువుకు పోయేత్రోవలోనున్నది. ఇది తెలుగులోనున్నది. దక్షిణ భాగమున ధ్వజ స్తంభముమీద క్రీ. శ. 1328 ధాతనామ సంవత్సరమునాటి శాసనము గలదు. చోళమండల రాజ్యమున 'గోపయదేవ మహారాజు కుమారుడగు 'సాళువ తిరుమలయ దేవమహారాజు బంగారు ధ్వజ స్తంభమును ప్రతిష్ఠించెనని కైఫీయతులో నున్నది.

పాతాళగంగకుబోవు మార్గములో కదంబ రాజకుమారి విఠలాంబ శాసనములు సంస్కృత నాగరి, తెలుగులిపిలోనివి నాల్గు కాన్పించినవి. అందొకటి శా. శ. 1315 (క్రీ. శ. 1393) శ్రీముఖ సంవత్సరము నాటిది. ఈమె కొకనాటి రేయి ఒక స్వప్నము వచ్చెను. ఆ స్వప్నములో మల్లికార్జునస్వామి ప్రత్యక్షమై, పాతాళ గంగకు సోపానములు గట్టించుమని కోరగా నామె సోపానముల గట్టించెనని, ఒక రాతి స్తంభము మీద నున్న శాసనములో నున్నది. పాతాళగంగకుబోవు త్రోవలో నొక పెద్ద రాతిబండమీద నాల్గుతలములలోను వ్రాయబడిన మఱియొక శాసనము గలదు. ఇంకొకటి మరియొక స్తంభము నాల్గుముఖములమీద నున్నది. ఇంకొకటి మెట్లకు దగ్గరగానున్న పెద్దరాయిమీద నున్నది. ఇది చాల శిథిలావస్థలోనున్నది. దీనినిబట్టి విఠలాంబ అను రాకుమార్తె శా. శ. 1318 లో మెట్లకు దగ్గరగా 'విఠలేశ్వర' విగ్రహమునుగూడ ప్రతిష్ఠించెనని తెలియుచున్నది. ఈశాసనము సంస్కృతములోనున్నది. Brown XV — పుట 324 యిట్లు తెల్పుచున్నది. 'కదంబకులము' హరిహరరాజు — శ్రీ మల్లికార్జున పర్వతానికి పాతాళగంగకు మధ్యలో సోపానాలు కట్టించెను. నాగర, కన్నడ, ఆంధ్రములలో శిలాశాసనములు వ్రాయించెను. మల్లికార్జున దేవాలయాన్నుంచి పాతాళగంగకు పోయే మార్గమందు వేయించినారు. అందులో సోపానాలు కట్టించినారు." కైఫీయతులోని వాక్యములు భిన్నముగా నున్నవి. శివభక్తుడైన హరిహర రాయలు దేవాలయము ముందు ముఖమంటపము గట్టించెనని, ఆలయమునుండి నీలగంగలోనికి మెట్లను వేయించె

రాజకుమారి విఠలాంబ గట్టించెనని చెప్పవచ్చును. ఇట్లే పుణ్యదంపతులు, తీర్థ యాత్రికులుండుటకు ముఖమంటపమును, పాతాళగంగ కేగుటకు సోపానపంక్తిని తయారుచేసి ఆశశితారకంబగు కీర్తిని గడించిరని చెప్పవచ్చును. శ్రీశైలము కైఫీయతులో మరియేకచోట నిట్లున్నది "బుక్కరాయల కుమారుడు హరిహర రాయలు — సౌరాష్ట్ర పాలకుడు కదంబకుల సంభూతుడు 'బసవదేవరాజు' కుమారుడు కామదేవుడు, ఆయన భార్య పద్మశాదేవి, కుమార్తె 'విఠలాంబ'ను హరిహర రాయల కిచ్చిచేసిరి. ఈ 'విఠలాంబ' శ్రీశైలమందు పాతాళగంగకు పోయే మార్గములో సోపానములు కట్టించినది. నాగరం, తెలుగు, సంస్కృత ములో శక. 1315 శ్రీముఖనాటి శాసనములున్నవి. దక్షిణపైపు ముఖమంటప స్తంభాన శాసనము స్వల్పముగానున్నది. హరిహర రాయలు విస్తారముగా గట్టించెను." మరియొకచోట "బుక్కరాయలు—ఇచట ధర్మములు, స్వామి భోగములు నడిపిరి అవి, భార్య గౌరమాంబవలన హరిహర రాయలు గల్గెనని" ఉన్నది. కైఫీయతులోనందందు దోషములు గాన్పించుచున్నవి. మల్లికార్జునస్వామి ఆలయమునకు దక్షిణమున ధ్వజస్తంభముమీద శా. శ. 1378 ధాతనామ సం. నాటి శాసనము గలదు. చోళమండలమును పాలించు రాజప్రతినిధి గోపదేవరాజు కుమారుడు సాళువ తిరుమలరాజు విజయనగర పాలకుడై యుండెను. ఆయన ఒక ధ్వజస్తంభమును ప్రతిష్ఠించెను.

ప్రౌఢదేవరాయలు అని పేర్గాంచిన (క్రీ. శ. 1426—1446) ఇమ్మడి దేవరాయలు గొప్ప వీరశైవ మతాభిమాని. శ్రీనాథుడు కవిసార్వభౌమ బిరుదును, కనకాభిషేకమును పొందిన దీయన ఆస్థానముననేయని తెలియుచున్నది. ఈయన ఆస్థానమున వీరశైవ లేఖకుడు "చామరస" అనువాడు 'ప్రభులింగలీల' అను గ్రంథము రచించెను. దేవరాయలు తన సోదరీమణితో వచ్చి శ్రీశైలస్వామిని దర్శించినట్లు తెలియుచున్నది. సాళువవంశరాజులు కూడ కొన్ని తటాకములు త్రవ్వించి స్వామి పేరున నప్పగించిరి. 2 వ దేవరాయలు మేనల్లుడు 3 వ విరూపాక్షుడు, మల్లికార్జునుని బారదోలి క్రీ. శ. 1466 (శా. శ. 1388) లో సింహాసన మధిష్ఠించెను. శ్రీశైల శాసనములుగూడ ఈ సంవత్సరములోనివే. 3 వ విరూపాక్షుడు అనసుయమున కొన్ని ధర్మములుచేసెను. శా. శ. 1379 సం. ఈశ్వర మాఘ. బ. పంచమి గురువారము రోజున వీరప్రతాప ప్రౌఢదేవరాయ మహారాయల కాలమున వ్రాయబడిన శాసనము కన్నడములో నున్నది. రాయల

వారి రాజమందిరములోని నౌకరు 'దేసురసయ్య' అనువాడు కొంత భూమినిగొని దాని నాలయము కొసంగి, ప్రతిదినము స్వామికి ఒక పళ్ళెము నైవేద్యమిచ్చునట్లు ప్రతి దినము ఐదుగురు జంగములకు భోజనము పెట్టునట్లు చేయుచు శాసనము వ్రాయించెను. ఇది మంటపములోని ఒక స్తంభముమీద దక్షిణపు వైపునవున్నది. గర్భగుడికి తూర్పున పెద్దనంది కూటము గలదు. ఈశ్వర మాఘ బ. విదియ గురువారము దినమున శ్రీ ప్రౌఢదేవ మహారాయలు, స్వామికి నైవేద్యము పెట్టు నట్లు ఐదుగురు జంగములకు భోజనము పెట్టునట్లు ఏర్పాట్లుచేయుచు ఒక శాసనము వ్రాయించెనని, శ్రీశైలము కైఫీయతులో నున్నది. ఇంకను గర్భగుడికి తూర్పున ఈశ్వర మాఘ బ. పంచమినాడు, ప్రౌఢదేవరాయలు ఐదుగురు జంగములకు భోజనము పెట్టునట్లు ఏర్పాట్లు చేసెనని, ప్రమాది ఫాల్గుణశుద్ధ విదియ సోమవారము నాటిది మరియొకటి గలదని, వీరసాళువ నరసరాయల శాసనము గలదని, ఈ కైఫీయతులోనే ఉన్నది. 'వీరప్రతాప ప్రౌఢమహాదేవ రాయలు' తనసోదరితో, పరివారముతో శ్రీశైలమువచ్చిస్వామిని దర్శించినట్లు శాసనాధారమున చెప్పవచ్చును.

వీరప్రతాప ప్రౌఢదేవరాయ మహారాయలవారి (క్రీ. శ. 1419-1449) రాజభవనములోని పరిచారకురాలు శా. శ. 1379 సం. లో [illegible] వ్రాయించిన శాసనము మంటపములోని ఒక స్తంభముమీద వేయబడినది ఐదుగురు జంగమ దేవర్లకు ఉచితముగా భోజనము పెట్టుటకు, ఒక పళ్ళెము నైవేద్యము నిత్యము స్వామికి ఆరగింపు చేయుటకు ఈ పరిచారకురాలు కొంత భూదానము చేసినది. ఈ మంటపములో ఐదవ స్తంభము మీద పడమటి తలమున శా. శ. 1381 ప్రమాది నామ సం. ఫాల్గుణశుద్ధ విదియ సోమవారము దినమున వేయించిన కన్నడ శాసనమున్నది. దీనినిబట్టి 'వీరప్రతాప విజయరాయ మహా రాయల 'కూతురు' లఖుమాజి అయమాంబ' పెదమూలదేవ ధారిక్ష కొంత భూమినికొని, మల్లికార్జున స్వామికిదానము చేసెనని, దీని ఆదాయముతో ఒక పళ్లెము నైవేద్యము స్వామి కారగింపు చేయుటకు, ఐదుగురు జంగములకు నిత్యము ఉచితభోజనము పెట్టుటకు ఏర్పాట్లు చేయుచు ఈ శాసనము వేయించెను. శా. శ. 1407 విశ్వావసు భాద్రపద శు. పౌర్ణమి గురువారము చంద్రగ్రహణ పుణ్యకాలమున 'ఎరమ్ కందయ దేవ మహారాజు' సూనుడు, 'పెదమల్లపరాజు' సాళువ వంశీయుడు దేవాలయావరణములో తూర్పువైపున పగిలిన రాతిమీద తెలుగులో ఒక శాసనము వేయించెను. దీనినిబట్టి మల్లికార్జునస్వామికి ధూపదీప నైవేద్యములకు ధర్మముగా

ఒక చెరువు, దానిక్రింద సాగగుచున్న భూములు యిచ్చినట్లు తెలియుచున్నది. 'సాళువ మహామండలేశ్వర సాళువ ప్రౌఢరాయదేవ మహారాయ' కాలమునాటి శాసనము శా. శ. 1389 సర్వధారి మాఘ బ. చతుర్దశి సోమవారము నాటిది కాన్పించినది. ఈ రాజు సిద్ధపురమువద్ద 'గంగసముద్రము' అను తటాకము త్రవ్వించెను. దీని క్రిందనున్న మాగాణిభూములను దేవాలయములోని స్వామి నిత్యనైవేద్యముల కీరాజు ఒసంగెను. ఇంకను బ్రాహ్మణుల, జంగమయ్యల పోషణకొఱకు శ్రీగిరి మీది సిద్ధసముద్ర చెరువు వద్దనున్న ఒకతోటను, రెండు భవనముల, పాలిచ్చుధేనువుల నొసంగెనని తెలియుచున్నది. క్రీ. శ. 15 వ శతాబ్దిలో సాళువవంశరాజులు చెరువులు త్రవ్వించి, ఆలయమున కప్పగించినట్లు శాసనములు తెల్పుచున్నవి. Brown XV – 330 పుటలో మన్నాని అన్నపయ్య ధర్మాలు వ్రాయబడి ఉన్నవి "మల్లికార్జున, భ్రమరాంబకు నిత్యనైవేద్యములు - సిద్ధేశ్వరుని ముఖమంటపము కట్టించి దేవుని ప్రాకారం, కోట దక్షిణ దిక్కుగ కోటగోడలు పడిపోయి ఉండగాను తిరుగా ఎత్తించి ఇనుము స్తంభమున్న దక్షిణ గోపుర మంటపము రాయిచెరిగి ఉండగా, తిరుగాకప్పు రాళ్ళువేయించిరి."

శా. శ 1426 రక్తాక్షి మాఘ బ. చతుర్దశి సోమవారమునాడు (క్రీ. శ. 1504) నాగిసెట్టి, లక్ష్మమ్మ కుమారుడగు పినయ్య మల్లికార్జునస్వామి ఆలయ ముఖమంటపమునకు దక్షిణపు వాకిలి భాగమున బంగారుతో తాపడముచేసినట్లు ఒక శాసనము తెల్పుచున్నది. ఆవరణములోని 4 వ స్తంభముపై ఈ శాసనమున్నది. అదే ఆవరణములో ఐదవ స్తంభముమీద శా. శ. 1452 (1530) విరోధి శ్రావణ బ. పౌర్ణమి సోమవారము దినమున వ్రాయబడిన తెలుగు శాసనమున్నది. శ్రీపర్వతమునకు వెంబడిన స్థలకరణము 'యేరికంటి కామరాజు' ఉండి ఉన్న స్థలములో ఒక నందివిగ్రహము మీద, స్వామివారి మంటపాలలో 'అన్నపూర్ణ' దాయనీ, విగ్రహమును ప్రతిష్ఠించినట్లు తెలియుచున్నది. స్వామి ఆలయ ఆవరణములో 'బలిపీఠమునకు దగ్గరగానున్న 'పిరదల్లు' మీద నౌకబొమ్మగలదు. 'భండారు పిరమరాజు' సేవకుడైన 'నాగరాజు తిమ్మన్న' ఒక బెబ్బులితో పోరాడి దానిని వధించినట్లు దీనినిబట్టి తేలుచున్నది. ఆ కాలమున శ్రీగిరి అరణ్యములలో బెబ్బులు లుండెడివి. దేవాలయము తూర్పు గోపురము మీదనున్న రాతి పలకమీద, తెలుగు శాసనమొకటి శా. శ. 1370 విభవ ఆషాఢ బ. పౌర్ణమి సోమవారము నాటిది కాన్పించును. మల్లికార్జుని ఆలయములో శివరాత్రి ఉత్సవము జరుపుటకు

వర్తక సంఘమువారు కొంత రుసుమును ధర్మముగా నిచ్చినట్లు దీనినిబట్టి తెలుచున్నది.

వీరనరసింహరాయలు క్రీ. శ. 1505–1509 వరకు పాలించెను. విజయనగర శాసనములలో 'వీరప్రతాప వీరనరసింగరాయ మహారాయని' యాతని పేరిట మల్లికార్జునాలయము మధ్యలోనున్నది. ఈ శాసనము శిథిలావస్థలోనున్నది - దీనినిబట్టి ఈరాజు మల్లికార్జున దేవుని ఆలయమును దర్శించెనని, అతనియెడ గౌరవాదు లొనర్చెనని తెలియుచున్నది.

శ్రీకృష్ణదేవరాయల కాలము ( క్రీ. శ. 1509–1530 ) లో శ్రీశైల దేవాలయము మహోన్నత వైభవమనుభవించినది. దక్షిణమార్గాన మెట్లపైపుల ఈయన మంటపములు కట్టించి, గ్రామముల దానముచేసెను. వీరప్రతాప కృష్ణదేవమహారాయలవారి శాసనము శా. శ. 1438 యువ శ్రావణ శు. పా. 15 బుధవారము చంద్రగ్రహణము దినమునాటిది. ద్వారమునకు దక్షిణపుప్రక్క రాళ్ళ మీద ఈ శాసనమున్నది. ఈ శాసనము తెలుగులోనున్నది. దీనిని అలెగ్జాండర్ 'రీ' కూడ పేర్కొనెను. కృష్ణదేవరాయల దండయాత్రల విజయమునకు, మల్లికార్జున స్వామికి ధర్మములుచేసిన అనంతరము రాయలవారు శ్రీమల్లికార్జునుని పూజించిరని, రథవీధిలో అనేక మంటపములు గట్టించిరని, ఇవని శ్రీముఖ వైశాఖ శు. పాడ్యమి గురువారము దినమున జరిగెనని ఈ సమయమున పొడుమూంచాల, ఆత్మకూరు అను గ్రామములను మల్లికార్జునస్వామి ఆలయముకిచ్చిరని; ఇంకను గోపురము, బరువువేసిన గుర్రములు, ఎద్దులు, గాడిదలు, నెత్తిమూటలు మున్నగు వానిపై వచ్చుపన్నులను స్వామివారి ఆలయము కిచ్చునట్లు చేసిరని ఈశాసనము తెల్పును. ఎడమ వైపున ఈ శాసనము కన్నడములో నున్నది. కృష్ణరాయలు అనేకచోట్ల కాళహస్తి, తిరున్నామలై, చిదంబరం, శ్రీశైలం, తిరుపతి మున్నగుచోట్ల అనేక నూత్న ప్రతిష్ఠలుచేసి, భూదానములు చేసెను.

("The Raya erected numerous additions to the great temples at Kalahasti, Thirunnamalai, Chidambarm, Sree Sailam and Thirupathi" — Kurnool Dt. Manual — "On his return, he visited the holy shrine of Sree Sailam and made a grant to if of the villages of Atmakur and Parumanchala as an offering of success.")

ఇదే విషయము శ్రీశైలము కైఫీయతులో నిట్లున్నది. "శా. శ. 1428 యువ శ్రావణ శు. పౌర్ణమి బుధవారము చంద్రగ్రహణము దినమున కృష్ణరాయలు

భార్యతో సహా వచ్చెనని, ఈదేవునికి తేరువీథి శిలామంటపాలు కట్టించి శ్రీముఖ వైశాఖ శు దశమి గురువారము – మధ్యాహ్న అవసరము, మహానైవేద్యానికి పారుమంచాల గ్రామము. అత్మకూరు యిచ్చిరని, కాశికావడి సుంకం, గుఱ్ఱం, పెద్దగాడిదె, తలమోపు మొదలగు వానిచేత సుంకం కొనకుండా మన్నించి శాసనము వ్రాయించెను." అని ఉన్నది. శాసనముకు కైఫీయతుకు కొంచెము భేదము కాన్పించినది. కృష్ణరాయల నౌకర్ల శాసనములు కొన్ని ఉన్నవి. శా. శ. 1448 సర్వధారి మాఘ బ. దశమినాటి శాసనమొకటి మంటపములోని మూడవ స్తంభము మీద పడమటి ముఖమున్నది. ఈ శాసనము కన్నడములో నున్నది. 'అబ్బరాగి' కి చెందిన 'మల్లపన్న' అనువాడు, కృష్ణరాయల రాజభవనములో బరిచారకుడు ఈ శాసనము వేయించెను.

శా. శ 1451 విరోధినామ సం॥ మార్గశిరశుద్ధ పౌర్ణమినాడు ద్వారమునకు ఎదిరిపైనున్న మంటపములో లిఖించిన ఒక శాసనము గలదు. ఇది సంస్కృతము, తెలుగులో నున్నది. 'దేవ యొక్క అల్లుడు, కృష్ణరాయలకు నమ్మినబంటు, గొప్ప మంత్రియైన 'చంద్రశేఖరామాత్యులు' మల్లికార్జునాలయమునకు ఉత్తరపు వైపున కల్యాణమంటపము నిర్మించెనని, దానిపైన స్వర్ణకలశమును నిర్మించెనని, ఈ లింగమునకు ఒక ఆలయ నిర్మాణ మొనర్చెనని, దీనికి 'దేమేశ' అని పేరని, యిందున్నది. దీని తర్వాత ఒక తెలుగుశాసనము. శా. శ. 1452 వికృతి చైత్ర బ. అమావాస్య దినమునాటిది కన్పించినది. దీనినిబట్టి పై మంత్రి 'బాగలమర్తి' సీమలోని 'కొరగోతె' అను గ్రామమును ఒక సేవకునికి ధర్మము చేసినట్లు తెలియుచున్నది. శా. శ. 1452 వికృతి ఆషాఢ శు. పౌర్ణమినాడు కృష్ణరాయల అల్లుడు చంద్రశేఖరయ్య ధ్వజమును ప్రతిష్ఠ గావించెనని కైఫీయతులో నున్నది. ఈచంద్రశేఖరయ్య శ్రీశైల రాజ్యమును రాజప్రతినిధిగా (అవసరం) పాలించుచు మల్లికార్జునస్వామి శయనమందిరమున కెదురుగా ఒక మంటపనిర్మాణ మొనర్చెనని, నందీశ్వర, భృంగీశ్వర బంగారు విగ్రహములను బహుమానముగా నొసంగెనని, ఆ మంటపములో తనయొక్క, తన ప్రభువైన కృష్ణరాయల, తన నాయమ్మైన 'దేమరస్సు' యొక్క విగ్రహముల ప్రతిష్ఠించెనని, ఆమంటపములో నిత్యమునాటి పూజా పునస్కారములకగు ఖర్చులను భరించుటకు, తన రాజ్యము లోని "ముసలిమడుగుసీమ" లోని "శివపురము" అను గ్రామమును చంద్రశేఖరయ్య దానము చేసెనని తెలియుచున్నది.

ఇంకను ఒక బంగారు నందిని, భృంగిపీఠమును దేవునికిచ్చెనని, మల్లికార్జునస్వామికి ఉత్తరపు వైపున 'దేమయ్య' పేరుతో నొక విగ్రహప్రతిష్ఠ చేసెనని, దాని కెదురుగా ఒక బంగారు స్తంభమును నాటించెనని, తెలియుచున్నది. ఇంతేకాకుండా, శ్రీగిరికి దిగువభాగమున 'నాగులూటి' అను గ్రామము వద్ద 'వీరన' (వీరభద్ర) పేరుతో నొక దేవాలయమును గట్టించి, 'దేమయ' అను పేరుతో నొక లింగమును దానిలో బ్రతిష్ఠించెనని, 'దేమసముద్ర' అను గ్రామమును బ్రాహ్మణుల కగ్రహారముగా నొసంగెనని తెలియుచున్నది, అచటనే ద్వారమునకు ఎడమవైపున శా. శ. 1451 విరోధి కార్తీక శు పౌర్ణము ఆదివారము దినమున తెలుగులో వ్రాయబడిన చంద్రశేఖరయ్య శాసనము కాన్పించినది. దీనినిబట్టి 'గతిరాజుపెంట' యను గ్రామమును బసవమంతమునకు చెందిన 'రాతోలి వీరనొడయ' అనువానికి 'చంద్రశేఖరయ్య' తన క్షేమము, దేవరనయ్య క్షేమము, తన ప్రభువగు కృష్ణరాయల క్షేమముకొరకు ధర్మము చేసెనని తెలియుచున్నది. ఈ ప్రకారము మంత్రియైన చంద్రశేఖరయ్య ధర్మములు ముక్కుటముగానున్నవి. మరియొక కన్నడ శాసనమునుబట్టి కృష్ణరాయల సేవలో (డలిగ) నున్న 'మాచయ్య, మల్లరస' అనువారు శ్రీగిరిస్వామిని బూజించినట్లు తెలియుచున్నది. ఇది మంటపము లోని కుడివైపుననున్న స్తంభముమీద పడమటి ముఖము మీద ఉన్నది. ఇంకను కృష్ణరాయల కాలమునాటి మరియొక శాసనము శా. శ. 1433 ప్రజాపతి మాఘ బ. చతుర్దశి సోమవారము నాటిది (కలి 4611) మంటపములోని కుడివైపు ఎడమ వైపుననున్న స్తంభములమీద తూర్పు వైపుననున్నది. దీనినిబట్టి 'శాంతయ్యకుమారుడు లింగ' అను వీరశైవుడు ఒక ముఖ్యనాయకుడు, శ్రీగిరిస్వామికియిచ్చిన ధర్మములు వరుసగా తెలియుచున్నవి. ఈయన పుణ్యకార్యములలో నొకటి శ్వేతాంబర జైనుల శిరచ్ఛేదన మని "The one of the pious acts being beheading of the Swethambara Jainas" తెలియుచున్నది. శాంతయ్య కుమారుడు లింగయ్య రాయల సామంతుడు. గర్భగుడికి కనక పూతపూయించెనని కైఫీయతు లోనున్నది. ఇంకను విరోధి శ్రావణ బహుళ దశమిలో "మన్నాని అన్నపయ్య ధర్మాలు—కంబాలు ఎత్తించిరి. కోటకన్నాలు పడినవి. దక్షిణపురాయి విరుగ మరమ్మత్తులుచేసిరి" అని కైఫీయతులోనున్నది.

శాంతలింగయ్య కుమారుడు ప్రాకారము గట్టించి, ఏనుగుల, గుఱ్ఱముల, భటుల, మృగపక్షిజాతుల బొమ్మలు లిఖించెనని కైఫీయతులో నున్నది. క్రీ. శ.

1512 ప్రజోత్పత్తి సంవత్సరంలో వీరశైవుడైన శాంతలింగము ఒక కాల్వను త్రవ్వించెను. ఆయన కుమారుడు ముఖమంటపము కప్పుపైన బంగారు తొడుగులు వేయించినట్లు తెలియుచున్నది శివకథలు సూచించు బొమ్మల నీయ నగోడలపైన చెక్కించినట్లు కాన్పించుచున్నది. శాంతలింగయ్యను గూర్చి శ్రీశైలము కైఫియతు (XVI) లో నిట్లున్నది. "మల్లికార్జునుని ధర్మకర్త భిక్షవృత్తి శాంతలింగయ్య" అనే జంగము. అతను విశేషంగా చదువుకొన్నవాడున్నూ జ్ఞానవంతుడున్నూ అయి ప్రవేశించి, అక్కడ మనుపు స్వల్పంగా ఉన్న ఆలయంవద్ద తాను ఒక మంటపం కట్టించి పేదలకు సత్రం సాగించెను. బ్రాహ్మణులకు అధ్యయనం చేయించెను. అతిథిపూజలు అవద్యము బయలుచేయించి, గ్రామములు" మల్లికార్జునుని భోగములకు, శాంతయ్యగారి శివలింగమంతములకు సత్రానకు నడిచే గ్రామములు అన్ని ఆయన పరామర్శిస్తుఉండెను—చేరువగా ఒక దుర్గము కట్టించి, కొంతమందిని ఉంచి, గ్రామములకు ఉపద్రవము లేకుండా కాపాడెను. రాజులకు నడిచే బిరుదులు, మర్యాదలు, జంగాలకు గురువు —— మర్యాదలు బిరుదులు —— స్వస్తిశ్రీ భువనైక త్రిలక్ష గ్రామగోళక మహామఠస్య సామ్రాజ్య పట్టభద్ర శ్రీమద్రాజ గురుచరణ సరసీరుహ భూషిత మస్తకులు శ్రీ త్రిపురాంతక దేవదివ్య శ్రీపాద పద్మారాధకులైన శ్రీ పర్వతాఖిల బసవగోళక మఠము శ్రీమంతు నిజగురు శాంత పూజ్య శివదేశికులు అనే బిరుదుగలదు" వీరశైవుడు, లింగాయతుడు అయిన ఈ 'శాంతలింగము' బొంటితో కైలాసమేగుటకు అనేకమంది శ్వేతాంబర జైన మతాచార్యుల వధించెను. కృష్ణరాయల కీవిషయములుతెలిసి ఈ ఘోరకృత్యమున కసహ్యించుకొనెను. రాయలు వైష్ణవుడైనను శైవమతపోషణచేసిన, మతసహనముగల మహాప్రభువు. జైనుల వధ విని దీని నాపుటకు 'వెలుగోటి నాయకుడగు గని తిమ్మానాయుని' పంపగా ఆయన మతమౌఢ్యము గల ఈ లింగాయతుని వధించెను.

*(Sri N. V. R. — Vijaya Nagar – the third dynasty "Velugoti chief Gani Thimma Naidu attacked the bigoted Lingayat and slew him-")*

రాయలు మతభేదము పాటించకుండ తిరుపతి, కంచి, సింహాచలము, అహోబిలము, కాళహస్తి. శ్రీశైలము అమరావతి మున్నగుచోట్ల అనేక భూదానములుచేసెను. వీరశైవసిద్ధ భిక్షావృత్తి, మఠస్థాపనచేసెను. అతని భార్య, శిష్యుడు పర్వతయ్య

క్రీ. శ. 1518 (శా. శ. 1440) లో స్వామికి కొన్ని ధర్మములు చేసిరి. క్రీ. శ. 1516 వ సంవత్సరమున అనేక విధములైన వాహనములనుంచి, జంతువులనుంచి సరుకులనుంచి, శ్రీగిరిమీదకు యాత్రికుల సౌకర్యార్థము చేయుచుండిరని కైఫీయతుల ఆధారమున జెప్పవచ్చును. కడపజిల్లాలోని 'వాముమారు' గ్రామ కైఫీయతునుబట్టి క్రీ. శ. 1536 వ సంవత్సరములో పెన్నంటాటి, ములికినాడు, రేనాడు, సకిలిసీమ, అపుకు, కోయిలకుంట్ల. పెదనంద్యాల, పులివెందులలోనున్న మగ్గములమీద రావలసిన బాకీలను 56 దేశములకు చెందిన శ్రేష్ఠులు శ్రీశైల మఠముమీద అధిపత్యము వహించిన స్వామికి ఉచితముగా మంజూరు చేసినట్లు L. R. 18 లోని 'వాముసూరు' కైఫీయతు తెల్పుచున్నది. క్రీ. శ. 1542 43 (శా. శ. 1464) వ సంవత్సరమున రామరాజు శ్రీశైలములో మన్నట్లు శాస నాధారమున చరిత్ర కారులు వ్రాసినారు. ఇంకను క్రీ. శ. 16 వ శతాబ్దములోని తామ్ర శాసనములబట్టి దక్షిణ హిందూస్థానమునగల పుణ్యస్థలములలో (1) చిదంబరము (2) విరూపాక్షం (3) కాళహస్తి (4) తిరుపతి (5) కంచి (6) శ్రీశైలము (7) తిరువన్నామలై (8) హరిహర (9) అహోబల (10) సంగమేశ్వర (11) శ్రీరంగ (12) కుంభకోణ (13) మహానంది (14) గోకర్ణ (15) రామేశ్వర అను శైవ, వైష్ణవ క్షేత్రములు గలవని తెలియుచున్నది. ఈ శతాబ్దములోనే శైవ, వైష్ణవ, జైనమతములు వ్యాప్తిలోగలవని, ఇందులో గొన్ని బ్రాహ్మణులకు, కొన్ని బ్రాహ్మణేతరుల కుపయోగించుచున్నవని, కొన్ని లింగాయతుల మఠములు లింగాయతులుకాని వారి కుపయోగింపబడుచుండెనని, అందులో ముఖ్యమైన మఠములు, శ్రీశైలము, సంగమేశ్వరము, ఉమ్మత్తూరు' అనుచోట్ల గలవని శ్రీ వేంకటరమణయ్యగారు వ్రాసినది సత్యముగానేయున్నది. శ్రీశైల కైఫీయతులో శా. శ. 1414 ప్రజోత్పత్తి మాఘ బ. చతుర్దశి సోమవారము దినమున 'ఈ కోటిచిన్నిశెట్టి' సదాశివలింగము ప్రతిష్ఠచేసి, రంగసముద్ర గ్రామ మిచ్చెనని, దక్షిణమున చతుర్ముఖ బ్రహ్మ ఆలయమునందు శా. శ. 1425 శ్రీముఖ మాఘ బ. చతుర్దశి గురువారమున గర్భగుడి, ముఖమంటపము గట్టించెనని రాయల సేవకుడు పర్వతనాయుడు బంగారుపూత పూయించెనని యున్నది.

ఇంకను దక్షిణమున ఒక శాసనము గలదని శా. శ. 1452 వికృతి సంవత్సరములో మంత్రి చంద్రశేఖరయ్య విమానముపై బంగారుపూత పూయించిరని కృష్ణరాయలు బంగారు రేకులు వేయించెనని సంస్కృతమున

అక్షరములు వ్రాసిరని, చంద్రశేఖరయ్యగారి రాగిరేకుల శాసనముగలదని, తూర్పు వైపున నున్న శాసనమునుబట్టి పరమాన్నం నైవేద్యము కొరకు 'పల్లవోలి' గ్రామము సమర్పించిరని, చంద్రశేఖర నాయుని పౌత్రుడు తిప్పానాయని పుత్రుడు మల్లానాయుడు ఈ పనులుచేసెనని, విమానం, బంగారు పనులు చేసినవాడు, కంసాలి సంపనుంట నాగాబత్తుని కుమారుడు కొండాబత్తుడని, గర్భగుడి వ. శాసనమునుబట్టి మంత్రి అయిన చంద్రశేఖరుడు స్తంభం తిరుగ గట్టించెనని, నాగయూటీవనం, వీరభద్ర ఆలయం, మంటపం, కొలను కట్టించిరని, చంద్రశేఖరయ్య హోమపిండము చేయించెనని క్రీ. శ. 1800–1804 మధ్యకాలములో వ్రాయించిన కాలిన్ మెకంజీ డైరీయందు తెల్పుచున్నది.

కృష్ణరాయలు స్వయముగ వచ్చి శ్రీశైల ఆలయమునకు ఈ క్రింది వానిని ధర్మము చేసెనని చరిత్రకారులు వ్రాసినారు అందులోనివి.

1. వజ్రనిర్మితమైన హారము. (Diamond necklace)
2. పచ్చతో తయారైన కంకణము. (Emerald wristlet)
3. బంగారు పళ్లెము. (Gold Plate)
4. 1000 బంగారు నాణెములు. (1000 Pieces of gold)

ఇంకను తమిళ గ్రంథములలో నిట్లున్నది. "కృష్ణరాయల మంత్రి చంద్రశేఖర్ కల్యాణమంటపము కట్టి, కలశము పెట్టెనని, గుడిముందు మంటపము కట్టెనని, ఇంకా అనేక మరమ్మత్తులు చేసెనని, ఆ మంటపములో కృష్ణరాయల చంద్రశేఖరుని శిలాప్రతిమల 'దేమరస' అనువాడు ఉంచెనని నంది ప్రతిష్ఠచేసెనని, దేవరస శాసనముగలదని ఉన్నది.

'వీరప్రతాప అచ్యుతరాయల' కాలములోగూడ వ్రాయబడిన శాసనమొకటి కాన్పించుచున్నది. శ. శ. 1452 వికృతి పుష్య బ. ఏకాదశి గురువారము (1530) నాడు 'మాలపనాయండు' అనువాడు మల్లికార్జునస్వామి ఆలయమునకు ఒక గంట నొసంగి, భ్రమరాంబదేవికి ఒక వస్త్రమునంగెను. ఈ రెండు ధర్మములు రాజు క్షేమముకొరకు, ఆయన సోదరుడు 'కృష్ణదేవరాజ దేవమహారాయ' క్షేమము కొరకు యివ్వబడెను. అచ్యుత దేవరాయని రాజ్యములోని 17 రాజ్యములలో శ్రీశైలము ఒకటి. విజయనగరరాజు వేంకటపతి రాయల కాలమునాటి చిన్నది శాసనమొకటి శా. శ. 1524 (క్రీ. శ. 1602) శుభకృతు మాఘ బహుళ 14-శివరాత్రి దినమునాటిది కాన్పించినది. దీనినిబట్టి 'దొడహాలగయ్య' కుమారుడు

'చికయ్య' అనువాడు 'ముడియపనాయకుని' క్షేమముకొరకు ఒక దీప స్తంభమును నాటించి శాసనము వేయించెను. ఈ 'చికయ్య' నిడుగళ్ళ సీమలోని 'మోస్లిస'కు జెందిన వడ్రంగి; ఇచట చోళరాజు క్షేమముకొరకు బంగారు పక్షిపాతము గట్టిన దని చెప్పబడుచున్నది. కొన్నిచోట్ల 'పాలకయ్య' కుమారుడని యున్నది. విజయ నగర ప్రభువు 'వీరతిరుమలయ్య దేవమహారాజు' కుమారుడు వీరప్రతాప రాయ రాజయ్య దేవ మహారాజు' శా. శ. 1499 భావ వైశాఖ బ. అమావాస్య శుక్రవారపు దినమున (క్రీ. శ. 1577) వ్రాయబడిన తెలుగు శాసనమొకటి కాన్పించినది. దేవాలయమునకు పడమటి వైపుననున్న "భోగవతి" ప్రవాహమునకు అడ్డముగా వేయబడిన ఆనకట్ట శిథిలమగుటచే, మరమ్మత్తు కావలసి ఉండెను. రాజుయొక్క ప్రతినిధి 'దండికంటి లింగపన' ఈ ఆనకట్టను తిరుగవేయించి, కింద్లను చెరువుతో సహా, స్వామివారికి పూలతోటవేసే నిమిత్తము ధర్మ మొసంగెనని తెలియుచున్నది. ఆనంద ఆషాఢ శుద్ధ విదియ ఆదివారమునాటి శాసన మొకటి తెలుగులో నున్నది. సారంగమఠములోని 'సానరాయి' మీద ఉన్న యీ శాసనమునుబట్టి 'పులి అన్నప నాయుడు' కుమారుడైన 'సింగయ్య' ఈ సానరాయి నిచ్చినట్లు తెలుచున్నది.

ఇంకను కైఫీయతులో 'అచ్యుతరాయల' శాసనము యొక్క ప్రసంగమున్నది. ధ్వజస్తంభము మీద శా. శ. 1458 మన్మథ భాద్రపద బ. త్రయోదశి నాటి శాసనము గలదని, 'సలకరాజుల పిన తిరుమలయ్య దేవమహారాజు' కార్యకర్త వచ్చి నాడని నారయ్యగారు మల్లికార్జునుని యజ్ఞశాలామంటపము కట్టించి బంగారు పూతతో ధ్వజస్తంభము చేయించిరని, సదాశివరాయలు, శ్రీరంగరాయలు కట్టడలు చేసిరని, (పెనుగొండ) తర్వాత కర్నూలు ప్రభువు గోపాలరాజు కాలములో శ్రీశైలధర్మం నడిచెనని, సోదరుడు వీరవెంకటపతి రాయలు శా. శ. 1512 వికృతి మాఘ శు. పంచమిన శ్రీకంఠ రాజయ్య కుమారుడు వీరయ్యదేవ ఉత్తరమున ధ్వజస్తంభము నాటించెనని శా. శ. 1516 విజయ శు. పౌర్ణమిన మాచనాయని కొడుకు మాచల చితాపిఖానుడు వచ్చెనని. శా. శ, 1524 శుభకృతు మాఘ. బ. విదియ వేంకటపతి రాయల కాలమున పొడిపాలగయ్య కుమారుడు సిద్ధలయ్య ఇనుపదీపస్తంభము వేయించెనని, పడమర శాసనము గలదని, శా. శ. 1525 శోభకృత్తు భాద్రపద శు. త్రయోదశిన 'హంపదేవమ్మ'గారు నాల్గుగుళ్ళ, మంట పాలు కట్టించిరని, శా. శ. 1511 సిద్ధార్థి నం. బీజపూరునుండి 'అబ్దుల్ మహమ్మదు' 'అబ్దుల్ వాహబు' మొదలైన సర్దార్లు సహాఫౌజుతో హదాను కందిన పోలిమ్మలము

ముట్టడికి పేసిరని' గోపాలరాజు కోట యిచ్చిరని, శా. శ 1556 శ్రీముఖలో పాలుట్ల అన్నమరాజు శ్రీశైలము పడమర కనక సత్రము కట్టించిరని అచట శాసనము గలదని ఉన్నది. తర్వాత కనిపెట్టబడిన శాసనములోని విషయములకు, కైఫీయతులోని విషయములకు కొలదితేడా ఉన్నది. పాతాళగంగకుపోయే మార్గములో ఒక శిలమీద సర్వజిత్తు ఫాల్గుణ శు. ఏకాదశి మంగళవారము దినమునాటి తెలుగు శాసనమొకటి కాన్పించినది. దీనినిబట్టి 'సాయపనాయుడు కుమారుడైన వేంకటపతి నాయుడు శ్రీగిరిమీదనున్న భిక్షుకులవద్ద సుంకము (గణాచార్య) వసూలుచేసి పంపించుచుండెను. ఆ కాలమున 'దావళదారిమసాహెబు, తానాజీవంతులు' అను వారు 'హాజరాతీనావలు' క్షేమముకొరకు భిక్షుకుల మీద సుంకం వెనుకటివలె వసూలుచేసి పంపించుచుండిరని, ఈ శాసనము తెల్పుచున్నది. దాసరిపల్లి కైఫీయతునుబట్టి సంస్థలు అహోబలమునకు కూడ పోవుచున్నట్లు తెలియుచున్నది. విను శ్రీశైలము, అహోబలము దక్షిణమున ముఖ్యమైన పుణ్యక్షేత్రములు 4 వ రామదేవుని కాలమున (కర్ణాటకరాజు) కూడ శ్రీశైలస్వామికి కొన్ని దానములు, కైంకర్యములు చేసినట్లు తెలియుచున్నది. చినవెవ్వనాయుడు అను రాజుకూడ అనేక కైంకర్యములు చేసెను.

## 17. శ్రీనాథుడు

### (క్రీ. శ. 15 వ శతాబ్దము)

ఇతనిని శ్రీనాథ భట్టారకుడు అని పిల్తురు. సంస్కృతాంధ్ర కర్ణాటక భాషలందు మహాపండితుడు; కవిరాజు; విజయనగర ప్రభువు సంగమ వంశీయుడగు 2 వ దేవరాయలవలన (1424—1466) కనకాభిషేకమును, కవిసార్వభౌమ బిరుదమును పొందెను. ఈ రాయలు వీరశైవ మతాభిమాని. శ్రీనాథుడు అటు కర్ణాటక ప్రభువులచేత, ఇటు కొండవీటి రెడ్డిప్రభువులచేత సన్మానములంది అనేక కృతులరచించెను. శ్రీశైలయాత్రచేసి, 'శివరాత్రి మాహాత్మ్యము' అను గ్రంథమును క్రీ. శ. 1440 ప్రాంతమున రచించెను. శ్రీనాథుని కాలమున వీరశైవ మతమున కధిపతి 'శాంతభిక్షావృత్తి' (యతీశ్వర) శిష్యుడైన శాంతయ్య. ఇతను తెలుగుభాషాభిమాని. శ్రీనాథుడు తన గ్రంథము నీయనకు కృతి నొసంగెను ఆకాలమున సిద్ధభిక్షావృత్తి శ్రీశైలములో (Donee) ఒక మఠమున

కధిపతి. విరూపాక్ష అనువాడు వీరశైవ మఠమునకు [illegible] శ్రీనాధుడు శివరాత్రి కేగినప్పుడు వీరిలో గొందరిని దర్శించెను. (E I Vol 21) 'సిద్ధి భిక్షావృత్తి' నామము శా. శ. 1440 ఈశ్వర చైత్రబహుళ 15 సోమవారమునాటి శాసనములో గూడ కాన్పించుచున్నది. తెలుగులో నున్న యీశాసనము వల్ల పర్వతయ్య అనువాడు, ఆయన భార్య, సిద్ధి భిక్షావృత్తి అయ్యంగారి శిష్యులు మల్లి కార్జునస్వామి'కి పూజచేసి భీముని కొలను వద్ద ఆయన [illegible] ప్రతిష్ఠించి "సిద్ధపురము" వద్ద నొక పూలతోటను నిర్మించెనని, [illegible] 'సిద్ధపురము' చెరువుక్రింద సాగగుచున్న వరిపొలమును, [illegible] నిత్యక్రియలు జరుపగలందులకు శా. శ. 1440 జ్యే. బ. 30 [illegible] యిచ్చెనని తెలియుచున్నది. ఈ రెండు శాసనములు వాకిలికి [illegible] రాతి మీద ఉన్నవి. ఆలయ ఆవరణములోని అరటితోటలోని ఒక రాతిమీద, శా. శ. 1384 శోభన సం. భాద్రపద శు. పూర్ణిమ సోమవారము [illegible] శాసనమున్నది. వైరాగి శాంతయ్య తనభార్య 'సిద్ధమ్మ' పేరున [illegible] శ్రీ[illegible] స్వామి ఆలయమునకు పూలతోట నొసంగెనని ఈ శాసనము తెల్పును. [illegible] దరు శ్రీనాధునితోబాటు క్రీ. శ. 15 వ శతాబ్దిలోనివాడు. శా. శ. 1240 విభవ ఆషాఢ శు. ౧౫ న 'ముక్తిశాంతి భిక్షావృత్తి అయ్యవారు' శివరాత్రి[illegible] మూటలకు నిర్ణయించిరని శ్రీశైలం కైఫీయతు (L. R XVI) చెప్పుచున్నది. శ్రీనాధుడు తన కాశీఖండములో శ్రీశైలక్షేత్రమును వర్ణించెను. "[illegible], రసాయనసిద్ధి, మూలికాసిద్ధి, పాదుకాసిద్ధ్యాదులగు సిద్ధిక్షేత్రం బగుటను, [illegible] దివ్యామృత నిర్మల శ్రీస్వయం జ్యోతిర్లింగమూర్తియగు మల్లికార్జున శ్రీమహా దేవునకు నిలనివాసంబై యభిరామంబై దివ్యంబగు శ్రీశైలంబు వెలయు" అని వ్రాసినారు.

శ్రీశైలము కైఫీయతులో 'భిక్షావృత్తి శాంతయ్య' [illegible] వృత్తిగారు' శ్రీశైలం మఠాధిపత్యంచేస్తూఉండగా [illegible] ముత్తినమాయిశెట్టి' "సిద్ధపుర గ్రామము" ధర్మసత్రాని కిచ్చిరి" అని ఉన్నది.

శ్రీనాధుడు, కృతిపతి 'శాంతయ్య' భక్తిశ్రేష్ఠుడు మున్నగు వారిని గూర్చి శివరాత్రి మాహాత్మ్యములో ప్రశంసించెను.

ఉ. "శ్రీగిరి (తూర్పుభాగము) మున జెన్నగు
ముమ్మడి దేవయ్య సుతుడు శాంతయ్య."

కధిపతి. విరూపాక్ష అనువాడు వీరశైవ మఠమునకు [illegible]
శ్రీనాధుడు శివరాత్రి కేగినప్పుడు వీరిలో గొందరిని దర్శించెను. (E I Vol 21)
'సిద్ధి భిక్షావృత్తి' నామము శా. శ. 1440 ఈశ్వర చైత్ర బహుళ 15 సోమవారపునాటి
శాసనములో గూడ కాన్పించుచున్నది. తెలుగులో నున్న [illegible] బట్టి
పర్వతయ్య అనువాడు, ఆయన భార్య, సిద్ధి భిక్షావృత్తి అయ్యంగారి శిష్యులు మల్లి
కార్జునస్వామి'కి పూజచేసి భీముని కొలను వద్ద ఆయన [illegible] ప్రతిష్ఠించి
"సిద్ధపురము" వద్ద నౌక పూలతోటను నిర్మించెనని, మరియొక శాసనమునుబట్టి
'సిద్ధపురము' చెరువుక్రింద సాగగుచున్న వరిపొలమును, [illegible]
నిత్యక్రియలు జరుపగలందులకు శా. శ. 1440 జ్యేష్ఠ బ. 30 [illegible]
యిచ్చెనని తెలియుచున్నది. ఈ రెండు శాసనములు వాకిలికి [illegible] ఒక రాతి
మీద ఉన్నవి. ఆలయ ఆవరణములోని అరటితోటలోని ఒక రాతిమీద, శా. శ.
1384 శోభన సం. భాద్రపద శు. పూర్ణిమ సోమవారము [illegible]
శాసనమున్నది. వైరాగి శాంతయ్య తనభార్య 'సిద్ధమ్మ' [illegible] శ్రీగిరి
స్వామి ఆలయమునకు పూలతోట నొసంగెనని ఈ శాసనము తెల్పును. [illegible]
దరు శ్రీనాధునితోబాటు క్రీ. శ. 15 వ శతాబ్దిలోనివారు. శా. శ. 1240 విభవ
ఆషాఢ శు. ౧౫ న 'ముక్తిశాంతి భిక్షావృత్తి అయ్యవారు' శివరాత్రి[illegible]
మూటలకు నిర్ణయించిరని శ్రీశైలం కైఫీయతు (L. R XVI) తెలుపుచున్నది.
శ్రీనాధుడు తన కాశీఖండములో శ్రీశైలక్షేత్రమును వర్ణించెను. "[illegible]సిద్ధి,
రసాయనసిద్ధి, మూలికాసిద్ధి, పాదుకాసిద్ధ్యాదులగు సిద్ధిక్షేత్రం[illegible]
దివ్యామృత నిర్మల శ్రీస్వయం జ్యోతిర్లింగమూర్తియగు మల్లికార్జున శ్రీమహా
దేవునకు నిలనివాసంబై యధిరామంబై దివ్యంబునగు శ్రీశైలంబు [illegible]"
అని వ్రాసినారు.

శ్రీశైలము కైఫీయతులో 'భిక్షవృత్తి శాంతయ్య' [illegible] సిద్ధిభిక్ష
వృత్తిగారు' శ్రీశైలం మఠాధిపత్యంచేస్తూఉండగా [illegible]
ముత్తినమాయిశెట్టి' "సిద్ధపుర గ్రామము" ధర్మసత్రానికి [illegible]" అని ఉన్నది.

శ్రీనాధుడు, కృతిపతి 'శాంతయ్య' భక్తీశ్వరుడు మున్నగు వారిని గూర్చి
శివరాత్రి మాహాత్మ్యములో బ్రశంసించెను.

ఉ. "శ్రీగిరి (తూర్పుభాగము) మున జెన్నగు
ముమ్మడి దేవయ్య సుతుడు శాంతయ్య."



శ్రీశైలనాధునిగూర్చి కూడ అనేకచోట్ల ప్రశంసించెను.

సీ. భక్తిరాజాఖ్యచే బర్వతేశ్వరునకు
నర్పించె జెరువాడు నాతకూరు
బోలిదేవయ్య చెన్నారు పుణ్యమూర్తి

గీ. పరగ శ్రీశైలనాధుని పట్టణమున
బోలిదేవయ్య కులపతి పుణ్యచరిత
ముదితసజ్జన నికురాంబముమ్మమాంబ

సీ శ్రీగిరినాధయ్య చెలువుమీర
మల్లికార్జున శివునకు మంత్రి యనగ

ఎలుప భక్తీశ్వరబోళుడు క్రీ. శ. 1360 ప్రాంతపువాడు. ఈయన అనపోతారెడ్డికి సామంతుడుగానున్నట్లు కాన్పించుచున్నది. భక్తీశ్వరుడు శా. శ. 1227 లో (క్రీ. శ. 1305) శ్రీశైల యాత్రచేసి విశ్వేశ్వర బ్రహ్మచారికి "కండ్యకొలను" అగ్రహారముగానిచ్చెను. ఈబ్రహ్మచారి ఆంధ్రదేశములో శైవమత ప్రచారము చేయుచు, శ్రీశైలముమీద శిష్యులకు విద్యనేర్పుచుండెను. ఆకాలమున శ్రీశైలము గొప్ప పుణ్యక్షేత్ర మని శ్రీనాధుడు వర్ణించెను. "కాశీ, శ్రీశైల, కుంభకోణ, కేదారక్క, కాంచీ, కాంచనసభా, కాళహస్తి, కురుక్షేత్రాది పుణ్యస్థానంబులం" శ్రీనాధుడు శ్రీగిరిమీద కూర్చుండి వ్రాసిన గ్రంథములోని పద్యములు మనోహరముగా నున్నవి.

గీ॥ తనయ సంతాన లబ్ధిదౌదవ్వ గాగ
విభవ సంపత్తి గల్గియు విన్నబోయి
వనిత నిష్ఫల పుష్ప దర్శనము దాల్చె
శరలతా కాననము వోలె జవ్వనంబు.

గీ॥ లన్ని భాగ్యంబులున్న నాయబ్జ ముఖికి
శ్రీమహాలక్ష్మి గలుగగ నేమిసెలవు
పుత్ర వదనావలోక నోద్భూతమైన
యొక్క సౌఖ్యంబు ప్రాతియై యుండుగాన.

ఉ॥ సంపద పేరి కట్టిడి పిశాచము సోకి మానవుండు పూ
జింప డభీష్ట దేవత భజింపడు సజ్జనులైన వారి మ
న్నింపడు మిత్రబంధుల గణింపడు ధర్మరహస్యములివ్విచా
రింపడు మీ - భరింప డహంకరణంబు పెంపునన్.

ఇచట శాంతభిక్షావృత్తి శిష్యుడగు 'పుష్పాల శాంతయ్యగారు' శ్రీనాథుడు శివరాత్రి మాహాత్మ్యము రచించి, అంకిత మొసంగెను. శాంత భిక్షావృత్తి సహకరించి, అనఘకోటి దీనిని కోరెవని, శ్రీనాథుడట్లే చేసెనని తెలియుచున్నది. బహుశః శ్రీశైలములోనే ఈ గ్రంథమును ముగించియుండవలెను. ఈ కవి శ్రీశైలము ననేకసార్లు దర్శించెను.

## 18. దూబగుంట కోమ్మన మంత్రి

(క్రీ. శ. 15 వ శతాబ్దము)

ఈయన 'ఒంగోలు తాలూకా' దూబగుంట వాస్తవ్యుడు. శ్రీగిరి కోమటి రెడ్డి భూధవుడు విజయనగర రాజగుప్రౌఢ దేవరాయలచే నోడించబడి, అతనికి కప్పము చెల్లించుచు సామంత రాజుగా నుండెను. కందుకూరు దుర్గములోనుండి, పూంగినాటి సీమను వీరి పూర్వులు పాలించుచుండిరి. శ్రీగిరి కోమటిరెడ్డి కీయనమంత్రి. ఈయన కుమార్లు 'నారాయణుడు, రామచంద్రుడు అనువారు. ఈయిద్దరు కుమారు నుల గైకొనిపోయి, శ్రీశైలములోని పాతాళగంగ నుండి యితడు స్వయంభూలింగ మును గొనివచ్చి శా. శ. 1352 సాధారణ సం. ఫాల్గుణ శు. ఏకాదశినాడు అనగా క్రీ. శ. 1430 వ సంవత్సరమున శిలలతో నొక ఆలయమును, మంటపమును గట్టించి, చుట్టును విఘ్నేశ్వర, దుర్గ, గోపాల, భైరవ విగ్రహముల ప్రతిష్ఠించి శిలలతో నాలయముల నిర్మించెను. శిలాప్రాకారముల లోపల నొక చక్కని యారామ మేర్పాట్లుచేసెను. ఇంతియేగాక తాను యజ్ఞము చేసిన చోటులో గుర్తుని చిహ్నముగ శిలా స్తంభముల రెండింటిని వేయించెను. (శ్రీ కోన వెంకట రాయశర్మ- సచివోత్తములు. పుట 136) పైవారి వంశములో 'శ్రీగిరి' అనువాడు అనవేమారెడ్డి కాలమున 'పూంగినాటి సీమను' బాలించెను. శ్రీగిరి పిన కోమటి ప్రభువుకు సూనుడు. ఈయన గురువు "శ్రీమద్రొడియరాయ శ్రీగిరి" ఇంకను 'శ్రీగిరి' అను పేరుగలవారు చాలమంది ఈవంశములో గాన్పించు చున్నారు. శివలింగభూపతి'

యను కోమటిరెడ్డి కుమారుడు, ప్రౌఢ దేవరాయల కాలమున 'కందనోలు (Kurnool) రాజధానిగా శ్రీశైల ప్రాంతమున కొంతదేశమును పాలించెను. ఈశివ లింగ భూపతి 'గిరీశశ్రుతి సూక్తిమాల' అను గ్రంథమును గీర్వాణ భాషలో రచించెను. వీరు శివభక్తులై తమ బిడ్డలకు 'శ్రీగిరి' అను పేరు పెటుట, గ్రంథ మును గూడ గిరీశుని పేరుతో వ్రాయుట చూడగా వీరు శ్రీశైలస్వామి భక్తులని, దగ్గరగా నుండుటచేత అనేకసార్లు శ్రీశైలయాత్ర చేసి యుండవలెనని ఊహ గల్గుచున్నది.

## 19. అబ్దుల్ హుసేన్ తానీషా

(క్రీ. శ. 1672–1687)

ఈయన వద్దనే 'అక్కన్న మాదన్నలు' మంత్రులుగానుండిరి. శివాజీని గోల్కొండ రావలసినదిగా ఈ మంత్రులాహ్వానించిరి. మాదన్న శివాజీ వచ్చి నపుడు లక్షహన్నులు బంగార మిచ్చినట్లు చరిత్రలు నుడువుచున్నవి. ఈ బ్రాహ్మణ మంత్రుల ప్రోత్సాహమున 'తానీషా' శ్రీశైల గర్భాలయమునకు బంగారు పూత పూయించెను. మల్లికార్జునస్వామికి కైంకర్యము జరిపించుచు, స్వామి పూజకు ఏర్పాట్లుచేయు చుండెనని చరిత్రలు నుడువుచున్నవి. దీనిని బట్టి తానీషా ముస్లిము అయినను, హిందువుల ఆలయముల నెట్టి గౌరవ భావముతో జూచుచుండెనో విదితంబగు చున్నది. తానీషాకు వచ్చు 5 కోట్ల ఆదాయములో చాల భాగము కైంకర్యములకు ఖర్చుగుచుండెను.

అక్కన్న మాదన్నల మీద కుంపినీ ప్రభుత్వము వారికి చాలాభక్తి భావము, గౌరవము గలదని 1679 నాటి ఫోర్టు సెంటుజార్జి ఉత్తరములు తెల్పుచున్నవి. 1678–2–6 వ తేదీ ఉత్తరములో అక్కన్న మాదన్నలు మనకు తగిన మిత్రులు (Our worthy Friends) అని వ్రాసిరి. మాదన్న కుమార్తె వివాహమునకు చాల విలువైన బహుమతులు బ్రిటీషువారు పంపించిరని రికార్డులు తెలుపుచున్నవి. బ్రాహ్మణ అక్కన్న పంతులు పేరుతో వ్రాసిన ఉత్తరములలో చక్రవర్తిని సంబో ధించినట్లు కుంపినీ అధికార్లు సంబోధించిరి. ("May it please your Lord-

ship.") పొదుల లింగప్ప, వీరరాఘవయ్యమున్నగు బ్రాహ్మణుల పేర్లు ఈ పత్రములలోనున్నవి. 26-11-1679 న వ్రాసిన జాబు గోల్కొండలోని బ్రాహ్మణ వీర రాఘవయ్యకు వ్రాసినట్లున్నది.

(We do also order you to watch an opportunity to provail with Frahmin Akkanna to get raised out of the divine books the Pagods 54 We have been glad to hear of what you have done in Cassa Viranna's reguest to Brahmin Madanna and Akkanna concerning St. Thomas ',)

వీనినిబట్టి కుంపినీ అధికార్లు, తానీషా, శివాజి మున్నగువారు అక్కన్న, మాదన్నల యందు ఎంతయో గౌరవము గల్గియుండిరని, వీరివలననే తానీషా శ్రీశైలస్వామికి కైంకర్యములు జరపించు చుండెనని తెలియుచున్నది. క్రీ. శ. 1686 లో అక్కన్న మాదన్నలు శ్రీశైల యాత్ర చేసిరని వీరిచరిత్ర తెల్పుచున్నది.

## 20. శివాజీ

### (క్రీ. శ. 1627–1680)

శివాజీ క్రీ. శ. 1627 మే నెలలో జననము పొంది క్రీ. శ. 1680 ఏప్రియల్ 5 వ తేదీన జ్వరము, రక్తగ్రహణి వ్యాధిచేత మరణము పొందెను. ఈయనను గూర్చి సంపూర్తిగా తెలిసికొనగోరు వారు ఎనిమిది భాషలు—మరాఠి, సంస్కృతము, హిందీ, పారసీకము, ఇంగ్లీషు భాష, ఫ్రెంచి, డచ్, పోర్చుగీసు, భాష నెరుంగవలెను. 'పరమానంద' కవి రచించిన 'శివభారతము' వలన క్రీ. శ. 1661 వరకు గల శివాజీ జీవిత విషయములు తెలియుచున్నవి. క్రీ. శ. 1659 తర్వాత ఆంగ్ల రికార్డులలో ఈయనను గూర్చి హెచ్చుగా వ్రాయబడినది. ఒక విధముగా ముఖ్య స్నేహితుడుగాను, గొప్ప విరోధిగాను ఆంగ్లేయులు భావించుచుండిరి ("Our fairest friend and noblest enemy.") Surat letter. ఈయన పట్టాభిషేకము క్రీ. శ. 1674 జూను 6 వ తేదీన జరిగెను. 'గాగభట్టు' అను కాశీబ్రాహ్మణుడు 17000 పగోడాల బరువుగల బంగారము (160 వీశెల బంగారం) కాక, 50 లక్షల రూపాయలు ఖర్చు పెట్టించెను. కొద్ది కాలములో తన కత్యంత ప్రియమైన మాతృదేవి మరణించెను. అందుచేత ప్రథమ పట్టాభిషేకముతో తృప్తి పొందక క్రీ. శ. 1674 సెప్టెంబరు 24 న తిరిగి రెండవసారి పట్టాభిషేకము చేసి

కొానెను. దీనితో నీయన ఖజానాలో డబ్బంత పూర్తిగా వ్యయమాయెను. ఉత్సవములలో నీయనవెంట నల్గురు భార్యలుండువారని కొందరు, ఏడుగురు భార్యలుండువారని లేఖకులు వ్రాసినారు. ఈయన మన్మధ రూపమును గాంచి ఔరంగజేబు కుమార్తె ప్రేమించెనని "దౌసన్" అను చరిత్రకారుడు వ్రాసినాడు. (History of Hindustan - Vol. III. P 368) ఆ కాలపు ఆచార ప్రకారము "శివాజీ" భార్యలందరు సహగమనము జేసిరి. పట్టాభిషేక సమయమున ఆంగ్ల రాయబారి హెన్రి ఆక్సిండరు (Henry Oxinder) అను వానిని బొంబాయి ప్రభుత్వము వారు పంపిరి. "Bombay sent the best man, she had next to the Governor.") ఆ నాడు తీయబడిన ఛాయా పటము "ఓర్మి" మున్నగు చరిత్ర కారుల గ్రంథములలో లభ్యమగు చున్నది. ఆంగ్ల రాయబారికి శివాజీ 'విలువగల అంబరమును (Robe of honour) గౌరవ పూర్వకముగా బహూకరించెను.

గోల్కొండ నవాబైన తానీషా మంత్రులగు 'అక్కన్న మాదన్న'లలో ముఖ్యుడైన 'మాదన్న' శివాజీని అనేకసార్లు ఆహ్వానించెను. శివాజీతో స్నేహము గల్గియున్నచో తానీషాకు ఔరంగజేబు భయముండదని, గోల్కొండ రాజ్యము సురక్షితముగా నుండవలెనన్న ఛత్రపతి శివాజి స్నేహ మవసరమని ఈయన పదే పదే చెప్పసాగెను. ఖజానాలో ధనము లేకుండుట గాంచి శివాజి 30 వేల ప్రశస్తమైన అశ్విక దళముతోను, 40 వేల కాల్బలముతోను లోగడ వెంకాజీ వద్ద ముఖ్య మంత్రియైన రఘునాథహనుమంతె అనువానితో గోల్కొండకు క్రీ. శ. 1677 మార్చి నెలలో 'రాయఘడ్' నుండి బయలుదేరెను. ఈయన నిండునామము 'రఘునాధ నారాయణ హనుమంతే' ఈయన 'వెంకాజీకి' గార్డియనుగా నుండి, తర్వాత శివాజీ వద్దకు వచ్చెను. 'జిత్తులమారి నక్క' (The Cunning Fox) అని పేర్కొంచిన శివాజీకి అఖండ స్వాగతము లభ్యమాయెను. కుతుబ్‌షా'తో రహస్యాలోచనా మందిరములో ననేక గంటలకాలము మాటాడెను. ఒక మాసము దినములు హైదరాబాదులోనే శివాజీ తన సైన్యబలముతో కాలము గడపెను. లక్షలాది బంగారు నాణెములను 'చౌత్' పన్నుగా వసూలు చేసికొని స్వదేశమునకు బయలుదేరెను. కర్నూల్ రాజగు ఆనందరావు దేశముఖువద్ద మూడు లక్షల రూప్యములు గైకొానెను. ఈయన ఎక్కడ ఉన్నను ఒక్కమారే భుజించి పరిపూర్ణారోగ్య వంతుడై వర్ధిల్లెను. ("He generally ate one meal daily and enjoyed good health.") గోల్కొండలో నుండగా శివాజీకి దినమునకు 3000

హన్నులు అనగా 4½ లక్షల రూప్యములు ఖర్చాయెను. ఈ గోల్కొండ నవాబుకు వజ్రపు గనుల వలన, మద్యమువలన, నృత్యగీత సంగీతములో ప్రవీణులైన 20 వేలమంది వేశ్యాంగనల వలన విశేషాదాయము గల్గెనని తెలియుచున్నది.

క్రీ. శ. 1677 మే నెలలో శివాజీ, కర్నూలుకు 25 మైళ్ళ దిగువున 'న్యూరోధి సంగమ్' వద్ద కృష్ణానదినిదాటెను. తన అపారసైన్య బలమును కడప మార్గమున రమ్మనికోరెను. కొంత అశ్వదళమును గైకొని తూర్పువైపుగా శ్రీశైల మల్లికార్జునుని దర్శించుటకు (Pururuthum according to the Bijapur M. S S) శివాజి తన ప్రియమైన అశ్వము నెక్కి హుటాహుటిని పయనించెను. శ్రీశైలమును చేరిన తర్వాత ఉత్తరముగా నాల్గు ఫర్లాంగుల దూరములో నున్న ఒక మందిరములో (నేడిది శిథిలమైయున్నది.) మకాముచేసి, స్వామి పూజా తత్పరుడై, దేవాలయములో కాలము గడపెను.

శివాజీ అచట అనేకవిధములైన తపోనిష్ఠలలో గడుపుచు శ్రీశైలములోనే ఆ మల్లికార్జునుని ఎదుట ప్రాణత్యాగము చేయవలెనని దృఢనిశ్చయ మనస్కుడై, ఒరనుండి ఖడ్గమునుదూసి ఆత్మహత్య చేసికొనబోగా, భవానీదేవి ప్రత్యక్షమై, హిందూ ధర్మమునకు చేయవలసిన గొప్ప సేవలను గూర్చి, కర్ణాటకములోని దండ యాత్రలను గూర్చి ప్రస్తావించి వీనికొరకు శివాజీ జీవించవలసిన అవసరము మను శివాజీ ద్వారానే, అంతర్వాణి రూపముగా జెప్పించెనని బీజపూరు మహారాజా వారి వ్రాతప్రతి తెల్పుచున్నది. 'కింకైడ్‌డఫ్' చెప్పిన విధానము మరి యొక విధముగానున్నది. ఆత్మహత్య చేసికొనబోగా ముఖ్యమంత్రి హనుమంతే వారించెనని, హిందూధర్మవ్యాప్తికి చేయవలసిన కార్యముల గుర్తుకుదెచ్చెనని, అంతట "శివాజీ" 12 దినములు తపోనిష్ఠలలోగడసి "దాముల్ చెర్రీకనుమ" ద్వారా "కర్ణాటిక్ పాయీ ఘాట్" లోనికి దిగిన 70 వేల సైన్యమును గలిసికొనెనని మేనెల మొదటి వారములో మద్రాసు చేరెనని, డఫ్ వ్రాసెను. **('After passing 12 days in this extravagant manner, Sivaji followed his army which descended into the Carnatic Payee Ghaut .by the Damuel Cherry pass He passed Madras in the first week of May:- Duff'')** శ్రీశైలములో 10 దినములు మాత్రము గడపెనని "కింకైడ్" మున్నగు లేఖకులు వ్రాసిరి. ఒక్కొక్కసారి సమాధ్యవస్థను బొందుచుండెనని, ఈయన కాపుదల కష్టమాయెనని తెలియుచున్నది. మొత్తము మీద శివాజీ శ్రీశైలస్వామిని దర్శించియుండుట సత్యము. భవానీదేవి ఖడ్గము

ప్రసాదించెనని, చెప్పుగాథల కాధారములేదు. భ్రమరాంబ ఆలయములో నొక తెరమీద భవానీదేవి శివాజీకి ఖడ్గము ప్రసాదించుచున్నట్లుగా బొమ్మగీయ బడినది. (N. Gopalakrishna — Kurnool Dt. Manual — "He proceeded to the holy shrine at Srisailam. Here he was absorbed or pretended to be absorbed in his religios devotions to the Goddess 'Amba, and at times, has so frenzied that it was found necessary to guard him for ten days When he recovered, he proceeded to join the army at Anantapur." శ్రీశైలయాత్ర పూర్తి అయిన తర్వాత పిడుగువలె 'జింజి' మీదపడెనని, మొదటి దండయాత్రలోనే దానిని పట్టుకొనెనని కొందరు వ్రాసిరి. ("He paid a visit to Srisailam and fell on Gingi like a thunderbolt, captured it at the first assault")

కింకైడ్ అను విద్వాంసుడు, శివాజీ బ్రాహ్మణ మంత్రియగు హనుమంతుతో గోల్కొండ ఏగెనని తిరిగి వచ్చునపుడు ఆ మంత్రితోను మరికొందరు అశ్వికులతో గలసి శ్రీశైలమేగిరని అచట 10 దినములుండిరని, ఒకనాడు ఒరనుండి ఖడ్గము దూసి ఆత్మహత్య చేసికొన సంకల్పించి తత్ప్రయత్నములో నుండగా హనుమంతే వారించెనని వ్రాసెను. "నన్నిచట బ్రతుక నివ్వనిచో నన్ను చావనిండని చెప్పెను. హనుమంతె చేతులు బట్టుకొని బ్రతిమాలి, తాను వదలిపెట్టుచున్న రాజ్యమును, నాయకుడు లేని సైన్యము నెట్లు వదలుచున్నది. ఆయన ఆరంభించిన కార్యము నెట్లు సంపూర్తికాకుండ వదలుచున్నది — ఆయనకు జ్ఞప్తికి తేగా శివాజీదీర్ఘ నిట్టూర్పులు విడిచి. కొంతకాలము నిశ్చల చిత్తుడై కూర్చుండి, ఒరలో ఖడ్గమును బెట్టుకొనెను. ఆనాడే దేవాలయమును వీడి ప్రయాణోన్ముఖు డాయెను. వెళ్లబోవు ముందు విశేష ద్రవ్యసంచయముల స్వామివారికైంకర్యములకు: పూజారులకువదలి పోయెను." బహుశః ఈ ద్రవ్యముతోనే శివాజీ గోపురము కట్టించబడెనని తోచు చున్నది. (D Kincaid - The grand Rebel - "For ten days, he remained in the temple fasting and in constant prayer. Sivajee Said "But I am only happy here and drawing his sword, he added, "If I cannot live on here, at least let me die here," He tried to fall on the sword. Hanumanth caught him by the arm, begging him to remember the Kingdom he was deserting the soldiers he was leaving leaderless, the task begun and unfinished Sivajee sighed heavily, stood motionless a moment and then sheathed his sword He left the temple the same day, but before leaving bestowed on the priests great treasures for the

cult of the God in memory of his ten days' happiness in the shrine – He rejoined the army at Anantapur '") ఈ ప్రకారము 12 దినములు సమర్థ రామదాసు శిష్యుడైన శివాజీ మల్లికార్జునస్వామి సేవాతత్పరుడై శ్రీశైలక్షేత్రములో గడపెను. ఈయన మకాము చేసిన గృహమును దేవస్థానము వారు బాగుచేయించవలెను.

## 21. ధవళేశ్వరపు మార్కండేయ ప్రభువు

(17 వ శతాబ్దము)

ఈయన గుంటూరు మండలములోని 'పెందోట ప్రభువు. ఇది నాగార్జున కొండకు తూర్పున ఎనిమిదిమైళ్ల దూరముననున్నది. ఈయన మహమ్మద్ ఖులికుతుబ్ శాహి (క్రీ. శ. 1580–1612) అను గోల్కొండ ప్రభువు కాలమున నున్నట్లు కాన్పించుచున్నది. విశ్వబ్రాహ్మణ వంశీయుడగు మార్కండేయ ప్రభువు ఆస్థానమున 'తుర్కా రాజకవి; అయ్యంకి బాలసరస్వతి' అను కవీంద్రులుండిరి. వీరు స్కాందపురాణములోని 'నాగర ఖండమును' తెలుగున ననువాదము చేసి తమ ప్రభువు కంకిత మొనర్చిరి. శా. శా. 1508 (క్రీ. శ. 1586) వ సంవత్సరమున ధవళేశ్వరపు మార్కండేయ ప్రభువు పెందోటలో బాలించు చుండెనని నాగర ఖండము తెల్పుచున్నది. ఈయన శివభక్తుడు. ఊరూర కూపములు, తటాకములు మఠాగారములు; నిరతాన్న సత్రముల నీయన స్థాపించెను. ఈయన శ్రీశైలములో 11 లింగముల స్థాపించి, 11 దేవాలయముల గట్టించినట్లు 'నాగరఖండములో' నున్నది.

కం॥ విశదముగ నిలిపె నేకా
దశ మార్కొండయ్య లింగ ధామములు నిరం
కుశవృత్తిన్ శ్రీ గిరి నా
శశి తారార్కముగ వీరశైవాగ్రణియై.

ఈయన శ్రీశైలములో నెన్నాళ్లుండెనో, దేవాలయాది ప్రతిష్ఠలు చేయుట కెంత కాలము పట్టెనో; ఎపుడు బయలుదేరి వెళ్లెనో, ఎపుడు తిరిగి వచ్చెనో, తెలిసి కొనుటకు ఆకాలమున దినచర్యలభ్యము కాలేదు.

## 22. సర్పభూషణ శివయోగి

(క్రీ. శ. 1795)

ఈయన 'కైవల్య కల్పవల్లరి' అను గ్రంథమును రచించెను. ఈయన శ్రీశైలయాత్రచేసెను. ఈయన ఆత్మకూరు, నాగలూటి, మార్గమున శ్రీశైలమును జేరెను. కోటను, భ్రమరాంబా, మల్లికార్జునాలయములగాంచి అచటనుండి పాతాళ గంగలో స్నానమాచరించి, శిఖరేశ్వరముపైకి మల్లికార్జున లింగమును ప్రత్యక్షము జేసికొనెను. శిఖరేశ్వరము, హాటకేశ్వరముల జూచి త్రోవలో అడవియందున్న పోతులు, పులులు, పాములగాంచి, కదళీవనమునకుబోయి, అచటనున్న సప్తవర్ణ లింగమును జూచెను ఇచ్చోటనే అక్కమహాదేవి తపంబాచరించి సిద్ధిపొందెను. తరువాత చంద్రగుప్తుని కోటనుజూచి, హాటకేశ్వరమునకు, పాలధార, పంచధారలకు జనెను. తర్వాత శ్రీశైలస్వామి గర్భగుడిలో ప్రవేశించెను. ఈ ప్రకారము సర్పభూషణ శివయోగి శ్రీశైల యాత్రనుజేసి సమస్త ప్రదేశముల పై గ్రంథములో వర్ణించెను.

## 23. వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు

(క్రీ. శ. 1761–1816)

వేంకటాద్రి నాయుడు గుంటూరు జిల్లాలోని చింతపల్లి జమీందారు. అంతిమ దశలో 'అమరావతి' లో గడపెను. ఈయన ఇద్దరు భార్యల జేసికొన్నను సంతానము లేకుండెను. చివరి దశలో నాయుడు తీర్థయాత్రలు చేయ సంకల్పించి పరివారముతో బయలుదేరి భారతావనిలోని సమస్త తీర్థముల సేవించెను. వెళ్లిన చోట్లనెల్ల అన్నసత్రముల స్థాపించెనని తెలియు చున్నది. 'కొప్పరాజు సుబ్బరాయ కవి' 'కాంచీ మాహాత్మ్యము'లో నాయని యాత్రల గూర్చి యిట్లు వ్రాసెను.

సీ॥ సేతుకాశీమధ్య సీమాంతరస్థిత
గురుతర శ్రీరంగ కుంభకోణ
పాశనాశర జంబుకేశ చిదంబర
కాంచీ మహాపురీ కాళహస్తి

శేషావనీధర శ్రీగిరి శ్రీజగ
న్నాథాది దేవతాస్థలుల కరిగి
యచ్చోట దనపేర హరిహరమూర్తుల
నిలిపి ముంచట హేమనిర్మితంబు

గీ॥ లైన కీర్తి ధ్వజంబుల నద్భుతముగ
స్థాపనముచేసి తన కీర్తి దశదిశావ
కాశముల నెల్ల నిండించె వాసిరెడ్డి
వేంకటాద్రీంద్రు డసదృశ విభవు డగుచు

నాయని కమాత్య శేఖరుడగు 'పొత్తూరి కాళిదాసు' కూడ నాయనితోబాటు తీర్థ యాత్రలు చేసినట్లు పాపయారాధ్యులవారి సరస హృదయాను రంజనము తెల్పుచునది.

సీ॥ అతిథి శతంబుతో నాప్తవర్గంబుతో
గజఘోటి కాందోళికములతోడ
శ్రీశైల కాళహస్తి చిదంబరాది ది
వ్యక్షేత్రయాత్ర లొప్పరయ జేసి.

అని ఉండుటచేత నాయడు, మంత్రికాళిదాసు, భటవర్గముకలసి అన్ని యాత్రలతో బాటు శ్రీశైలయాత్ర చేసినట్లు కాన్పించుచున్నది. కొన్నియాత్రలు క్రీ. శ. 1802 లోను, కొన్నియాత్రలు క్రీ. శ. 1812–13 లో జరిగినట్లు కాన్పించుచున్నది. కవుల పద్యముల వలనగాక యితర విధముల ఈ యాత్రల వివరములు తెలియకున్నవి.

## 24. ఏనుగుల వీరాస్వామయ్య

(19 వ శతాబ్దము)

వీరాస్వామయ్య మదరాసులోని సుప్రీమ్ కోర్టులో 'ఇంటర్ ప్రిటర్' గా పనిచేసి పేరు ప్రఖ్యాతి సంపాదించెను. ఈయన సకుటుంబముగాను, సపరివారముగాను క్రీ. శ. 1830 మేనెల 18 వ తేదీ కుజవారము రాత్రి 9 గంటలకు చెన్నపట్టణమునుండి కాశీయాత్ర చేయుటకు బయలు దేరెను. మధ్యలో ననేక ప్రదేశముల జూచి జూన్ నెల 16 వ తేదీకి శ్రీశైలము చేరిరి.

"16 వ తేదీ అక్కడికి 5 కోసుల దూరములో నుండే శ్రీశైలము 12 గంట లకు చేరడ మయినది. పెద్ద చెరువు విడిచి వెంబడిగానే కొండ యెక్కను ఆరంభించ వలసినది. ఒక కోసెడు దూరము యెక్కడు, దిగుడుగా నుంచున్నది. అయితే మెట్లవైపు (వీలు)గా కట్టియున్నవి. నిండా ప్రయాసకాదు. ఇరుపక్కలా అడివి. అటుపిమ్మట కోసెడు దూరము సమభూమి. అందులో పోయేదారి రాతిగొట్టుగా నుంచున్నది. అటుపిమ్మట భీముని కొల్లమనే అగాధమైన కొండ పల్లము వరకు కొండ యెక్కడు దిగుడుగా నుంచున్నది. అక్కడ మెట్లు ఏర్పరచి కట్టియున్నవి. ఆ యగాధమైన కొండ దొనలో నొక వాగు పారుచున్నది. అక్కడ ఆసోదా చేసుకొని కొండయేటు తిరుగుళ్ళు, రెండుపేల మెట్లు పర్యంతము, మిక్కిలి పొడుగుగా నెక్కవలసినది. ఆ ప్రదేశములో నెక్కేటప్పుడు, దిగేటప్పుడున్ను వాడికె లేనివారికి చుట్టూ చూస్తే కండ్లు తిరుగును. మెట్లు బాగుగా నెక్కవలసినంత దూరము కట్టియున్నవి. చుట్టు ఏ తట్టు చూచినా పర్వతములున్నవి.

ఈ ప్రకారము రెండుకోసులు ఎక్కిన వెనుక సమభూమిలో రాతిగొట్టు గల మార్గము శ్రీశైల పర్యంతము పోవుచున్నది. ఆ కొండ యెక్కడుకు, దిగుడుకు తిరుపతి బోయీలు డోలీకి 6 మంది అయినట్టయితే అనాయాసముగా నెక్కిపోదురు. అంతదూరము ఎక్కడు దిగుళ్ళలో తిరుపతి గాలిగోపుర పర్యంతము ఎక్కవలసి నంత ప్రయాస యెక్కడనున్ను లేదు. నా తోడవచ్చిన పుప్పాడా బోయీలు 8 మందిన్ని నా డోలీని అనాయాసముగానే మోసినారు. అయితే నాగులోటి దాటగానే కొండ యెక్కడము, పిమ్మట కొండయెక్కవలసిన దానికంటే రవంత ప్రయాస యెక్కవ గనుక, అక్కడ ప్రథమ మందే యీలాగున నున్నదే, యిక నేలాగున నుండునో యని అధైర్యము తోచుచున్నది. అవతలసాగి పోగా సుళు వనిపించుచున్నది. గాని వేరుగాదు. ఆకొండ యెక్కడు, దిగుడులలో ఆత్మకూరి బోయీలకు పుప్పాడ బోయీలు తీసిపోలేదు. ఆ యాత్మకూరి బోయీలకు సంవత్సర మునకు నొకసారి పనిపడుచున్నది గాని నిండా పనిలేదు గనుకనెక్కడము, దిగడము లలో తిరుపతి బోయీలవలెనే ఆ బోయీలు వాడికెపడిన వారుకారు. నేను చేయించిన డోలీకి బంగాళాపాలకీవలెనే రెండుం ముక్కాలడుగుపెడల్పు పెట్టించినాను. అది శ్రీశైలమునకు సాధారణముగా సాగిపోయినది. కందనూరు నవాబు వగయిరాలు పల్లకీల మీదనే శ్రీశైలమునకు వెళ్ళియున్నారు. సంపన్నులయినందున దోవలోని చెట్ల కొమ్మల కొట్టడమునకు ముందుగా మనుష్యులను జాగ్రత్తపెట్టి యుండవచ్చును.

17 వ తేదీ పగలు 3 గంటలకు శ్రీశైలముయొక్క గుడి కల్యాణ మంటపములోనుంటిని. అక్కడ ముందు గుడికిచుట్టును గొప్ప పట్టణ ముండెను. వేశ్యా స్త్రీల యిండ్లుమట్టుకు 360 ఉండినవి ఆ పట్టణ మంతయు ఇప్పుడు పాడుబడిపోయెను. ఇంటింటనున్న బావులు శిథిలములయినవి. గోడలుగూడా యిప్పుడు తెలియుచున్నవి. 5000 (600?) ఏండ్లనాడు అనవేమారెడ్డికి భగవంతుని కటాక్షము చేత బంగారనుములు పండినవి వాడుక కలిగియున్నది అతడు స్వామిగర్భ గృహమునకున్ను, ముఖమంటపమునకున్ను, వయి నందులకున్ను, ధ్వజస్తంభములకున్ను విమానమునకున్ను బంగారు మొలాము చేసిన రాగితగుళ్ళు కొట్టించినాడు అవి యిప్పుడు నిండా శిథిలములుగా నున్నవి. గుడికి రెండు ప్రాకారములు కలిగి యున్నవి. బయటి ప్రాకారపు గోడలమీద నాలుగు ప్రక్కల శిలలు సుందరములయిన ప్రతిమలుగా చెక్కియున్నవి. వాటిని శిల్పి బహుబాగా చేసినాడు. అయితే రాళ్ళను వయిపుగా సంతన చేసినవాడుకాడు. ప్రాకారముమీద ప్రతికోట కొమ్మకు నొక్కొక్క ప్రతిమ చెక్కియున్నది. గుడిలోపల రెండో ప్రాకారము బొత్తిగా శిథిల మయియున్నది. మంటపములు అరీతిగానేయున్నవి, అర్చకులకు మనసు వచ్చినప్పుడు దీపారాధన, నైవేద్యములు స్వామికి చేయబడుచున్నవి. గాని నిత్య నియమములేదు. బ్రాహ్మణులు స్వేచ్ఛగా లింగమును తాకి అభిషేక నివేదనలు చేయవచ్చును. భ్రమరాంబా దేవికి మాత్రము మిరాశీ అర్చకుల తరఫున నొకడు నియమముగా గుడిలో కాపుర ముండి అర్చన చేయుచున్నాడు ఆలాగు అర్చనచేసే గుమస్తా సంవత్సరము ప్రాణముతో నుండుట దుస్తరము. అందుకు కారణము రోగప్రదేశమేనో, వానిభక్తి తక్కువేనో తెలిసినది కాదు. ఇప్పుడు 5 సంవత్సరములుగా రాజశ్రీభొట్లు అనేబ్రాహ్మణుడు 50 ఏండ్లవాడు ప్రాణముతో నక్కడ నిలచియున్నాడు. అది ఆశ్చర్యముగానున్నది. అతడు ఏకాకి. ఆగుడి లింగము భూమికి జానెడు పొడుగుగా నున్నది. విమానమునకు 5 శిఖరములు. అవి నాలుగు పక్కల శిథిలము లయియున్నవి. నడుమ నున్న గొప్ప శిఖరము దర్శనమునకు నుపయోగింపుచున్నది. ఆత్మకూరి దారినివస్తే గుడిలో ప్రవేశించేవరకు శిఖరదర్శనము కానేరదు. నెల్లూరు కంభము మార్గములవస్తే గుడికి మూడు కోసుల దూరములో శిఖరేశ్వర మనేపేరు కలిగినయున్న యున్నత ప్రదేశమునను శిఖరము తెలియుచున్నది. ఆగుడివద్ద వశింపుచున్న చెంచువాండ్లు ఆత్మకూరి వారివలెనే మిక్కిలి కొప్పునవారు. భ్రమరాంబ గుడికిన్ని, మల్లికార్జునస్వామి గుడికిన్ని నడుమనుండే కొండెపు మిట్ట మీద వారి గుడిసెలున్నవి. దేవీ బింబము సుందరముగా, కొంచపాటిదిగా,

కూర్చున్న అవసరముగా నున్నది. గర్భగృహాపు గడపమీద శ్రీచక్రస్థాపన చేసి యున్నది. గుడిలో 11 తీర్థములున్నవి. ప్రతి తీర్థమందున్ను కొండపూట స్రవించి తీర్థములకు అంతర్ వాహినిగా పారివచ్చి అవతల సాగిపోవుచున్నది.

ప్రతి తీర్థమునకున్ను సూర్యరశ్మి పడకుండా పైన మంటపాలు కట్టియున్నవి. ఏ తీర్థమున్ను మోకాటిలోతుకు నెక్కువ లేదు. రోగకారి యని అక్కడివారు చెప్పినారు. ఉదకము నిర్మలముగానున్ను, శీతలముగా నున్నది. ఆ గుడిహాశ్శీలు మూలకముగా సంవత్సరము రు. 1కి 18000 లు కందనూరు నవాబుకు వచ్చినా, గుడి యేగతి పొందేదిన్ని విచారింపడు. ఎవరయినా మరమ్మతు చేసినట్టయితే నెలవంత హాశ్శీలు తీసుకొనుచున్నాడు. రాజా చందులాలా ఈ నిర్బంధముచేత కొంత మరమ్మతు చేసి విసికి విడిచి పెట్టినాడు. అతను అగ్గురు బ్రాహ్మణులను నెల 1 కి 6 రూపాయీలు జీవితము చేసి నిత్యము స్వామికి అభిషేకము చేసేటట్టు వుంచినాడు. మహిషాసుర మర్దనము మహిసూరి దేశములో చేసినందున ఆ దేశము నకు మహిసూరనే పేరువచ్చినది యనుచున్నారు. అక్కడ మహిషాసుర మర్దన మయిన వెనుక భ్రమరాంబ శ్రీశైలము ప్రవేశించినది. మహిసూరు తద్వారా ఆమె పుట్టిన దేశమని ఆ దేశస్థులు ఎవరు వచ్చినా హాశ్శీలు యియ్య నక్కరలేదు. జంగాలకు, ఆరాధ్యులకు, బ్రాహ్మణులకున్ను ఉత్సవ కాలములో హాశ్శీలు లేదు.

గుడిలో నే పక్క చూచినా అడివి మొలిచి సర్పవ్యాఘ్ర భూయిష్ఠముగా నున్నది. ఆ యడవి కొట్టి చక్కచేసే దిక్కులేదు. స్వామికిన్ని, దేవికిన్ని ఎవరయినా ఆభరణాలు, వస్త్రాలు సమర్పించితేని వాటి మదింపంతమాకలు హాశ్శీలు పుచ్చుకోవడము మాత్రమే కాకుండా కొన్నిదినములుపోనిచ్చి ఆ వస్తువులనే ఆ కందనూరి నవాబు అపహరింపుచున్నాడు. తిరుపతి విషయముగా కుంపిణీవారిని 'అహో గుణవతీ భార్యా ఖాండామూల్యం నయాచతే" అనే శ్లోకసంగతి ప్రకారము ఆ స్థలవర్తమానము తెలిసినవారు కొనియాడ వలసియున్నది. కలి సామ్రాజ్యము గనుక లోకకర్మసాక్షిగా నుండే ఈశ్వరుడు లోకులకు కర్మ ఫలప్రదానము చేయుట కంటె ఎక్కువ యేమి చేయగలడు. ఇది సర్వజన పూజిత మయిన ప్రసిద్ధికెక్కిన స్థలము. శిఖరదర్శన మాత్రముచేతనే జన్మాదులు లేవని, పురాణాలు మొరపెట్టు చున్నవి. ఈ మహాస్థలము 3 గంటలకు వదిలి 4½ ఘంటకు దిగుడు గనుక త్వరగా భీముని కొల్లము చేరినాను. 6½ ఘంటకు పెద్ద చెరువు చేరినాను."

(ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్రనుండి)

ఇంకను ఈయన శ్రీశైలమును గూర్చి యిట్లు వ్రాసెను.

"ఆ యాత్మకూరిలో శ్రీశైల స్థలమందలి యర్చకులున్ను యాత్రచేయను వచ్చిన వారివద్ద హాశ్శీలు పుచ్చుకొనే నవాబు ముసద్దీలున్ను ఉన్నారు. అక్కడికి శ్రీశైలము నాలుగామడలని చెప్పుచున్నారు. ఆనాలుగామడలదూరములో నడుమ కొన్ని యూళ్ళున్నా పదార్థాలు ఎంతమాత్రమున్నూ దొరకవు గనక నక్కడనుంచి. బయలు వెళ్లినది మొదలు మళ్లీ ఆస్థలము చేరేవరకు కావలసిన సామానులన్ని మరచిపోకుండా తీసుకొని పోవలసినది. మరచిన పదార్థములు తక్కువ పడే యుండును. శ్రీశైల యాత్రకు తీసే హాశ్శీలు కందనూరు నవాబుకు చేరుచున్నది. శివరాత్రి ఉత్సవములో శూద్రజనము 1కి రూ 7, గుర్రానికి రూ 5, అభిషేకమునకు రూ 3, వాహనోత్సవము చేయిస్తే ఉత్సవపు సెలవులు గాక గ 3, దర్పణ సేవోత్స వమునకు రు 3, ఈ ప్రకారముగా పుచ్చుకొనుచున్నారు శివరాత్రి మొదలు చైత్ర మాసమువరకు శ్రీశైలము మీద ప్రతిదినమున్ను పల్లకీ సేవ అనే ఉత్సవము జరుగుచున్నది. చైత్రమాసములో భ్రమరాంబ యనే దేవికి కామనపూజ చేసి శ్రీశైలముమీద వచ్చియుండే జనులు విరామమును పొందుచున్నారు. అటుపిమ్మట నొకరిద్దరు అర్చకులు మాత్రము మార్చి మార్చి ఆ యాత్మకూరునుండి వచ్చియుంటున్నారు. ఎక్కువ దినములుంటే అక్కడి నీళ్ళు వంటక జ్వరము, మహోదరము, శోభ మొదలయిన రోగములు కలుగుచున్నవి. శ్రీశైలమున గుడికి సమీపముగా 20 చెంచు గుడిసలున్నవి. గుడివద్దస్వామికి ఆవులు 100 దనుక నున్నవి. కడవ విడిచిన వెనుక ఆవుపాలు, పెరుగున్ను కండ్ల చూడవలె నంటే శ్రీశైలముమీద చూడవలసినది గాని యితర స్థలములలో అవులను మాత్రము కండ్ల చూడవచ్చును. ఈయాత్మకూరి నుంచి పట్టణపు సవారీల మీద కష్టముగా శ్రీశైల పర్వతమునకుపోయి చేరవచ్చును. మృగభయమున్ను, చెంచువాండ్ల భయమున్ను విస్తరించి యుండును. ఆ చెంచువాండ్లు అడవి మనుష్యులైనను యాత్రకు వచ్చేవారిని యాచించి తినేవాడిక పడియున్నారు."

ఈ విధముగా వీరాస్వామయ్య, ఆయాచోట్ల కేగి అచటి జనుల వృత్తుల, ఆచారముల వర్ణించెను. దాదాపు 140 ఏండ్లనాడు వర్ణించిన సాంఘిక, ఆర్థిక విషయములు, శ్రీశైలము మీదగల వేశ్యల యిండ్ల విషయము ఇందున్నది.

# 25. విదేశ విద్వాంసులు

ఒకప్పుడు అత్యంత వైభవముతో నున్నట్టి, అచటి శిథిలమైన గోడలు, చెరువులు, దేవాలయములను జూచి క్రీ. శ. 1794 లో కలనల్ కాలిన్ మెకంజీ శ్రీశైలమును గూర్చి ఒక వ్యాసము వ్రాసెను. ఈవ్యాసము క్రీ. శ. 1798 నాటి 'బెంగాలులోని ఆసియాఖండ పరిశోధనలు' అను పరిశోధన సంచికలో ప్రకటిత మైనది. "ఈఆలయ ప్రాకారము 660 అడుగుల పొడవు 510 అడుగుల వెడల్పు గల్గియున్నదని, గోడలు 20—26 అడుగుల ఎత్తుగలవని, ఒక్కొక రాయి 6—7 అడుగుల పొడవు 3 అడుగుల ఎత్తు గల్గియున్నదని రాతి చెక్కడము అద్భుతమని, గోడలమీద గజముల, అశ్వముల, వ్యాఘ్రముల, కాల్బలముయొక్క, జోగుల యొక్క, రామాయణ భారతములోని పాత్రలబొమ్మలు, బ్రహ్మ, విష్ణు, శివుల. దిగంబర స్త్రీయొక్క, జపమాలతో గూడిన లింగముయొక్క, బొమ్మలు గలవని మల్లికార్జునస్వామి గోపురము 39 అడుగుల ఎత్తుగలదని, కృష్ణరాయలనాటి అనగా శా. శ. 1435 (క్రీ. శ. 1513) నాటి శాసనము గలదని, అద్భుతమైన శిల్పము గలదని ఈయన వ్రాసెను." ఈ బొమ్మలన్ని సరిగా చిత్రించబడినవని, కొన్ని బొమ్మలు యుద్ధములో పోవునట్లు పరుగెత్తు చుండెనని, కొన్ని బొమ్మలలో రెండు చేతులలో ధనస్సు గలదని, కొన్ని బొమ్మలు గగన వీధిని పరుగెత్తుచున్నట్లు కాన్పించు చున్నవని, అదేసమయములో విల్లును లాగుచుండెనని ఈయన వర్ణించెను. ("All these figures are accurately designed It is remarkable that several figures are represented galloping off as in fight, Figures seem to have entirely dropped the bridle, both hands being occupied by the bow, some of them are seen advancing at full speed and drawing the bow at the same time.") ఇచటి శిల్పము పల్లవ శిల్పమునుబోలి యున్నది. ఈ అద్భుత శిల్పకళను గాంచి పాశ్చాత్యులు శ్లాఘించిరి.

19 వ శతాబ్దిలో వచ్చిన 'ఇమ్పీరియల్ గెజటీర్' అను గ్రంథములో (90—91) పురావస్తు శాస్త్రరీత్యా పరిశీలించిన, చారిత్రకముగా జూచిన ఈ ఆలయము చాల ముఖ్యమైనది అని ప్రశంసించెను.

'అలెగ్జాండర్‌రీ' అనువాడు. క్రీ. శ. 1891 లో "List of ancient monuments in Madras" అను గ్రంథమును వ్రాయుచు ఈ ఆలయమును జూచి దీనికి తగినంత మూల ధనమున్నదని లిఖించెను.

19 వ శతాబ్దములో డాక్టరు బర్గెస్ ఈ ఆలయమునుజూచి, ఇది చాల పురాతన కాలము నాటిదని, చారిత్రక అభిరుచిని గల్గించునట్టిదని, లిఖించుచు, ఈ ఆలయమును గూర్చి సరిగా తెలియకున్నదని లిఖించెను. 19 వ శతాబ్దములో 'కలనల్ లాంబ్‌టన్, వాయసీయి,' అనువారు ఈ పర్వతము ఎత్తు 1563 అడుగు లని, ప్రజలచటకు ఆటవిక సంపద కొరకు, వనమూలికల కొరకు పోవుచుందురని వ్రాసిరి. కెప్టెన్ న్యూబోల్డు అనువాడు కూడ శ్రీగిరిని, అచటి అడవులను, తోటలనుగాంచి ఆశ్చర్యచకితు డాయెను.

క్రీ. శ. 1867 లో శ్రీగిరి అరణ్యముల మీద వ్యాఘ్రములున్నవని విని, వేటయందారితేరిన పాశ్చాత్యులు వచ్చి 67 పులులను గాల్చిపైచిరి. ఇచట పెద్ద పులులే కాకుండా, మర్కటములు, భల్లూకములు, తోడేళ్లు, గుండసర్కలు, పునుగులు గలవని పాశ్చాత్య లేఖకులు వ్రాసిరి. క్రీ. శ. 1855 లో 'కెప్టెన్ నెల్సన్' అనువాడు శ్రీ పర్వత ప్రదేశమును తిరిగి అనేక విషయముల లిఖించెను. ఇచ్చట లక్క, తేనె, చింతపండు, వెదురు బియ్యము, జిగురులు, చిరిసెన, సీకాయ, చంద్ర, మోదుగ, ఇప్ప, అడవిఇప్ప, ఇంకను ఇతర విభిన్నమైన 106 మూలికలు గలవని ఇచట పర్యటించిన లేఖకులు వ్రాసిరి. 'సంజీవినిలతి' అని పేర్గాంచిన అడవి శనగ లేక 'దీర్ఘ జీవికా' యిచట గలదు. పరుసవేది యను హేమము చేయు క్రియ యిందే ఉన్నది. ఈ కారణముచేత ఈ పర్వతము పూజ్య నీయమై యున్నది.

## 26. శ్రీశైలమును దర్శించిన ముఖ్య శైవభక్తులు

### (క్రీ. శ. 12—13 శతాబ్దములు)

శైవభక్తుడు 'కెరయ పద్మరసు' క్రీ. శ. 1170 నాటివాడు: 'దీక్షాశైవ దీక్షాబోధ' అను గ్రంథమును కన్నడమున రచించెను. 'పిడుపర్తి బసవకవి' తమ్ముని కుమారుడు 'బసవకవి' పై గ్రంథమును ద్విపద కావ్యముగా ననువ దించెను.

మల్లరసు కుమారుడగు సకలేశ మాదిరాజయ్య (క్రీ. శ. 1150) కాల్యాణ కటకమేగి అచట బసవేశ్వరుని గలసికొని, ఆయన కల్యాణ కటకమును శపించి

వచ్చునపు డాయనతోబాటుండి, బసవేశ్వరుడు చనిపోయిన తర్వాత శ్రీపర్వతమేగి అచటనే జీవిత శేషమును గడపి, అచ్చట మరణించెను. కన్నడములో నీయన కొన్నికృతులు రచించెను.

ఘంటా కర్ణుడు—ఘంటాకర్ణ శివాచార్యులను పేరుగలదు. ఈయన నివాస స్థలము శ్రీశైలము. ఈయన వ్యాసునికి గురువని కొందరు పల్కుదురు. క్రీ. పూ. 1000 ఏండ్ల క్రితమున్న వేదవ్యాసునికి, ఈయనకుగల సంబంధము విశదపడకున్నది.

బోరండ్ల సూరసానమ్మ—కర్ణాటకమునుండి వేమనారాధ్యునితో గలసి బయలు దేరి, పండితారాధ్యుని ఆంధ్రదేశములో గలసికొని, బసవేశ్వరుని మహాత్మ్యలజెప్పిరి. పండితారాధ్యులు బసవేశ్వరుని జూడ కోరిక గలదని చెప్పి, తర్వాత బయలుదేరెను.

తెలిదేవి వేమనారాధ్యుడు — జంగము. బసవేశ్వరుని శిష్యుడు.

ధవళేశు నామయ్య — పానుగంటి ఉదయామనీశుని కొల్వులోనివాడు.

వెల్లగొండ మహాదేవయ్య — పర శైవ భక్తుడు.

అక్కమహాదేవి — ఈమె చరిత్రను బాలపాపాంబ రచించెను. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకాలయములో నొక ప్రతి గలదు, (10 నెం.) ఈదేవి గొప్ప భక్తురాలు. శ్రీశైలములో కదళీ వనములో తపంబాచరించెను. మల్లికార్జునుని నిచ్చలు పూజించి శ్రీశైలములోనే తనువును బాసెను. రససిద్ధిద్వారా దేహసిద్ధి పొందెను. కల్యాణి నగరములోని 'అనుభవ మంటపము'లో నీమెభక్తచర్చలలో బాల్గొనుచుండెను. బసవేశ్వరుని శిష్యురాలు. 'మధువయ్య' అను బ్రాహ్మణుని కూతురును, 'హరళయ్య' అను అస్పృశ్యుని కుమారుని కిప్పించి, కులభేదముల నిర్మూలించుటకు ప్రయత్నించినముగువ. బసవేశ్వరుని భావములు — సమానత్వము, సోదరభావము అనునవి ఈమెలో గూడ గలవు. చంద్రమతీ దేవివలె బ్రహ్మ చారిణి. దిగంబరి. తన యోనిని కేశపాశములచే కప్పుకొని అల్లమప్రభు చెంతకరిగెను. అట్లు చేసితివేల యని ఆయన అడుగగా, తనగౌరవముగాదని, మానవుల కొరకని ఆమె జవాబు చెప్పెను. ఆంధ్రదేశములో వేమన, కూసలమ్మ లీమెవలెనే సంచరించిరి. స్వానుభవములను వచనములుగా వ్రాసినది. 'శ్రీచెన్న మల్లికార్జున దేవ నాస్తిని ఎవరికి తెలియరాదు గదా!' అన్నదామె. జన్మమరణ రాహిత్య స్థానమును పొందవలెనని ఆమె యోగాభ్యాసము చేసికొని మోక్షము పొందినది.

సిద్ధరామ శివయోగి—బసవనిసమకాలీనుడు (1132—1168) రేవణసిద్ధుడు—వీరశైవ జగద్గురు పంచాచార్యులలో నొకడు.

అల్లమప్రభువు — శివభక్తుడు. శ్రీశైలములో నీయన తపంబాచరించెను. అక్కమహాదేవి ఈయన చెంతకు దిగంబర వేషముతో నేగెనని ఆమె చరిత్ర తెల్పును. కన్నడములో ఈయన తత్వములు రచించెను.

హేమారెడ్డి మల్లమ్మ — ఈమె శ్రీశైలములో దపంబాచరించెను. శివభక్తి పరురాలు. మొదట తండ్రి, హేమారెడ్డి కుమారుడు పరమారెడ్డి కిచ్చిరి. అత్త వారింట నుండగా కొన్ని తగాదాలురాగా, ఆమె ఊరూరు తిరుగుచు శివతత్వమును బోధించెను.

ఆదయ్య—శివభక్తుడు. శ్రీశైలములో కాలము గడపినట్లు కాన్పించుచున్నది.

పొన్నలాపురంసిద్ధ రామేశ్వరుడు — ఈయన తపసుచేసినచోటు సిద్ధ రామేశ్వరుని కొలను అను పేర బరగుచున్నది. ఇది శ్రీశైలములో నున్నది. కన్నడములో నీయన 'తత్వములు' రచించెను. ఈయన బాలశివయోగి. ఆలయమునకు ఆగ్నేయమున రెండు ఫర్లాంగుల దూరములో నీయన తపసు చేసినగుహ గలదు. ముక్తాయక్క, కదిరె రెమ్మవ్వ, నీలాంబిక, గంగాంబిక మున్నగు అనేకమంది స్త్రీలు ఆ కాలమున ధర్మచర్చలలో బాల్గొనిరి. పై వారెల్లరు శ్రీశైల యాత్ర చేసి యుండిరి. రేణుకాది పంచాచార్యులు, గోరక్షుడు మున్నగు నవనాథు లిచట తపసు చేసి సిద్ధి పొందిరని తెలియుచున్నది.

## 27. శ్రీశైలమునకు పూర్వకాలపు బాటలు-నవీన మార్గము

క్రీ. శ. 6వ శతాబ్దము నుండి యాత్రికులు శ్రీశైలస్వామిని దర్శించుట కేగుచుండిరి. కాని ఈ నాటి బస్ సౌకర్యము లాకాలమున లేవు. నాల్గు దిక్కుల నుండి వచ్చుటకు మూడు మార్గములుండెను. 1 తూర్పున గుంటూరు ప్రాంతము నుండి వచ్చువారు, ధూమశకటములో బయనించి, మార్కాపురం రోడ్డు స్టేషనులో దిగుచుండిరి. అటనుండి తోకపల్లి మీదుగా దోరణాలవరకు 28 మైళ్ళు బస్సులో పయనించెదరు. దోరణాలనుండి చెంచులగ్రామమగు 'చింతల' అను ఊరి వరకు 10 మైళ్లు ఎడ్ల బండ్లపై పోవుచుండిరి. ఇది అడవి బాట. చింతలనుండి స్వామి

ఆలయము 22 మైళ్ల దూరముననున్నది. చింతలకు 6 మైళ్ళదూరములో 'పెద్దారుట్ల' గలదు. తరువాత హాటకేశ్వరము, శిఖరేశ్వరములు తగులును. తరువాత ఆలయము వచ్చును. కొందరునడచి, కొందరు డోలీలపైన, కొందరు గుర్రములపై పోవుచుండిరి. ఛత్రపతి శివాజీ, బ్రహ్మనాయుడు, వీరి సైనికులు గుర్రములపై స్వారీచేయుచు ఆలయమును జేరి స్వామిపూజను జేసిరి. వినుకొండ ప్రాంతీయులు కూడ ఎద్దులబండ్లమీద త్రిపురాంతకము, ఎర్రగొండ పాళెము మీదుగా తెలుగురాయని చెరువువరకు జేరి, అటనుండి కాల్నడకను చుక్కలపర్వతము మీదుగా చినారుట్ల, పెదారుట్లచేరి పైమార్గముగుండ స్వామి ఆలయముకు జేరుచుండిరి.

2. ఉత్తరమునుండి వచ్చువారు అనగా హైదరాబాదు ప్రాంతపువారు నాగరకర్నూలు, అమ్రాబాదు, తెలకపల్లి, పటర్లపల్లి మీదుగా కాలినడకను పయనించి, కృష్ణానదినిదాటి శ్రీశైలము చేరుచుండిరి. ఈనాడు హైదరాబాదునుండి 'అచ్చంపేట, మన్ననూరు' మీదుగా చంద్రగుప్త పట్టణమువరకు బస్సుప్రయాణముచేసి, అటనుండి 3 మైళ్ళు నీలగంగవరకు నడచి శ్రీశైలమును జేరుచున్నారు.

3. దక్షిణము, పశ్చిమములనుండి వచ్చువారు అనగా నంద్యాల, కర్నూలు. మున్నగు ప్రదేశములనుండి వచ్చువారు ఆత్మకూరువరకు బస్సులో పయనించి. అక్కడనుండి 'నాగలూటి' మీదుగా పెద్దచెరువువరకు బండ్లపైన పయనించెదరు ఇచటనుండి శ్రీశైలము 10 మైళ్ళు మాత్రమే. ఇచటనుండి కాల్నడకను లేదా డోలీల మీదుగా భీమునికొలను, కైలాసద్వారము దాటి శ్రీశైలము జేరుచుండిరి. పై చెరువు క్రింద చెంచులు సాగుచేయుచుండిరి.

ఆలయము చుట్టును భయంకరమైన అడవిగలదు. ఇందులో క్రూరమృగములు, పాములు విపరీతముగానున్నవి. అందుచేత చెంచులు, విల్లసంబుల సాయంబున యాత్రికుల వెంటనడచి, ఆయా మజిలీలలో నాపి స్వామి దర్శనము చేయించుచుండిరి. ఒక్కొక్క యాత్రికుడు 12 పైసలు వంతున చెల్లించవలెను. సంవత్సరమంతయు చెంచువాండ్రు అచటనేయుండి యాత్రికుల గాపాడుచుండిరి. కర్ణాటకులు ఉగాదినాడు; ఆంధ్రులు శివరాత్రినాడు స్వామి, భ్రమరాంబ దర్శనము చేసి కొనుచుందురు. భీమునికొలనునుండి చుక్కల పర్వతము మీదుగా పోవటము చాల కష్టమైన కార్యము. ఎక్కుచు దిగుచు ఎన్నియో శ్రమలకోర్చి యాత్రికులు

పయనించెదరు. చుక్కల పర్వతము ఎగినచోటు ముఖ్యమైనది. త్రిపురాంతకము మీదుగా వచ్చువారుకూడ యిచట గలసి కొందురు. ఉత్సవ సమయములో చలి పందిళ్ళు, అన్నసత్రములు మార్గమధ్యమున నేర్పాటుచేయబడియుండును. శ్రీశైలము సముద్రమట్టమునకు 1500 అడుగులు ఎత్తు ఉన్నను, సాంద్రారణ్యముల పర్వతముల మధ్యఉన్నను, ఈయాత్రచేయుట కైలాసయాత్రవలె ఉండెడిదని యాత్రికులు భావించుచుండిరి. 1957 — నవంబరు 24 వ తేదీన దోరణాలనుండి శ్రీశైలమునకు 32 మైళ్ళ పొడవున నున్న రోడ్డుతెరచి, అప్పటి ఆంధ్ర ప్రభుత్వపు ముఖ్యమంత్రి శ్రీనీలం సంజీవరెడ్డిగారు తీర్థయాత్రికులకు మహోపకార మొనర్చిరి. ఏనుగుల వీరాస్వామి కూడ శ్రీశైలమునకు తోవ మార్గముల వర్ణించెను. ఆయన కాశీయాత్రలో నీ మార్గములు వర్ణించబడినవి.

## 28. శ్రీశైలములోని దృశ్యములు - వాని వివరణ

మల్లికార్జునాలయము — ఇది అడవి మధ్య విశాలమైన సమప్రదేశములో నున్నది. చంద్రవతి ఈ ఆలయము గట్టించెను. చుట్టును బలిష్ఠమైన ప్రాకార మున్నది. ఇది 600 అడుగుల పొడవు, 510 అడుగుల వెడల్పుగల్గి, 20—26 అడుగుల ఎత్తుగల్గి ఉన్నది. గోడరాళ్ళు, 7 అడుగుల పొడవు 3 అడుగులు ఎత్తు గల్గిఉన్నవి. ప్రాకారము ఎనిమిది దిక్కులలోను అష్టభైరవుల విగ్రహములు గలవు. కోటకు 'ఏడుచుట్లకోట' అనిపేరు. ప్రాకారము మీద బొమ్మలు మనోహరమై మధ్యకాలీన శిల్ప సౌందర్యమునకు నిలయమై యున్నవి. తూర్పు ద్వారముపై గల గోపురమును శ్రీకృష్ణరాయలు కట్టించెను. దానికి తూర్పువైపున రథవీథిలో ఇరువైపుల మంటపములను శ్రీకృష్ణరాయలు కట్టించెను. ఉత్తరపువైపున శివాజీ గోపురము గలదు. శివాజీ పూజారుల కిచ్చిన ద్రవ్యముతో దీనిని పూర్తిచేసి శివాజీ గోపురమని పేరిడినట్లు కాన్పించుచున్నది. కాని శివాజీ యితడు ఉన్న 12 దినములలో దీనిని గట్టించలేదు. దక్షిణ ద్వారము మీద రెండవ హరిహరరాయలు ఒక గోపురమును గట్టించెను. పశ్చిమమున నిప్పుడు గోపుర నిర్మాణము జరుగుచున్నది. మల్లికార్జునుని పూజారులు వీరశైవులైన మహేశ్వరులు. సమస్త కులములు, జాతులవారు స్వామిని తాకి నమస్కరించుచున్నారు. లోపల ఏడు కొలనులున్నవి. ఆలయము నానుకొని తూర్పున, ఉత్తర దక్షిణములందు రంగ మంటపములు గలవు. ముఖ

మంటపమునకు ముందువైపున 'వీరమంటపము' గలదు. శైవులు తమ శిరములు, నాలుకలు యిచటనే ఖండించుకొనిరి. వీరమంటపమునకు ముందు 'పెద్ద నంది విగ్రహము' గల, అనేక స్తంభములు గల మంటపము గలదు. దీనికి దగ్గరగా మరియొక మంటపములో 'అక్కమహాదేవి, మల్లమ్మల' రాతి విగ్రహములు గలవు. ఆలయమునకు పడమట వైపున 'శిలాబలి పీఠము' గలదు. దీనికి పడమర వసంత మంటపము గలదు. భ్రమరాంబా, మల్లికార్జునుల విగ్రహముల నిచటికి తీసికొని వత్తురు. ముఖమంటపమునకు తూర్పు వైపున 'సహస్రలింగ దేవాలయము' గలదు. ఈ ఆలయ పూజారులు 'జంగములు' ప్రతినిత్యము తాళ, మృదంగ, భేరి, ఘంటానాదములు వినబడుచుండును. నేను మూడు రాత్రులు ఆలయములోని ఒక మందిరములో శయనించినాను.

2. భ్రమరాంబాదేవి ఆలయము—ఇది చంద్రవతీదేవి అనంతరము నిర్మించ బడినది. గోడలమీద రామాయణ గాథకు సంబంధించిన బొమ్మలు గలవు. గర్భాలయమునకు ముందున ముఖ మంటపము, దానికి నాల్గువైపుల స్తంభము లతో గూడిన వసారా గలదు. ఈ ఆలయ పూజారులు 'బ్రాహ్మణులు'. ఈగుడిలోనే శివాజీకి భవానీదేవి ఖడ్గమిచ్చుచున్నట్లు చూపించు బొమ్మగలదు.

3. ఏనుగుల కొలను — భ్రమరాంబలయమునకు పడమటి వైపున నిది గలదు. లోనికి దిగుటకు మెట్లు గలవు. ఒడ్డున ఒకరాతి మీద పెద్ద శాసనము గలదు. శాసన పరిశోధకులు శ్రీశైలములోని 43 శాసనములను వ్రాసి ముద్రించిరి. (A. R. 1915) ఈ శాసనముమీద అక్షరములు శిథిల మగుటచే వ్రాయబడలేదు

4. భీముని కొలను — ద్వారబాల నుండి శ్రీశైలమునకు పోవు త్రోవలో, 4 మైళ్ళు దిగువ ఒక లోయలో ఈ కొలను గలదు. ఇచట నుండి ఒక సెలయేరు ప్రవహించి పడమట కృష్ణానదిలో గలియుచున్నది. కొలనులోని నీటిమట్టమునుండి కొండపైకి 652 అడుగుల ఎత్తుగలదు. ఈ కొలనుకు దగ్గరగా 'భీమలింగేశ్వర లింగ'మున్నది. దీనికీ పేరు ఏలవచ్చెనో తెలియకున్నది.

5. పాతాళగంగ—సమతలము నుండి 900 మెట్లు దిగవలెను. నీరు నీలముగా నుండుటచేత 'నీలగంగ' యనికూడ పేరుగలదు. ఆలయమునకు రెండు మైళ్ళ దూర ములో నొకలోయలో నిది గలదు. త్రోవలో ననేక మంటపములున్నవి. ఇచట స్నానముచేసి చెంబులతో నీళ్ళు తీసికొని పోయి శ్రీశైలస్వామి కభిషేకము చేయు దురు. దీనికి దగ్గరనే చంద్రగుప్త పట్టణము గలదు. ఇది శిథిలావస్థలోనున్నది.

6. కొండవాగు — ఒక వాగులో కొండమీద నుండి దూకి కొందరు భక్తులు దీనిలోబడి చనిపోవుదురు. అట్లు దూకిన ముక్తి గలుగునని వారి నమ్మకము.

7. శివాజీ గోపురము — ఇది ఉత్తరపు ప్రైపున నున్నది. శివాజీ యిచటి పూజారుల కిచ్చిన ద్రవ్యముతో నీ గోపుర నిర్మాణము జరిగియుండ వచ్చును. ఇది శివాజీ కాలములో గట్టబడిన దనుటకు ఆధారములులేవు.

8. హాటకేశ్వరము — శ్రీశైలమున కాగ్నేయమున ఉన్నది. ఇచట మౌనస్వామి గలడు. ఈయన తపోనిష్ఠా గరిష్టుడు. శ్రీ జగద్గురు వాగీశ పండితా రాధ్య మహాస్వాములవారి శిష్యుడు. ఆత్మసాక్షాత్కారము చేసికొన్న మహనీయుడు. శ్రీశైలమున కేగినవారు ఈయన దర్శనము చేసికొని వచ్చెదరు. ఇచ్చట దేవుని పేరు 'హాటకేశ్వరుడు.'

9. శిఖరేశ్వరాలయము — ఇచట 'వీరశంకరుని' లింగమున్నది. తూర్పు ప్రైపున ఒక చెరువున్నది. పైన రుబ్బుగుండు గలదు. దీనిలో బెల్లము, నువ్వులు పోసి రుబ్బు చుందురు. వంట చేసికొని విశ్రమించుటకొక ఇల్లు ఉన్నది.

10. ముక్తి శిఖరము—శిఖరేశ్వరమునకు ఆగ్నేయమున నిది కలదు. 'విఘ్న హరేశ్వరుడు' అను పేరున విగ్రహము గలదు.

11. బిల్వవనము—ఇచట అనేకములది తపసు చేసిరి. ఈవన మధ్యమున ఆలయములో 'బిల్వేశ్వరుడు' అను పేరుగల లింగము గలదు. జంగము మల్లయ్య ఇచటనే తపసు చేసినట్లు కాన్పించుచున్నది.

12. పాలధార, పంచధార — హాటకేశ్వరమునకు తూర్పున అరణ్యములో నున్నవి. ఈనీరు రుచ్యముగా నుండును. ఈ ప్రాంతముననే శంకరులవారు తపంబాచరించిరని తెలియుచున్నది. సంతతధార కాన్పించును. చివరకివి కృష్ణలో గలియును.

13 సాక్షి గణపతి—ఈ విగ్రహము త్రోవ మార్గమున గలదు. శ్రీశైలమునకు వచ్చు యాత్రికుల కీయన సాక్షి అట.

14. మేడిచెట్టు—వృద్ధ మల్లికార్జునాలయము ప్రక్కన గలదు. ఇది చాల ప్రాచీనమైనది.

15. వృద్ధమల్లికార్జునుడు—చంద్రగుప్తుని కుమార్తె చంద్రావతి పూజించిన దీయననే. మల్లికా గుండమునకు దాపుగా నీ ఆలయము గలదు.

16. కదళీవనము — మల్లికార్జునాలయమునకు 16 మైళ్ళ దూరమున 'కదళీ వనము' కలదు. ఇది చంద్రగుప్తునికి ఉద్యానవనముగా 'నుండెనని చెప్పుదురు. అక్క మహాదేవి మున్నగు వారిచట తపసు చేసినట్లు తెలియుచున్నది.

17. సిద్ధరామేశ్వర కొలను — మల్లికార్జునాలయమునకు ఆగ్నేయ దిశలో రెండు ఫర్లాంగుల దూరమున నిది కలదు. పొన్నలాపురము సిద్ధరామేశ్వరుడీ గుహలో తపసుచేసెను.

18 చంద్రకుండ తీర్థము—శివాజీ గోపురమునకు ఎదురుగా రెండు ఫర్లాంగులు దూరములో నిది కలదు. ఇపుడది గుహగా గాన్పించుచున్నది.

19. సూర్య సింహాసన పీఠము — దీని కధిపతి శ్రీజగద్గురు శ్రీవాగీశ పండితారాధ్య శివాచార్య మహాస్వాముల వారు - వీరు గొప్ప పండితులు. విద్వాంసులు; శైవగురు పరంపరను గూర్చి, శ్రీశైలమునుగూర్చి కర్ణాటక గ్రంథముల జదివి నాకు అనేక ముఖ్య విషయముల చెప్పిరి. వీరి మఠము జంగమయ్య సమాధికి ప్రక్కనే ఉన్నది.

20. ఇంకను బలిపీఠము, కల్యాణమంటపము మున్నగు వానిని దర్శించవచ్చును. ఇవియన్ని చారిత్రక ప్రదేశములు — ఇంకను శంకరులవారి మఠములో రామధ్యానే విగ్రహస్థాపన జరిగినది. ఇందు శంకరుని, వారి శిష్యుల విగ్రహము లున్నవి.

21. కైలాసద్వారము—ఇది త్రోవలో, భీముని కొలను దగ్గరనున్నది. ఒక లింగము, నంది 'సింహద్వారము' గలవు.

22. నరసింహ బిలము — స్నాన ఘట్టమునకు 100 గజముల దూరమున 'నరసింహ బిలమను' గుహగలదు. నరసింహస్వామి శిలావిగ్రహ మున్నది.

23. లింగాలగట్టు — పాతాళ గంగకు ఒక మైలు దూరములో నిదిగలదు. యాత్రికు లిచటనుండి రాళ్లను గైకొందురు.

## 29. మూలపంచాచార్యులకు జెందిన పంచమఠములు

ఇచటనున్న ఐదు ముఖ్య మఠములలో 'వీరశైవ సిద్ధభిక్షావృత్తి మఠము' చాలప్రసిద్ధిగాంచినది. సిద్ధ భిక్షావృత్తి స్వామి, శిష్యుడు పర్వతయ్య (శా. శ. 1440

క్రీ. శ. 1518) మల్లికార్జుననికి 16 శ. న దానము చేసినట్లు తెలియుచున్నది
శ్రీనాథుని కాలమున వీరశైవమతమున కధిపతి శాంతభిక్షావృత్తి శిష్యుడు,
'శాంతయ్య.' ఈయన తెలుగు భాషాభిమాని.

క్రీ. శ. 1178–1216 వరకు పాలించిన 3 వ కుళోత్తుంగ చోళుడు ఒక మఠమును స్థాపించెను.

సోమనాధకవి పండితారాధ్య చరిత్రలో పర్వత ప్రకరణములో 'బల్లాహు మహారాజు' ఆయన భార్య శ్రీశైలమున కేతెంచి, అచటి జగద్గురువుల దర్శించి, ఉభయులు అవరణములో మఠముల గట్టించిరని యున్నది ఈమఠములు స్వామివారి ఆలయమునకు వెనుక, భ్రమరాంబాలయమునకు ముందు గలవు. ఇచ్చటనే జంగమ మల్లయ్య 'సమాధిగలదు'.

బసవమఠము - శా. శ. 1451 (క్రీ. శ. 1529)

గణమఠము - అరసిమఠము కలవు.

కలుమఠము - శా. శ. 1327 (క్రీ. శ. 1405)

సారంగమఠము - క్రీ శ. 1585

సోమనాధుని కాలమున ఆయామఠములలో కైంకర్యములు జరుగు చుండెనని, సారంగ మఠము వైభవముతో నుండెనని డా॥ చిలుకూరి నారాయణరావుగారు వ్రాసిరి.

క్రీ. శ. 5 వ శతాబ్దినుండి కాలాముఖులు దక్షిణ దేశములో శైవమత ప్రచారము చేయుచుండిరి. క్రీ. శ. 1050 లో 'వనవాసి'లో కాలాముఖ మల్లికార్జునుని గురువు 'తపోరాశి' ఒక మఠమును స్థాపించెను. శ్రీశైలములో కాలాముఖ మఠము నాకు కాన్పించలేదు. పై మఠములలో నేదియో నాకు చెప్పిన వారులేరు. వేములవాడ (లే) చాళుక్యుల కాలమున జైనశైవ మఠములు గలవు. కొల్లిపర తామ్రశాసనమున శ్రీశైలమునకు ఉత్తర ద్వారము అగు ఏలేశ్వరమున నొక కాలాముఖ మఠమున్నదని ఉన్నది. సద్యోశివాచార్య, ముక్తిశివా చార్య అను వారు, గురుశిష్యులిచట ఉండిరి. "వేములవాడ శిలాశాసనమున అచట దేవాలయములో నివసించు సాక్షి "మల్లికార్జున ముక్తిలింగి విద్యారాశి, వ్యాఖ్యాని భట్టారిదుడు పేర్కొన బడినాడు. విద్యారాశి దేవాలయ స్థానాధిపతి" అని చరిత్రకారులు వ్రాసినారు.

ఆ కాలమున మఠములు కేవలము సన్యాసుల కునికి పట్టుకావు. సర్వసంగ పరిత్యాగులైన గురువులు విద్యాదానము చేయుచుండిరి. (Vivekananda - "The imparting of knowledge was done through men of renunciation")

"అయం శ్రీ మదరి కేసరో ధర్మః
విద్యాదాన మిదం దత్తమ్."

దీనిని బట్టి ఆయామఠములలో విద్యాదానము చేయబడుచుండె ననుట స్పష్టము. ప్రతి కాలాముఖ మఠములో ఉచితవిద్య, ఉచితభోజనము, (అన్న సత్రము) వసతి గృహము, ధర్మవైద్యశాల, ప్రతిభా సంపత్తిగల అధ్యాపకులు, వారికి తగిన వసతులు. గృహారామములు ఉండెను. నిచ్చలు నాలందాలోవలె శాస్త్రవాదనలు జరుగుచుండెను. బౌద్ధుల సంఘారామములు, జైనుల బసతులు అనుచోట్లకూడ పైవిధముగా విద్యాదానముండెను; కాని మతవిద్యకు ప్రాధాన్య ముండెను. శ్రీశైలములోని మఠములలో గూడ గురువులకు, విద్యార్థులకు అన్ని వసతులు జరుగుచుండెను. కాని ఈ మఠముల పేర్లను రచయితలు భిన్న భిన్న విధములుగా వ్రాసిరి.

1 ఘంటామఠము — (ఘంటాకర్ణమఠము) మల్లికార్జునుని ఆలయమునకు వాయువ్య దిశగా హైద్రాబాదుకు పోవు కాలిబాట గలదు. ఆబాట కటునిటు అనేక మఠములున్నవి. అందులో నిది యొకటి; ఇచట 'ఘంటాకర్ణ సిద్ధేశ్వరుడు' బహువర్షముల కాలము శిష్యులతోగలసి తపమాచరించెను. ఆయన పేరుతో నిట్లు పిలువబడుచుండెను. సిద్ధేశ్వరుడు అను యోగి ఇచట నివసించుచు, దేవపూజ వేళలోదన శిష్యులను బిల్చుటకు ఒక గంటను వాయించుచుండెనని, అందువలన ఘంటామఠమను పేరు గల్గినదని నావెంట వచ్చిన బైరాగులు చెప్పినారు. ఈ ఆవరణములో కొన్ని గుహలు, జలకుండములు, సమాధులు కాన్పించినవి.

ఇచట పోతులూరి వీరబ్రహ్మముగారి, విగ్రహము కుడివైపున ఆలయములో నున్నది. ఎడమ వైపుననున్న ఆలయమున 'ఘంటాకర్ణసిద్ధేశ్వరుని, విగ్రహము గలదు. అతని చెవులలో గంటలు, కుడిచేతిలో జపమాల ఎడమ చేతిలో శివలింగము గాన్పించును. ఇచటనే ఘంటాకర్ణ తీర్థము గాన్పించును. యాత్రికులు ఈ తీర్థమును సేవించెదరు. 'ఘంటామహాదేవయ్య' అను తపస్వి విగ్రహము చూడగలదు. ఒక విగ్రహము ముందున్న ఘంటపై ఒక శాసనము చెక్కబడియున్నది. శాసనము రాతిగోడ పడిపోయి ఉన్నది. 'ఘంటాసిద్ధేశ్వరుని'

మఠమును మల్లికార్జునాచార్యుని శిష్యుడు నిర్మించెనని ఈ గంటపైనగల సంస్కృత శాసనములో నున్నది. ("This shrine of Ghanta Siddheswara was constructed by the Pupil of Mallikarjunacharya." No. 42) వ్యాసుడు తన గురువగు 'ఘంటాకర్ణ శివాచార్యుల' తో తపమాచరించెనని, ఇచట శ్రీశైల ఖండము వ్రాసెనని, లింగాయతులు నమ్ముచున్నారు.

2. విభూతిమఠము — ఇచట 'శాంతమల్లయ్య' అను వీరశైవుడు విభూతిని దయారు చేసి భక్తులకిచ్చి ఆశీస్సులిచ్చు చుండుటచేత ఈ పేరు వచ్చినదని చెప్పుదురు కృష్ణరాయల కాలమునాటి 'శాంత లింగము'నకు ఈయన శిష్యుడేమో. 'వైరాగి శాంతయ్య, భార్య సిద్ధమ్మ' కు ఈయన సంబంధమేమో। దీనిలోపల కొన్ని మంటపములున్నవి. మధ్యలో నొక ఎత్తయిన ప్రదేశముమీద నంది, గణపతి విగ్రహములు గలవు. వీనిముందు ఒక నల్లరాతి పలకపై, కొన్ని బీజాక్షరములు గల యంత్రమున్నది.

3. రుద్రాక్షమఠము — 'మల్లిశంకరస్వామి' యను భక్తుడు దీనిని కట్టించి, దీనిలోనే ఉండి రుద్రాక్షలను భక్తులకిచ్చి ఆశీర్వదించు చుండుటచే నీపేరు వచ్చినదని యిచ్చటి యోగులు చెప్పినారు. దీనిముందుపైపు గల వసారాలో నొక పుట్ట గలదు. ఇచట నాగేంద్రుడు వసించునని, ఎపుడో దర్శనమిచ్చునని యిచ్చటి వారు చెప్పుదురు. లోపల ఒక లింగమును, పానవట్టమును గలవు.

4. సారంగమఠము—దీనిని సారంగధర మఠమని కూడా పిలిచెదరు. సారంగ ధరుని కాళ్లు చేతులిచటనే నరికినారని ఒకరు చెప్పినారు. కాని దీనికి ఆధారములేదు. సారంగేశ్వరముని ఈ మంఠమును గట్టించి అనేకమంది శిష్యులను జేర్చెనని అందుచే నీ పేరు వచ్చెనని తెలియుచున్నది. లోనున్న గుహలో 'సారంగేశ్వర ముని' తపసుచేసికొని యుండవచ్చును. దీనిచుట్టును ప్రాకారము గలదు. మఠమున కెదురు స్తంభము మీద ఒక శాసనము గలదు. అది శా. శ. 1507 (1585) పార్థివ ఆశ్వయుజ బ. విదియ మంగళవారమునాడు లిఖించబడినది. పంచ మఠములకు జెందిన మఠాచార్యులు ఒక సమాఖ్య చేసికొనిరి. అందు సారంగ మఠమునకు జెందిన 'బాలసిద్ధయ్య' శ్రీశైలము మీద ఐదు ఇండ్లకు, పంచాలయము లకు జెందినవారు అనగా నందిమంఠము, భృంగిమఠము, వీరభద్ర, ఇంక ఇతరములకు జెందినవారు గలరు. ఈ ఒడంబడిక ప్రకారము సారంగ మఠము నకు వంశపారంపర్యా నచ్చు మఠాచార్యులకు ఏవిధమైన పరిచారకులుండరాదు.

(అంత్యపంచపరివార) అని తీర్మానించిరి. ఈ సారంగ మఠములోని సానరాయి మీద శాసనమును బట్టి 'పులి అన్నమనాయుని, కుమారుడు 'సింగయ్య' ఈ సాన రాయి నిచ్చినట్లు తెలుచున్నది.

5. నందుల మఠము — దీనికి నందికేశ్వర మఠమని, నందీమఠమని పేర్లు గలవు. నందికేశ్వరుడు అను యోగి దీనిని మరమ్మత్తు చేయుటచేత దీనికీపేరు వచ్చెనందురు. లోపల నందికేశ్వర లింగము గలదు. తపసు చేయుట కనేక గుహాలున్నవి. ఇది ఘంటా మఠమునకు పడమటి పైపున ఉన్నది.

ఇవి గాక వీరభద్రస్వామి ఆలయమునకు ఎదురుగానున్న పలకమీద శా. శ. 1237 రాక్షస శ్రావణ బ. దశమి మంగళవారము (క్రీ శ 1315) నాడు లిఖించిన తెలుగు శాసన మున్నది. గణ మఠమునకు జెందిన 'వీరభద్రస్వామి' ఆలయము నకు ముందున్న ముఖమంటపములో శ్రీశైలాసము (శ్రీశైలము మీద నివసించు మహేశ్వరు లెల్లరు కూర్చుండిరి. ఇందులో గణమఠాధికార్లు, అరిసిమఠ, కలు మఠమునకు జెందిన ప్రగ్గడలు కలసి వారి ఎదుట, మల్లికార్జునస్వామి ఆలయములో నిత్యము పూజలు, ఉత్సవాది కైంకర్యములు జరుపు కొందుమని వ్రాసిచ్చిరి. 41 వ నెంబరు శాసనమునుబట్టి క్రీ. శ. 1315 నాటికి గణమఠము, అరసిమఠము, కలు మఠము పేర్లు తెలియుచున్నవి. శకసంవత్సరము చెరిగిపోయిన మరియొక శాసన ములో బలిపీఠము పేరున్నది. ఆలయమునకు ఈశాన్యమూల నున్న బలిపీఠమును, రాజమహేంద్రపుర వాస్తవ్యుడు 'గౌరేముద్దనశెట్టి మల్లిశెట్టి' కుమారుడు 'గంగ మల్లిశెట్టి' శా. శ 1236 లో నిర్మించినాడని తెలియుచున్నది. ఈశాసనము తెలుగులోనున్నది. కనుక పంచమఠములు గాక పైమఠములుకూడ పేర్కొనబడి యున్నవి. "సిద్ధుల మఠము, వటసిద్ధ మఠము, చంద్రగుండ మఠము, కమరీ మఠము" అను మఠములు కూడ కొన్నిచోట్ల పేర్కొనబడినవి. చంద్ర గుండ మఠములోనే శివాజీ 12 దినములు నివసించెను. దీని కెదురుగా 'చంద్రకుండము' గలదు. లోపల ఒక గుహాపతె కాన్పించినది. కాలాముఖుల మఠ మెచ్చట నున్నదో తెలియలేదు ఆలయమునకు బడమర పైపున బిల్వవనములో జంగము మల్లయ్య నివసించిన ప్రాంతమును సరిగా జెప్పినవారు లేరు. జంగము మల్లయ్య సమాధి మాత్రము భ్రమరాంబాలయమునకు తూర్పుపైపున ఉన్నది. ప్రభుత్వము వారు ఆయా చారిత్రక ప్రదేశములలో ఫలకముల నిల్పి క్లుప్తముగా చారిత్రక విషయ ముల వ్రాయించిన పరిశోధకులకు మేలు గల్గును. వీరభద్రస్వామి మఠము, భీమ

శంకర మఠము, గిరిజాశంకర మఠము, విశ్వామిత్రుని మఠము, ఇత్యాదులు నాకు నావెంట వచ్చిన బైరాగులచేత జూపించ బడినవి. వీనికి శాసనములలో పేర్లు కాన్పించలేదు. పంచమఠములు అనగా ఘంటామఠము, నందన మఠము, మూలమఠము, సారంగ మఠము, తీర్థమఠము అని కొందరు వ్రాసియున్నారు. పేర్లు భేదమేకాని స్వామివారి గుడికివి వాయువ్య దిశలో శిథిలావస్థలో బైరాగులకు వాసస్థానములై యున్నవి. కొన్నిచోట్ల చెంచులున్నారు

శివాజీ గోపురములో శివాజీని పంచాచార్యులు ఆహ్వానించు చున్నట్లు చూపు బొమ్మగలదు. ఈ పంచాచార్యు లెవరు ? రేణుకాచార్యులు మొదటి వారు. ఈయన ద్వితీయావతారము "రేణుకసిద్ధు" లని ఆదిశంకరాచార్యులు శృంగేరిలో రేణుక సిద్ధులవలన మహిమాన్విత చంద్రమౌళీశ్వర లింగమును బడసిరని గురు వంశ కావ్యము మున్నగు అనేక గ్రంథములలో వ్రాయబడియున్నది. కనుక రేవణ సిద్ధులు శంకరుని సమకాలీనుడని, క్రీ. శ. 9వ శతాబ్దములోని వాడని నిశ్చయముగా చెప్పవచ్చును. ఈ రేవణ సిద్ధుల కాలములోనే 'ఉజ్జయినీ పీఠపు మరుళసిద్ధులు, కేదార పీఠపు ఏకోరామారాధ్యులు, శ్రీశైలపీఠపు మూల పండితారాధ్యులు, కాశీ పీఠపు విశ్వారాధ్యులు, పంచాచార్యులను పేర ప్రసిద్ధులై యుండిరని శ్రీపతి పండితా రాధ్యులు తమ 'శ్రీకర భాష్యమందు స్పష్టపరచియున్నారు' అని శ్రీశైలములోని జగద్గురు వాగీశపండితారాధ్య మహాస్వాముల వారు రచించిన 'వీరశైవము' అను గ్రంథములో వ్రాసియున్నారు. శ్రీపతి పండితులు క్రీ. శ. 10 వ శతాబ్దిలోని వారని చరిత్ర కారులు వ్రాయుటచేత వీరు క్రీ శ. 9 వ శతాబ్దిలోని వారని స్పష్టముగా జెప్పవచ్చును. కనుక శ్రీశైలములోని పీఠములు క్రీ. శ. 10 శతాబ్దికి తరువాతవే యని స్పషముగా చెప్పవచ్చును. శివాజీ క్రీ. శ. 1677 న శ్రీశైలము వచ్చి యుండుటచేత ఆయన నాహ్వానించినది మూలపంచాచార్యులు కావని, క్రీ. శ. 17 వ శతాబ్దిలోని వివిధమఠములకు చెందిన పంచాచార్యులని చెప్పవచ్చును. కాని ఏయే ఆచార్యులు శివాజీని ఆహ్వానించిరో తెలిసికొనుటకు ఈ బొమ్మతప్ప యితరాధార ములు లభ్యముకాలేదు.

## 30. శ్రీశైలము యొక్క క్షీణదశ

శ్రీశైలములోని మల్లికార్జునస్వామిని, భ్రమరాంబను దర్శించుటకు ఆసేతు హిమాచలము నుండి యాత్రికులు వచ్చుచుండిరి; ఒకప్పుడు పట్టణముగాను,

ముఖ్యనగరముగాను, శ్రీశైలరాజ్యములో ప్రధాన పట్టణముగాను, వేలకొలది జనులతో, శైవభక్తులతో, మఠాధిపతులతో, వేశ్యాగృహములతో నిండిన ఈ చారిత్రక క్షేత్రము క్రీ. శ. 18 వ శతాబ్దమునుండి క్షీణదశ నొందసాగినది.

ఈ శతాబ్దములో 'మన్నావర్ ఖాను' పాలనకు వచ్చెను. పారుమంచాల, సిద్ధవరం మున్నగుచోట్ల ముస్లింముల పాలనములో దైవకార్యములు జరగలేదని, ఆలయముచుట్టు మూడు పరువుల దూరము పట్టణము. యిండ్లు కట్టిరని, జంగముల మఠాలు 1200 ఉండేవి అని, ఆ మఠములకు మాన్యములు నడిచేవి అని, బ్రాహ్మణులకు అదేవిధముగా నుండేవి అని, సంసార్లు కాపురము చేసిరని, తురకలు అంతరువులు పెట్టిరని, వారు ఆత్మకూరు వచ్చిరని, ఉత్సవములు లేవని, శ్రీశైలము కైఫీయతు తెల్పుచున్నది.

క్రీ. శ. 15 వ శతాబ్దిలో 'శాయప్ప' అను నాయకుడు ఇచట నివసించెనని, ముస్లిముల దండయాత్రలలో ఈ ప్రదేశము నిర్మానుష్య మాయెనని, క్రీ శ. 1741 లో కర్నూలురాజు 'హిమాయత్‌ఖాన్' అని 'రగోబా' క్రింద ఉద్యోగి అయిన 'ఫత్తేసింగు' అను సర్దారు మహారాష్ట్ర సైన్యముతో దుర్మతి నామ సం. లో వచ్చి దండయాత్ర చేసెనని, కడప, చాగలమర్రి, సిరువేలు, నంద్యాల మొత్తము మీద శ్రీశైల దేశమంత ఈ దోపిళ్లకు గురియాయెనని, 18 వ శతాబ్దిలో 'మానువర్‌ఖాన్' దండయాత్రచేసెనని, 'దేశముఖ్ సీతారాం' 300 మంది దొంగలను గూర్చుకొని, శ్రీశైలప్రాంతమంత దోపిడి చేసెనని, బ్రిటిషువారు స్వాధీనము చేసికొన్న తర్వాత మొదటిసారి రు. 5025—2—9 ఆదాయము వచ్చెనని, పూజారులు జంగములని క్రీ శ. 1840 లో శ్రీశంకరాచార్యులు దీనికి సంరక్షకుడుగా నుండెనని, చెంచులు అంబాదేవి దర్శనముకు యాత్రికులను దీసికొనిపోవుచుండిరని, యాత్రికులు చెంచులకు పన్ను చెల్లించవలెనని, జిల్లాబోర్డులు ఏర్పడిన తర్వాత కర్నూలు బోర్డువారు రు. 400 లు సాలీనా ఖర్చుచేయుచుండిరని, మాన్యూలు రచయిత, చారిత్రకాంశముల వెల్లడి చేసినాడు.

మొదట హిందువుల నోడించిన వాడు కర్నూలు నవాబు 'అబ్దుల్ వాహబ్ ఖాను' అని, ఈయన సోదరుడు 'ఛోటా అబ్దుల్ వాహబ్‌ఖాను' అని తెలియు చున్నది. 'మేజర్ జనరల్ మెకంజీసాహేబు' ఆజ్ఞప్రకారము దరియాప్తి నారాయణ రావు గారు క్రీ. శ. 1810 లో తయారు చేసిన కైఫీయతులో దోపిళ్ళ వృత్తాంతము గలదు. కందనవోలి దేశాయి త్ర్యంబక రాయుడు చాగలమర్రి కోటలోని బలమును

గూర్చుకొని మువాసు అయిన నవాబు 'మానవరుఖాను'ని కెదురుతిరిగి కొన్ని గ్రామాలు దోయగా, కొందరు శ్రీశైలము మీది వర్తకులను దోచిరని, వర్తకులు పారిపోయి ఆత్మకూరు చేరిరని, ఇద్దరు పూజార్లు, ఒక బైరాగి మాత్ర ముండిరని, వారు గుళ్లు, మంటపములలో నుండిరని, బురుజులు యుద్ధసైనికుల కనుకూలముగా నుండెనని, వారు 18 దినములుండిరని, ఆత్మకూరు నుండి ధాన్యము వచ్చుచుండెనని, గుడికి దక్షిణముగా ఆరుకోసుల దూరములో ఆత్మకూరు నుండివచ్చు మార్గము గలదని, పెద్ద చెరువువద్ద చెంచులు వరిపైరు పండించు చుండిరని, దక్షిణమున సిద్ధాపురము నుండి సరకులు వచ్చుచుండెనని, ఆగ్నేయ మార్గమున తూర్పున చెన్నుపల్లి మీదుగా శ్రీశైలశృంగం మీద మార్గంగలదని, దక్షిణమున భీముని కొలను మీదుగా ఆత్మకూరు గలదని, పడమట లింగాలగట్టు, హైద్రాబాద్ మార్గము గలదని, వాయువ్యదిశలో అమరావతి గలదని; ఈశాన్యమూలను అంతర గంగ మార్గం, సోపానాలు గలవని, పూజార్లు నాల్గునెలలకు సరిపడు ఆహారము తెచ్చుకొందురని, ఇద్దరు పూజార్లు, ఒకబైరాగి నిచ్చలు ఉందురని, సుంకాల వసూలు గలదని, లింగబలిజలకు శ్రీశైలం కాశీసమానమని, వారు బసవన్న పూజకు పోతూ కావడితో నీళ్లు తీసికొని పోయేవారని, అలపుఖాను, సుంకములో ¼ వ వంతు పూజార్లకిచ్చు చుండెనని, గంటలు తీసికొని పోయిరని, మల్లికార్జునుని, భ్రమరాంబ పూజారులు, ఒక బైరాగి మాత్రముండిరని, మూడు రాత్రులు వాసముచేసిన చలి జ్వరము వచ్చుచుండెనని, ఉడతలూరి గంగడు అను చెంచు, దోపిడి చేసెనని, అతని క్రిందనున్న 30 మంది చెంచులు రేకులు, పూజారి సొమ్మును దోచిరని, కృష్ణదాటి చెన్నుపల్లివారు గొడ్డలితో వానిని నరికిరని, విల్లు, సురకత్తి, తుపాకి, మానులు నరకు గొడ్డలి గైకొనిరని కైఫీయతులో నున్నది. మల్లికార్జునుని జంగమ మఠములకు రాజు లిచ్చిన మాన్యములు ముస్లిముల స్వాధీన మాయెను.

ఈ విషయములబట్టి 18 వ శతాబ్దిలో ముస్లిముల, రోహిల్లాల దండయాత్రల వలన దోపిడిల వలన శ్రీశైలము నిర్మానుష్యమాయెనని, వర్తకులు పారిరని పూజారులు, బైరాగి మాత్రము నిల్చి ఉండిరని, బ్రిటిషు పాలనలో శాంతిభద్రత లేర్పడి తిరిగి పూజా పునస్కారములు వైభవముగా జరిగెనని తెలియుచున్నది. లారీలు మున్నగునవి నేడు పయనించుటచేత అడవిరక్ష, వెదురుమున్నగు వానిని స్థలాంతరముకు జేర్చుచున్నారు. వనమూలికలు, తేనె, చారపప్పు, రాతినాటి శిలాజిత్తు, తాళకము అభ్రకము, మణిశిల, లోహము, కాంతము, స్ఫటికము లభ్యమగుచున్నవి. వీనిని వైద్యులేరుకొని, భస్మాదులు చేసి అనేక లాభములను

గొందుచున్నారు. ప్రభుత్వమువారు ఈక్షేత్రము నుపయోగించి, పరిశోధనాశాల నేర్పాటుచేసి స్పర్శవేది, అడవిశనగ (సంజీవి కరణి) మున్నగువానిని పరిశోధనాశాలలోనుంచి, అవసరమైనచో బంగారును తయారు చేయించుదురని నమ్ముచున్నాను. 'ఐనీ అక్బరీ' అను గ్రంథమునుబట్టి అక్బరు బంగారు తయారు చేసెనని తెలియుచున్నది.

'ఐనీ అక్బరీ i' అను గ్రంథము ననువాదముచేసిన "బ్లాక్‌మన్" యిట్లు వ్రాసెను. 'చక్రవర్తి రసశాస్త్రమును నేర్చుకొని ప్రత్యక్షముగా నందరి ఎదుట ఆయన తయారు చేసిన స్వర్ణమును చూపించెను. (Aiyini Akbar-I H. Block man - P 201. "His majesty even learned Alchemy, and showed in public some of the gold made by him.") బంగారమును తయారు చేసిన క్రియలు శ్రీశైల పర్వతము మీద కలవని వదంతులు కలవు. దీనికి పరిశోధన అవసరము. శ్రీనగ స్పర్శవేది' శ్రీశైలభాస్వర సురతరువు, అనునవి ఏవియో తెలిసికోవలయును. ఈప్రకారము శ్రీశైలము భారతావనిలోనన్ని విధముల గణుతి గాంచినది. ఈ సంవత్సరము శివరాత్రికి మన ముఖ్యమంత్రి శ్రీకాసు బ్రహ్మానంద రెడ్డిగారు, వారి సతీమణి శ్రీమతి రాఘవమ్మగారు శ్రీశైలములోని వివిధ ప్రదేశముల సందర్శించి, స్వామిని భ్రమరాంబను ఆరాధించి, విశేషముగా కాన్కల నొసంగి భాగ్యనగరమునకు తిరిగి వచ్చిరి. ఈ దంపతులను జూచినపుడు 63 వ పుటలో నున్న చివరి శ్రీనాథుని పద్యములు స్ఫురణకు వచ్చుచుండును. శ్రీమతి రాఘవమ్మగారికి 'అన్ని భాగ్యంబులున్నను, పుత్రపదసాను లోకనోద్భూతమైన యొక్క సౌఖ్యంబు ప్రాంతిమై' యున్నది. భీమనగౌరాంబ కలసి శ్రీశైల యాత్రచేసిన అనంతరము ఒక కుమారుడు గల్గ ఆయనకు శ్రీగిరిస్వామి పేరు అనగా 'మల్లికార్జునుడని' పేరుపెట్టిరి. అటులనే ఈ దంపతులకుగూడ సంతాన ప్రాప్తి గల్గుగాత! అని నేను శ్రీగిరి మల్లికార్జునుని వేడుచున్నాను.

## విశేషాంశములు

కూచిమంచి జగ్గకవి రచించిన 'సోమదేవ రాజీయము' లో 'కాకతీయ గణపతి చక్రవర్తి' దర్శించిన పుణ్యక్షేత్రములను గూర్చి నిట్లున్నది.

సీ. శ్రీశైలమున కేగి శ్రీమల్లికార్జున
దేవుని దర్శించి కేవిమొరయ

పండ్రెండు వేల సువర్ణ పద్మంబుల
బోలుపార నదేవు బూజసేసి"

ఈ విషయము "ప్రతాపరుద్ర చరిత్రము"లో గూడ కలదు. ఏకాంధ్ర నాధుని 'ప్రతాపరుద్ర చరిత్రము' లో 'రుద్రమహారాజు' తీర్థయాత్రల గూర్చి యిట్లున్నది. "మఱియు శ్రీనగరంబునకుఁబోయి మల్లికార్జున లింగంబు సేవించెను. అచ్చట నెనిమిది తులాభారంబులు దూగి కోటి సువర్ణంబులు దానంబుచేసెను." తనకు సంతానంబు లేకునికిఁ జింతించి శ్రీశైలంబునకుఁ బత్నియు దానుంబై చని, శ్రీమల్లి కార్జునలింగంబు సేవించి యక్కడనున్న సిద్ధులకును, మఠాధిపతులకును నానావిధవస్తు సముదయంబు లిచ్చి వారల చిత్తంబునకు మోదంబుగలుగ చేసెను. ప్రసన్నంబగునట్లుగాఁ బూజలుచేసెను. అంతవారల ప్రసాదంబున నొక సుతుండు గలిగెను. అతనికి గణపతిదేవుండని నామకరణంబిడియె. మఱియు గొందఱు సుతులుంగలిగిరి." ప్రతాపరుద్రుడు, శ్రీశైల మల్లికార్జునునికి ప్రతి వర్షంబును కోట్లు చెల్లించుచుండెనని పై గ్రంథము తెల్పును.

'కుమారధూర్జటి' 'కృష్ణరాయ విజయము' లో 'శ్రీకృష్ణదేవరాయలు పుణ్య క్షేత్రముల జూడనెంచి, వీనిని దర్శించెనని యిట్లు వ్రాసెను.

సీ. శ్రీశైల కాళహస్తి చిదంబరాదిక
రమణీయ శైవస్థలములుజూచి"

విజయ విలాసములో చేమకూర వేంకటకవి శ్రీశైలము నిట్లు వర్ణించెను.

"యుత్తుంగ శృంగ విలోకి లోకసాత్కృత సుపర్వ పర్వతంబగు శ్రీపర్వ తంబులోచన పర్వంబుగాఁజూచి, ప్రణమిల్లి మల్లికార్జును సమ్ముఖమునఁ బ్రణుతించి తన్మనోజ్ఞ భ్రమరీ విభ్రమ రమ్యయగు భ్రమరాంబం బ్రశంసించి" ఈప్రకార మనేక కావ్యములలో శ్రీశైల ప్రశంస కాన్పించును.

# BIBLIOGRAPHY


**English :**

| | | |
|---|---|---|
| Ep. Indica | Volumes | |
| Ep. Carnatica | ,, | (Vol. VII) |
| Asiatic Researches | ,, | |
| Arch. Survey of India | ,, | |
| Annual Reports | ,, | (1915) |
| South Indian Inscriptions | ,, | |
| Telangana Inscriptions | ,, | |
| Annual Epigraphy | ,, | (Mach 1922) |
| Fort St eorge Letters | ,, | (1679) |
| Imp. Gaz | ,, | |
| Ency Brit | ,, | |
| Sewell — Antiquities | ,, | (1 and 2) |

D. C. Sircar — Select Inscriptions

Publication Division - Temples of South India

K A. Nilakantha Sastry - History of India

G. Mackenzie - Krishna Dt. Manual

D. Kincaid - The Grand Rebel

M. S Sarma - History of the Reddy Kingdoms

Moraes - Kadambas

B. V. Krishna Rao - Early Dynasties of Andhra

P V. Jagadisa Ayyar - South Indian Shrines

R. K Mukherji - Chandra Gupta Mourya and his times

J. N Sircar - House of Sivaji

N Subrahmanya-South Indian Temple Inscriptions (Vol. I)

Alexander Rea - List of Ancient Monuments in Madras

N. Gopala Krishna - Kurnool Dt Manual

James Hastings - Ency of Religions

Havell - The Ideals of Indian Art

V. R. R. Diksh th - Puranic Index

R- C- Majumdar - Outline of Ancient Indian History and civilization, The Vakataka Gupta Age

K- S- Ramaswami - History of India

R- M- Martin - The Indian Empire

R- Satyanathiar - Politcal and Cultural History of India

N- V- Ramanayya - Vijayanagar, The third Dynasty

K- R- Subrahmanyan - History of Andhra

James Duglas - Bombay and Western India

Duff - History of The Marattas

Krishna Sastry - Indian images of Gods and Goddesses

Dowson - History of Hindusthan

Dr Raj- Bali Pandey - Historical and Literary Inscriptions etc

# తెలుగు - సంస్కృతము

శ్రీ బులుసు వేంకటరమణయ్య - శ్రీశైలక్షేత్రము
,, నూతలపాటి పేరరాజు - శ్రీశైల చరిత్ర
,, హెచ్. నారాయణరావు - శ్రీశైలక్షేత్ర మహిమము
,, హెచ్. పి. నాగోజీరావు - పురాతన శ్రీశైలక్షేత్ర మహిమము
,, జగద్గురు వాగీశపండితారాధ్య మహాస్వాములవారు } వీరశైవము, శ్రీశైలక్షేత్ర నిర్ణయము
,, నిడదవోలు వెంకట్రావు - ఆంధ్రకర్ణాటసారస్వతములు, వచనవాఙ్మయము
,, ప్రసాద భూపాలుడు - ఆంధ్రవిజ్ఞానము.
,, సి. మెకంజీ - శ్రీశైలం కైఫీయతు - లోకల్ రికార్డులు, 16. 38; 15
,, నిత్యనాధసిద్ధుడు - రసరత్నాకరము (సం)
,, ఆనందగిరి - శంకర విజయము (సం)
,, శ్రీనాధుడు - శివరాత్రి మాహాత్మ్యము, కాశీఖండము, పల్నాటివీరచరిత్ర.
,, వడ్డాది అప్పారావు - రెడ్డి సంచిక
,, పాల్కురికి సోమనాధకవి - బసవపురాణము, పండితారాధ్యచరిత్ర.
,, వేదం వేంకట్రాయశాస్త్రి - అక్కన్న మాదన్నల చరిత్ర
,, నన్నయభట్టు - ఆదిపర్వము
,, నన్నెచోడుడు - కుమారసంభవము.
,, కోన వేంకట్రాయశర్మ - సచివోత్తములు
,, రత్నాకర బాలరాజు - బౌద్ధయుగము (రెండు సంపుటములు)
,, ఆచార్య ఖండవల్లి, లక్ష్మీరంజనం - ఆంధ్రుల చరిత్రము
,, చి. వీరభద్రరావు - ఆంధ్రుల చరిత్రలు (మూడు సంపుటములు)
కాకతీయాంధ్రరాజ యుగచరిత్రము
,, ఏనుగుల వీరాస్వామయ్య - నా కాశీయాత్ర
,, (సంపా) దిగవల్లి వేంకటశివరావుగారు
శంకరాచార్యులవారు - భ్రమరాంబాష్టకము మొ.
,, పెరియ సామిత్తురన్ - (తమిళము) కలైక్ కలంచియం.
శ్రీశైలజ్యోతి మొదలగు పత్రికలు, అప్పార్ మొదలైనవారు - తేవరం.

# భారతీయ సంస్కృతి

## ౧. సంస్కృతి - నిర్వచనము

'సంస్కృతి' అనునది సంస్కృత భాషలోని ఒక పదము. దీని అర్థమేమనగ ఉత్తమస్థితి లేక సంస్కారము చేయబడినస్థితి. ఆంగ్లభాషలో దీనిని కల్చర్' అందురు. ప్రసన్న కుమార ఆచార్య అను విద్వాంసుడు ఇట్లు వ్రాసినాడు. "ఈ విధముగ విద్యావ్యాసంగమును పొందినవాడు పరిశుద్ధత చెందును; ఇంతేకాక సంస్కృతి ముఖ్యముగ భౌతిక సంబంధమైన బుద్ధి సంపదను శుద్ధిచేయు మార్గమును జూపును. ఇంకను మానవునియొక్క శక్తి సామర్థ్యములను బరిపూర్ణముగ వికసింపజేయును." కనుక సంస్కృతి మానవునియొక్క మానసిక, ఆధ్యాత్మిక అభివృద్ధియొక్క స్థితిగతులకు సంబంధించి ఉండును. సభ్యత మాత్రము మానవుని యొక్క భౌతిక అభివృద్ధికి సంబంధించియుండును. ఈవిధముగ సంస్కృతికి, సభ్యతకు భేదముకలదు. 'జార్జిబెర్నార్డుషా' అను ఆంగ్ల రచయిత ఇట్లు వ్రాసెను. "20 వ శతాబ్దమునాటి నాగరికతా విలువలు వాణిజ్య సంబంధములు; అవి ఆధ్యాత్మిక సంబంధమైనవికాని, కళా సంబంధమైనవికాని కావు. లండన్ నగరమును విద్యావంతము చేయుటయే నాగమ్యస్థానము."

కొంతమంది విద్వాంసులు అమెరికా, యూరప్ ఖండములు సభ్యత కలవని, భారతదేశము సంస్కృతి కలదని, ఈ రెంటియొక్క సమ్మేళనము అవసరమని వ్రాసినారు. భారతీయుల ఆధ్యాత్మిక జ్ఞానము, పశ్చిమ దేశీయుల విజ్ఞానశాస్త్ర సంబంధమగు సంస్కృతి, ఈనాటి ప్రపంచమున కంతటికి అవసరమని అందరును వచించుచున్నారు. సంస్కృతినిగూర్చి అనేక మంది అనేక విధములైన నిర్వచనము లొనంగినారు. మానవుని లోపల బీజరూపమున శారీరక, మానసిక, ఆత్మసంబంధమగు శక్తులు గలవని, వాటి వికాసమే సంస్కృతి ముఖ్యఉద్దేశ్య మని 'ఆచార్య శివదత్తజ్ఞాని' వ్రాసినారు "సభ్యత, లలితకళలు, సాహిత్యము, దినదినము మానవుడు పొందు అభివృద్ధి, వీటి అన్నిటిలోని ఉత్తమగుణముల కలయికనే సంస్కృతి అందురు." అని కొందరువ్రాసిరి. "సురవరము ప్రతాపరెడ్డి" అను ఆంధ్రవిద్వాంసుడు పై విషయమును జెప్పుచు 'సంస్కృతి' మానసిక, ఆధ్యాత్మిక అభివృద్ధికి సంబం

ధించినదని, 'సభ్యత' భౌతిక అభివృద్ధికి సంబంధించినదని వ్రాసెను. లేవివిధముగ సంస్కృతినిగూర్చి విద్వాంసులు భిన్న భిన్న దేశములలో భిన్న భిన్న విధములుగా వ్రాసిరి. శివదత్తజ్ఞాని అను విద్వాంసుడు, తాను రచించిన 'భారతీయ సంస్కృతి' అను హిందీగ్రంథములో 'సంస్కృతి' అనగ 'ఆత్మదర్శనము' అని పేర్కొనెను. ఈనిర్వచనము నాదృష్టిలో సరిగానున్నది. అమెరికా, యూరోప్ ఖండవాసులు తాము అభివృద్ధి చెందిన జాతులమని తలంచుచున్నారు అభివృద్ధి అనగా ఆధ్యాత్మిక మైన, బుద్ధి సంబంధమైన అభివృద్ధి అని 'రామతీర్థస్వామి' పేర్కొనుచున్నాడు. ఈదృష్టితో బరిశీలించిన భారతీయులు మిగత జాతులకంటె శ్రేష్టులని చెప్పవచ్చును. కాని ఈనాడు భారతీయులు 'ధనమూల మిదం జగత్' అని దిగజారిపోవుచున్నారు.

'సంస్కృతి అన్నను, మతము అన్నను, నిజమైన విద్య' అన్నను ఒకటిగానే కాన్పించుచున్నది. ఏలననగ మూటిలోను ఆత్మ సాక్షాత్కారము కాన్పించుచున్నది. మతమనగ ఆత్మసాక్షాత్కారమని వివేకానందుని సూక్తి తెలిసికొన్నచో ఒక మతస్థునికి, మరియొక మతస్థునితో తగాదాలుండవు. అన్ని మతములు సత్యము లే యని గాంధిమహాత్మునివలె, నేను భావించుచున్నాను (All religions are true) అటులనే "నిజమైన విద్యఅనగా ప్రపంచమునంతటిని భగవంతుని నేత్రముల ద్వారా చూచుట యనునది, నేర్చుకొనుటయే" అని రామతీర్థస్వామి వచించినాడు. మానవునిలోపల నిద్రాణమైన కొన్ని శక్తులు కలవు. వానిని మేల్కొల్పుటయే విద్యఅని, నరునందలి ప్రకాశతను సదా వెల్లడికిదెచ్చుటయే విద్యయని గాంధిమహా త్ముడు, ఠాగూరు, వివేకానందులు పలికినారు. కనుక పర్యవసానములో 'సంస్కృతి, మతము, నిజమైన విద్య' అను మూడును ఆత్మదర్శనమునకు సంబంధించినవని చెప్పవచ్చును. ఉపనిషత్తులలో జెప్పబడిన పరావిద్య ఇదియే. ఈ కాలపు విద్యా విధానములో విద్యార్థులు విజ్ఞానశాస్త్రము, సాంకేతిక, పారిశ్రామిక రంగములలో ప్రవీణులగుచున్నారు; కాని ఆధ్యాత్మిక జ్ఞానమునకు సంబంధించిన హృదయ వికాసము ఈ నాటి విద్యార్థులలో గాన్పించుటలేదు. అందుచేతనే గాంధిమహాత్ముడు ఈనాటి విద్యాధికులు కఠిన పాషాణహృదయములుగలవారు అని పేర్కొనెను. (The hard hearts of the educated). బుద్ధదేవుని దయార్ద్రహృదయము ఈనాటి విద్యాధికుల కవసరము. హృదయవికాసము లేనందున, ఈనాటి విద్యార్థులలో 'క్రమశిక్షణ, శీలసంపత్తి' లోటుగానున్నవి. 'ఎమర్సన్' అను అమెరికా తత్వవేత్త కూడ, 'హృదయమను గ్రంథము తెరవబడినచో, వేరువిధమైన గ్రంథముతో పని

లేదు' అని వ్రాసెను. కనుక భారతీయుల సంస్కృతిలో నధికభాగము 'హృత్పురుషుడు లేక హృదయాంతర్వర్తియగు పరమాత్మకు' సంబంధించియున్నది. భారతీయయోగులు చంచలమగు మనసు నణచి. చిత్తవృత్తుల నిరోధించి, ఆత్మదర్శనమును జేసికొనియుండిరి. ఈ తత్వవిద్య ఉత్తమమైనది. అందుచేతనే 'గజినీ మహమ్మదు'తో వచ్చిన 'అల్బరూని'తో ప్రాచీనపండితులిట్లు చెప్పసాగిరి. "మాదేశమువంటి దేశము, మామతమువంటి మతము, మాశాస్త్రమువంటి శాస్త్రము, మాజాతివంటి జాతి, భూతలమున నెచ్చోటను లేదు" ఈ మతము కర్మకాండతో సంబంధములేని ఆత్మదర్శనము; శాస్త్రము ఆధ్యాత్మికశాస్త్రము; కంటితో దేనిని జూచెదరో యది ఆత్మభావముగా జూచిన జాతి ("యద్యత్ పశ్యతి చక్షుర్భ్యాం తత్ర దాత్మేతిభావయేత్") ఈ సమభావము మనుష్యకోటియందేకాక, సమస్త ప్రాణికోటిని జూచుటలో గూడ గాన్పించినది. ఈ గుణములు మహాత్ములయందు మాత్రము గాన్పించినవి. సంకుచితత్వము గలవారు జాతి, మత, కుల తగాదాలతో భారతజాతి ధ్యేయమును బోగొట్టిరి.

## ౨. సంస్కృతి ఎన్నివిధములు ?

### ఆధ్యాత్మిక సంస్కృతి

సంస్కృతిని నాలుగు విధములుగ చేర్కొనవచ్చును. 1. ఆధ్యాత్మిక సంస్కృతి (Spiritual Culture) 2. శారీరక సంస్కృతి (Physical culture) 3. మానసిక సంస్కృతి (Mental culture) 4 సారస్వత సంస్కృతి (Litera-ry culture). ప్రథమమున ఆధ్యాత్మిక సంస్కృతినిగూర్చి నేర్చుకొందము. ఆధ్యాత్మిక సంస్కృతిని బొందుట చాల కష్టమైనది. 'కఠోర బ్రహ్మచర్యము, యోగము' అనుచరించుట వలన ఓజఃశక్తి కలుగును. ఇది మేధస్సులో నిల్వఉండి అనేక మహత్తుల గల్గించును. దీనివలన నిర్వాణము లేక ఆత్మదర్శనము కలుగును. దీనినే అమృతత్వము అందురు. బుద్ధదేవుడు, ప్రాచీన మహర్షులు ఈ స్థితినిబొంది, నివృత్తిలోనుండి ప్రవృత్తిలోనికి వచ్చి తమ దివ్యశక్తిని లోకమునకు వెదజల్లి అజ్ఞానమును, బాధలను, దుఃఖములను బోగొట్టిరి ఈస్థితిలోనున్న మహాత్ములు అసాధారణ జ్ఞాన విశేషములను బొందుదురు. యోగమునకు సంబంధించిన కొన్ని అనుభూతులు బాల్యమునుండి వారిని వెంటాడును. ఈ ఆధ్యాత్మికోన్నత స్థితి, మనసును దాటి హృదయకమలములోని భానుని వీక్షించినపుడే కలుగును. ఇదియే

పరమవిజ్ఞానము. (Super mind) ఈస్థితిలో సుషుమ్న నాడి తెరవబడుననీ, సహస్రార కమలము వికసించుననీ, జగత్ అంతయు నీదగ్గరకు వచ్చుననీ, అన్ని వస్తువులు నీకు లొంగిపోవుననీ, విశిష్టానుభూతులు కలుగుననీ. జీవన్ముక్తి పొందుదు వనీ, "రామతీర్థ, వివేకానందాదులు" వచించిరి. ఇదియే "ఆధ్యాత్మిక సంస్కృతి".

దీనివలననే భారతదేశము ప్రపంచములో సున్నతస్థానము గడించినది. పాశ్చాత్యులు మనసునుదాటి పైకిపోలేదు. వారు ఆత్మను Soul అని పిలవసాగిరి: కాని ఇది న్యాయముగ మనసేకాని ఆత్మ కానేరదు. వివేకానందుడు ఆత్మను Self అని పేర్కొనెను. భారతీయ యోగులు మనోపరిధినిదాటి, హృత్కమలములో ప్రవేశించి ఆత్మదర్శనమును బొందియుండిరి. ఒక ఉపనిషత్తు ఇట్లు వచించుచున్నది.

ఇంద్రియార్థేభ్యః పరేహ్యార్థ
అర్థేభ్యశ్చ పరం మనః
మనసస్తు పరే బుద్ధ్యా
బుద్ధేరాత్మా మహాత్పరః.

కనుక ఆత్మ బుద్ధికంటె, మనసుకంటె, ఇంద్రియములకంటె గొప్పది బుద్ధ, గాంధి, ఠాగూరు, రామకృష్ణపరమహంస, అరవిందుడు మొదలగువారు ఇట్టి ఆత్మసాక్షాత్కారము పొందిరి. ఇది పొందినపుడే జీవన్ముక్తి కలుగును. "ఎప్పుడు బ్రహ్మము నెరుంగునో అయన బ్రహ్మము అగుచున్నాడు" అని యోగులు వచించిరి. (బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి — Ramathirtha – 'Being lost in such vision one is the Brahman itself, unknowable to the mind or intellect") ప్రాచీన ఋషులు 'ఆత్మానం విజానీహి' (Know thyself) అని గానముచేసిరి. గ్రీకు తత్త్వవేత్త 'సోక్రటీసు' కూడ దీనినే గానముచేసెను.

ఇదియే 'హృదయ పురుషుని సాక్షాత్కరించుట' అని రామతీర్థ మున్నగు వారు వచించిరి. (Ramathirtha – "Bless your secret seeking heart, Come. - The true Vedanta is not confined to the Vedas only, it is in your hearts") ఇట్లు అధ్యాత్మిక ఉన్నతితోనే, మనము పశ్చిమ దేశీయులను జయించవలెను. మనజీవితరక్తము ఆధ్యాత్మిక జ్ఞానమని మనము తెలిసికోవలెను. ( Vivekananda – "Our life blood is spirituality. We must

conquer the west by spirituality") ఇంద్రియ నిగ్రహము అనునది అధునిక విద్యావిధానములో లేదు. అధునిక ప్రయోగాత్మక శాస్త్రములు, ఆత్మదర్శనమును బొందు మార్గమును జూపజాలవు. ఈశాస్త్రములన్ని మనసుయొక్క హద్దుల వరకు మాత్రమే పయనించును. మనోవీధిని దాటి హృత్పురుషుని దర్శించుటకు సాధనము చేసినప్పుడే, దివ్యశక్తులు గల్గును. ఆత్మజ్ఞానము హృదయమునకు సంబంధించియున్నది. హృత్పురుషుడగు భగవంతుడే తనను నడిపించునని, ఉపన్యసింపజేయునని, అంతర్వాణి ప్రబోధముగల యోగులు పల్కియుండిరి. ఒక ఉపనిషత్తు ఇట్లు పల్కుచున్నది. "అంగుష్ఠమాత్రః పురుష, మధ్య ఆత్మని తిష్ఠతి' టాగూరు మహాశయుడు, 'హృత్పురుషుడు (The Purusha of the heart) అని పల్కెను. 'శంకర భగవత్ పాదులవారు' ఈహృత్పురుషునిగూర్చి యిట్లు ప్రశ్నించెను. "హృదయమును గొట్టుకొనునట్లు చేయునదెద్ది? రక్తనాళములలో రక్తమును ప్రవహింప జేయునదెద్ది? నఖములను, కేశములను పెంచునట్లు చేయునదెద్ది?" ఇది యొక అదృశ్యమైనశక్తి. ఈశక్తినే విద్వాంసులు పలువిధములుగా బిల్చిరి.

ఆత్మజ్ఞానమును బొందినవారు ఏ భేదమును లేకుండ నందఱిని ప్రేమించెదరు. ద్వేషము, అసూయలను వానిని వారెరుంగరు. ఆధ్యాత్మిక ఆరోగ్యసూత్రమును వారు పాటించెదరని, సిపొరుగువానిని ప్రేమతోచూచుటయే దీనిలక్షణమని 'రామతీర్థ' వచించినాడు. (Ramathirtha - "To be saved from foreign politics, the only remedy is to live the law of spiritual health – the law of love for your neighbour"–) యేసుక్రీస్తుకూడ 'పొరుగు వానిని ప్రేమించుము' అని వచించెను. Jesus - "Love your neighbour") హృదయసాక్షాత్కారమనునది ఏ భౌతికశాస్త్రము వచించునదికాదు. "గౌతమబుద్ధులు, యేసుక్రీస్తులు అనువారు రెండవ తరగతికి జెందినవారు. మొదటి తరగతికి జెందినవారు ఎవరికి తెలియకుండనే అదృశ్యమైపోయిరి" అను వివేకానందుని వచనము సత్యమైనది. (Vivekananda "Even the Buddhas and the Christs are but second - rate men, the greatest men of the world have passed away unknown".) ప్రాచీన మహర్షులు, రామకృష్ణ, అరవింద మున్నగువారు సత్యమైన హిందూధర్మమును బోధించియుండిరి. 'C. F ఆండ్రూస్' ఇట్లు వచించెను. "భారతీయుల నిజమైన మతమును సంస్కరించవలసిన పనిలేదు. అది ఆత్మదర్శనము, అది సమస్త కాలములలో నుండునట్టిది. – ఆచారకర్మలు, సంస్కారములు, యజ్ఞయాగాదులు, అనునవి మతముపేరుతో చలామణి అగు

చున్నవి. వీనిని మాత్రమే సంస్కరించవలసిన అవసరమున్నది." (C. F. Andrews - "Simply because people live on the bank of Sindhu and follow Dharma, they are called 'Hindus' by the Persians first of all. The true religion of the Indians needs no reformation. It is only realization of the self and it will last for all times to come. The so called rites, ceremonies sacrifices which go in the name of Hindu religion needs reformation" ఈ వాక్యములు సత్యమైనవి. సత్యము, జ్ఞానము, ఇంద్రియ నిగ్రహము, ధర్మనిష్ఠాపరత' అను వానిని ప్రాచీనయోగులు అనుష్ఠించిరి. ఈ కాలములోగూడ టాగూరు, గాంధి మున్నగువారు వీని ననుసరించి, పవిత్రమైన వారి భావములను ఆచరణలోనుంచిరి. మానవుని అంతిమధ్యేయము ఆచరణయని, భావముకాదని కార్లయిలు పలికెను. (Carlyle – "The end of man is an action and not a thought") ఆచరణవలననే మాక్సుముల్లరు, రామకృష్ణ పరమహంసను 'మహాత్మా' అని సంబోధించెను. అనిబిసెంటు గాంధిగారిని 'మహాత్మా' అని సంబోధించెను. వీరి భావములకు దగినట్లుగానే వీరి ఆచరణ కాన్పించుచున్నది. గాంధిమహాత్ముని 'సెంటుపాలని', టాగూరును 'ప్లేటో' అని, సి. యఫ్. ఆండ్రూసు పిల్చెను. కామినీ కాంచనములందాశలేనట్టి, కుల మత భేదములు లేనట్టి, సుఖదుఃఖముల మానావమానముల మట్టి బంగారుల, సమదృష్టితో జూచిన మహాత్ములు చరిత్రలో ననేకులు లభ్యమగుచున్నారు. అహింస, సత్యము, తపసు, వారి ధ్యేయములని స్పష్టపడుచున్నది.

గ్రీకులేఖకులు క్రీ. పూ. 326 లో 'అలెగ్జాండరు'తో బాటు భారతభూమికి వచ్చిరి. 'అనిసిక్రటసు' 'దండమీసు' అను యోగిచెంతకువచ్చి, అలెగ్జాండరు అనేక బహుమతులిచ్చునని ఆయన చెంతకు రమ్మనికోరెను. అలెగ్జాండరు దేవుడుకాదని, ఆయనకూడ మరణమును రుచి చూడవలసియున్నదని, తాను బ్రహ్మవేత్తనని, బ్రహ్మవేత్తలు మరణమున్న భయపడరని, సంపదయన్న ఆశపడరని చెప్పెను. అలెగ్జాండరును అతని దుస్తులు తీసివేయుమని, నదీజలముత్రాగుచు తన ప్రక్కనే ఆకులపాన్పుపై వెల్లడిగాలిలో బరుండుమని, కందమూల ఫలాదుల దినుచు తన ప్రక్కనుండుమని, 'దండమీసు' అను భారతీయయోగి అలెగ్జాండరును సవాలు చేసెను. మానవజీవనమునకు అంతిమధ్యేయమైన ఆత్మదర్శనము పొందినయోగికి, అలెగ్జాండరు అల్పుడే 1. మానవజీవనమున కొకే ధ్యేయము గలదు. ఆత్మనెరింగి జీవనమరణమను బంధమునుండి, విముక్తిచెందుటయే మోక్షము. ఈజన్మలోనే దీనిని పొందవచ్చును. కబీరుదాసు అను జ్ఞాని నేయి, రొట్టె ప్రక్కనేపెట్టుకొని

భుజించుటకు సిద్ధపడుచుండెను. హఠాత్తుగా నొక శునకమువచ్చి రొట్టెనుగైకొని పారిపోయెను. కబీరుదాసు కుక్కనిట్లు సంబోధించెను. "ఓ శునకరాజమా, నేయి లేకుండ నీవు ఎందు రొట్టెను భుజించజాలవు; కాన దీనినికూడ గైకొనుము." ఈ విధముగా జెప్పుచు, నేతిలో రొట్టెనుగలిపి, కుక్కకుబెట్టి కబీరు భోజనము లేకుండ వెడలిపోయెను. కబీరుదాసు తనలో నున్న ఆత్మ, శునకములోనున్న ఆత్మ ఒకటియే యని భావించెను. భావించుటయే కాకుండా ఆచరణలో జూపించెను. ఇదియే ఆయన గొప్పతనము. జ్ఞాని మనోవాక్కాయ కర్మలందు శుద్ధిగా నుండును.

తిరుచునాపల్లి ప్రభువగు 'విజయరంగ చొక్కలింగభూపతి' కాశ్మీరమునుండి ఒక మేలైనశాలువాను తెప్పించి 'తాయమానవర్' అను యోగికి బహుమతిగా నొసంగెను. కొంచెము సేపటికి, చినిగిన చీనాంబరముతోనున్న ఒక హరిజనస్త్రీ యోగిచెంతకు వచ్చెను. ఆమె చలితో గజగజవణకుచుండెను. ఆ యోగి ఆమెను జూచి దయార్ద్రహృదయుండై, ఆ శాలువా నొసంగెను. దీనిని విని రాజు ఆగ్రహావేశపరవశుండాయెను. యోగిని కాళ్ళు, చేతులు బంధించి తనచెంతకు దోడ్కొని రమ్మని భటులను బంపెను. ఆయోగి నిర్భయముగా రాజు చెంతకు వచ్చెను. 'శాలువా ఎచట నున్న'దని రాజు అడుగగా, యోగి, దానిని మాతయగు అఖిలాండేశ్వరి కిచ్చితినని పల్కెను. ('The mother of the universe'). రాజు సిగ్గుపడి, క్షమాపణకోరెను. 'యద్యత్ పశ్యతి చక్షుర్భ్యాం తత్తదాత్మేతి భావయేత్' — "కంటితో దేనినిజూచుదో, అది ఆత్మ భావముగాజూమను" అను ఉపనిషత్తు వచనము సత్యమైనది. భారతీయయోగులు ఈశ్వరుని తమ ఎదుట దర్శించిరి. (వేదాహమేతం పురుషం మహాన్తం) 'రామకృష్ణ పరమహంస' వివేకానందునితో నిట్లు వచించెను. "నేను నిన్ను చూచినట్లుగానే పరమాత్మనుజూచెదను. ("I see God face to face, just like I see you") బ్రహ్మభావముగలిగిన మహాత్ములకు సర్వకాల బ్రహ్మపర్యంతము సమానముగా నుండును. రామతీర్థస్వామి 6సం: 138 వ పుటలోనిట్లు వ్రాసెను. "గాయముతో బాధపడు ఒకస్వామిని నేను జూచితిని. సూక్ష్మ క్రిములు ఆ చర్మమును తినుచుండెను. ఈ పురుగుల జంపుట కేమి ఔషధము నాయన వాడుచుండుటలేదు; పైగా క్రిందపడిన పురుగుల నాయనతీసి, చిరునగవుతో వానిని పుండుమీద బెట్టుచుండెను. ఆయోగి ఇట్లుచెప్పెను. "ఈ చిన్నశరీరము ప్రపంచములోని అన్ని పురుగులకు జెందును. ఈ విశాలప్రపంచము నాకు జెందును. ఈ విశ్వమే నాశరీరము,వాయువు,భూమి నామస్తులు పాదరక్షలైయున్నవి": స్థితప్రజ్ఞుల లక్షణములిట్టివే.

ఒక ఐరోపీయ యాత్రికుడు 'ఉల్ఫ్' (Wolf) అనువాడు భారతదేశ పర్యటనము చేయుచు ఒక అడవిలో నొక యోగిని దర్శించి, ఆయన నిట్లు ప్రశ్నించెను. "నీవు ఈశ్వరీయ జ్ఞానము నెట్లు పొందగలవు ?" ఆ యోగి యిట్లు చెప్పెను. "నన్ను ప్రశ్నలడుగ పలదు. నీవు నావంక చూడుము; నేను పర మాత్మనై యున్నాను." "అహం బ్రహ్మాస్మి, అయమాత్మా బ్రహ్మ, ప్రజ్ఞానం బ్రహ్మ, తత్త్వమసి" ఇత్యాది వచనముల భావమిదియే.

భారతీయ సంస్కృతి నర్థము చేసికొన్న పాశ్చాత్య విద్వాంసులు అనేక మంది గలరు. సోక్రటీసు, ప్లేటో, అరిస్టాటల్ మున్నగు గ్రీకు విద్వాంసులు మన వేదాంతమును శ్లాఘించిరి. సోక్రటీసు భారతీయ బ్రాహ్మణ విద్వాంసులతో మాటాడిన ఉదంతమును 'యుసేబ్రియసు' వ్రాసెను. సోక్రటీసు భారత భూమికి వచ్చెనని కొందరు వ్రాసిరి; కాని తగిన చారిత్రకాధారములు లభ్యము కాలేదు. యువకుడైన 'యూధిడిమాసు' జ్ఞానుల గ్రంథములను సమకూర్చి గ్రంథాలయ మేర్పరచుట చూచి, సోక్రటీసు అతనిని పొగడియుండెను. 19 వ శతాబ్దములోగూడ 'మాక్స్ ముల్లర్' స్కోపెన్‌హారు, పాల్‌డ్యూసేస్' మున్నగువారు భారతీయ సంస్కృతిని బలువిధముల పొగడి యుండిరి. యస్. యన్. అగర్వాలు అమెరికా సంయుక్త రాష్ట్రముల కేగినపుడు నచటి ఆచార్యు లిట్లు పల్కిరి. "ప్రాచీన దేశమైన భారతభూమి పశ్చిమ దేశముల గ్రుడ్డిగా ననుకరించరాదు; దీనికి బదులుగా భారతదేశ సంస్కృతిని వారికందజేసి వారి కవసరమైన నూత్న జీవిత విధానమును పశ్చిమ దేశీయుల కొసంగ వలెను. ("that an ancient nation like India should not try to 'ape' the west. Instead, she should evolve her own glorious culture and give to the western countries a 'new way of life', which they so urgently need")

'జాన్‌డ్యూయీ' అను విద్యావేత్తకూడ యిట్లు పల్కెను. "భారతదేశ సంస్కృతిలో ఉత్తమమైన దానిని రాబట్టుము." హార్వర్డు విశ్వవిద్యాలయము లోని ఒక ఆచార్యుడు (Prof. Schumpeter) ఇట్లుపల్కెను. "అమెరికా తన ఖండమును, మానవకోటిని తారుమారొనర్చెను; భారతదేశము దాని ననుకరించినచో, దన్ను తానుచంపుకొనినట్లే." (M. R. Sept 1949 – 'America has made a mess of herself and humanity.' If India copies her, she will kill herself") మానవతా వాదము (Humanism) భారతభూమిలో కొన్నివేల వర్షములక్రితమే ఆవిర్భవించినది; కాని దీనాచేసు

యూరోపు ఖండములో విక్టోరియారాణి యుగములో నావిర్భవించినది. 'మానవు లందరు సమానమే' అనుభావము భారతావనిలో మహాత్ములలో బయలుదేరినది.

యూరోపు సంస్కృతికి మూలసిద్ధాంతములగు సమత్వము, స్వాతంత్ర్యము, భ్రాతృభావము అను భావములు ఈ దేశములో బయలుదేరి, అరేబియనులద్వారా, పశ్చిమ దేశములకు ప్రాకినవి. బుద్ధదేవుని బోధలవలన భారతీయులు ధర్మాత్ములు, పరోపకార బుద్ధిగలవారై వినుతిగాంచిరి. బాటలమీద అన్నసత్రములు, చలి వేందరలు, పుణ్యశాలలు, పూర్వకాలములో విశేషముగా నుండెను. ఇది యంతయు హృదయ వికాసముయొక్క ప్రభావము. మనుజులందరిని ఒక హిందీ కవి 'కంజూస్, మక్కీచూస్, ఉదార్, త్యాగి' అని నాల్గురకములుచేసెను. భారతీయులలో 'ఉదారబుద్ధికంటె త్యాగబుద్ధి అధికముగానుండెను.

ఒకసారి సింహళద్వీపములో గొప్పక్షామమువచ్చెను. 'బోధిమేఘేశ్వర, 'అభయదంష్ట్రి' అను వారు 300 మంది భిక్షువులతో కాంచీపురమునకు వచ్చిరి. వారిట్లుచెప్పిరి. "జంబూద్వీపములో విశేషముగా నాహారపదార్థములు గలవని, శాంతితోను, నిశ్చలముగాను దేశముగలదని మేము విని యిచ్చోటకు వచ్చినాము." వారిచట నున్నంతకాలము, ఉదారబుద్ధిగల భారతీయులు వారికి గావలసిన పదార్థ సంచయముల, భోజనపానీయాదుల నొసంగిరి. 'హౌనుత్సాంగు' జీవిత కర్త 'హ్వ్యాలీ' పై విషయము నుల్లేఖించెను. "నీవు బ్రతుకు, ఇతరులను బ్రతుకనిమ్ము" అను బంగారు సూత్రము (Live and let live-Golden rule.) అమలులో నున్నది.

ఆధ్యాత్మిక జ్ఞానఫలిత మిదియే. ప్రపంచవాసుల కిది అర్థముకాక, కొన్ని చోట్ల తప్పటడుగులు వేసిరి. 'రామతీర్థ' అమెరికా కేగినపుడు ఒక అమెరికావాసి యిట్లడిగెను. "ఆసియా ఖండపు సోమరిపోతు తనమును, ఈ దేశములో నేల దిగుమతి చేసెదవు? బయటకేగి కొంత లోకోపకారము సల్పుము. (An American—"Why do you import Asiatic laziness into America ? Go out, and do some good'.) వ్యాపారమే వ్యాపారముగా బెట్టుకొన్న అమెరికా వారికి 'రామతీర్థ' నిరాడంబర జీవితము, ఉన్నతమైన ఆలోచన ఎట్లిష్టమగును? ('The business of America is business,.) జగత్తంతయు స్వార్థము, ద్వేషము, అసూయ మున్నగు దుర్గుణములతో నిండియున్నది. 'ధనవంతుడే విద్వాంసుడని, కులీనుడని, జ్ఞానవంతుడని చెప్పబడుచున్నాడని, ఎవరియొద్ద ధనముగలదో వాడే

సంస్కృతి గలవాడని తలంపబడుచున్నదని 'ఆచార్య శివదత్తజ్ఞాని" చెప్పినది సత్యముగా గాన్పించుచున్నది. ఈనాడన్ని దేశములు ధనార్జనమే ప్రధానముగా బెట్టుకొన్నవి. 'టాల్‌స్టాయ్' చెప్పినట్లు 'ధనవంతుల కలుష పూరిత నాగరికత' జగతిలో నధికమగుచున్నది. (Rich man's corrupt civilzation.)

అందుచేతనే 'రామకృష్ణపరమహంస' ఒకసారి యిట్లు నుడివెను "కొందరు ధనమను వెఱ్ఱిలోను, కొందరు అధికారపు వెఱ్ఱిలోను, కొందరు పేరుప్రతిష్ఠలు, బిరుదులు సంపాదించు వెఱ్ఱిలోను ఉన్నారు; కాని నేను మాత్రము 'ఈశ్వర సాక్షాత్కారము' అను వెఱ్ఱిలోబడి పోవుచున్నాను." అరవిందయోగి కూడ తనకు గల మూడు వెఱ్ఱులలో 'భగవంతుని సాక్షాద్దర్శనము' అను వెఱ్ఱిగలదని చెప్పినాడు. 'లోకో భిన్నరుచిః' అనునది అందరెరిగినదే. ఏపనికైనను ధనము పనరమే. 'రాజతరంగిణి'లో 'సూర్య' నామక ఇంజనీరు యిట్లు పల్కెనని కలదు. 'నాకొక ప్రణాళిక కలదు; కాని ధనసంచయములు లేకుండా నేనేమి చేయగలను? ('I have a plan but without resources, what can I do?) కాని ధనముతోబాటు, జ్ఞాన సంపదకూడ అవసరము. ఒక గ్రంథకర్త యిట్లు నుడివెను. "జ్ఞానమునకు సంబంధించిన గ్రంథాలయము, అన్ని సంపదలకంటె విలువైనది." జాతి, మత కులవిచక్షణలకు ప్రాధాన్యమివ్వక, ధర్మమునకే అధిక ప్రాధాన్యమొసంగిన బౌద్ధకాల భారత వర్షము, ఆధ్యాత్మిక విలువల కధిక ప్రాధాన్య మొసంగినది; కాని నేడు అదే భారతవర్షము పాశ్చాత్యదేశముల గ్రుడ్డిగా ననుకరించి, వారి సభ్యతను ధ్యేయముగా బెట్టుకొని, ఆత్మజ్ఞానమును మరచిపోయి, ధనమువైపు వెఱ్ఱెత్తి పరుగిడుచున్నది. భారతభూమి యిట్టిసంఁదేశమెట్టి?

మహనీయుడైన అక్బరు చక్రవర్తి (Akbar the great) అంతటి గొప్పవా డయుండి కూడా, నిరాడంబర జీవియై, ప్రతివర్షము శివరాత్రినాడు భారత దేశములోని యోగులందరిని ఆహ్వానించి ఒక సభచేసి, సభానంతరము, ముఖ్యమైన యోగులతో గలసి త్రాగుచు, భుజించుచు కాలము గడుపుచుండెనని, మామూలు జనుల ఆయుష్షుకంటె ఆయన ఆయుస్సు మూడు నాల్గు రెట్లు అధికముగా నుండునట్లు వారు ఆశీర్వదించుచుండిరని, ఐనీ అక్బరీ I, అను గ్రంథము తెల్పును, జ్ఞానులన్న ఈయన కెంత ప్రేమయో దీనినిబట్టి తెలిసికొనవచ్చును. (Aiyini Akbari – Vol I – 'Once a year also during a night called Sivarathri, a great meeting of all Yogis was held of the empire, when the Emperor, ate and drank with the principal Yogis,

who promised him that he should live three and four times as long as ordinary men'. భారతభూమిలో 62 లక్షల సాధువులున్నారు. వీరిలో సఖర భాగము వాచా వేదాంతులు; అనుష్ఠాన వేదాంతులు కారు. ఆంధ్రదేశీయుడు, అంతర్జాతీయ ఖ్యాతి పొందినవాడు అగు వేమన 'ఆధ్యాత్మిక సంస్కృతికి' రత్నము. ఈయనను గూర్చి కొంచెము తెలిసికొందము.

## వేమనయోగి చరిత్ర

వేమన కవియే కాకుండా, మహావేదాంతి; అనుష్ఠానపరుడు. బెంగాలులోని 'టాగూరు' (Poet of Asia) ఇంగ్లాండు కవి 'రాబర్టు బ్రౌనింగు' కంటె వేమన కొన్ని విధముల నధికుడు. ఈయన పద్యములను క్రీ. శ. 1824 లో సి. పి. బ్రౌను ప్రథమముగా నాంగ్ల భాషలోనికి మార్చెను; తర్వాత క్రీ. శ. 1872 లో 'గోవర్' అను కవి ఆంగ్లభాషలోనికి మార్చెను. ఇవి నీతిదాయకములు, బోధగల్గించునట్టివని ఈయన వ్రాసెను. వి. ఏ. స్మిత్ తన Oxford History of. India' అను గ్రంథమున 'గోవర్' వ్రాసిన నాల్గు పద్యముల నుదాహరించెను. Imperial Gazeteer of India – Vol. II లో 'గియర్సన్' 1904 లో వేమనను గూర్చి వ్రాయుచు నిట్లు వ్రాసెను. "సామాన్య ప్రజలకవి యని పేర్గాంచిన (The poet of the People) వేమన అతిముఖ్యమైన రచయిత. క్రీ. శ. 16 వ శతాబ్దమునకు చెందినవాడు. ఆయన గ్రామ్యభాషలో వ్రాయుచు, కులములమీద, స్త్రీలమీద దాడిచెడలెను. అందురు తెలుగు రచయితలలో నేడీయన అత్యధికమైన పలుకుబడి గలిగియున్నాడు. వేమనయోగి పేరుతో లేని సామెతకాని, వచనముగాని లేదు." ఈ విధముగా నీయన అంతర్జాతీయ ఖ్యాతిగడించెను. ఈయన పద్యములు తమిళ, కన్నడ మళయాళభాషలలోనికి మార్చబడినవి.

జననము – ఈయన క్రీ. శ. 1400–1500 మధ్యవాడని క్రీ. శ. 1424 – 1428 వరకు పాలించిన అఖరు రెడ్డిరాజు 'రాచవేమారెడ్డి' సోదరుడని కొందరు వ్రాసిరి. ఈయన మహారాజు తమ్ముడని, అన్నయనిన భయములేకున్నను పదినెయిగురు నరసమ్మయసిన చాల భయభక్తులు గలవని శ్రీమహాభక్త విజయము వ్రాయుచున్నది. కొంద రీయన కొండవీటి 'కుమారరెడ్డి' పుత్రుడని వ్రాసిరి; కొందరు 'పెదకోమటి వేమారెడ్డి' పుత్రుడని వ్రాసిరి. 'గ్రియర్సను' ఈయన క్రీ. శ. 16 వ శతాబ్దము వాడనెను. వేమనపద్యములను 2100 లకు సమకూర్చిన 'సి. పి. బ్రౌను,' ఈకవి 18 వ శతాబ్దారంభమున జీవించెనని 707 వ పద్యములో

ఈయన జనన సంవత్సరముగలదని, ఇది క్రీ. శ. 1652 కు సరిపోవునని, కొన్ని పద్యములనుబట్టి ఆ యా ప్రాంతములలో ముస్లింములు పాలకులుగానున్నపుడు అనగా క్రీ. శ. 17 వ శతాబ్దపు ఆఖరుభాగములో నీయన జీవించెనని చెప్పవచ్చు నని వ్రాసెను. నందన సంవత్సరమని ఉదాహరించిన పద్యమిది.

కం. "నందన సంవత్సరమున
పొందుగ కార్తీకశుద్ధ పున్నమనాడున్
వింధ్యాద్రిసేతు
బంధన నౌర వీరుచేలు సరగునవేమా!"

బ్రౌనులెక్క ప్రకారము ఈ నందన క్రీ. శ. 1652 కు సరిపోవునని, అదియే జననవర్షమని ఆయన ఊహ. క్రీ. శ. 1652 నందననామ సంవత్సర కార్తీకశుద్ధ పౌర్ణమినాడు జననమని, క్రీ శ. 1680 లో గటాటుపల్లెలో మరణమని కొందరు వ్రాసిరి. శార్వరీ చైత్ర శుద్ధ నవమి రోజున మరణమని కొందరు వ్రాసిరి. వేమన చరిత్రల జాలామంది వ్రాసిరి; కాని ఈయన జనన, మరణ సంవత్సరముల సరిగా నిర్ధారణ చేయలేకపోయిరి.

జనన ప్రదేశము-'వేమన పద్యములలో' నీ క్రింది పద్యము కాన్పించుచున్నది.

ఊరు కొండవీడు ఉనికి పశ్చిమవీధి
మూగచేతచెల్ల మొదటిఇల్లు
యరసిచూడ జూడనది ముక్తిమార్గమో
విశ్వదాభిరామ వినురవేమ॥ పద్యము 497

'వేమన సూక్తిరత్నాకరము'లో నిది కొంత మార్పుగానున్నది.

ఊరు కొండవీడు మనికి పశ్చిమవీధి
మూగ చింతపల్లె మొదటి ఇల్లు
ఎడ్డి రెడ్డి కులమదేమని తెల్పుదు ॥విశ్వ॥

ఈ పద్యమునుబట్టి వేమన నివాసము కొండవీడని కొందరు వ్రాసిరి. ఈ పాఠాంతరము బ్రౌను వ్రాసిన పద్యమునకు భిన్నముగా నుండుటచేత ఎంత వరకు సత్యమో తెలియకున్నది. పైగా పై పద్యమునకు బ్రౌను కొండవీడు నెత్తు కొనకుండ వేదాంతపరముగా నిట్లు వ్రాసెను. ("The village of our body in which the deity dwells is Hill Town; (the head) his

is in back street. (the spine) There is silence in the first house We gaze and continually view it, this is the road of beautitude.) దీనినిబట్టి 'కొండవీడు', శరీరములో పరమాత్మ నివసించు గ్రామమని బ్రౌను వ్రాసెను అందుచే జననము 'కొండవీడని చెప్పవీలులేదు. ఈయన 'కడపజిల్లా' వాసియని, 'గండికోట' సమీపములో నీయ జననము కానవచ్చునని బ్రౌనువ్రాయు చున్నాడు. ఇది సత్యమే కావచ్చును,

ఈ క్రిందిపద్యము ఈ ఊహను బలపరచుచున్నది.

గండికోటలోన కస్తూరి మృగముండు
రాజుగారు దొడ్డ రౌతుగాడు
నెంతవారికైన నెత్తిపడంగొట్టు ॥విశ్వ॥

సందర్భములేని 'గండికోట' ను బేర్కొనుటచేత, నిది జన్మభూమి కావచ్చును. కులము — ఈయన రెడ్డికులస్థుడు. తాను కాపుకులమునకు జెందిన వాడని స్వయముగా వేమన చెప్పినాడు. కాపులు, రెడ్లు రెండును పర్యాయపదములే.

పానగంటిరెడ్డి పరగమోటారెడ్డి
మెనగుతోట పెద్ద యెర్రరెడ్డి
మొరుసులందరు భువి హరిహొప్ప నన్నింట
ప్రతిభకెక్కె రెడ్లు పరగవేమ.

వేమన కాలమునాటికి వీరు ప్రతిభకెక్కిన రెడ్లు కావచ్చును.

మనమున జేసిన మైనవుణిష్టి
ప్రణతము దైదగు రావులదొడ్డి (సత్రావులదొడ్డి)
అనువుగజేసెను యందరనొక్కి
వినతముగాగను వేమనరెడ్డి

ఈ పద్యములో 'వేమనరెడ్డి' అందరను దీసికొని చక్కగా బోధించి, ఖ్యాతి గడించెనని యున్నది. 213 వ పద్యములో 'వేమనృపాలశేఖరా!' అని ఉన్నది. కాని ఈయన రాజ్యపాలనచేసిన ఆధారములు లభ్యముకాలేదు. ఈయన ఏకాలమున సన్యసించి, శిష్యులతోబాటు ఊరూర దిరుగుచు దిగంబరుడై వేదాంతబోధ చేసియుండెను. వేమన వాఙ్మయము — ఆంధ్రభాషలో దాదాపు 600 శతకము లున్నవి. భక్తి, జ్ఞాన, వైరాగ్య, నీతి, శృంగార సంబంధముగు శతకము

ఉన్నవి. కొన్ని హేళనశతకము ఉన్నవి. వేమన, రామలింగేశ, కవ్వాలచెన్న, చంద్రశేఖరశతకములు సాంఘిక దురాచారములను, మూఢనమ్మకముల ఖండించినవి. ఈయన గురువు 'అభిరాము' డగుటచేత ప్రతి పద్యములోను ఆయన పేరుతో సంబోధించెను.

'సి. పి. బ్రౌను' బందరులో 'అసిస్టెంటు జడ్జిగా, నున్న కాలమున, ఆంధ్ర పండితుల సాయంబున బళ్ళారి, కడప, మద్రాసు, విశాఖపట్టణము, ఈయన ఉన్ననగరములోను తాళపత్రికా శరణ్యములైయున్న వేమన పద్యముల నొక చోటుకుజేర్చి ఒక సంపుటము తయారుచేసెను. ఈయన 2100 పద్యములను సమకూర్చెను. ఇందులోని వానిని 1220 పద్యములను బ్రౌనుగారి ఆంగ్లానువాదముతో ఆంధ్రసాహిత్య అకాడమీవారు ప్రచురించి, మనకు మహోపకార మొనర్చిరి. ఇదియొక ప్రామాణిక గ్రంథముగానున్నది. వేమనగారి గంగాధర కవిగారు 5000 పద్యములను సమకూర్చి ప్రచురించినారు. వేమనయోగి పద్యములు 7000 గలవని పరంపరా వినబడుచున్నది. కాని వీనిలో ఈయన రచితములెన్నియో, శిష్యరచితములెన్నియో తెలియకున్నవి. కాని ఈవాఙ్మయము చిరస్థాయిగా నుండును. వేమన, అక్కాంబ, కూనలమ్మ కోపదములెంచిన మహాత్ములు. 'రామతీర్థ' అరవింద, వివేకానందాదుల భావములవలె ఈయన అధ్యాత్మ భావము లున్నవి. కొన్ని ముఖ్యమగు భావముల నిచట పొందుపరచుచున్నాను. వేమన్న జయంతుల జరుపుటకూడ ముఖ్యము. వంగూరి సుబ్బారావు గారిట్లు వ్రాసిరి. "సామాన్య ప్రజలిట్లు వేమన్నకవి జయంతి జరుపుచుండగా, విద్యార్థులు వాఙ్మయ ప్రియులు నగుదుమని గర్వించు మన నాగరికు లిప్పుడిప్పటికైన, వేమన్న జయంతి నారంభించిరనుటయు, మనల మనమభినందించు కొనవలసిన విషయమే.'

## 1. గురువు

కం. సద్గురు కృప జ్ఞానంబున
సద్గతి దీపించుచున్న చాలా చదువుల్
సద్గతి గలుగగ జేయును
సద్గురువే దైవమనుచు జాటర వేమా॥

గీ. సకల శాస్త్రంబు లెల్లను జదువువారు
చదువుకోనట్టి వారితో సమముగారె

గురుముఖంబున ననుభవం బరయకున్న
విశ్రుతంబుగ జగమున వినురవేమ॥

ఆ. అరయ దోచువారు గురువుల మందురు
తెలివిలేక దమ్ము దెలియలేక
పనికిమాలినట్టి బానిసె కొడుకులో ॥విశ్వ॥

ఆ. పూజ చక్కజేసి పుణ్య మార్జించిన
పూజ్యుడైన గురువు పూజవలన
తేజమెల్లగాంచి తిరుగ డెన్నటికైన ॥విశ్వ॥

ఆ. గురువునకు పుచ్చకూరైన నివ్వరు
అరయ వేశ్యకిత్తు రర్థమెల్ల
గురువు వేశ్యరన్న కులహీనుడేమొకో ॥విశ్వ॥

ఆ. ఆశలం బెగంగోసి యనలంబు చల్లార్చి
గోచి బిగియంబట్టి కోపమడచి
గుట్టు మీరువాడు గురువుకు గురువురా ॥విశ్వ॥

పరావిద్య, అపరావిద్యలలో బరము ఉత్తమమైనది. అందుచేతనే దయానంద సరస్వతి అన్నిదానములలో విద్యాదానము గొప్పదనెను, ఆధ్యాత్మిక సంబంధమగు ఆవిద్యను బోధించువాడు వేమనవంటి మహాత్ముడై యుండవలెను. అనుష్ఠానములేని గురువులు నిష్ప్రయోజనము.

## 2 మనసు

కం. ఎన్నగ మనసే కారణ
మన్నిటికిని జూడజూడ నాత్ముడు తానే
యున్నంత కాల మెచ్చట
నున్నను ఇది నిజము తెలియ నొప్పుగ వేమా॥

ఆ. అగ్రమందు జూపు యాభ్యాస విధినిల్పు
మధ్యమందు జూపు మనసు నిల్పు
నంతమందు జూపు నరయు నాపోజ్యోతి ॥విశ్వ॥

గీ. వేదవిద్యగాదు వీరవిద్యయుగాదు
బాధవిద్యగాదు పరుపుగాదు
మధురమైనయట్టి మనసు నిల్పెడి విద్య
స్వాదువిద్య యెన్న సరగపేమ॥

గీ. పంచకరణములను బంధించనేరక
నందులో శిఖిశిఖిలందుకొనక
మనసు యొకటిగాక మరి ద్విజుడెట్లగు ॥విశ్వ॥

గీ. త్రాడు మెడనువేసి తనకు శూద్రత్వంబు
బోయె ననెడిదెల్ల బుద్ధి కొదువ
మనసునిలక త్రాడు మరి వన్నె దెచ్చునా ॥విశ్వ॥

గీ. ఆసనాదులెల్ల నభిషేక పూజలు
కాశియాత్రలు వ్రతకల్పకములు
మనసు నిలక నెన్ని మార్గముల్ నడిచిన
పనిగొనవు తెలియగ బరగపేమ॥

గీ. తాను నింద్రియములఁ దనర జయించిన
తత్త్వమరసిచూడఁ దానయగును
రాజయోగి యిట్లు దేజరిల్లుచునుండు ॥విశ్వ॥

గీ. ఆశకన్న దుఃఖ మతియంబుగ లేదు
చూపు నిలుపకున్న సుఖములేదు
మనసు నిల్పకున్న మరి ముక్తిలేదయా ॥విశ్వ॥

గీ. మనములోనబుట్టు, మరి కోర్కులన్నియు
కోర్కులందు ముక్తి కుదురుపడదు;
మనము బ్రహ్మమనుచు మదినెరుంగగలేరు ॥విశ్వ॥

"చలేవాతం చలేచిత్తం, నిశ్చలం నిశ్చలంభవేత్" అని హఠయోగప్రదీపిక తెల్పుచున్నది. మనసు చంచలమైనదని, గాలి నణచుటవలె, మనసు నణచుట అసాధ్యమని, అయినను అభ్యాసము, వైరాగ్యముచేత నణచవచ్చునని గీత తెల్పుచున్నది.

శ్లో. చంచలంహిమనః కృష్ణ ప్రమాథిబలవద్దృఢమ్
తస్యాహం నిగ్రహంమన్యే వాయోరివసుదుష్కరమ్.

శ్లో. అసంశయం మహాబాహో మనోదుర్నిగ్రహం చలమ్
అభ్యాసేనతు కౌంతేయ వైరాగ్యేణచ గృహ్యతే.

## 3. మాయ

ఆ. తన్ను గన్నవారు తాగన్నవారును
చచ్చుటెరిగి తాను జచ్చుటెరిగి
తెలియనీదు మాయ దీనిల్లుపాడాయె ॥విశ్వ॥

నహుషుడు ధర్మరాజు నడిగిన ప్రశ్నలలో నిది కలదు. 'అన్నిటికంటె ప్రపంచములో విచిత్రమైనదెద్ది ?' ధర్మరాజిట్లుచెప్పెను. "తనచుట్టు, వేలకొలది జనులు నిత్యము మరణించుట కండ్లారచూచుచుండును. కాని తనకు మరణముగల్గునని ఎన్నడు తలంచడు. ఇది అన్నిటికంటె విచిత్రమైనది."

## 4. కామినీకాంచనములం దాశ-వైరాగ్యము

ఆ. కాంతయందె వెదలి కాంతకై యాశించి
గాసి బడగనేల కాంతచేత
కాంతవిడుచువాడు ఘనతరయోగిరా ॥విశ్వ॥

ఆ. గతము యింద్రియములగట్టి వేయగలేక
జావు వచ్చినపుడు సన్యసించి
నాత్మ జయములేక అందునా మోక్షంబు ॥విశ్వ॥

ఉ. కాముకుడై నహుడు ధనకాంక్షవహించినవాడు మిక్కిలిన్
పామరుడై నవాడు, భువిబాలనసేయనివాడు, మూర్ఖుడున్
మోమరసేయువాడు, మరిముక్తినిగాంచునె ఎన్నిభంగులన్
వేమన వాక్యమొక్కటియు వీసరబోవునె దారిదప్పినన్

ఆ. బాలచనుల పూలబంతుల బోల్తురు
పాలుమాలినట్టి భ్రష్టులవని
మాంసఖండమందు మరియేమియున్నది ? ॥విశ్వ॥

గీ. మాళ్ళు వెంటరావు మణులు వెంటరావు
యాలుబిడ్డలు హితు లరయరారు
తానుయిచ్చు ఈవి తనవెంటవచ్చురా ॥విశ్వ॥

గీ. గోచిపాతబెట్టి కోరితామునినంట
మనసులోని యాసమానలేడు
యాకృతెన్నవేరు యాశ ఎన్నగవేరు ॥విశ్వ॥

కం. ఎక్కడిసుతు లెక్కడిసతు
లెక్కడిబంధువులు, సఖులు, నెక్కడి భృత్యుల్
డొక్కబడి పోవువేళల
చక్కటికిని నెవరురారు, సహజము వేమా.

గీ. ఆశవిడుకకాని పాశము త్రుడుకాడు
ముక్తుడైనగాని మునియుగాడు
మునికిగాని సర్వమోహంబు లూడవు ॥విశ్వ॥

గీ. యోగిననుచు గొంత యోగము గూర్చుక
జగములోని వాని జంపుకొనుచు
ధనము కొరకు మిగుల దారాడుచుండిన
యోగిగాదు వాడు యోగు వేమ.

గీ. పరమహంస ననుచు పరవ గట్టుక భూమి
పరధనముల కాసపడెడి వాడు
పరమహంస గాడు పరమహింస యంద్రు ॥విశ్వ॥

గీ. తోటకూరకైన దొగ్గలాకునకైన
తపుడుకైన తాలు తప్పకైన
కావ్యములను జెప్పుగాడ్డెలు ఘనులైరి. ॥విశ్వ॥

"కాతే కాంతా, కస్యేపుత్రః, సంసారః అయం విచిత్రః" అని శంకరుని సూక్తి. జ్ఞానికి సంసార భ్రాంతిగాని, కామినీ కాంచనములం దాశగాని లేదు. 'సుజాత' పెట్టిన మృష్టాన్నమును తథాగతుడు భుజించి, హేమపాత్రను నిరంజనా నదిలోబారవైచెను. రామతీర్థ తన మిత్రులతో దాము తెచ్చిన ధనమంత గంగలో

బారవేయుమని చెప్పెను. ("Here Rama ordered his companions to throw away all the cash if they had any, in the Ganges.") 'రామకృష్ణ పరమహంస' బంగారము, మట్టి సమానమని చెప్పుచు, తనకు భక్తులిచ్చిన వెండి బంగారు నాణెముల గంగానదిలో బారవేయు చుండెను. ఇట్టి త్యాగసంపన్నుల వలననే భారతభూమికి పేరు వచ్చినది.

## 5. యోగము

గీ. ముక్కు తుదను దృష్టి ముదము తోడుత నిల్పి
హృదయమందు జూచి యొసగు మహిమ
పదవి తెరగుగన్న బరమాత్మ యోగియౌ ॥విశ్వ॥

గీ. ముక్కు తుదను దృష్టి మురువుగా నిల్పిన
నొనర నరుడు చూచుచుండు బరము
పరము దెలియువాడు బంధంబు దెగగోయు ॥విశ్వ॥

కం. రేచక పూరక కుంభక
సూచకముల రాజయోగి సుస్థిరమతియై
లోచూపుజూడ నొల్లక
వాచా బ్రహ్మంబు పలుక పద్దుర వేమా.

గీ. అగ్రమందు జూపు యాధ్యాన విధి నిల్పు
మధ్యమందు జూపు మనసు నిల్పు
నంతమందు జూపు నరయునాపోజ్యోతి ॥విశ్వ॥

కం. గంగాయమునల నడుమను
బంగారపు బొమ్మవోలె బాలిక యుండున్
సంగంబు చెలిమి జేసిన
భంగములేకిందు ముక్తి బరగురవేమా.

'చిత్తవృత్తి నిరోధశ్చ యోగః' అని హఠయోగులు వ్రాసినారు. ఇడా పింగళ అను నాడుల మధ్య శ్రేష్ఠమైన సుషుమ్నా నాడి గలదు. యోగము తీవ్రమైనపుడు, ప్రాణవాయువు గుదమూల స్థానముననున్న కుండలినీశక్తిని లేపి, వెన్నెముక మధ్యలోగల సన్నని కాల్వగుండ, సహస్రారకమలమున చేగి,

అచటనున్న పరమాత్మను గలయును. ఇదియే జీవబ్రహ్మైక్య సంధానము. ప్రాణవాయువులేక జీవు డీస్థానము జేరినచో 'జీవన్ముక్తి' గల్గును. ఇదియే మోక్షము; అపుడిక సంకల్ప, వికల్పములు నశించి జన్మ, మరణ, రాహిత్య స్థానమును జెందును.

## 6. కుండలిని

కం. కుండలి యోగము దెలిసిన
బండాలపు యోగికేల బాలకిపొందుల్
దండిగ నీతను వందే
మెండగు నొక ముక్తికాంత మెలగుచువేషా ।

గీ. షడరవిందములను సాధ్యంబుగాజేసి
కుండలి నుపరినొగి కుదురుజేసి
మనసునిల్పువారు మరిద్విజుడనవచ్చు ॥విశ్వ॥

కుండలినీశక్తి గుదస్థానము మూలమున నున్నది. నిద్రాణమైన యీశక్తిని మేల్కొలుపుటయే విద్య. బ్రహ్మచర్యము, యోగముచేత, వీర్యము ఓజశ్శక్తిగా మారి, ఊర్ధ్వముఖముగా మేధస్సుకేగును. దివ్యకళలు, దివ్యానుభూతులు అప్పుడు కల్గును. ఈ ఓజశ్శక్తి (Spiritual energy) గల్గిన తర్వాత, సుషుమ్నానాడి తెరవబడిన తర్వాత, జగత్తంతయు నీవెంతకనవచ్చును. ఈ కుండలిని మేల్కొన్న వేళ, ఆరంభకుడు భయభ్రాంతుడగును. వివిధ నాదములు వినబడును. అభ్యాసకుడు నిర్భయముగా ముందుకుబోయి, ప్రాణవాయువు ననాహత చక్రమును దాటించవలెను. అపుడు భౌతిక వాసనలుండవు.

## 7. నాద బిందు కళలు

గీ. ఆత్మలోని నాదమాలించి యాలించి
యాశలందు జిక్కుడాది యోగి
యాత్మలోని కళల నంటునా తత్వంబు ॥విశ్వ॥

గీ. సూక్ష్మ మధ్యమునను సౌరిది జీవుండుండు
స్థూల మధ్యమునను సూర్యుడుండు
నాద బిందుకళల నాగబ్రహ్మముండురా ॥విశ్వ॥

గీ. జ్యోతియందు పుట్టె సొంపైన నాదంబు
నాదమందు పుట్టె నలుపు బిందు
వట్టి బిందువందు పుట్టె మన్నునుమిన్ను ॥విశ్వ॥

గీ. తెలివి వెడకచూడు దీపించు కళలను
కళల వెడకచూడు క్రమము బయలు
బయల వెడకచూడు బ్రహ్మంబు వేదుర ॥విశ్వ॥

గీ. బిందుమీద పరచి ప్రియముగా నాదంబు
గళను గూర్చుకున్న ఘనుడుగాడు
యెన్ని పాట్లుబడిన నెట్లబ్బు మోక్షంబు ॥విశ్వ॥

గీ. బిందు నాదుజేసి ప్రియమొప్ప నానాదు
నాదు బిందుకళను పాడుచేసి
నాదు నెరిగిచూడ నందుడే యోగితా ॥విశ్వ॥

గీ. నాదబిందుకళల నయమొంది యాత్మయం
దంటు చపలచిత్త మసురనిల్పి
బ్రహ్మరంధ్రమునను ప్రబలిన యోగిరా ॥విశ్వ॥

కం. ఘంటారావము మదిలో
వింటినేకంటగంటి విపులపు కాంతిన్
వెంటాడగ బ్రహ్మములో
గంటిని వగగాడు నన్ను గనుగొన వేమా।

గీ. నాదబిందువులను నాదంబుగాజేసి
నాదబిందుకళల నాదముగను
జేసి నాద మరసి చింతింప యోగంబు ॥విశ్వ॥

బ్రహ్మచర్యము, యోగముచేత, త్రికూట స్థానమున దృష్టి నిల్పుటచేత నారంభదశలో బిందువు, కళలు గాన్పించును; ఒక విధమైన నాదము వినబడును. ఆరంభకుడు వీనిని విని భయపడకుండ నిర్భీతితో ముందుకు పోవలయును.

## 8. విగ్రహారాధన-దేవుడు

గీ. దేవుడనగ వేరె దేశమందున్నాడె
దేవితోడ నెపుడు దేహమంటె
వాహనములనెక్కి వడిదోలుచున్నాడు ॥విశ్వ॥

గీ. బ్రహ్మమనగ వేరె పరదేశమునలేదు
బ్రహ్మమనగ తానె బట్టబయలు
తన్ను తానెరుంగ తానెపో బ్రహ్మంబు ॥విశ్వ॥

గీ. దేహమందునున్న దేవుని దెలియక
తీర్థవాసులగుచు తిరుగువారు
గంధతరువుమోయు గాడిదెచందంబు ॥విశ్వ॥

గీ. శిలలుజూచి నరులు శివుడని మొత్తురు
శిలలు శిలలుగాని శివుడుగాదు
తనదులోని శివుని దానేల దెలియడో ॥విశ్వ॥

గీ. పొమ్ము దొరుకుదనుక జ్యోతియంతియెకాక
పొమ్ము దొరుకు వెనుక జ్యోతియేల
దేవుడైన వెనుక దేహంబు యదియేల ॥విశ్వ॥

గీ. అడవిదిరుగలేదు యాకసమునలేదు
అవని, దీర్థయాత్రలందులేదు;
ఒడలు శుద్ధిజేసి యొడయనిజూడరా ॥విశ్వ॥

గీ. తోలుకడుపులోన దొడ్డవాడుండగ
రాతిగుళ్ళలోన, రాశిబోయ
రాళ్ళు దేవుడైన, రాసులు మింగవా ॥విశ్వ॥

గీ. హృదయమందునున్న యీశునిదెలియక
శిలలకెల్ల మ్రొక్కు జీవులార ।
శిలల నేమియుండు జీవులందేకాక । ॥విశ్వ॥

విగ్రహారాధనయందు వేమనకు విశ్వాసములేదు. ఆత్మజ్ఞానికిది అవసరము లేకున్నను పామరులకు భక్తి ప్రపత్తులకిది అవసరమని వివేకానందాదుల అభిప్రాయము; నాయభిప్రాయమిదియే.

## 9. కులము

ఆ.
మాలవానినేల మరిమరినిందింప
నొడల రక్తమాంస మొకటికాదె
వానిలోన మెలగువాని కులంబేది ॥విశ్వ॥

ఆ.
జాతి నీతి వేరె జన్మములొక్కటి
యరయ తిండివేరె యాకలొకటి
పశులవన్నె వేరె పాలెల్ల యొక్కటి ॥విశ్వ॥

ఆ.
మాల మాంసముదిను, మరి సర్వజనులెల్ల
క్రొవ్వుదిందు రొక్క కులముగాదె
కులములన్ని యొక్క కులముగా జూడరో ॥విశ్వ॥

ఆ.
కులములేనివాడు కలిమిచేవెలయును
కలిమిలేనివాని కులము దిగును
కులముకన్న మిగుల కలిమి ప్రధానంబు ॥విశ్వ॥

ఆ.
మాలవానినంటి మఱి నీళ్ళమునిగేరు
మనుజ కర్మచేత మాలడయ్యె
నేల తెలియలేరొ యీనరపశువులు ॥విశ్వ॥

భారతదేశమునకు జాతీయభావములేకుండ పోవుటకు కారణ మీకుల భేదములే. 'వేమన, బుద్ధ, అశ్వఘోషుడు, గాంధి, మున్నగు మహాత్ములందరు దీనిని నిరసించిరి. ("Buddha opposed the caste system on biological grounds– A Brahmin and a chandala can together procreate children,") 20 వ శతాబ్దములో గూడ ఇది తాండవించుటము ఆశ్చర్యకరము. ప్రతివాడు బ్రాహ్మణత్వ గుణములుగల్గి, రాగ, ద్వేషములు లేకుండా వర్థిల్లవలెనని నాకోరిక. ("A Brahmin neither cares for death nor for wealth.") ఇదియే బ్రాహ్మణధర్మము.

ఋష్యశృంగో మృగ్యాః కౌశికః కుశాత్
జాంబూకో జంబూకాత్ వల్మీకో వల్మీకాత్
వ్యాసః కైవర్త కన్యకాయాః శశపృష్ఠాత్ గౌతమః
వశిష్ట ఊర్వశ్యాం అగస్త్యః కలశో జాత
ఇతి శ్రుతవ్వాత్

38 వ ఉపనిషత్తు వజ్రసూచికోపనిషత్తు తెల్పును. ఇది సాకేతబ్రాహ్మణుడగు 'అశ్వఘోషరచితమని' విద్వాంసులు వ్రాసినారు. పై మంత్రమునుబట్టి ఋషుల జన్మవిదితంబగును. ఇంకను మరియొకచోట నిట్లున్నది.

నరక్తస్యనమాంసస్య నచాస్థినః నజాతి
రాత్మనో జాతిర్వ్యేవ హారప్రకల్పితాః.

కనుక జాతి భేదము రక్తమాంసఅస్థి ఆత్మలకులేదు. దీనికి బలియై జాతీయ భావమును చెడగొట్టవద్దు.

## 10. సమత్వము

గీ. బ్రాహ్మణులకు బెట్ట ఫలముగల్దని యంద్రు
కుక్కలకును బెట్ట కొదువ ఏమి
ఇందునందు జీవుడొక్కడె యందురు. ॥విశ్వ॥

గీ. తల్లిగర్భమందు తా బుట్టినప్పుడు
మొదల బట్టలేదు తుదనులేదు
నడుమ బట్టగట్ట నగుబాటు గాదకో ॥విశ్వ॥

(Marco Polo-The ascetics said- "We go naked because naked we came into the world") ఆత్మభావముగల్గిన తర్వాత దిగంబరుడై తిరుగుట అతి క్లిష్టమైనది. జ్ఞాని బాలోన్మాద పిశాచమువలె తిరుగునని రామకృష్ణ పరమహంస వచించినాడు. దిగంబరత్వము పసిబిడ్డ దశయేకదా!

## 11. ఆయుర్వేదము

గీ, చేదరాసి వేరు చెలువంబుతో దెచ్చి
పొన్నగంటి పసరుబోసి నూర
సహజమైనయట్టి సర్వాంజనంబురా ॥విశ్వ॥

ఆ. హేమశుద్ధి గొనుచు యింగిలీకముగొని
పాలమన్నుగూర్చి భట్టిసేయు
నెలవు దెలియకున్న నయమించుకయు లేదు. ॥విశ్వ॥

అక్బరు చక్రవర్తివలె వేమనకు 'పరుసవేది' తెలియునని వదంతి గలదు. బంగారమునుజేయు క్రియలేమిటో, సరిగా దెలియలేదు. మట్టి, బంగారును సమముగాజూచు బుద్ధ, రామకృష్ణ పరమహంస, రామతీర్థుల బోలిన వేమనకు, కాంచనముతో నిమిత్తము లేదుకదా!

## 12. ఆత్మజ్ఞానము

ఆ. ఆత్మయనెడు చక్రమం దాత్మలింగంబు
యరిది నలరుచుండునట్టి దాని
పరగజూచినంత బ్రాప్తించు మోక్షంబు ॥విశ్వ॥

కం. జ్ఞానికి కర్మం బేటికి
జ్ఞానికి మర్మంబు వలదు సత్పురుషునకున్
జ్ఞానము నిర్మలమైనను
మానుగ భవముక్తి కలుగు మహిలో వేమా!

ఆ. జ్ఞానవంతుజూచి సరికర్మ బద్ధులు
వెట్టియంద్రు ప్రకృతి విడువలేరు
వెట్టి కవని బ్రకృతి వెదకిన గల్గునా ॥విశ్వ॥

ఆ. ఆత్మబుద్ధి వలన నఖిలంబు తానయ్యె
జీవబుద్ధి వలన జీవుడయ్యె
మోహబుద్ధి లయము ముందర గనుగొను ॥విశ్వ॥

ఆ. చదువులు చదివేటయ్యలు
పదవికి బొందంగలేరు పరమార్థముగా
పెదవుల గదలపకుండిన
మదిలోనిది రాజయోగ మహిమము వేమా!

హనుమంతుడిట్లు చెప్పెనని రామాయణము తెల్పును. "నాలో శరీర భావమున్నంతవరకు నేను సేవకుడను. నేను జీవుడ ననుకొన్నచో నేను నీలోని భాగమును. నేను ఆత్మనని తెలిసికొన్నచో నేను నీవు ఒకటియే. ఇది నా నిశ్చిత నమ్మకము". రామాయణములోని ఆత్మార్థ మిదియే. (Hanuman "When body idea prevails in me, I am thy servant; when I think I am a Jiva, I am thy part, when I know I am the Atman, I and thou art one. This is my firm conviction")

## 13. కర్మము

ఆ. కర్మమొవరికైన గడచి పోవగరాదు
ధర్మరాజు దెచ్చి తగనిచోట
కంకుభట్ల జేసెకటకటా దైవంబు ॥విశ్వ॥

"Fate is inevitable - A mam can never avoid his destiny." కర్మను దప్పించుకొన నెవరికి వీలులేదు. రామునివనవాసము, బ్రహ్మనాయుని దేశపరిత్యాగము, పాండవుల వనవాసము మున్నగునవిట్టివే.

## 14. ధర్మము

ఆ: తనువు లస్థిరములు ధర్మము నిత్యము
చేయు ధర్మమెల్ల చెడనిపదవి
కని విని మరి తెలియగనరు నరపశులు ॥విశ్వ॥

జీవితములు పవనచలిత దీపశిఖలవోలె క్షణభంగురములు: ధర్మమొకటే నిల్చును. "కాన కుడిచేతితో నిచ్చుదానము, ఎడమచేతికి తెలియరాదు" అను ఏసుక్రీస్తువచనమును గుర్తెరుంగుము (Jesus - 'Let not your left hand know what your right hand giveth.')

## 15. వెర్రి

ఆ. జ్ఞానవంతుజూచి నరికర్మ బద్ధులు
వెర్రియంద్రు ప్రకృతి విడువలేరు
వెర్రి కవని బ్రకృతి వెదకిన గల్గునా ॥విశ్వ॥

ఆత్మజ్ఞానమును బొందిన వానినిజూచి ప్రకృతి బంధములలో దగుల్కొన్న వారు వెఱ్ఱివాడందురు. వారి స్వభావమును వారు విడువలేరు. కాని జ్ఞానులకు, ప్రకృతి బంధములలో దగుల్కొని, కామినీ కాంచనములందాశగల వానిని జూచిన వెఱ్ఱివారుగా గాన్పించెదరు.

## 3. శారీరకసంస్కృతి (Physical culture)

రామతీర్థస్వామి యిట్లు వచించెను. "వేదాంతమనగా శారీరక, మానసిక, ఆధ్యాత్మిక సంబంధమగు ఆరోగ్యము; దగ్గు, కఫము, జ్వరము, అతిమూత్రము కాకుండా, అసూయ, రాగద్వేషములు, పాపసంకల్పములు మున్నగునవి గర్భము యొక్క ఆరోగ్యమును గాపాడుటచేత తుడిచిపెట్టబడును. ఇంకను భారతదేశ పతనమునకు కారణము, వేదాంతము లేకుండుటయే." ఇది సత్యముగానే యున్నది. యోగాభ్యాసము వలన ఉబ్బసము, అతి మూత్రము, రక్తపుపోటు మున్నగునవి నయమగును. గర్భములోని వాతము బయటకు పోవుటచేత మానవుడు పరిపూర్ణారోగ్యవంతుడగును. కనుక శరీరారోగ్యమునకు 'యోగసంస్కృతి' ముఖ్యావసరము.

ఆసన ప్రాణాయామముల వలన హృదయబల మెక్కువగును; అందువలన మానసికశక్తి అధికమగును. హృదయమునుండి పరిశుద్ధ రక్తము మస్తిష్కమున కేగును. ఆలోచనకు కేంద్రమైన మనసిచటనే కలదు. కనుక శారీరక వికాసము వలన మనోవికాసము, తర్వాత ఆత్మవికాసము గల్గును. ఇట్లు పరస్పర సంబంధము గలదు. ప్రాచీన భారతీయులు బ్రహ్మచర్యము, ఆసనము, వ్యాయామము, యమ నియమ ప్రాణాయామములచేత శారీరక బలము సంపాదించుచుండిరని, బలము, ఆరోగ్యము, దీర్ఘాయుర్దాయముగల్గియుండిరని, 'శరీర మాద్యం ఖలు ధర్మసాధనం' అని ఎరింగిరని, శారీరక శాస్త్ర జ్ఞానమును వారు పొందిరని, వేదమంత్రములలో "పశ్యేమశరదః శతం జీవేమ శరదః శతమ్" అను సంకల్పములు గలవని 'ఆచార్య శివదత్త జ్ఞాని' వ్రాసినది సత్యమే. నిర్మలమైన శరీరములో నిర్మలమైన మనసుగలదని ("A sound mind in a sound body") ప్రాచీను లెరింగి యుండిరి.

ఆయుస్సును వృద్ధిచేయు శాస్త్రమగు ఆయుర్వేదములో ప్రాచీన భారతీయులకు అనుభవము గలదు. ఉల్లిపాయవలన అనేక జబ్బులు నయమగునవి, దానిని

వాడి 100 ఏండ్లు జీవించుచుండిరని ప్రాచీనులు గ్రహించిరి. దీర్ఘాయుర్దాయమునకు పాదరసము నెక్కువగా వాడుచుండిరి. రసగంధకములగలిపి ఔషధముల తయారు చేయు పద్ధతిని ఆంధ్రుడగు "బోధిసత్వ నాగార్జునుడు" కనిపెట్టినట్లు కాన్పించు చున్నది.

పర్షియా చక్రవర్తియగు 'అర్టాక్సెర్క్సస్' ఆస్థానములో 'కేటియస్' అను గ్రీకువైద్యుడుండెను. "భారతీయులు ప్రకృతిలో నివసించుటచేత ఏవిధమైన జబ్బులేదని, కొందరు 130, కొందరు 140 ఏండ్లు, కొందరు 200 ఏండ్లు జీవించుచుండి"రని ఈయన వ్రాసెను. 'నియార్కసు'అను గ్రీకులేఖకుడు కూడ భారతీయు లారోగ్యవంతులని, నిరోగులని, వృద్ధాప్యము వచ్చువరకు జీవించు చుండిరని వ్రాసెను. Arrian Indika Frag 15.) 'అనిసిక్రుటస్' భారతీయుల సగటు ఆయుర్దాయము 130 ఏండ్లనెను. (Strabo – XV – I – 34) 'మార్కో పోలో' అను వెనీసు వర్తకుడుకూడ భారతీయులు, ఆహార విహారాదులలో నియమములు పాటించెదరని, నేలమీదకూడ పరుండెదరని, దీర్ఘకాలము జీవించు చుండెదరని వ్రాసెను. హౌనుత్సాంగు, ఆచార్య నాగార్జునుని గూర్చి వ్రాయుచు, ఈయన దీర్ఘకాలము జీవించెనని వ్రాసెను. ఈయన రసగంధకములు కలసిన గుళికల వాడినట్లు కాన్పించుచున్నది. అశోకుని తాతయైన 'మౌర్యచంద్రగుప్తుడు' శరీరమును, ఆరోగ్యమును కాపాడుకొనుచుండెను. ఈరాజు శరీరావయవముల నిత్యము భటులు మర్దించుచుండిరని, తగాదాలు విచారణ చేయునపుడు కూడ నల్గురు భటులు శరీర మర్దన చేయుచుండిరని, ఈమర్దనమునకు ఒక విధమగు బిళ్ళల వాడుచుండిరని (Ebony rollers) 'మెగస్థనీసు' అను గ్రీకు లేఖకుడు వ్రాసెను.

ఈవిధముగా ప్రాచీన ప్రభువులు, గుఱ్ఱపుస్వారి, ధనుర్విద్య, కత్తి, కుస్తీ పట్టు, ఏనుగులమీద, రథముల మీద తిరుగుట, శరీరమర్దనము నేర్చిరని, వివిధము లగు ఆటలనాడుచుండిరని, కందుకఖేలన మొకటియని, ప్రకృతిలో వీరు ఆడు చుండిరని, వీని అన్నిటివలన వారు దృఢవంతులై యుండిరని తెలిసికొనవచ్చును. రామాయణ, మహాభారతములలో గూడ ధనుర్విద్యా ప్రవీణులైన రాకుమారుల చరిత్రలు లభ్యమగు చున్నవి. జాతక కథలలోగూడ అట్టి రాకుమారుల నామములు లభ్యమగుచున్నవి. 'అసదీస' అను రాకుమారుడు ధనుర్విద్యలో ప్రవీణుడు. చెట్టు మీదనున్న మామిడిపండ్ల గుత్తిని పడగొట్టుమని రాజు కోరగా, 'అసదీస' అట్లే చేసెను.

'జోతిపాల' అను మరియొక ధనుర్విద్యాపారంగతుడుకూడ తన విలువిద్యను జూపెను. అలెగ్జాండరు కాలములో పెక్కుమంది విలుకాండ్రు కాన్పించుచున్నారు. మల్లుల వలన అలెగ్జాండరుకు బాణపుదెబ్బ తగులగా, రక్తము స్రవించి, మూర్ఛితుడాయెను. అందరు ఆయన బ్రతకడని నిరాశచేసికొనిరి, కాని ఎట్లో బాణము తీయగా ప్రాణము దక్కెను.

కృష్ణరాయలు, కాకతీయ ప్రతాపరుద్రుడు మున్నగువారి కాలములో నిట్టి విలుకాండ్రు పెక్కురుగలరు. శబ్దవేది విద్యనెరింగిన విలుకాండ్రు పెక్కురుగలరు. ప్రాచీన భారతీయులు చాల ఆలస్యముగా వివాహములు జేసికొనుచుండిరి. ఇంద్రియ నిగ్రహము వలన వారు దృఢగాత్రులై యుండిరి. బాబరు, శివాజి, సాహిత్య సమరాంగణ చక్రవర్తి కృష్ణరాయలు, మున్నగువారు శారీరక బలసంపత్తి గల్గియుండిరి. బాబరు చక్రవర్తి, చంకలో నిరువురు మనుజుల బెట్టుకొని, ఎత్తయిన గోడలమీద దిరుగుచుండెను. కాబూలు, ఆగ్రాల మధ్యనున్న నదుల నన్నిటిని 'బాబరు' ఈదెను. ప్రాచీన కాలములోని రాజులందరు ఈత ఈదుటలో నేర్పరులై యుండిరి. సర్వేంద్రియములకు ఈత బలముగల్గించునని అందరికి తెలియును.

ఒకసారి 'ఢిల్లీనగరములో' బాబరు చక్రవర్తి తననుగూర్చి ప్రజలేమనుకొనుచుండిరో తెలిసికొనుటకు మారువేషముతో నేకాంతముగ దిరుగుచుండెను. ఆసమయమున ఒక మత్తేభము తిరుగుచు ఒక బిడ్డను తొండముతో బట్టి చంపబోవుచుండెను. జనులెవ్వరును ఆ ఏనుగుచెంతకు బోజాలకుండిరి. బాబరు గభాలున దూకి, ఏనుగుతొండమును బట్టి దానిని వెనుకకుత్రోసి ఆ బిడ్డను రక్షించెను. సాహసోపేతమైన ఈ ఉదంతము చరిత్రలలో వర్ణించబడినది. కృష్ణరాయలుకూడ తన హయంబునెక్కి ప్రతిదినము పొంపి చుట్టుతిరిగి వచ్చుచుండెను. రాయలు కుసుమ నూనెత్రాగి, శరీరమర్దనము చేయించుకొని, కుస్తీపట్టుచుండెనని, 'పియస్' వ్రాసెను. (Oil of gingelly anoints emgellym Sesamum)

(241 "He covers his loins with a small cloth, and takes in his arms great weight, made of earthern ware and then taking a sword, he exercises himself with it till he was sweated out all the oil and then he wrestles with one of his wrestlers. After this labour, he mounts a horse and gallops about the plain in one direction and another till dawn, for he does all this before day break " Robert Sewell, Forgotten empire - Paes-)

శ్రీకృష్ణరాయలు నిత్యముచేయు శారీరపరిశ్రమ పై విధముగానున్నదని 'పియస్' వ్రాసెను. పూర్వకాలములో ననేకచోట్ల 'తాలింఖానము' లుండెను. సాము, గరిడీలు నేర్పుచుండుటచేత, ప్రాచీనులు శారీరదార్ఢ్యము గల్గియుండిరి.

శివాజీకూడ అశ్వారోహణము, విలువిద్యనేర్చిన సర్దారు. ఈయనను స్వయముగా జూచిన బొంబాయిలోని ఆంగ్లఉద్యోగి యిట్లు వ్రాసెను. "శరీరము వంగకుండ తిన్నగానుండెను. వ్యాయామములో జురుకుగా నుండెను. ఎప్పుడు మాటాడిన చిరునగవుతో నుండినట్లు కాన్పించును. ("Erect and of an excellent proportion active in exercise, and whenever he seems to smile - English chaplain of Bombay") ప్రాచీన కాలములో రాకుమార్తెలుకూడ నృత్యములో ప్రవీణులై యుండిరని, అందుచే వారు పరిపూర్ణా రోగ్యవంతులై యుండిరని, తెలియుచున్నది.

నేను 1923 – 24 లో 5వ ఫారము చదువుచుంటిని. కలియుగ భీముడని పేర్గాంచిన 'కోడె రామమూర్తినాయుని, తెనాలిలో జూచితిని. రెండు మోటారు కారుల నాపుట, 3000 పౌనుల బరువుగల పెద్ద రోలును రొమ్ముమీద పెట్టించు కొని దానిపై మరియొక రాయి నుంచి ఆరుగురు వస్తాదుల నెక్కించుకొని వారిచే రాయిని పగులగొట్టించుట – ఇత్యాది పనుల నాయనచేసెను. ఒకసారి స్పెయినులో నుండగా, మహిషముతో బోరాడు ఒక స్పానిషువానిని, దూషించి, తానే ఆటలో నిరాయుధముగా మహిషమును డీకొని, కొమ్ములు పట్టుకొని క్రిందపడవేసి చంపెనని, స్పెయిను వారికి బుద్ధిచెప్పెనని తెలియుచున్నది.

ఈయన రచించిన 'My physical culture' అను గ్రంథము నేడు లభ్యము కాదు. శరీర వ్యాయామానంతరము ఈయన, 'సీమ బాదము పప్పులో సోపు, మిరియములు మున్నగు సుగంధ ద్రవ్యములగలిపి,' అవియున్న నూరి దానిని త్రాగుచుండెను. ఇదియే 'టండా' అనబడును. దీనివలన శరీరములోని వేడితగ్గి, బలముగల్గుచుండెను. విజయనగరములోని చెరువులో నీయన నిరంతరము ఈత ఈదుచుండెను. ఈయన శిష్యులతోగూడ నేను విజయనగరములో మాటాడి తిని. ఈయన చేసిన పనులు, ఒంగోలు రాజు 'చినరాజు' వీరకృత్యముల జ్ఞప్తికి దెచ్చుచున్నవి. ఏనుగుతో పోరాటము, చెట్టు పీకుట, పలుగువంచుట అనువాని నీరాజు చేయుచుండెను. చినరాజు, పెదరాజు అను వారిని గంగవరమువద్ద బ్రిటిషు వారి సహాయమున వెంకటగిరిరాజు లోడించిరి.

రామమూర్తి నాయుడు పరకంగుళము మందముగల ఇనుప గొలుసునుకూడ త్రెంపుచుండెనని, రెండెడ్ల బండ్లను మనుజులతో నింపి వీపు, రొమ్ముపై పోనిచ్చెడివారని, ఏనుగును రొమ్ముపై ఎక్కించుకొనెడి వారని, మోటారుకారును వీపు, రొమ్ముపైన పోనిచ్చెడివారని, హఠయోగ ప్రభావము వలన వీనిని జేయుచుండెడివారని, వీరి శిష్యులు నాతో చెప్పిరి. ఈయన శాకాహారి. ప్రతిదినము సాయంత్రము బాదాము, మినుములు, గోధుమపిండి, నేతితో తయారైన 'హరీరా' అను హల్వాను గైకొనుచుండిరి. ఉబ్బసవ్యాధి పీడితులైన ఈ వస్తాదు హనుమంతుడు, భీమసేనుడు మున్నగువారి కథలను జదివి తను, అంత వారు కావలయునని విద్యార్థిదశలోనే సంకల్పించెను. దండెములు, కసరతు, ఈత, గుఱ్ఱపుస్వారి మున్నగువానివలన ఈయన వ్యాధియంతయుపోయి, వజ్రశరీరము గల్గెను. 'గామా' అనువస్తాదు ఈయన శిష్యుడే.

1893 లో విజయనగరముకు దగ్గర వీరఘట్టములో జన్మించిన ఈ మహనీయుడు 1938 లో మరణించెను. 1927 డిశంబరులో జరిగిన మద్రాసు కాంగ్రెసుకీయన హాజరై యువక మహాసభలో నొసంగిన గంభీరోపన్యాసమును నేను స్వయముగావింటిని. అది ఫర్లాంగుదూరమువరకు వినబడినది. ఈనాడుకూడ విద్యార్థులకిట్టి వ్యాయామము, బలకరమగు ఆహారము – హరీరా, బండాలు అవసరమని, వీనివలన, నిర్మలమగు మనసు కల్గునని నమ్ముచున్నాను. శుశ్రుతుడు ఏనాడో శరీరవ్యాయామముయొక్క లాభముల లిఖించెను. ("Exercise is the exertion to invigorate and to increase the strength of the body; one should take physical exercise measurably." శక్తివికాసము, తైలమర్దనము, ఇంద్రియనిగ్రహము, ఇవి ఆరోగ్యమునకు ముఖ్యములు.

## 4· మానసిక సంస్కృతి (Mental culture)

కొందరు గ్రంథకర్తలు సభ్యత, సంస్కృతి ఒకటియే యని వ్రాసిరి. వాల్టేరు (Voltaire) అను రచయిత 'సభ్యత' అనగా మానసిక ప్రకాశతయని వ్రాసెను. ("Civilization meant mental enlightenment") ఈ మానసిక ప్రకాశత, ఆకాలపు జాతులన్నిటితో బోల్చిచూచిన భారతదేశములో నధికముగా నుండెను.

'మానసిక సంస్కృతి' లౌకిక, పారలౌకిక సాహిత్యమునకు, కళలు, విజ్ఞానశాస్త్రములకు సంబంధించియున్నది. హిందువులు, బౌద్ధులు, జైనులు తమ సాహిత్యమును వివిధరకములుగా సృష్టించిరి.

హిందువుల సాహిత్యము :— వేదములు, (సంహిత) సూత్రములు, బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు, షడంగములు – శిక్ష. కల్ప, నిరుక్త, ఛందస్సు, జ్యోతిష, వ్యాకరణములు, దర్శనములు, స్మృతులు, ఇతిహాస, పురాణములు, అద్భుత కథలు, కావ్యములు, రూపకములు, కథలు, ఆఖ్యాయికలు, తత్వశాస్త్రము, శాస్త్రసాంకేతిక సంబంధములు – అర్థ, కామ శాస్త్రములు, అలంకారశాస్త్రము, వైద్యము, గణితశాస్త్రము, రాజకీయము, కళాసంబంధము, (64 కళలు లేక 528 కళలు) గణితశాస్త్రములో లెక్కలు, బీజగణితము, క్షేత్రగణితము, త్రికోణమితిశాస్త్రము, జ్యోతిష శాస్త్రము మున్నగునవి.

బౌద్ధుల సాహిత్యము:— వినయ, సూత్ర, అభిధర్మ అను త్రిపిటకములు మొ॥

జైనసాహిత్యము:— సిద్ధాంత లేక ఆగమములు; వీనిలో 12 అంగములు గలవు. అంగములలో, ఉపాంగములు, ప్రకీర్ణ, ఛేదసూత్రములు, మూలసూత్రములు మొదలగు విభాగములు గలవు. సంస్కృత సాహిత్యము నంతను విద్వాంసులు 6 విభాగములుగ జేసిరి. 'మెక్డనాలు' అను విద్వాంసుడిట్లు విభజించెను.

1. (Epic) :— కావ్యసంబంధములు, రామాయణ, మహాభారతములు, పురాణములు, బుద్ధచరిత్ర మొదలగు కావ్యములు.

2. (Lyrical) :— పద్యకావ్యము – కాళిదాసుని మేఘదూత, ఋతుసంహారము.

3. (Drama) :— నాటకములు. మొట్టమొదట నాటకకర్త అశ్వఘోషుడు సారిపుత్ర ప్రకరణము రచించెను. కాళిదాసు క్రీ. శ. 6 వ శతాబ్దమువాడు. భాసుడు మరికొంత పూర్వుడు. గద్యపద్యములలో గూడినవి చంపూలు.

4. (Didactic) :— నీతిబోధకములు, జాతకకథలు, పంచతంత్రము మొ॥

5. (Narrative),— వినోద కథాసంబంధములు. బృహత్కథ, శుకసప్తతి మొ॥

6. (Scientific) :— శాస్త్రసంబంధములు. (Technical) శిల్పాదివిద్యల సంబంధములు, సాంకేతికములు. ఇతరశాస్త్రములు — వ్యాకరణము, తత్వ శాస్త్రము, నిఘంటువులు, ధర్మ, అర్థ, నీతిశాస్త్రములు, కామశాస్త్రము, వైద్య శాస్త్రము, జ్యోతిష, ఖగోళ, గణితశాస్త్రాదులు, అలంకార, నాట్యశాస్త్రాదులు.

కళలు;— 1. వాస్తునిర్మాణకళ

2. స్థాపత్య, శిల్పకారి ఆది.

3. చిత్రకళ, 4. సంగీతకళ, 5. నృత్యకళ

విజ్ఞానశాస్త్రములు:— గణితము. బీజగణితము, క్షేత్రగణితము, జ్యోతిషము, భౌతికశాస్త్రము, రసాయన, వనస్పతి శాస్త్రములు, ప్రాణిశాస్త్రము, భూగర్భ శాస్త్రము, ఆయుర్వేదశాస్త్రము, సర్పకాటు చికిత్సలు, పశువైద్యము, శారీర శాస్త్రము, ధనుర్విద్య; ఇవియన్ని ప్రభుత్వోపయోగములు లేకపోయిన కడుపుకూటి సమస్యను విప్పత్తిచేయుచుండెను. బౌద్ధులు, వాస్తునిర్మాణకళలోను, రాతి చెక్కడము కళలోను ప్రవీణులు, ఆరంభకులునై యుండిరి. హిందువులు బౌద్ధమత క్షీణత అయిన తర్వాత ఈపని కారంభించిరి. ప్రాచీనులు పై వానిని 'లలితకళలు' అని పేర్కొనిరి, లలితకళలు అనగా ముఖ్యముగా పైవానికి జెందునని, కొన్నిసార్లు పద్యకావ్యములకు, నాటకములకు, సంగీత, నృత్యకళలకు, జెందునని, సుందరమైన వానిని ప్రేమించు అన్ని కళలకు జెందు నని, 'పార్కుహర్స్టు' అను విద్వాంసుడు వ్రాసెను. (C. A. Parkhurst — India then and now - P. III - "Usually the term is limited to the arts of design-painting, sculpture, achitecture and work of the highest order in precious metals and jewellery. Some times it is also used to cover poetry, drama music, dancing, and every art that expresses and fosters a love of the beautiful")

## 1. వాస్తు నిర్మాణకళ (Architecture)

ఈ శాస్త్రము భారత వర్షములో చాలకాలము నుండి వ్యాప్తిలోనున్నది. క్రీ. పూ. 5000 ఏండ్లక్రిందట 'మహెంజదారో—హరప్పలకు సంబంధించిన సింధు నాగరికత లేక ద్రావిడ నాగరికత ప్రపంచఖ్యాతి పొందినది. 'సర్ జాన్ మార్షల్' 'సింధు నాగరికత' అను గ్రంథములో అచటి నగరముల, చతుశ్శాలల, రాజ భవనముల వర్ణించెను. అచట తయారుచేసిన బంగారు నగల, గాజులనుగూర్చి ఆయన విశేషముగా ప్రశంసించెను. (Marshall - "The gold ornaments are so well furnished and so highly polished that they might have come out of a Bond street jewellery of today, rather

than from a prehistoric house of 5000 years ago') స్నానాగారములు, మురికి కాల్వలపై కప్పులు, గదులు మున్నగు వానిని జూచినచో, ఆకాలమునాటి ద్రావిడుల వాస్తునిర్మాణ కళా కౌశలము బయల్పడుచున్నది. నగరముల గోడలు, సింహద్వారములు, వంతెనలు, ఆనకట్టలు మున్నగువానిని రాతితో జేయుపనులు పరిమితమై యుండెనని, బౌద్ధయుగమునకు పూర్వమిట్లుండెనని 'దత్తు' మున్నగు విద్వాంసులు వ్రాసినది సత్యముగానున్నది. మట్టి, రాయి, కొయ్యలతో ఆకాలమున ఇండ్లు కట్టుచుండిరి. (R. C. Dutt—"Architecture in stone previous to the Buddhist age was confined mostly to Engineering works, such as city walls, gates, bridges and embankments") హిందువుల కంటెముందు బౌద్ధులే వాస్తునిర్మాణమున కారంభకులుగా గాన్పించుచున్నారు. ("The Buddhists were the first Indian builders and carvers in stone") తక్షశిలలోని 16 పాఠ్యవిషయములలో వైద్యము, చిత్రలేఖనము, రాతి చెక్కడము, బొమ్మలువేయుట, చేతిపనులు, జ్యోతిషశాస్త్రము గలవు.

జాతక కథలలో వాస్తుకళకు సంబంధించిన పనులు గాన్పించును. 'మహా ఉమ్మంగజాతకము'లో నొక కొండసొరంగమును త్రవ్విన వృత్తాంతము కాన్పించును. దీనిముఖము గంగానది ఒడ్డువైపున గలదు: దాని ప్రవేశద్వారము నగరములో నున్నది. అచటగల 101 శయనమందిరములలో 101 మంది రాకుమారులు శయనించుచుండిరి. ఒక్కొకగదిలో నొకపాన్పు గలదు. ఇది పనివాండ్ర నైపుణ్యమును గన్పరచును. 'కనిష్కమహారాజు' గొప్ప వాస్తుశాస్త్రవేత్త: 'మహా యాన మతము' ఈయన కాలములో నారంభమాయెను. గౌతమ బుద్ధుడు మత ప్రచారకుడుగాకుండ, దైవతుల్యుడుగా బూజింపబడుచుండెను. హీనాయానము పోయి మహాయానము వచ్చినది. వాస్తునిర్మాణకళ, రాతిచెక్కడపుపని, ఈయన కాలములోనే విశేషప్రచారము గాంచెను, భవనములు, సంఘారామములు, బుద్ధ విగ్రహములు, బొమ్మలు ఈయన కాలములో ప్రథమముగా నిర్మింపబడెను. ఈకాలపు శిల్పములో గ్రీకు శిల్పకళ కాన్పించుటచేత దీనికి 'గాంధారశిల్పము' అను పేరు వచ్చినది. అనేక స్తూపములు ఇటుకరాతితో తయారు కాబడినవి. క్రీ. శ. 5—6 శతాబ్దములనుండి హిందువుల వాస్తుకళ వ్యాప్తిలోనికి వచ్చినది. సాంచీస్తూపములు, తక్షశిలలోని స్తూపము చాల ప్రఖ్యాతి గాంచినవి. కార్లే, ఎల్లోరా, అజంతా మున్నగుచోట్లగూడ ప్రసిద్ధ సంఘారామములు గలవు.

కాశ్మీరరాజగు అవంతివర్మ కాలములో సూర్యనామక వాస్తుశాస్త్ర విశారదుడు జీవించియుండెను. వితస్తానదికి అడ్డముగా నొక ఆనకట్ట నీయన కట్టించి, వడ్లు విశేషముగా పండించి, వడ్ల ధరను తగ్గించెనని రాజతరంగిణి తెల్పుచున్నది. "నాకొక ప్రణాళిక గలదు; ద్రవ్యసంచయములు లేకుండా నేనేమి చేయగలను ?" ("Surya - I have a plan but without resources, what can I do?") 'ఏకశిలానగరము' (ఒరంగల్లు) అని పేర్గాంచిన నగరములో 'అలూప్‌ఖాను' కాలమున నీటిపంపు లుండెను; అవి రెండు మైళ్ల పొడవుండెను. కాకతీయ సామ్రాజ్య పతనాంతరము, 'ప్రోలయ వేమారెడ్డి' అను ప్రతాపరుద్రుని సేనా నాయకుడు కొండవీడు, వినుకొండ రాజ్యముల నాక్రమించి, అద్దంకిలో నొక కోటను గట్టుకొని, క్రీ. శ 1324 నుండి రాజ్యము పాలించ సాగెను. ఈకోట 2 ఫ. పొడవు. 2 ఫ. వెడల్పుగల్గి, చుట్టును 20 గజముల వెడల్పు, 10 గజముల ఎత్తు గల్గిన గోడనుగల్గి యున్నది. మధ్యలో 'పిల్లకోట' గలదు. దీనిమీదనే 'ప్రోలయ వేమారెడ్డి' ప్రథమ రెడ్డిచక్రవర్తి, రాజభవనము గట్టుకొని, నిర్వక్రప రాక్రమోపేతుడగు తమ్ముడు 'మల్లారెడ్డి' సాయంబున 26 ఏండ్లు రాజ్యపాలన చేసెను. ఈరాజభవనము మీది శిల్పము ఎట్లుండెనో తెలిసికొనుట కాధారములులేవు. ఈమల్లారెడ్డి కవిత్రయములోని ఎఱ్ఱాప్రగడను పోషించినట్లు, అన్నకు బరిచయ మొనర్చినట్లు ఈ క్రింది ఎఱ్ఱాప్రెగడ పద్యము తెల్పును.

శా॥ నాతమ్ముండు ఘనుండు మల్లరథినీనాథుండు నిన్నాతత
శ్రీతోడన్ సముపేతుఁజేసి యెలమిం జేపట్ట మాకిచ్చుటం
జేతోమోదమెలర్ప రామకథ మున్ జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతింబొందితి నింకనుం దనియనేఁ గావ్యామృతస్వాదనన్

ఈరెడ్డి ప్రభువులలో మూడవవాడు 'కుమారగిరిరెడ్డి'. కొండవీడులో 'గృహరాజ సౌధము' అను ప్రాసాదమును నిర్మించెను. ఇది 'ఒంటి స్తంభపుమేడ'. ఇది నేడు 'గుఱ్ఱాలదిబ్బ' అనుచోట శిథిలమై ఉన్నది. 'శ్రీనాథ కవీంద్రుడు' దీనిని వర్ణించెను. విజయనగర ప్రభువు 'రెండవ ప్రౌఢ దేవరాయలు' ఇట్టి సౌధమునే నిర్మించ కుతూహలాయత్త చిత్తుడగుచుండెను. 1 వ దేవరాయలు 'తుంగభద్ర' కడ్డముగా నొక ఆనకట్టను కట్టించి, దీనినుంచి హంపీలోనికి కాల్వల ద్రవ్వించెను. వీనివలన వ్యవసాయాభివృద్ధి సాగుచుండెను. బార్బోసా, న్యూనిజ్' మున్నగువారు 'విరూపాక్షాలయమును' ఆ శిల్పమును వర్ణించిరి. ఒరంగల్లు,

హంపి విజయనగరము, హనుమకొండ, రామప్ప దేవాలయము మున్నగుచోట్ల గల శిల్పము, దేవాలయ నిర్మాణము అద్భుతమైనవి. షాజహాను గట్టించిన 'తాజ్‌మహాలు' కూడ సర్వాంగసుందరమైనది. మధుర, కంచి, తంజావూరు మున్నగు తావులలోగూడ సుందర దేవాలయములు గలవు; అందలి శిల్పము అద్భుతముగా నున్నది.

## 2. రాతి చెక్కడము (Sculpture)

మహెంజదారో, హరప్పలలో మనము కొన్ని బొమ్మల, విగ్రహముల జూచు చున్నాము. ప్రాచీన భారతవర్షములో కొయ్య, రాయి, లోహము, వేగడిమున్ను మున్నగువానిని విగ్రహ నిర్మాణమున కుపయోగించుచుండిరి. దీనినే చెక్కడపు పనిఅందురు. రాళ్ళమీద ఉలులతో చెక్కడము చూడగా, ఆకాలపు పనివాండ్ర కుశలత కాన్పించును. బార్హూతు, సాంచి స్తూపములమీద ఇట్టి బొమ్మలు పెక్కు గాన్పించును. ఎల్లోరా, అమరావతి, నాగార్జునకొండలలోగూడ నిట్టి శిల్పము గాన్పించును. ఆవిగ్రహములమీద శిల్పము చూచిన నేత్రపర్వముగానుండును. ఉలితో ఈపని చేయడము చాలా కష్టమైనది. దీనికెంతయేని సహన మవసరము. అమరావతిలోని శిల్పసంపద పాశ్చాత్యుల నాకర్షించినది.

స్తూపములలో ఏనుగుల, సింహముల, మొసళ్ళ, పొట్టేల కథలకు సంబంధించిన దృశ్యములు, చూలములమీదనున్నవి. అశోకుని కాలములో నీ రాతి చెక్కడపుపని ఆరంభమైనట్లు కాన్పించుచున్నది. ఆ యా మతము లభివృద్ధియైన కాలది, శివ, విష్ణు, బుద్ధ, జిన విగ్రహములు వ్యాప్తిలోనికి వచ్చినవి. రాజాదరణ హెచ్చినచోట్ల, ఒక విగ్రహము దీసి మరియొక విగ్రహమును ప్రతిష్ఠచేసినట్లు కాన్పించుచున్నది. తిరుపతి ఒకప్పుడు శైవులకు పవిత్ర స్థలము. అచటనే వీరభద్రుని విగ్రహముండెను. శ్రీపతి వ్రాసిన 'శ్రీకారభాష్యమును' బట్టి, వైష్ణవ గురువు శ్రీరామానుజాచార్యులవారు ఆ విగ్రహమును తొలగించి, వేంకటేశ్వరుని విగ్రహము పెట్టి వైష్ణవ క్షేత్రముగా జేసెనని తెలియుచున్నది. ఇట్టివి చాల గలవు. బౌద్ధ, జైనుల క్షేత్రముల కొలామువైపు లాక్రమించుకొనిరి. ఈ కాలములో లలితకళలలో ముఖ్యమైన వాస్తునిర్మాణకళ, రాతి చెక్కడము, రంగులతో చిత్తరువులు గీయుట అనునవి విస్మృత కళలుగా (Forgotten arts) మారినవని విద్వాంసులు వ్రాయుచున్నారు. ("Architecture, sculpture, and painting are almost forgotten arts in India." R. C. Dutt) ఉండవల్లి,

మొగల్రాజపురము మున్నగుచోట్ల కొండను దొలిపించి గుహలుగా తయారుచేసిరి. ఇచటనే బౌద్ధ భిక్షువులు తపసు చేసికొని నిర్వాణము పొందిరి.

## 3. రంగులతో చిత్రములు గీయుట ((Painting)

చిత్రకళ — భారతీయ సంస్కృతిలో నిది ముఖ్యమైనది. గోడలమీద రంగులతో వివిధరకముల బొమ్మలు గీయబడినవి. 'అజంతా'లో నివి కాన్పించును. "వర్ణాశ్రమధర్మములు భారతభూమిలో బుద్ధిసంపదను, మేధాశక్తిని, శారీరక కష్టమునుండి విడదీసి, నిమ్న జాతులవారిని ఆ యా కళలలో నిమగ్నులగునట్లు చేసినవని దత్తు వ్రాసినది సత్యముగా నున్నది (R. C. Dutt–The caste system of India divorced intellect and genius from manual labour and persisted only law castemen to engage themselves in the arts!")

అజంతా చిత్తరువులు క్రీ. పూ. 200 నుండి క్రీ. శ. 650 వరకు వ్యాప్తి గాంచినవి. బుద్ధుని జీవితము గుహాలలో అనేక రంగులలో చిత్రింపబడినది. స్తంభముల మీదకూడ నివిగలవు. గుహాలగోడలు కోయబడి, నునుపుచేయబడి, పల్చగా రంగువేయబడినవి. ప్రాచీనులు ఉలి, కుంచె వాడి చిత్రకళను వ్యాప్తి చేసిరి. హౌనుత్సాంగు క్రీ. శ. 640 లో వచ్చి దీనిని దర్శించి ఈ చిత్రకళను శ్లాఘించెను. 2 వ నెంబరు గుహాలో ఓడల బొమ్మలు, 1–4 ఓడ స్తంభములతో గాన్పించును. 'హావెల్' మున్నగు విద్వాంసులు దీనిని శ్లాఘించిరి.

ప్రతాపరుద్రుని భార్య మాచలదేవి (1300 క్రీ. శ.) 'ఓరంగల్లుకోటలోని' సర్వాంగసుందరమైన భవనములో ప్రవేశించుచుండెను. ఈ చిత్తరువుకూడ గీయ బడినది. ఓరుగల్లులో నిది శిథిలమై యున్నది. ఆంధ్రకవులు దీనిని వర్ణించిరి. ఏకామ్రనాథు డనుకవి, ఓరంగల్లులో 1500 నుండి చిత్రకారుల గృహములు గలవని, వారు చిత్రకళను వృత్తిగా నభ్యసించుచుండిరని వ్రాసెను. 'పియస్, అబ్దుల్‌రజాక్ మున్నగువారు హంపి, విజయనగరములోని రాజభవనముల వర్ణించిరి. సింహముల, పెద్దపులుల బొమ్మలు వివిధరంగులలో చిత్రింపబడినవి. ఒక రచయిత యిట్లు కళాకారులగూర్చి పలికెను. "భవిష్యత్తరములవారు మిమ్ము విశ్వాసముతో జ్ఞప్తియందుంచుకొందురు." ("Posterity will remember you with gratitude.")

## 4. గానకళ (Music)

సంగీత, నృత్యకళల వలన శారీరక, మానసిక శక్తులు వికసించునని ప్రాచీను లెరింగిరి. 'డయోడోరసు' ఇట్లు వ్రాసెను. నృత్య సంగీతములందు భారతీయులకంటె ఎక్కువ అభిమానము గలవారెవరు లేరు. ("No nation is fonder of singing and dancing than the Indian"— Diod XVII — curtius") సంగీత, నృత్యకళలు కలసియుండును. గానకళానిధులు గలరు. వీణమున్నగు వాయిద్యములు వర్ణించబడినవి. 'సముద్రగుప్తునికి లేక భారతీయ నెపోలియనుకు' కవిరాజు అను బిరుదుగలదు. సంగీతమునందు ఇతనికి గాఢమైన అభిమానము గలదు. వీణ వాయించుటలో దిట్ట. కృష్ణరాయలు కూడ గానము నేర్చుకొని, వీణల వాయించుచుండెను. రాయలు స్నానము చేయునప్పుడు, స్త్రీలు కీర్తనలు పాడుచుండిరని, క్రీ. శ. 1514 లో 'బార్బోసా' వ్రాసెను. తంజావూరు రాజు శరభోజి, రఘునాథరాయలు (1614–1633) నృత్యగానములందు అభిమానులు. గాన కళానిధియగు 'త్యాగరాయలు' పేరు ఎరుంగనివారు లేరు. సంగీతము, చిత్రకళ యనువానిని ప్రాచీన కాలములో బాలికలుకూడ నేర్చుకొను చుండిరి.

## 5 నృత్యకళ (Dancing)

దీనివలన మనుజుని శారీరక, మానసిక శక్తులు వికసించును. 'కాకతీయ గణపతి' గజసైన్యాధ్యక్షుడు 'జాయప సేనాని' 'నృత్య రత్నావళి' అను గ్రంథమును రచించెను. రామప్ప దేవాలయములో స్త్రీలు నృత్యము చేయుచున్నట్లు గాన్పించు బొమ్మలు ఈ నాటికి కాన్పించుచున్నవి. నృత్యకళకు, మతసంబంధమగు పూజకు సంబంధము గలదు. అస్సాములోని 'మణిపూరు నృత్యము', ఆంధ్రలోని కూచిపూడి భాగవతుల నృత్యము, మళయాళములోని 'కథాకళి' ప్రఖ్యాతి గాంచినవి; కొండవీటి రెడ్డిరాజులు ఈ కళను విశేషముగా నాదరించిరి. 'కొమరగిరి రెడ్డి' వారాంగన 'లకుమాదేవి' నృత్యకళలో ప్రసిద్ధురాలు. ఈ రాజును వసంతోత్సవములందు అభిమాన ముండుటచేత 'వసంతరాజు' అని పేరు వచ్చినది. తనసోదరుడు కాటయవేమునికి రాజ్యము నొసంగి, సంగీత నృత్యములలో గాలము గడపెను. ఈయన 'వసంత రాజీయము' అను గ్రంథమును లిఖించెను. 'పోలయ వేమారెడ్డి' (1324–1350) కూడ పై కళలలో నభిమానము గన్పరచెను. అభినయము వలన

మనోభావములు ప్రకటితమగును. భరత నాట్యము కూడ వ్యాప్తిలో నుండెను. హస్తములు 72 విధములుగాను, ముఖము 9 విధములుగాను త్రిప్పుట, తద్వారా మనోభావములు ప్రకటించుట వారు నేర్చిరి. 'చైత్రోత్సవము, సువసంతకము, హోలికోత్సవము, మదనోత్సవము' ఆయా దేశములలోని నామభేదములేకాని ఒకటియే. వసంతోత్సవము చైత్రశుద్ధ పాడ్యమి నుండి నవమి వరకు జరుగుచుండెను.

భారతీయులకు కొన్ని ప్రయోగాత్మక శాస్త్రములుకూడ తెలియును; కాని శాస్త్రములు మత సంబంధమగు కర్మకాండల వలన గనిపెట్టబడినవి. (R. C. Dutt- "The sciences were discovered in India in the Pursuit of religious rites") గణితము, ఖగోళశాస్త్రము, వైద్యశాస్త్రము, ముఖ్యముగా సర్పపాటుకు చికిత్సలు, శస్త్రచికిత్స, జాతక శాస్త్రము మున్నగువాని నభ్యసించుచుండిరి. 'అర్జునుడను' గణితశాస్త్రవేత్త బుద్ధుని పరీక్ష చేసెనని 'లలిత విస్తారము' అను బౌద్ధగ్రంథము తెల్పుచున్నది. 'పైథాగరసు'కు పూర్వమే భారతీయులకు క్షేత్రగణితము, అందలి సూత్రములు తెలియునని విద్వాంసులు వ్రాసినారు. ఇది సత్యముగానేయున్నది. త్రికోణముల, చతురస్రముల వైశాల్యము కనిపెట్టుపద్ధతిని గూడ ప్రాచీన భారతీయు లెరింగియుండిరి. శుల్వసూత్రములబట్టి క్షేత్రగణితము తెలియునని ఎరుంగవచ్చును. సమకోణములు, చతురస్రములు, వలయముల నిర్మాణము, ఒక ఆకారమునుండి మరియొక ఆకారమునకు మార్చు పద్ధతి, త్రికోణమితి శాస్త్రము, వారికి తెలిసియుండెను. గణితశాస్త్రము హైందవులశాస్త్రమే యని, ఇతిహాసకాలమునాటికే యిది అభివృద్ధి చేయబడినదని 'దత్తు' అను విద్వాంసుడు వ్రాసినది సత్యమే. (R C. Dutt- "Arithmetic is pre-eminently a Hindu science and was developed as early as the epic age, while minute rules for the construction of altars of different shapes and sizes led to the discovery of Geometrical figures.")

ఆర్యభట్టు (క్రీ. శ. 476), బ్రహ్మగుప్త (క్రీ. శ. 598), జైనవీర మహాచార్య, అనువారు గొప్పగణితశాస్త్రవేత్తలు; 'భాస్కరాచార్యులు' అను గణితశాస్త్రవేత్త తన కుమార్తె లీలావతికి గణితశాస్త్రము నేర్పెను. ఆయన గణితములో 'బీజగణితము' కూడ గలదు. క్రీ. శ. 15 వ శతాబ్దములోని 'సిద్ధన మంత్రి' గణితశాస్త్ర జ్ఞానమునకు బ్రసిద్ధి గాంచెను. "ఒకవ్యక్తి చంచల చిత్తము అటునిటు పరుగిడుచున్నచో ఆయనను గణితశాస్త్రము చదువనిండు" అని బేకన్ వచించెను.

(Francis Bacon–So if a man's wit will be wandering, let him study the Mathematics") ఆర్యభట్టు, వరాహమిహిరుడు, బ్రహ్మగుప్తుడు, భాస్కరాచార్యులు అనువారు జ్యోతిషశాస్త్రములోగూడ విశేషఖ్యాతిగాంచిరి. వేదకాలములో గూడ భారతీయులకు ఖగోళశాస్త్రము కొంచెము తెలియును: కాని ఇతిహాసకాలములో నిది వృద్ధిచెందెను. గ్రీకులు వచ్చిన తర్వాత వారి స్నేహముతో జాతకశాస్త్రమును భారతీయ బ్రాహ్మణ విద్వాంసులు నేర్చుకొనిరి. మానవ జీవితముపై నక్షత్ర ప్రభావము, గ్రహముల ప్రభావము గలదని యవనులు, భారతీయులు నమ్ముచుండిరి. వరాహమిహిరుడు, బృహత్సంహిత, బృహజ్జాతకము అను గ్రంథముల రచించెను. ఈయన 'హర్షవిక్రమాదిత్యుని' (క్రీ. శ. 525) ఆస్థానమున నున్న విద్వాంసులలో నొకడు. ఈ శాస్త్రముకూడ ఆ కాలమున చాల ఉచ్ఛదశలో నున్నదని 'హౌనుత్సాంగు' అను చైనీయ లేఖకుడు వ్రాసెను. 'వజ్ర' అను జైన నిర్గ్రంధుడు తలవని తలంపుగా 'హౌనుత్సాంగు గదిలోనికి వచ్చెను. చైనీయ యాత్రికుడు, తానెంత కాలము జీవించునది, భారతభూమిలో నెన్నాళ్లుండునది చెప్పుమనికోరెను. అంతటాయన యిట్లు చెప్పెను. "నిన్ను త్వరలో బంపించుట కేర్పాటు జరుగుచున్నది. నీవు త్వరలో చైనాదేశమేగెదవు. నీవింకను 10 ఏండ్లు మాత్రము జీవించెదవు." (Heuli– "As for the years of your life, you will have 10 years added to your knowledge") అవిధముగా హౌనుత్సాంగు తర్వాత 10 ఏండ్లు మాత్రమే జీవించెను. భారతీయ జ్యోతిష శాస్త్రవేత్తల అద్భుత ఫలితముల కాయన ఆశ్చర్యచకితుడాయెను. ఈ 10 ఏండ్ల పుణ్యకాలములో నాయన భారతావనినుండి తెచ్చిన బౌద్ధ గ్రంథముల ననువదించెను.

రాజనీతి సంబంధమగు శాస్త్రములోగూడ భారతీయులు నిపుణులు. ప్రభువుల పాలన, ప్రజాస్వామికములు కూడ ఉండెను. కామశాస్త్రము కూడ వ్యాప్తిలో నుండెను. వాత్స్యాయన కామసూత్రములు జగద్విదితమే. ఈ శాస్త్రము తెలియని వారు అంధులుగా భావించబడుచుండిరి. ("A man who has not studied this Science is blind even though possessed of eyes") ప్రాచీన కాలములో ప్రజాసత్తాక రాజ్యములు వర్ధిల్లెను. వైశాలిలోని క్షత్రియులు క్రీ. పూ. 7 వ శతాబ్దములో 'వర్ధమాన మహావీరుని' తమ పాలకునిగ నెన్నుకొనిరి. చరిత్రకు దెలిసిన ప్రథమ ప్రజాస్వామిక పాలకుడీయనయే. బుద్ధదేవుని తండ్రి శుద్ధోధనుడుకూడ ఎన్నికలమీద వచ్చిన పాలకుడే. బుద్ధదేవుని కాలములో ననేక ప్రజాసత్తాక రాజ్యములు గలవు. ప్రజాస్వామికముకంటె కొన్ని సందర్భములలో

ధర్మమును పాలించిన అశోకుడు మున్నగు ప్రభువుల పాలన ఉత్తమ మైనదిగా గాన్పించినది. అశోకుడు తన గిర్నారు శాసనములో నిట్లులిఖించెను. "అన్ని వేళల, అన్ని స్థలముల (At any hour and any place) భోజనము చేయుచున్నను, అంతఃపురములో నున్నను, శయనమందిరములో నున్నను, దేహబాధ తీర్చుకొనుచున్నను, రథముమీద నున్నను, ఉద్యానవనములో నున్నను, ప్రతీహారులు ప్రజల మొరలను సంతతము నాకు వినిపించుచుండవలెను — నేను సంతతము ప్రజాసౌఖ్యమునకు బనిచేసి తీరెదను." దీనినిబట్టి అశోకుడు, హర్షుడు మున్నగువారు నిద్రాహారముల మరచి, రేయింబవలు ప్రజాక్షేమము కొరకు ఎట్లు పనిచేసినది విదితమగుచున్నది. ఆకాలములో గురువును తండ్రిగాను, శిష్యుని కుమారుని వలెను జూచుచుండిరి. సర్పకాటు చికిత్సలలోను, కొన్ని యితర చికిత్సలలోను గ్రీకులకంటె భారతీయు లధికులనుటకు చారిత్రక ప్రమాణములు లభ్యమైనవి.

1. Ailianus- "While the Indians knew the proper antidote against the bites of each kind of serpent, none of the Greek physicians had discovered any such antidote,"

2 Nearchus - "The Grecian physicians found no remedy against the bite of snakes, but the Indians cured those who happened to incur that misfortune"

3 Arrian- "The Greeks when indisposed applied to their sophists, (Brahmans) who by wonderful and even more than human means, cured whatever would admit of cure.) ప్రాచీన కాలములో ప్రఖ్యాతవైద్యులు చరకుడు, శుశ్రుతుడు చాల ఖ్యాతి పొందియుండిరి. వీరి గ్రంథములలో శస్త్రచికిత్సకు సంబంధించిన వైద్యపరికరముల పేర్లున్నవి. బుద్ధునికి చికిత్సచేసిన జీవకుడు, తలమీద, గర్భముమీద శస్త్రచికిత్సలుచేసెను. ఒకరాజు కండ్లుతీసి; ఆకండ్లను అంధుడగు ఒక బ్రాహ్మణునికి పెట్టినట్లు జాతక కథలు తెల్పుచున్నవి. క్రీ. పూ. 6 శతాబ్దులక్రింద ఆత్రేయఋషి శిష్యుడు జీవకుడు శస్త్రచికిత్సచేసిన ఆధారములు లభ్యమగుచున్నవి. ఆనాడు అమెరికా యూరోపు ఖండములు అనాగరికస్థితిలోనున్నవి.

ఇంకను ప్రాచీన విద్యావిధానమునుగూర్చి స్వల్పముగా తెలిసికొందము. అమరావతి, నాగార్జున విశ్వవిద్యాలయముల గూర్చి మనకు గొప్ప విశేషములు

తెలియవు. జంబూద్వీపములోని బ్రహ్మాండమైన నాలందా విశ్వవిద్యాలయమును గూర్చి హౌనుత్సాంగు, హ్వ్యాలీ వ్రాసిరి. ("The most magnificent temple of learning in Jambu Dwipa") శీలభద్రుడు కళాశాలా ప్రిన్సిపాలుగా నుండెను. ఈయనయే 'యోగశాస్త్రము' నేర్పుచుండెను. నానాశాస్త్ర పారంగతులైన ధర్మపాల, చంద్రపాల, గుణమతి, ప్రభమిత్రుడు, జినమిత్రుడు, మున్నగువారు 1712 మంది అధ్యాపకులుగానుండిరి. అచటి నిబంధనలు చాల కఠినముగా నుండెను. విద్యార్థులు భక్తిశ్రద్ధలతో చదువుచుండిరి. వారు పరిశుద్ధ ప్రవర్తనతోనుండిరి. విద్య, భోజన వస్త్రములు, వైద్యము, నివాసములగు ఖర్చులు అన్నీ ఉచితమే। నూరుగురు అధ్యాపకులు నిత్యుండి బోధించుచుండిరి. చదువు పూర్తి అయిన తర్వాత విద్యార్థి ప్రభుత్వోద్యోగముల మీద ఆధారపడకుండ, సాంకేతిక లేక వృత్తి విద్యలు చెప్పబడుటచేత, ప్రతివిద్యార్థి స్వతంత్ర జీవనము చేయుచుండెను. గణితము, జ్యోతిషశాస్త్రము, భూగోళము, ఖగోళశాస్త్రము, ఛందము, తర్కము, వ్యాకరణము, వైద్యము, శిల్పము, ఓషధి శాస్త్రము చెప్పబడుచుండెను. సర్వసంగ పరిత్యాగులైన గురువులు విద్య నొసంగుచుండిరి. (Vivekananda - "In our country the imparting of knowledge has always been through men of renunciation.") ఇంద్రియ నిగ్రహ సంపన్నులైన ఈగురువుల బోధలు ఎక్కువగా పరావిద్యకు సంబంధించినవి. అందుచేత ప్రతి విద్యార్థికి వైరాగ్యభావ మధికముగా నుండెను. హౌనుత్సాంగు వెళ్లినపుడు శిలాదిత్యుడతనికి పదివేల బంగారు నాణెములు, మూడువేల వెండినాణెములు, మంచిదూది వస్త్రములు వంద యిచ్చెను. 18 మంది రాజులు ఎచట విలువైన ఆభరణముల నొసంగిరి. కాని ఆచైనీయ యాత్రికుడు వానినన్నిటిని తృణప్రాయముగా వర్జించెను. హౌనుత్సాంగు నాలందా విద్యాలయములో చదువుకొనుట కేగినపుడు, శీలభద్రుని దగ్గరకేగి, మోకరించి, గురుపాదముల శిరంబున నానించి, ముద్దుపెట్టుకొని, భూమిమీద శిరసు నానించెను. గురువు ఆనందపడి ఆశీర్వదించెను. హౌనుత్సాంగు' కీక్రింది వస్తువు లివ్వబడు చుండెను. 120 జంబీర ఫలములు, 20 పూగలు, 20 జాజికాయలు, 1 తొస్సు కర్పూరము, మహాశాలి బియ్యము, వెన్న, నెలకు మూడు మానికల నూనె, ఇంకను అవసరమైన వస్తువు లివ్వబడుచుండెను. "ఇచట పదివేలమంది విద్యార్థులుండిరని, అతి కష్టమైన తత్వశాస్త్రి సంబంధమగు ప్రశ్నలకు జవాబు లొసంగువారే యిచట నుండుట కర్హులని, ఈనాటి కళాశాలలలో తత్వశాస్త్ర సంబంధమగు గౌరవ పీఠమును దొలగించి వేసిరని, ఇది విచారకరమని 'పాల్ బ్రంటన్' అను తత్వవేత్త లిఖించెను.

(Paul Brunton – "India, which a 1000 years ago, maintained universities, like that of Nalanda, where none could obtain admittance save those who could answer the most abstruse metaphysical questions and where ten thosuand students were once to be found despite this difficult initial bar, India, which has fed all the other Asiatic lands with her thoughts cannot today find sufficient college students to form more than ridiculously small classes in the same subject. Indeed it is a well known fact that several colleges have now abolished the chair in Philosophy) ఈనాటి విజ్ఞానశాస్త్రము, సాంకేతిక, పారిశ్రామిక విద్యలతోబాటు, ప్రాచీన కాలములోని తత్వశాస్త్రము కలియనిచో, విద్యార్థికి హృదయవికాసము గల్గదు; శీలసంపత్తి ఏర్పడదు.

## ౫. సారస్వత సంస్కృతి

గ్రంథమువ్రాయు ప్రతి రచయిత, సాహిత్య వేత్తయగుచున్నాడు. ఉత్తమమగు గ్రంథము కర్తయొక్క అమూల్య రక్తధారయని మిల్టన్ వచించెను. ప్రతి గ్రంథములోను విజ్ఞానశాస్త్ర దృష్టితోబాటు ఆధ్యాత్మిక, నైతిక సంబంధమగు బోధలుండవలెను. గ్రంథకర్త సూక్ష్మభావములను లోకములో వ్యాప్తిచేయవలెను. రచయిత ప్రపంచము నుత్తమ స్థితిలోనికి బంపవలెను. (Johuson – "The duty of the writer is to make the world better") శైలి యనగా గ్రాంథికముగాగాని లేక గ్రామ్యముగాగాని లిఖించుటకాదు. సూక్ష్మ భావములను బ్రకటించుట కూడ శైలియని ఒక ప్రఖ్యాత రచయిత నుడివినాడు. (Charles Maurras – "What does the mind enjoy in books ? Either the style or nothing ? But, some one says, what about the thought ? The thougnt, that is the style, too.")

నవీన యుగములో విమర్శన, పరిశోధన, శాస్త్రీయ దృక్పథము, హేతుబద్ధమగు నడక, ప్రజాస్వామికము, జాతీయ భావము ముఖ్యగుణవి. ఇంగ్లాండులో 17 వ శతాబ్దములో విమర్శన ముఖ్యమైనదని, జాన్సనుకు విమర్శకుడుగా గొప్ప పేరు గలదని, తన 70 వ ఏట ఆంగ్ల కవుల చరిత్రను ఎక్కువ శ్రమతో రచించెనని 'వార్డు' లిఖించెను. (A. C. Ward – Modern Engiish literature– P 61 – "In relation to literature – it is the spirit of criticism and criticism in England is the creation of the 17 th century– As a critic, his criticism is the only side of his literary work

that need be considered Johnson must be allowed a high place in society — The lives of the poets, his greatest work was composed with pain and difficulty, when he was 70 years old ")

ఈకాలములో చారిత్రక దృష్టి కోణము, పరిశోధన, విమర్శన ముఖాశ్రయము. చరిత్రకూడ విజ్ఞానశాస్త్రమే. ("History is a science by itself".) క్రీ. శ. 19 వ శతాబ్దము చారిత్రక రచనకు స్వర్ణయుగమని చెప్పవచ్చును. భారతీయ సాహిత్య చరిత్రలో చరిత్ర రచన చాల హీనస్థితిలో నున్నది. చరిత్రకు విషయసంగ్రహణము, తిథిక్రమ పట్టిక చాల ముఖ్యమైనవి. 'చారిత్రక' ఆలోచనా సరళి స్వభావ సిద్ధముగా గల్గునట్టిదే — ( A. Neelakantha Sastry — 'Historic way of thinking is a thing by itself') ఐహికవిషయములు, నూత్నభావములు, తిథిక్రమ పట్టిక కనిపెట్టువారు గొప్పవారే. 'ఎమర్సను' అను అమెరికా తత్వవేత్త యిట్లు చెప్పెను. "అన్నిరకముల గొప్పవారిని — అనగా విషయములు సేకరించువారిని, భావముల గనిపెట్టువారిని నేను శ్లాఘించెదను. (Emerson – 'I admire great men of all classes, those who stand for facts and for thoughts ") చరిత్రకూడ ఒక శాస్త్రమే అగుటచేత, ఈశాస్త్రీయ ఆలోచనాసరళి జగతిలో వ్యాప్తియగుగాక ! సత్యమును రాబట్టుటకు చేయువిచారణయే చరిత్ర అగుచున్నది. ("History is an enquiry designed to elicit truth ")

"నేను పర్షియా రాజగుటకంటె ఒక విజ్ఞానశాస్త్ర సత్యమును గనిపెట్టుట నాకు అభిమానము." అని ఒక ఆంగ్లరచయిత పల్కెను. ("I would rather discover one scientific fact, than become king of Persia ") ప్రాగ్దేశము, నవీన యుగము వచ్చువరకు నూత్నభావములనవలంబించలేకపోయినది. తాత, ముత్తాతలనాటి అనాగరిక పద్ధతులలో నిల్చిపోయినది. అందుచేతనే దీనిని 'మార్పుచెందని తూర్పు (Unchanging East) అని 'కిప్లింగు' పేర్కొనెను. కనుక సాహిత్యములో, సభ్యతలో, సంస్కృతిలో యింకను అన్ని రంగములలో ఈదేశము మార్పు చెందవలెను. 19 వ శతాబ్దములో మార్పుతెచ్చి, శాస్త్రీయ దృక్పథములో గ్రంథములు వ్రాసిన వారు వీరేశలింగము. ఆంధ్రకవుల చరిత్ర వ్రాయుచు, కవుల తిథిక్రమ పట్టికను సరిచేసెను. ఈయన ఆంగ్లకవి 'జాన్సను'వలె విమర్శకుడు. సంస్కర్త. పండితుడు. జాన్సనువలెనే తన 70 వ ఏట కవిచరిత్రను సంస్కరింప మొదలిడెను. ఈయన కళాశాలలలో ఆంధ్రపండితుడుగా పనిచేయుచుగూడ, సారస్వత సంస్కృతియం దభిమానముగల్గి శతాధిక

గ్రంథకర్తయై, ఆయాగ్రంథములలో దననూత్న భావముల వెదజల్లెను. ఆంగ్ల భాషా సంపర్కమువలన ఈశతాబ్దిలో అనేక నూత్నభావములు మనవారిలో గల్గ సాగినవి. ప్రపంచభాష అయిన ఇంగ్లీషు మనదేశమునుండి పోయినచో, చారిత్రక దృష్టికోణము భారతీయులలో క్షీణించిపోవును.

ఉద్యోగధర్మ నిర్వహణము జేసికొనుచు, సారస్వత సంస్కృతిలో ప్రవీణులైనవారు అనేకదేశములలో గాన్పించుచున్నారు. క్రీ. పూ. 326 లో యవనభూపతి 'అలెగ్జాండరు' మనదేశము వచ్చినపుడు ముగ్గురు చరిత్రకారులను వెంటదీసికొని వచ్చెను. అలెగ్జాండరు ఘనకార్యముల వర్ణించుటకే వారీదేశమునకు వచ్చిరి. ఒకరు అనిసిక్రిటసు; రెండవవాడు 'అరిస్టోబోలసు', మూడవవాడు 'నియార్కసు' అను వారు. గ్రీకులేఖకు లిట్లు వ్రాసిరి. "ఆయన ఉద్యోగులు కొందరు సాహిత్య సంస్కృతికూడ గల్గినవారై యున్నారు; వారు కలమునే కాకుండా ఖడ్గమునుగూడ ఉపయోగించ గల్గుచుండిరి. (Mc - Crindle — 'Some of his officers were also men of literary culture who could wield the pen as well as the sword") తత్త్వవేత్తయగు అరిస్టాటిలు శిష్యుడగు ఈ అలెగ్జాండరుకు వేదాంతశాస్త్రమన్న, జ్ఞానులన్న అభిమానముమెండు. అలెగ్జాండరుకు 'దండమీసు' అను యోగికి, అలెగ్జాండరుకు 'కాలనస్'కు జరిగిన సంభాషణలను, ఆకాలపు సాంఘిక, ఆర్థిక, రాజకీయవిషయములను పూసగ్రుచ్చినట్లుగా సీ లేఖకులు వ్రాసిరి. చరిత్రలో నీవ్రాతలకు గొప్ప విలువ గలదు.

సర్ విలియం జోన్సు (క్రీ. శ 1746—94) కలకత్తాలోని 'సుప్రీంకోర్టు' న్యాయాధిపతి. క్రీ. శ. 1784 లో 'ఏషియాటిక్ సొసైటీ' అను సంఘమును కలకత్తాలో స్థాపించి, పది ఏండ్లకాలము దాని కధ్యక్షుడుగానుండి విశేషముగా సాహిత్యసేవచేసెను. ఆయన అనేక గ్రంథముల లిఖించెను. 'కలనల్ కాలిన్ మెకంజీ' మొదట ఇంజనీరు; అనేక యుద్ధములలో బాల్గొనెను. మైసూరు, మద్రాసు రాష్ట్రములలో సర్వేజనరలుగా నుండెను. ఉద్యోగధర్మమును నిర్వహించుచు మద్రాసురాష్ట్రములోని చాలగ్రామముల కైఫీయతుల సంపాదించెను. 'ఫుల్లివర్తి మల్లయ్య' మున్నగు లేఖకులు సంపాదించిన కైఫీయతుల నొకచోట చేర్చి 'కావలి వెంకటబొర్రయ్య' ఆంధ్రచరిత్ర రచనకు పునాదులువేసిరి. ఈయన ద్విభాషి. ఏలూరువాసి. శాసనములు, కైఫీయతులు, సమకాలీన గ్రంథములు, నాణెములు, శిల్పము, ఆయా లేఖకుల వ్రాతలు మాకు చరిత్ర సామగ్రి అయినది.

క్రీ. శ. 1783 లో మెకంజీ మదరాసువచ్చి, చరిత్ర జిజ్ఞాసతో స్వంతద్రవ్యమును ఖర్చిడి, తెలుగు, అరవము, కన్నడము, మహారాష్ట్రీయము, పారశీకభాషల పండితుల బిలిపించి, వారికి వేతనములిచ్చి, కైఫీయతుల తయారుచేయించెను. ఆయన క్రీ. శ. 1821 లో కలకత్తాలో చనిపోయెను. ఆయన మరణానంతరము ప్రాగ్భారత సంఘమువారు (East India Company) ఆతని భార్యకు లక్ష రూప్యములిచ్చి, కైఫీయతుల గొనిరి ఇంకను ఆంగ్లసైనిక రాజకీయోద్యోగులు గ్రాంటుడఫ్, ఓర్మ్, ఎల్ఫిన్‌స్టన్, కల్నల్‌టాడ్, మున్నగువారు చారిత్రక గ్రంథముల రచించిరి. 'ఓర్మ్' 1751–1–24 న జరిగిన బొబ్బిలియుద్ధ చరిత్ర వ్రాసెను. టాడ్ రాజస్థానచరిత్ర వ్రాసెను. బొర్రయ్య తమ్ముడు 'కావలి రామస్వామి' మెకంజీ క్రింద పనిచేయుచు చారిత్రక సామగ్రిని కూర్చుకొని క్రీ శ. 1822 లో దక్షిణ హిందూస్థాన కవుల చరిత్రను కలకత్తాలో ఇంగ్లీషులో ప్రచురించెను. (History of Deccan poets) సి. పి. బ్రౌను బందరులో అసిస్టెంటు జడ్జిగా నుండి, సంస్కృతాంధ్ర పండితుల వద్ద తెలుగు నేర్చుకొని వేమన పద్యములు మున్నగు వానిని గూర్చుకొనెను.

ఆయన 40 ఏండ్లు ఉద్యోగి. మద్రాసు రాష్ట్రమునకంతటికి పోష్టుమాష్టరు జనరలుగా నుండెను. లండనులోగూడ ఆయన తెలుగు ఆచార్యపదవ్యుడుగా నుండెను. బ్రౌను నిఘంటువులు తెలుగు-ఇంగ్లీషు-ఇంగ్లీషు-తెలుగు చాల ప్రామాణిక మైనవి. మెకంజీ సంపుటముల నీయన అనేకచోట్ల సంస్కరించెను. తప్పుగానున్న తిథిక్రమపట్టికల నీయన సరిచేసెను. ఈప్రకారము ఉద్యోగములజేయుచు, సారస్వత సంస్కృతీ జిజ్ఞాసలో బలువురు బహుళ గ్రంథముల ముద్రించి శాశ్వత యశస్సు గడించిరి. అలెగ్జాండరు ఉద్యోగులు సారస్వత సంస్కృతి (Literary culture) అని వాడుటచేత నేను ఆ పదమునువాడితిని. వీరిని గూర్చి వ్రాయుచు 'సాముయెల్ స్మైల్సు' యిట్లు వ్రాసెను. "ప్రఖ్యాతిగాంచిన ఆంగ్ల రాజకీయవేత్తలకు, సాహిత్యము కూడ ముఖ్యధ్యేయముగానుండెను. (Samuel Smiles — "Literature has also been the chief solace of our greatest English statesmen") రాజకీయ సాహిత్య సాంఘిక సేవ,-అను మూడు సేవలలో సాహిత్య సేవ చాల ముఖ్యమైనది. భారతీయ రాజకీయ వేత్తలుకూడ ఆంగ్ల రాజకీయ వేత్తలవలె, సాహిత్యమును జీవితధ్యేయముగా బెట్టుకొందురని, అధికారము లోనికి వచ్చినపుడు విద్వాంసుల నాదరింతురని నమ్ముచున్నాను. ఆధ్యాత్మిక సంస్కృతికి వేమనయోగి, శారీరక సంస్కృతికి కోడె రామమూర్తినాయుడు. మానసిక

సంస్కృతికి, ఆంధ్రదేశములో ప్రథమముగా శాసనముల జదివి, కలనల్ మెకంజీకి కుడిభుజముగా బనిచేసి అనేక శాసనముల వ్రాసిపెట్టిన ఏలూరు వాసి, 26 వ ఏటనే యసువులబాసిన 'కావలి బొర్రయ్య', సారస్వత సంస్కృతికి, దేహము రుగ్మతపాలై, బలహీనమైయున్నను ఆంధ్రభాషపై కనికరముంచి, తీవ్రకృషిచేసి, తానుపొందిన ఫలితముల నాంధ్రదేశమున కందచేసినట్టి, శాస్త్రోపాధ్యాయ పట్టమును బొందినట్టి, (M. A.) ఎనిమిది భాషలలో బండితుడైన నరిత్ర పరిశోధకుడు, 44వ ఏటనే ప్రాణము వీడినవారు అగు శ్రీ కె. వి. లక్ష్మణరావు మన కాదర్శమూర్తులై వెలయుదురుగాక।

---

## Definition of Culture

1. P. K. Acharya—Thus culture primarily aims at the refinement of material intelligence and capacities to its fullest growing power. – Thus culture would refer to the conditions of mental and spiritual progress while civilization would refer more to the material progress.

2 Arnold – "Culture is an acquaintance with the best that has been known or said."

3 Golden home and High School Ency. Vol. V – "Included in culture are the technological developments, the economic system, the educational system, the political system, the religion, the arts, the folklore and the fashions of people–'

4 The English dictionary — "culture — The improvement of body, or mind, Intellectual refinement."

5. Oxford dictionary – 'Trained and refined state of the understanding and manners and tastes '

6. D. W. Brogan – 'America in the modern world' – 'culture – All social habits. techniques: religious practices, marriage customs, in fact everything the kitchen sink - Society lives, moves or just exists culture – Ideas, aesthetic experiences and achievements and philosophic and religious ideas that affect and are affected by the aesthetic experiences and experiences of a given society,"

7. S. Pratapa Reddy – culture is a refined quality with a mixture of the good qualities, such as civilization, fine arts, literature, day to day progress. – It is mental and spiritual development.

8. Prof, Sivadatta Gnani – Culture is realization of the self.

# Bibliography

## ENGLISH


Sri John Marshall — Indus Valley civilization
,, P. K. Acharya — Elements of Hindu culture
,, R. C. Dutt — Ancient India
,. Arnold — Essays.
,, Max Muller — Sacred books of the East. All volumes.
,, D. W. Brogan — America in the modern world.
., Macdonall — India's past
,, V. A. Smith — Early History of India,
— Oxford ,,
,. Vivekananda — All volumes.
,, Rama Thirtha — ,,
,, Kode Ramamurty — My Prysical culture.
,, Mecrindle — All volumes
,, Rajan Ayyar — Rambles in Vedanta,
,, Hueli (S. Beal) — Life of Hiuen Tsiang.
,, Watters — Travels of ,,
,, Kalhana — Rajatharangini.
,, Blockman — Ayoni Akbari I
,. R N. Mehtha — Buddhist India
,, Sewell — Forgotten empire,
,, Park hurst — India, then and now.
;, Modern Reviews — Imperial Gaz Volumes etc.


## తెలుగు


యస్. ప్రతాపరెడ్డి — ఆంధ్రుల సాంఘిక చరిత్ర
మెకంజి — కైఫీయతులు 67 సం.
ఆంధ్ర సాహిత్య అకాడమీ ప్రచురణ-సి.పి. బ్రౌను — వేమన పద్యములు
గ్రంథకర్త — ప్రాచీన ప్రజాస్వామికములు
కె. వి. లక్ష్మణరావు — ఆంధ్రవిజ్ఞాన సర్వస్వములు 3 సం.
వ్యాసావళి
— హిందూ మహాయుగము etc.,
కోన వేంకటరాయశర్మ — కాలిన్ మెకంజీ జీవితము
కాశీనాధుని నాగేశ్వరరావు — భారతి సంపుటములు, వ్యాసావళి etc.
ప్రతాప రామకోటయ్య — కొండవీటి సామ్రాజ్యము
ఆచార్య శివదత్తజ్ఞాని — భారతీయ సంస్కృతి (హింది)మొ.

# చారిత్రక కాశీ క్షేత్రము

౧

## ఆర్యులవలస - కాశీనగరము పుట్టుక

ఆర్యులు మధ్యాసియా ప్రాంత భూములనుండి భారత వర్షమునకు క్రీ. పూ. 1500 ప్రాంతమునవచ్చి, పంజాబు ప్రాంతమున స్థిరపడిరి. జనాధిక్యత యైన కొలది, యటనుండి ఆర్యులు గంగానది పొడవున వలససాగించిరి. కురుపాంచాలురు, గంగకెగువభాగమున నివసించుచుండ, మిగత ఆర్యజాతులవారు, భాగీరధికి పూర్వ దిశగానడచి, యచట వసింపసాగిరి. కురులు ఆధునిక 'ఢిల్లీ' నగరమునకు తూర్పుగాను, పాంచాలురు 'కనూజి' ప్రాంతమున నున్న ఆధారములు లభ్యమగుచున్నవి. పంజాబులో 'సుదాసు' యుద్ధములో బాల్గొన్నవారి పూర్వులు; వారి ఋషులగు 'త్రిత్సులు' తోగలసి తూర్పుముఖముగా వచ్చిరి. వారితోబాటు ఆర్యసభ్యత, మతము, ధర్మమును దోడ్కొనివచ్చిరి. వీరిలో మూడు ఆర్యతెగలు మాత్రము ప్రాముఖ్యత వహించినవి.

వేద, ఇతిహాసముల కాలమునాటికి, భారతవర్షములో ఒక మిలియను చదరపుమైళ్లు నివాసయోగ్యమైన భూమి గలదని, అందు 100 వేల చదరపుమైళ్ళ ఆర్యులు వలసపోయినట్లు, ఐతిహాసిక లేఖకు లూహించుచున్నారు.

కోసలురు, విదేహులు, కొన్ని ప్రదేశము లాక్రమించుకొని, అరణ్యములు దగ్ధముచేసి, వ్యవసాయక్షేత్రముల వృద్ధిచేసి, అయోధ్య, మిథిలానగరముల నిర్మాణము చేసికొనిరి. 'విదేహులనువారు' గండకీనదిని దాటి ఇంకను తూర్పుగా గంగానదికి ఉత్తర ముఖముగా పోయి 'తిర్హుతు' లో నివసించిరి. వారి పూర్వుడు 'మాధవ విదేహుడు', పంజాబులోని 'సరస్వతి' ప్రాంతమునందుండి, వారి ఋషియైన గౌతమునితో ననేక నదీనదములు, దేశములు, నిర్జనారణ్యములు దాటివచ్చెను. "నే నెచట నివసింపవలెను" అని విదేహుడడుగ, అగ్ని అపుడు "గండకీనదికి తూర్పుదిక్కు నీ నివాస" మని చెప్పగా, విదేహు డచటనే స్థిరపడెను. ఇచటనే 'మిథిల' యను ముఖ్యనగరమును నిర్మించుకొనెను.

మూడవ తెగవారు 'కాశీలు' పడమరనుండివచ్చి. గంగానది ఒడ్డున స్థిర నివాస మేర్పరచుకొనిరి. పురాణాదులబట్టి 'కాస్య, కాస, ఖాస' అను ఆర్య తెగ

వలన 'కాశీలు' అను పేరు ఆవిర్భవించినట్లు తెలియుచున్నది. ఈ 'కాస' లేక 'కాస్య' వంశీయులు నిర్మించిన నగరముగుటచేత దానికి 'కాశీ' నగరమని పేరు పెట్టియుండ వచ్చునని కొందరు వ్రాసిరి. అతిప్రాచీనమైన ఈనగరము ఋగ్వేద కాలములోని 'శునహోత్రుని' మనుమడు 'కాశ' యనువానిచేత నిర్మింపబడినట్లు తెలియుచున్నది. (A. I Ch P 206)

'హావెల్', కాశీలు అను ఆర్యులు క్రీ. పూ. 1400—1000 మధ్య దీని నాక్రమించిరని చెప్పుచున్నాడు. (E B Havell - Benares - The sacred city P 2 "The first definite historical event known about Benares is that the Kasis, one of the Aryan tribes which were then occupying northern India, established themselves in the Ganges valley, near Benares at a date supposed to be between 1400 and 1000 B C."

## Ency. Bri. Vol. III

"The Hindu kingdom was Benares; it is said to have been founded by Kas Raja about 1200 B C. Subsequently it became part of the kingdom of Kanuj, which in 1193 was conquered by Mohommad of Ghor. On the dismemberment of the Delhi Empire, it was seized by Safdar Jung, the Nawab Wazier of Oudh, by whose grand son it was ceded to the East India Company by the treaty of 1775,")

ఈ వంశములోని వారు, 'రాష్ట్రి, దీర్ఘతపసు, ధన్వ, ధన్వంతరి' మొదలైన వారని, వంశ వృక్షముల వలన నెరుంగవచ్చును. కాశిని ముఖ్యనగరముగా జేసికొని, వీరిచట రాజ్యమేల సాగిరి. ఈ 'కాశీలు' శివపూజ నారంభించిరి. కాశిలో గూడ శివలింగపూజను జేసియుండిరి. వీరు తమ పూర్వుల మతమును, వారి కర్మ కాండను త్యజించలేదు. పంజాబులో వారు పూజించిన దేవతలనే పూజించి, వారచట గానముచేసిన వేదమంత్రములనే గానముచేసిరి. గంగానది ప్రాంతపు ఆర్యులే మూడు వేదములను సంహితలుగా గూర్చిరి. 'అథర్వవేదము' తర్వాత నాల్గవ వేదముగా గుర్తించబడినది. ఈ విధముగా 'కురు పాంచాల' యుద్ధమునకు పూర్వమే మూడు వేదములు సంహితలుగా వేదవ్యాసునిచేత 'కాశిలో' గూర్చబడెను.

'విదేహులు, కాశీలు' అను ఆర్యులే ఉపనిషత్తుల నిర్మాణమునకు కారణ భూతులు. విదేహుల రాజగు జనకుని ఆస్థానమునయున్న 'యాజ్ఞవల్క్యుడు'

సూత్నమైన యజుర్వేదమును నిర్మించుటయేకాక, శతపద బ్రాహ్మణమును గూడ కూర్చెను. ఈ జనకుడనేకమంది, విద్వాంసుల, ఋషులబోషించి యుండెను. 'కాశీలరాజగు' 'అజాత శత్రుడు' కూడ, "జనకుడే మాపోషకుడు అనియు, పలువురతని చెంతకు బోసాగిరనియు" చెప్పుటచూడగా, ఆ కాలమున విద్వాంసుల బోషించిన రాజులలో 'జనకుడు' ముఖ్యుడని స్పష్టపడుచున్నది. 'అజాత శత్రుని, జనకుని' పేర్లు ఉపనిషత్తులలో బలుతావుల నుల్లేఖింపబడియున్నవి. 'కాశీల రాజగు' 'అజాతశత్రుడు', 'బాలాకి' యను ఋషినోడించి, అతనికి తత్త్వశాస్త్ర విషయములు బోధించినట్లు, ఉపనిషత్తుల వలన విదితమగుచున్నది. అందుచేత 'కాశీ నగరము కర్మకాండ సంబంధమగు వేదసంహితలకే కాక, జ్ఞానకాండ సంబంధమగు ఉపనిషత్తుల ప్రచారమునకు గూడ మొట్టమొదటిదని చెప్పవచ్చును. అపౌరుషేయములు, శ్రుతులు అని ప్రసిద్ధి కెక్కిన హిందువుల పవిత్ర గ్రంథ సంచయము లిచటనే యావిర్భవించెను.

ఈకాశీలోని ఆగారములోనే, మత, తత్వశాస్త్ర సంబంధమగు గహన ప్రశ్నలను గూర్చి తర్కించుచుండిరని, బౌద్ధ గ్రంథములు నుడువుచున్నవి. (E B Hawell — Benares—The sacred city, P 41. "The old Buddhist records tell us that it had a large public hall or pavilion, in which religious and philosophic questions were discussed")

## కాశీనగరప్రసిద్ధి - హిందువుల నమ్మకములు

ఈ 'కాశీనగరము' వేదకాలమునుండి ప్రసిద్ధి గాంచియున్నది. హిందువులకు గల ఏడు పుణ్యక్షేత్రములలో నిది ముఖ్యమైనది. ఇందుగల 1500 దేవాలయములలో చాలభాగము శివాలయములు. కొద్దిమాత్రము విష్ణుదేవుని ఆలయములై యున్నవి. ఇవి చాలభాగము 18 వ శతాబ్దము తర్వాతనే నిర్మించ బడినవి 'వరుణ, అసీ'ల సంగమస్థానములో ఈ నగరము నిర్మించ బడుటచేత దీనికి 'వారణాసి' అనిపేరు కల్గినది. ప్రస్తుతమది ఉత్తరప్రదేశములో నున్నది. జాతకకథలు ఈ నగరమును 'పుష్పావతి' యనుపేరున, బ్రహ్మపట్టణ మను పేరున వర్ణించి యున్నవి. క్రీ. పూ. 1500 సంవత్సర ప్రాంతమున నిది నిర్మించబడినట్లు విద్వాంసుల ఊహ. ఈ 'వారణాశి' నగరము ఈ విషయములో ప్రాచీన 'బాబిలన్' నగరమును, మధ్యకాలీన రోమునగరమును బోలియున్నదని, 'హేమచంద్రరాయ్ చౌదరి' వర్ణించియున్నాడు. (P H A I P 70 'Benares in this respect

resembled ancient babylon and medieval Rome, being coveted prize of its more warlike, but less civllized neighbours" మహమ్మదీయులకు, మక్కావలెను, క్రైస్తవులకు పాలస్తీనా వలెను, హిందూ బౌద్ధులకు 'కాశీ' పుణ్యతీర్థమై వెలయుచున్నది.

(William Daniel— The oriental annual - P 126 - In the estimation of the Hindus, there is not a name upon earth and scarcely in heaven. so sacred" భూలోక స్వర్గలోకములలో నెచటను ఇంత పవిత్రమైన నగరములేదు. అని హిందువులు నమ్ముచుందురు. ఇచట 8000 బ్రాహ్మణుల గృహములు గలవని 80 పాఠశాలలలో సంస్కృతము చెప్పబడు చున్నదని, 12000 ఇటుకరాతి ఇండ్లు, 16000 మట్టిఇండ్లు కలవని డేనియల్ వ్రాసెను. 'రస్సెల్' అను ఆంగ్లేయుడు కూడ కాశీనిగూర్చి ప్రస్తావించెను. (My diary in India Vol I P 145 - 148)

ఇచట చనిపోయినవారికి జన్మరాహిత్యము గల్గునని హిందువుల నమ్మకము. ముఖ్యముగా 'మణికర్ణికా ఘట్టము' లో జనిపోయినవారికి వారి అస్థిసంచయములు గంగలో గలిపినచో, పుణ్యలోక ప్రాప్తియని పలువుర విశ్వాసము. ఇచట శివుడు లేక విశ్వనాధు డుండునని, చనిపోవువారి కీయన 'తారక' బ్రహ్మనామ ముప దేశించునని హిందువులు నమ్మెదరు.

కాశీలోమాత్రము గంగానది, ఉత్తరమునకునుండి దక్షిణమునకు, 4 మైళ్ళ దూరున అర్ధచంద్రాకారముగ ప్రవహించు చున్నది. ఏ నదికూడ యిట్లు ప్రవహించి యుండలేదు. మూర్తి, తీర్థములకిది పుణ్యమైనదని హిందువులు నమ్ముదురు. నిత్యము యాత్రికులు గంగలోస్నానముచేసి, విశ్వనాథుని దర్శించి పోవుచుందురు. అన్నికాలములలోని యోగులు, విద్వాంసులు, పండితులు కాశీక్షేత్రమును దర్శించి బోధలుచేసి పోయిరి. వేదవ్యాసుడు, బుద్ధుడు, శంకరుడు, తులసీదాసు, వల్లభా చారి మున్నగు మహర్షి సత్తము లిచట సంచారము చేసియుండిరి. తులసీదాసు తన రామాయణము నిచటనే వ్రాసియుండెను. వారిపాదరేణువులచేత ఈ తీర్థము పుణ్యస్థలి అయినది. అందుచేత ఈ తీర్థమునకు పుణ్యస్థలత్వము చెప్పబడినది.

శ్లో॥ ప్రభావాదద్భుతాద్భూమేః సలిలస్య చ తేజసా

పరిగ్రహాన్మునీనాంచ తీర్థానాం పుణ్యతాస్మృతా॥ కాశీఖండము

తా॥ భూమియందొక విధమైన అద్భుత ప్రభావము, నీళ్ళయందొక విధముగు అద్భుత తేజస్సు కనబడుటవలన, లేక ఋషులు నివసించుటచేత, తీర్థము లకు పుణ్యస్థలత్వము చెప్పబడినది.

ఈ కాశీక్షేత్రము, పురాతన కాలమునుండి, విద్వాంసులకు, పండితులకు కేంద్రము. వేదశాస్త్ర పారంగతులకు జన్మస్థానము. మొదట నిర్మించిన నగరము, ప్రస్తుతమున్న నగరమునకు కొంచెము ఉత్తరముగా నున్నది. చాలాకాలము తర్వాత 'సౌదేవదివోదాసుడు' మరల ఈ నగరనిర్మాణము చేయించినట్లు తెలియు చున్నది. 'హైహయుల' దండయాత్రల భయమే దీనికి కారణము.

ఆంగ్లేయ విజ్ఞాన సర్వస్వమిట్లు వ్రాయుచున్నది. 'మూలకాశీనగరము' ప్రస్తుత నగరమునకు ఉత్తర దిశగా మూడున్నర మైళ్ళ దూరములో, శిథిలమైన ఇటుక, రాళ్ళ కట్టడములో నిల్చియున్నట్లు ఊహించబడుచున్నది. ("The original city of Benares (Kashi) is supposed to have been at Sarnath, 3½ miles north of the present city, where ruins of brick and stone buildings are found-' Eucy, Brit, III P 714) ప్రస్తుతమున్న 'కాశీస్టేషనుకు' ఉత్తరమున పూర్వపు కాశీయని పలువురు వ్రాసిరి. 'కాశీనగరము' నది మట్టమునకు 100 అడుగుల ఎత్తున ఉన్నది.

వేరువేరు రాష్ట్రములలోని ముఖ్యనగరములు, పవిత్ర పుణ్యక్షేత్రములుగా రాణించినవి. కాశీ, గయ, ప్రయాగ, మథుర, నాలందా, తక్షశిల ఉజ్జయిని, కంచి, నవద్వీపము మున్నగునవిట్టివి. దక్షిణ దేశములోని పూరి; కంచి, ద్వారక, నాసిక మున్నగునవికూడ అట్టివే తీర్థయాత్రికులు, యోగులు ఉత్తరమునుండి దక్షిణమునకు, దక్షిణమునుండి ఉత్తరమునకు పోవుచుండుట గమనించు చున్నాము. ఉత్తర హిందూస్థానములోని పుణ్యక్షేత్రముల పేర్లు దక్షిణ దేశములో గూడపెట్టి, దూర ప్రాంతములకుపోలేని వారిని, వీనిని సేవించుడని పండితులు చెప్పుచున్నారు. గోదావరిని దక్షిణ గంగయనుట, మధురకు బదులు దక్షిణమున మధురపేరు పెట్టుట, కాంచీనగరమును దక్షిణ కాశిగా పేర్కొనుట మనము కాంచుచున్నాము. అంతర్వేదిని కూడ 'దక్షిణకాశి' యందురు.

శంకరుడు అద్వైత మత ప్రచార మారంభించిన తావు యిదియే; శంకరుని కొరకు హరిజనునితో వాదన యిచటనే జరిగెను. చైతన్యుడు మున్నగు వారు కాశీ మున్నగు సమస్త క్షేత్రముల దర్శించిరి. క్రీ. పూ. 522 లో బుద్ధదేవుడు ప్రథమ ధర్మోపదేశము నిచటనే చేసెను. "భగవాన్ బుద్ధః" అని శంకరునిచే ప్రశంసించ బడిన, గౌతమ బుద్ధుడు, కాశీలోని సారనాథులో (కురంగారామము) బహు వర్షముల కాలమునుండి చాతుర్మాస్య వ్రతాదులు జరిపి యుండెను. తత్త్వజ్ఞాన సముపార్జనా లాలసత్వమున గౌతమునివీడి కాశీకి వచ్చిన యతిపంచకము

నకు ధర్మచక్ర ప్రవర్తనమునుజెప్పి, ఆచంద్రతారార్కమగు కీర్తిని గడించెను. చరిత్ర వీని నెన్నడు మరచిపోజాలదు. ("It was here at Saranath that the great message pealed out whose echoes have never died away in history." Sister Nivedita)

దివ్యతేజో విభాసితుడు, సమ్యక్ సంబుద్ధుడు, అర్హంతుడు, సర్వోత్కృష్టుడు నైన బుద్ధదేవుని ప్రధమ ధర్మోపదేశ మిచటనే జరుగుటచేత నిది బౌద్ధులకెంతో పుణ్యక్షేత్రమే. బౌద్ధధర్మ ప్రధమ దుందుభి యిచటనే మ్రోగెను. బుద్ధదేవుడు కోసలరాజ్యములో ననగా, సంయుక్త పరగణాలు, సారనాథ్, కాశీ ప్రాంతములలో నిరువది సంవత్సరముల కాలము అమూల్య ధర్మోపదేశముల జేసి యుండెను. ఈభూమి ఆయన పవిత్ర పాదరేణువులచేత పునీత మాయెను.

బౌద్ధప్రభువు, అశోక మహారాజు కాశిలోని 'సారనాథ్' లో ఒక స్థూప నిర్మాణము గావించి, ఒక్క శిలా స్తంభముపై ధర్మచక్రమును వేయించి, నాల్గు సింహముల ప్రతిమలను చెక్కించెను. ఈ చిహ్నమే ఈ నాటి స్వతంత్ర భారతవర్షమునకు చిహ్నమై, జాతీయ జండాపై వెలయుచున్నది. ఈ నాల్గు సింహములు నాల్గు దిశలలో బౌద్ధధర్మములను గర్జించుచున్నట్లు కాన్పించుచున్నవి.

బుద్ధుడు మహాపరినిర్వాణము చెందుచుండగా, ఆనందుడు బుద్ధునితో "యోగ్యమగు మహానగరములు చంపా, రాజగృహము, శ్రావస్తి, సాకేతము, కౌశాంబి, వారణాశి" మొదలగున వెన్నియోగలవని, వానిలో గృహస్థ భక్తులగు మహాధనవంతులు, మహాసమర్థులు చాలమంది కలరని, వారు శ్రేష్ఠముగా బుద్ధుని శరీర పూజలచేయగలరని చెప్పుటచూడగా 'కాశినగరము' క్రీ. పూ. 6 వ శతాబ్ది నాటికి ప్రసిద్ధి కెక్కిన పెద్ద నగరమని స్పష్టపడుచున్నది

అహింస, అస్తేయము, సూనృతము, బ్రహ్మచర్యము బోధించిన జైనులు కూడ దానిని పుణ్యభూమిగా దలంతురు. జైనగ్రంథముల బట్టి 23 వ తీర్థంకరుడు 'పార్శ్వనాధుడు' కాశీపురములో క్రీ. పూ. 817 వ సంవత్సరములో జన్మించినట్లు 'జాకోబి'గణిత ప్రకారము తెలియుచున్నది. అతని 'అశ్వసేనుడు' కాశీరాజు, కాశ్యపగోత్రుడు. జైనాలయములు కూడ నిందు ప్రతిష్ఠింప బడియున్నవి.

(S. Slevenson – Heart of Jainism P 48)

అశోకుడీ క్షేత్రమును దర్శించి, ఒక స్థూపమును నిర్మించెను. సారనాథులోని శివలింగము అశోక స్థూపమునకు కొంచెము దూరములోనున్నది. దానికి 'శివనం

ఘేశ్వరము' అని పేరుగలదు. అనగా, సంఘమున కధిపతియని అర్థము. క్రీ. శ. 1792 వ సంవత్సర ప్రాంతమున వ్రాయబడిన 'కాశీపరిక్రమ' అను గ్రంథమున (రచయిత జయనారాయణ గోషాలు) హిందువులు వరుణానదినిదాటి, దీనిని బూజింతురని యున్నది. అందుచేత శైవులకు కూడ 'కాశి' ముఖ్యమైన క్షేత్రము. 'విశ్వేశ్వరుని' పూజించుటకు కూడ శైవులు వచ్చుచుందురు. పవిత్ర మైన గంగానది జలములో నేవిధమైన సూక్ష్మజీవులు ఉండవని, శాస్త్రవేత్తలు పరిశోధించి చెప్పియుండిరి.

అక్బరు చక్రవర్తి గంగానది నీరును త్రాగుచుండెడి వాడని 'ఐనీ అక్బరీ' మున్నగు సమకాలీన గ్రంథములు చెప్పుచున్నవి. ఇంటిదగ్గర, ప్రయాణములలో గూడ నిర్మలమైన గంగానది జలమును. ఆరాజు త్రాగుచుండెను. 'ఆగ్రాలోగాని' ఫతేపూరు'లో గాని ఉన్నపుడు, 'సోరన్' మండలమునుండి. పంజాబులోనున్నపుడు 'హరిద్వారము'నుండి గంగాజలమును దెప్పించుకొని త్రాగుచుండెను. అన్నము వండుటకు, వర్షము నీరుగాని, 'యమునా చీనాబు'ల నుండి కైకొన్న నీటిలో గొంచెము గంగానది జలమును గలిపికాని. ఉపయోగించు చుండినట్లు తెలియు చున్నది. ఆనీటి నాయన ప్రాణమూలమని. అమరత్వము గల్గించు జలమని పిల్చుచుండెను. (Vol I P 55 "Both at home and on travels, he drinks Ganges water. Some trustworthy persons are stationed on the banks of that river, who despatches the water in realed jars. When the court was at the capital Agra and in Fatehpur, the water came from the District of Soron, but now that his Majesty is in the Punjab. the water is brought from Hardwar. For the cooking of the food rain water or water taken from the Jumnah and Chenab is used mixed with a little Ganges water" "His majesty calls this, source of life. the water of immortality.'

శా. శ. 1446 సం. తారణ సం. మార్గశిర శు ౨ శనివారము 'తిరుమల మహాదేవరాయల' శాసనములో "కృష్ణదేవ మహారాయరిగె గంగోదక సేవితరప్ప-కోనప్పనాయకరు——" అని ఉండుటచేత, కృష్ణరాయలు స్వయముగ పోలేక, కోనప్ప, చేత గంగోదకము దెప్పించి అందుస్నానము చేసినట్లు తెలిసికోవచ్చును; గంగోదక స్నానముచేత పవిత్రులగుదురని కృష్ణరాయాది రాజులు నమ్ముచుండిరి.

'బెర్నియరు' అను మొగలు సామ్రాజ్యకాలములో వచ్చిన యాత్రికుడు, (క్రీ. శ. 1656——1668) కాశీనగరమును వర్ణించియుండెను. "అది హిందూ

దేశమునకు 'ఏథెన్సు వంటిది' అని వ్రాసెను. (Benares is the Athens of India. ఈనాటి 'కాశీనగరము' 1500 ప్రసిద్ధ దేవాలయములతో, గంగ యొడ్డునగల వివిధఘట్టములతో, బౌద్ధుల స్థాపనములు, విహారములు, సంఘారామము లతో కళకళలాడుచున్నది. పురాణాదులబట్టి చూడగా, శివుడు ఒక యుద్ధములో 'చతుర్ముఖుని' శిరస్సులలో నొక శిరస్సును ఖండించి, తోట్రుపడిపోవుచుండగా, ఆశిరస్సు యిచ్చోట పడిపోయి, అంతర్ధానమై పోయెనట. గజినీమహమ్మదుతో వచ్చిన 'అల్బరూని' ఈ విషయమును పేర్కొనెను. గంగామాత, ఒక మకరమును వాహనముగా గైకొని, పయనించుచు, ఈ ప్రదేశములో విగ్రహమై పోయెనట. ఈ విషయములు చారిత్రక సత్యములు కాకపోయినను, హిందూవులు మాత్రము నమ్ముచుందురు. శాస్త్రమొక కొలతవంటిది: (Science is a measurement) నమ్మకమునకు హద్దులేదుకదా!

## కాశీనగరము విద్యాకేంద్రము

'కాశీనగరము,' నాలందా, తక్షశిల, మధుర, ఉజ్జయిని, ప్రయాగ, కంచి క్షేత్రములవలె సంస్కృత విద్యలకు పుట్టినిల్లు. కాశీ, కాశ్మీరమున కీడుపోదని కొందరు వర్ణించిరి. కాశీక్షేత్రము మధ్యకాలము వరకు, గొప్ప విద్యాలయముగా ప్రసిద్ధిచెంది యుండలేదు. కాశీ, కంచి తర్వాత కాలములో విఖ్యాతి గాంచినవి. క్రీ. పూ. 7 వ శతాబ్దములో ప్రసిద్ధిగాంచిన నగరములో 'వారణాసి' యొకటి. కాశీరాజ్యము స్వతంత్రముగా నున్నపుడు, అనగా క్రీ. పూ. 15 వ శతాబ్దమునుండి క్రీ. పూ. 7 వ శతాబ్దము వరకు ఈనగరము మహోన్నతస్థితిలో నుండెను. ఈ నగరము చుట్టుకొలత 12 లీగులు లేక 85 మైళ్ళు అని జాతక కథలు వర్ణించు చున్నవి. ఈరాజ్యము చుట్టుకొలత 2000 మైళ్ళు అని కూడ తెలియుచున్నది. 'మహావగ్గము'లో గూడ దీని వర్ణన కలదు. ఈ పురములోని 'పురమంటపము' లేక ఆగారము, రాజకీయ సభలకుగాక, మత, తత్త్వ శాస్త్రసంబంధమగు వాదనల కుపయోగింపబడు చుండెనని స్పష్టపడుచున్నది. (జా IV—74) ఒక చిన్న రాజ్యమునకు 'కాశీ' కేంద్రమని, డా. బార్నెటు వ్రాయుచున్నాడు.

వేదములను సంహితలుగా గూర్చిన ఋషి, పురాణకర్త, మహాభారతము నకు మూలగ్రంథమగు 'జయ'ను జెప్పిన 'కృష్ణద్వైపాయన వేదవ్యాసుడు' యా

కాశీనగరములోనే గడపి, భిక్ష యందే కైకొని, ఒకనాడు భిక్షలభించమి, అలిగి శపించి తర్వాత వ్యాసకాశిని నిర్మించెను. లిపిలేని యాకాలమున తన శిష్యులకు వాగ్రూపకముగా సమస్త శాస్త్రములు నేర్పి, వేదవ్యాసుడు గొప్ప గురువుగా, ఋషిగా ఖ్యాతిగాంచెను. తక్షశిల తర్వాత కాశీ విద్యా కేంద్రమైనట్లు జాతక కథలనుబట్టి తెలిసికొనవచ్చును. తక్షశిలలోని విద్యార్థులే కాశీలోని అధ్యాపకులని, కాశీలో ఒక్కొక్క అధ్యాపకుడు 500 మంది విద్యార్థుల వంతున బోధించుచుండెనని తెలియుచున్నది. ప్రత్యేకముగా నిచట "గానవిద్య" బోధింపబడుచుండెను. 'తక్షశిల' ప్రసిద్ధి ఉన్నంత వరకు కాశీకిపోవు విద్యార్థులు తక్కువ. బుద్ధుని కాలములోని 'జీవకుడు, దగ్గరగానున్న కాశీకి పోకుండ తక్షశిలకు పోవుటకు కారణమేమిటో ఊహించుకొనవచ్చును. క్రీ. పూ. 7 వ శతాబ్దమునుండి క్రీ. పూ. 3 వ శతాబ్దము వరకు 'తక్షశిలా విద్యాలయము' వర్ధిల్లినది. తర్వాతనే 'కాశీ' పేరుగాంచినది. జ్యోతిష పండితుడగు 'నీలకంఠ పండితుడు' ఇచటనే జన్మించెను. అనేకమంది పండితుల కిచటనే వాదనలు జరిగెను. భారతదేశములో నత్యంత ప్రాచీనమైన ఈ నగరములో 'దివోదాస, ప్రతర్దనులు' కీర్తిగాంచిరి. కాశీరాజైన 'దివోదాసునికి 'ధన్వంతరి' యను పేరుగలదందురు. ఈయనయే ఆయుర్వేద ప్రారంభకుడుగా గాన్పించుచున్నాడు. ఆయుర్వేదముకు మూలపురుషులు 'ఆత్రేయ, అగ్నివేశులని' కొందరు వ్రాసిరి. కాని వీరు తర్వాతవారు. ఋగ్వేదములో ఆయుర్వేద జన్మదాతలు ముగ్గురు పేర్కొనబడినారు.

శ్లో॥ యదయాతందివోదాసాయ భారద్వాజాశ్వినాహయంతా॥(మం 1-12-16)

తా॥ దివోదాసుడు, భారద్వాజుడు, అశ్వినీదేవతలు వీరు ముగ్గురు ఆయుర్వేద ముపదేశించినవారు.

ఈ 'దివోదాసధన్వంతరి' దేవతల గురువగు ధన్వంతరి యవతారమని భారతీయులు నమ్ముచుండిరి. ఇద్దరు ధన్వంతరులు కలరా ? వేద కాలములో 'కాశీరాజు' 'దీర్ఘతపసు' అని, తర్వాత ఆయుర్వేదమును తెచ్చినది 'ధన్వంతరి' యని వాయు పురాణాదులు తెల్పుచున్నవి. (వాయు 92, 18; 21). వీరితర్వాత భీమరథుడు. దివోదాసుడు, ప్రతర్దనుడు, అలర్కుడు, కాశీరాజులు అని పురాణములు తెల్పును. కాన ఈ 'దివోదాసుడు, ధన్వంతరి దివోదాసుని పౌత్రుడని స్పష్టపడుచున్నది. ఋగ్వేద సర్వానుక్రమణికనుబట్టి, దివోదాసుని కుమారుడు 'ప్రతర్ధనుడు' ఋగ్వేదము 10—179 వ కర్త. ఈయన రాముని

సమకాలీనుడు. రామపట్టాభిషేక సమయమున నీ రాజు, అయోధ్యకువచ్చి, తిరిగి రాముని యనుమతితో వారణాశికేగెను. (A. I. C. పే 29) అందుచేత 'ప్రతర్దనుడు' క్రీ. పూ. 14 వ శతాబ్దములోనివాడు కావచ్చును అంతకు పూర్వము మూడుతరములకు ముందున్న 'ధన్వంతరి' నిశ్చయముగా క్రీ. పూ. 1500 సంవత్సర ప్రాంతమున నుండవచ్చును. ఈనాడు ఈయన చెప్పిన లక్షశ్లోకముల వైద్య శాస్త్రము కానరాదు. ఈయనయే శస్త్రవైద్యమునకు ప్రధానోపదిష్ట. భారత దేశములో, ఆయుర్వేద శాస్త్రారంభము క్రీ. పూ. 1600 ప్రాంతమని, చరిత్రరీత్యా నిశ్చయింప వచ్చును. పైన జెప్పిన 'అలర్కుడు', అగస్త్యుని భార్య 'లోపాముద్ర' వలన దీవనలు బొంది, దీర్ఘాయుర్దాయవంతుడాయెను. కాశీరాజు లలో 'అజాతశత్రుడు', దివోదాసునినుండి 17 వ తరమువాడుగా గాన్పించు చున్నాడు. ఈ 'అజాత శత్రుని' కుమారుడు 'భద్రసేనుడు, అశ్వపతి, జనక ధర్మధ్వజుడు, జనమేజయుడు, ప్రవహాణజైవాలి, శతానీకుడు, వీరెల్లరు సమకాలీనులు: క్రీ- పూ. 900 ప్రాంతపువారు.

ఆకాలమున ఋషులు ఆశ్రమములలో శిష్యులకు వాగ్రూపమున వేదవేదాంత ముల బోధించుచుండిరి. క్రీ. శ. 17 వ శతాబ్దమున వచ్చిన 'బర్నియరు' కాశీ లోని విద్యలనుగూర్చి వర్ణించియుండెను. (Bernier's travels P 334.) "ఇచట కళాశాలలు, తరగతులులేవు. శ్రీమంతులైన వారిచ్చిన ఆరామములలోనో, స్వంతయిండ్లలోనో ఒక్కొక్క అధ్యాపకుడు నలుగురు ఆరుగురు ఏడుగురు శిష్యులను బెట్టుకొను చుండెను. మిగులకీర్తి గాంచిన గురువరేణ్యులు 12 లేక 15 విద్యార్థుల నుంచుకొను చుండిరి; ఇదియే అత్యధికమైన సంఖ్య. విద్యార్థులు పది లేక పండ్రెండు వర్షముల కాలము గురువులచెంత చదువు చుండిరి కాశీలోని ఒక చతుశ్శాలలో తత్వశాస్త్రము, ఆయుర్వేదము మున్నగు శాస్త్రముల పెద్ద గ్రంథము లున్నవి ఇవి మహమ్మదీయుల చేతులలో బడినచో దగ్ధమై పోవు నేమోయని, వారు పలువిధముల భయపడుచుండిరి. వారికి శారీరశాస్త్రము (Anatomy) ఏమియు తెలియదు. మానవశరీరములోని రక్తనాళములు లెక్క ప్రకారము 5000 అని వారు చెప్పుచుందురు. వారు ప్రపంచము బల్లపరుపుగాను, ముక్కోణాకారముగా నుండునని బోధించుచుండిరి. ఇది వారి భూగోళశాస్త్రజ్ఞానము." ఈప్రకారము భారతీయుల విద్యలను గూర్చి విదేశీయులు హేళనజేసిరి. అనంత మైన మూఢనమ్మకముల గూర్చి ఆక్షేపించిరి. నాగార్జునుని శిష్యుడైన ఆర్యదేవుడు (దేవ — కాణదేవ — నీలనేత్రుడు.) తన "చిత్తవిశుద్ధి ప్రకరణము"లో

గంగానదిపై సనాతన బ్రాహ్మణులకు గల భక్తి గౌరవాదులజూచి, హేళన చేయుచు వ్రాసెను. (K. R. Subrahmanyan-Andhra history P. 62.) ఈగ్రంథము మాకు లభ్యము కాలేదు. ఏవిధముగా నాలోచించి చూచిన, కాశీ మున్నగుచోట్ల చెప్పబడిన ప్రాచీన విద్యలు శారీరశాస్త్ర, భూగోళ, ఇతిహాసాదులు బహుభాగము శాస్త్ర సమ్మతము (Scientific) కావని చెప్పవచ్చును. భారతీయుల తత్త్వ విద్య, బ్రహ్మచర్యము, సత్యము, అహింస మున్నగు బోధలలో, ప్రపంచములో వీరిదే అగ్రస్థానమని చెప్పుటకు మేము వెనుకాడము. ప్రాచీన భారతీయులకు పారమార్థిక చింతయందున్న లక్ష్యము, ఐహిక విషయములలో గాన్పించదనుట స్పష్టము.

## వివిధ వాఙ్మయములలో కాశీరాజ్య ప్రశంస

ఈనాటి కాశీనగరము ఉత్తరమునుండి దక్షిణముకు ఐదు మైళ్ళ పొడవున్నది; తూర్పునుండి పడమరకు వెడల్పు రెండుమైళ్ళున్నది; అనగా పది చదరపు మైళ్ళ పైశాల్యముగల్గియున్నది. 1941 లో జనాభా 2,58,908 మంది ప్రస్తుతము దీనిజనాభా నాల్గు లక్షలు ఉత్తరమున సారనాథ్, దక్షిణమున మాళవ్యా పండితునిచేత స్థాపించబడిన 'హిందూ విశ్వవిద్యాలయము' ఆధునిక కాశీనగరమునకు ఎల్లలుగా నున్నవి. ఈ కాశీనిగూర్చి స్కాందపురాణము, వాయుపురాణము, కాశీఖండము, కాశీమహాత్మ్యము, జాతక కథలు, మహావగ్గము మున్నగుచోట్ల వర్ణించబడియున్నది.

తమిళములో ఒక భక్తుడు వ్రాసిన 'కాశీయాత్ర' కలదు. 'ఏనుగుల వీరాస్వామయ్య' తన తెలుగు 'కాశీయాత్రలో' కాశీని వర్ణించి యుండెను. ఇండూరు రాజు 'మలహార్‌రావు హోల్కారు' భార్య 'అహల్యాబాయి' ఇరువదవ ఏట భర్త మరణించగా, క్రీ. శ. 1765—1795 వరకు రాజ్యపాలనచేయుచు కాశీ మున్నగు అనేక పుణ్యక్షేత్రములకేగి, దానధర్మము లాచరించి, వచ్చిన వారికి లేదనకుండ అన్నదానముచేసి విఖ్యాతి గడించెను. చరిత్ర యిట్టి సాధ్వీమణుల మరచి పోజాలదు. కాశీలోని అన్నపూర్ణ సత్రములో పూనా శ్రీమంతుని తమ్ముడైన 'అమృత రాయుడు' 1500 మందికి ప్రతిదినమున్ను అన్నము పెట్టునని 'కాశీ తంబురాయడు' అనే పండారముగుండా 1000 మందికి అన్నదానము చేయునని, మైసూరురాజు మొదలగువారు, స్వయంపాకములు, అన్నదానములు చేయుచుందురని, ఏనుగుల వీరాస్వామయ్య వర్ణించెను.

అమృతరావు ధర్మములనుగూర్చి 'హీబర్' కూడ వర్ణించెను. ప్రతి బ్రాహ్మణునికి ఈ మహారాష్ట్రుడిష్వా ఒకసేరు బియ్యము, ఒక రూపాయదబ్బు యిచ్చుచుండెనని, కుంటి గ్రుడ్డివారికి కూడ ధర్మము నిచ్చుచుండెనని సంవత్సరము నకు రు 50000 ధర్మము లేక అంతను మూడులెల్లు చేయుచుండెనని, 'హీబర్' వ్రాసెను. 'కాశీశంకరు' కూడ ధర్మదాతయని ఇతని వ్రాతల వలన తెలియుచున్నది.

(Reginald Heber – Narration of journey through the upper provinces of India Vol. I P 374)

కాని కాశీలో నతి ఆచారము కలదని, ఇందును తీర్థయాత్రను లిచటకువచ్చి, గంగలోమునిగి ప్రాణము పోగొట్టు కొనుచుండిరని, అందువలన ముక్తిగల్గునని వారు నమ్ముచుండిరని, వారు రెండు రెక్కిరీపాత్రలుకొని, వాని మనస్సు చాల కట్టుకొను చుండిరని, తర్వాత నీళ్ళలో ముంచి, వానితోబాటు గంగలోమునిగి చనిపోవు చుండిరని, హిందువుల ఈ మూఢనమ్మకముల ప్రభుత్వ మూపలాలించెనని, పాశ్చాత్య లేఖకులు వ్రాసిరి. ఒక మహారాష్ట్రము నుండియే 20000 మంది యాత్రికులు వచ్చుచుండిరట. మిగత భారతదేశమునుండి ఎందరు వచ్చుచుండిరో! 16 వ శతాబ్దములో వచ్చిన 'ఫిచ్' (Fitch) కొన్ని మూఢనమ్మకముల ఉరిద్ర దేవునివలె విమర్శించెను.

1839 లో 'రంజిత్‌సింగు' మరణించినపుడు అతని నల్గురు భార్యలు, ఏడుగురు దాసి స్త్రీలు, చితిపైన పరుండి 'రంజిత్‌సింగు'తో బాటు ప్రయాణము చేసిరి. ఇది దురాచారముకాదా!

విశ్వేశ్వరుడు, చనిపోవు వారికి తారకమంత్ర ముపదేశించునని ప్రజలు నమ్ముచుండిరి. ఇందు పదివేల యిండ్లు, లక్షప్రజలు గలరని పై లేఖకుడు వ్రాసెను. 'హీబరు'లెక్క ప్రకారము 5,82000 ప్రజలు గలరని తెలియుచున్నది. (1803 లెక్కలు) కాశీలో సకలగ్రంథముల సంగ్రహించి కుంపిణీవారు ఒక శాల నేర్పరచిరని, పైలేఖకుడే వ్రాసెను.

ఇట్టి ఈ కాశీనగరము, రాజ్యము క్రీ. పూ. 1600 నుండి వర్ధిల్లినది, కాని అనేకదండయాత్రలచేత నగరము ధ్వంసమైపోయినది. హైహయులు, గంగా యమున సంగమస్థానములో, కాశీపై దండయాత్ర చేసి, 'హర్యశ్వుడను' రాజును వధించిరి. ఇదియే మొదటి దండయాత్ర. అతని కుమారుడు 'సుదేవుని' కాలములో, హైహయులు మరల దండయాత్ర సలిపి, అతని నోడించి, నగర

మును దోచుకొనిరి. సుదేవుని కుమారుడు, 'దివోదాసుడు' రాజాయెను. మరల కాశీనగరము నీరాజు 15 మైళ్ళదూరములో దృఢముగా నిర్మించెను. హైహయులతో 100 రోజులు "సౌదేవ దివోదాసుడు" యుద్ధము చేసెను. ఇత డోడిపోయి నగరము వదలి, భరద్వాజాశ్రమములో తలదాచుకొనెను. అతని కుమారుడు ప్రతష్టనుడు, నిర్వక్రపరాక్రమోపేతుడు, గంధ గజేంద్రతుల్య బలాఢ్యుడు, గంగా నదినిదాటి, హైహయుల నోడించివచ్చెను. ఈ యుద్ధములో నితని భార్య 'దృషద్వతి' సాయ మొనర్చినట్లు తెలియుచున్నది. ప్రాచీన కాలములో వీరపత్నులు భర్తలకు సాయమొనర్చి రనుటకిది నిదర్శనము. 'అలర్కుడను' రాజు కాలములో 'కాశీరాజ్య' మతనికి సంపూర్ణముగా లభించెను. సత్యవంతుడైన హరిశ్చంద్రుడు తన భార్య చంద్రమతిని అమ్మబోయిన తావు నేటికి 'చౌక్' అను పేర బరగుచున్నది. హరిశ్చంద్ర ఘట్టము కూడ ఈ నాటికి గలదు.

ఈ నగరమును ఈ స్వతంత్ర రాజ్యమును బలువురు పాలించిరి. జాతక కథలలో ననేకచోట్ల 'బ్రహ్మదత్తుడను' రాజుపేరు వ్రాయబడియున్నది. 'మహా శీలవ జాతకము'లో నొక మంత్రి కాశీ రాజ్యమును గూర్చి చెప్పుచు "వారణాశి రాజ్యము తేనెటీగలచే ముటిన పరచనట్టి తేనెతుట్టెవలె ఉన్నది. ("The kingdom of Benares is like a goodly honeycomb untainted by flies") అని చెప్పుటచేత, ఇది మహోన్నత స్థితిని జెందినట్లు గ్రహించవచ్చును.

జైనకల్ప సూత్రాదుల బట్టి, గౌతమబుద్ధుని కాలములోని 11 రాజ్యములలో 'కాశీ'లోని మల్లులు ప్రసిద్ధి చెందిరని తెలియుచున్నది. 'అంగుత్తరనికాయము షోడశ మహాజనపద యుగమును వర్ణించినది. అందు కాశీరాజ్యము కూడ కలదు. 'రైస్ డేవిడ్స్' యిట్లు వ్రాసెను. "కాశీలు అనువారు 'వారణాశి' చుట్టు ఉన్న మండలములలో స్థిరపడినవారు. భరతుల ఈ పురాతన రాజ్యము, బుద్ధుని కాలములో, రాజకీయముగా నధోగతి పాలాయెను. కోసల, మగధదేశపు రాజ్యములు, ఈ పట్టణపు ఆదాయమును గూర్చి వివాద పడుటచేత, ఈ రాజ్యమే చివరకు కోసలలో జేరిపోయెను." (Rhys Davids — Buddhist India, P. 17) 'ఇంటికి అజాత శత్రుడు' లిచ్ఛవులు, మల్లులు, కాశీ కోసల సంబంధమగు 18 గణరాజ్యములపై 16 ఏండ్ల యుద్ధమాడెను. దీని ఫలితముగా వైశాలీ, విదేహ, కాశి, కోసలలోని కొంత భాగము 'అజాత శత్రుని'రాజ్యములో లీనమైపోయెను. తిరిగి యిది స్వాతంత్ర్యత ననుభవించలేదు. దీని హద్దులు తర్వాత తెలియకున్నవి.

ఈ ప్రకారము క్రీ. శ. 6 వ శతాబ్దము వరకు ఖ్యాతి గాంచిన 'కాశీరాజ్యము' మొదట కోసలకు, తర్వాత మగధరాజులకు లొంగిపోయెను. చివరకు కోసల రాజ్యములో గలసిపోయెను. దీని స్వతంత్రత క్రమముగా నశించి పోయెను. అందు చేత బుద్ధదేవుని కాలము నాటికి, కాశీరాజ్యము తన ప్రసిద్ధి కోల్పోయినది. 'వారా ణాశి' లో 'ఋషిపతన మృగదావము' లోని 'విహారములో' 'కాశీరాజు' 'కికి'తో కాశ్యపునికి సంవాదము జరిగినట్లు బౌద్ధ గ్రంథములు చెప్పుచున్నవి. బుద్ధదేవు డిచట 'ఘటికార' యను కుంభకారుని జీవితమును వర్ణించియుండెను. అదియే 'త్యాగముయు గృహస్థజీవనము.' ఇది మజ్ఝిమనికాయము, 'ఘటికారసుత్తాంతము' లో నున్నది.

ధర్మపాద వ్యాఖ్యనుబట్టి, జాతక కథలనుబట్టి పాణిగ్రహణ మహోత్సవ సమయములో వధువుకు 'స్నానచూర్ణమూల్యము (Bath powder money) ను తండ్రి యిచ్చెడివాడని తెలియుచున్నది. ఈ కాలపు తండ్రులు తమ కుమార్తెలకు వివాహ సమయములో పసుపు కుంకుమల క్రింద భూమి యిచ్చిన మాదిరిగా ఈ పద్ధతి ఉన్నది. 'ప్రసేనజిత్తు తండ్రియైన 'మహాకోసల' యనువాడు 'కోసల రాజు', తన కుమార్తె 'కోసలదేవిని' మగధరాజు బింబిసారునికిచ్చి కాశీమండలము లోని యొక గ్రామమును 'స్నానచూర్ణ మూల్యము' గా నొసంగెను.' ప్రసేనజిత్తు' కుమార్తె 'వజీర'ను (వజీరి కుమారి) మగధరాజు 'అజాతశత్రునికిచ్చి, ఆమెకు స్నానచూర్ణ మూల్యముగా 'కాశీగ్రామ మిచ్చెనని' ధర్మపాద వ్యాఖ్య (Vol iii — P 266) తెల్పుచున్నది.

'అద్దకాశి' యను భిక్షుణి 'కాశీవర్తకుని కూతురు. ధర్మమెరింగిన యువతిగా, ఈమె వినయ పిటకాదులలో కొనియాడ బడినది. 'మిలిందుడను' గ్రీకురాజుకు (మీనాండరు) నాగసేనుడను బౌద్ధభిక్షువుతో సంవాదము జరిగినది. ఇది 'మిలింద పన్హా' యను గ్రంథమున వర్ణించ బడినది. (క్రీ. పూ. 110) నిర్వాణమునుగూర్చి బోధించుచు, నాగసేనుడు మిలిందునితో నిట్లనెను. "మహారాజా ! నిర్వాణము పొందుటకు ఏస్థలముతోను పనిలేదు; సన్మార్గమున నడచుచు, మనసును విగ్రహించి యుంచినచో, నిర్వాణము పొందవచ్చును. శీలముపై దృష్టిని ప్రతిష్ఠించి, మనసును వశములో నుంచుకొన్నచో, మనుజుడు నిర్వాణమును బొందుచున్నాడు. 'కాశిలో, కోసలలో, గాంధారము'లో నుండి కూడ, శీలముపై ప్రతిష్ఠించి, మనసును వశములో నుంచుకొన్నచో, నిర్వాణమును బొందగల్గును. లేనిచో 'కాశీ'లో నున్నను నిర్వాణమును బొందజాలడు." దీనినిబట్టి 'కాశీ' యొక్క ప్రసిద్ధి క్రీ. పూ. 2 వ

శతాబ్దము నాటికి గలదని స్పష్టపడుచున్నది. ఈ గ్రంథములోనే (పుట 252) "ధర్మాశోకునికి, 'బిందుమతి నామక గణిక, తన సత్యబలముచేత గంగానది జలమును ఎదురు ప్రవహించునట్లు చేసి చూపినదని వ్రాయబడినది. గంగానది పొడవు 500 యోజనములని, వెడల్పు యోజనమని ఇందు వర్ణింపబడి యున్నది.

అంధకార యుగములో రాజ్యపాలన చేసిన 'భారశివుల' వంశము యొక్క మూలస్థానము 'కోశాంబి కాశీల' మధ్యప్రదేశమైనట్లు ఐతిహాసిక లేఖకుల పరిశోధనల వలన తేలినది. తామ్రలేఖనముబట్టి, ఈ 'భారశివులు' శివలింగమును కంఠమున ధరించి, శివునితృప్తి పరచినవారని, వారి రాజ్యాభిషేకమును, 'భాగీరథి' పవిత్రజలము చేత జరిపినారని, దశాశ్వమేధ యజ్ఞము జరిపి, అవభృథ స్నానము చేసిరని, తెలియుచున్నది. కుషాను సామ్రాజ్యానంతరము, దాదాపు క్రీ. శ. 150 ప్రాంతములో, వీరు కాశీప్రాంతమున రాజ్యము సంపాదించిరి. 'కాశీకి దగ్గరగా నున్న 'నగవా' నామక స్థానములో ననగా, ప్రస్తుతము 'హిందూ విశ్వవిద్యాలయము'న్న స్థానము వారిపేరుతో పిలసినది. దశాశ్వమేధ యజ్ఞములు జరిపిన తర్వాతకల్గిన బిడ్డకు 'హయనాగ' యని మొదటిరాజు పేరిడెను. ఈ భారశివులను పురాణములలో నవనాగులని పేరుగలదు. శైవ ధర్మముననుసరించిన 'పల్లవులు' తమ ముఖ్య నగరమైన 'కాంచీ నగరము'ను ఉత్తరమున ఉన్న 'కాశీ' వలె, తమ శాసనములో గొనియాడిరి. 'హౌనుత్సాంగు' ఈ కాంచీపురమును జూచి వర్ణించి యుండెను. ఆ కాలమున ఇందు నూరు బౌద్ధ సంఘారామములు, పదివేలమంది బౌద్ధమతాచార్యులు, ఎనుబది హిందూదేవాలయములు, దిగంబర జైన సన్యాసులు కూడ వేలకు వేలుండిరని, ఈపురము 5 లేక 6 చదరపుమైళ్ళ విస్తీర్ణముగల పట్టణమని, ప్రఖ్యాత బౌద్ధపండితుడైన 'ధర్మపాలుని' జన్మస్థానమని, వర్ణించియున్నాడు. అందుచేత ఈ కాంచీపురము కూడ 'కాశీ' వలె సమస్తమతస్థులకు పుణ్యక్షేత్రమని చెప్పవచ్చును. (Watters — Vol II — P 226—228) ఈమధ్య ఈగ్రంథ కర్త దక్షిణదేశ సంచారము చేయుచు 'కాంచీపురము'ను జూచివచ్చెను.

వాయుపురాణములో, మధ్యప్రదేశములోగల రాజ్యములలో, కాశీరాజ్య మొక్కటే యని వ్రాయబడి యున్నది. శివపురాణములన్నియు కాశీని బేర్కొనియున్నవి.

క్రీ. శ. 5 వ శతాబ్దములో వచ్చిన 'ఫాహియాను' సారనాథునుజూచి, అందు నాల్గు స్థూపములు, రెండు బౌద్ధ సంఘారామములు, ఉన్నవని అందు

భిక్షువులుండిరని వ్రాసెను. హిందూదేవాలయముల ప్రశంస, అతని వ్రాతలలో గాన్పించదు. (హిందీ — జగన్ మోహనవర్మ — పాహియాన్ P. 7/)

క్రీ. శ. 7 వ శతాబ్దములో వచ్చిన 'హౌనుత్సాంగు', అచట 30 బౌద్ధ సంఘారామములు, 1500 భిక్షువులు 'థేరవాద శాఖకు చెందినవారు గలరని, 100 హిందూదేవాలయములు గలవని, అందు 10000 మంది ముముక్షులుండిరని వ్రాసియుండెను. నగరమునకు ఈశాన్యమున వరుణానదికి పడమర, 100 అడుగుల ఎత్తుగల అశోకుని స్థూపముగలదు. స్థూపమున కెదుట ఒక రాతి స్తంభము డెబ్బది అడుగుల ఎత్తుదికలదు. ధర్మచక్రము నుపదేశించు బుద్ధుని ప్రతిమకూడ కలదని పై లేఖకుడు వ్రాసెను.

"వరుణానదికి 10 లీల దూరములో, లూయీలోని సంఘారామము గలదు. ఇది 8 భాగములుగా విభజింపబడి, చుట్టును గోడగల్గియున్నది. దీనిలో 1500 మంది భిక్షువులు సమ్మతీయ శాఖకు జెందిన, హీనాయాన ముముక్షులు కలరు. దీని లోపల 200 అడుగుల ఎత్తుగల ఒక విహారముగలదు. దీన్పైన బంగారు పూతగల మామిడి పండుగలదు." ఈ విధముగా, చైనీయ లేఖకుడు వర్ణించియుండెను. అనేకచోట్ల బంగారు విగ్రహములగూర్చి కూడ ప్రస్తావించెను. తథాగతుడు స్నానముచేసిన, గుడ్డలుతుకవేసిన, భిక్షాపాత్రను కడిగిన కొలనులనుకూడ 'హౌను త్సాంగు' వర్ణించియుండెను. ఈ చైనీయ లేఖకుల వ్రాతలవలన కాశీవృత్తాంతము తెలియుచున్నది.

అర్వదిమంది భిక్షువులను ధర్మదేశనమునకై ఆయా దిక్కులకు 'వారణాశి' నుండియే పూర్ణబ్రహ్మచర్య ప్రకాశకుండు ధర్మవేత్తయగు బుద్ధదేవుడు పంపించి యుండెను. యుగ యుగాంతరములు స్మరించదగిన ధర్మమిందుండియే మ్రోగెను. "భిక్షువులారా ! బహుజన హితార్థముగ, బహుజన సుఖార్థముగ, లోకసంగ్రహ బుద్ధితో దేవమనుష్యులకు లాభకారిగా, హితకరముగ, సుఖకరముగ, అన్నిచోట్ల సంచరించుడు. ఆదికల్యాణము, మధ్య కల్యాణము, అంత్య కల్యాణము నగు ధర్మము నుపదేశించుచు బొండు. అర్థసహితమును, కేవలమును, పరిపూర్ణమును పరిశుద్ధమగు బ్రహ్మచర్యమును బ్రకటించుడు. లోకములో అల్పదోషయుతులగు ప్రాణులు ధర్మమును విననిచో చెడిపోవుదురు; విన్నచో ధర్మవేత్తలగుదురు.

ఈ అమృతమయమగుబోధ సారనాథునుండియే బయలుదేరినది.

ఈ సారనాథ ప్రధానమందిరములో నిల్చుండి గ్రంథకర్త బుద్ధుని సందేశమును విద్యార్థులకు వినిపించెను. ఇచ్చటనుండియే బుద్ధుడు శిష్యులను, నలుదిశలకు పంపించుచు, 'భయపడని ఖడ్గమృగమువలె' ధ్వనులకు భయముచెందని మృగరాజువలె, నీటిబొట్టు అంటని తామ రాకువలె, ఒంటరిగా ఖడ్గమృగమువలె త్రోవ తెన్ను లేకుండ ముందుకునడువుడు, అని బోధించెను.

("Go forward without a path,
Fearing nothing, like the
rhinoceros;
Even as the lion not trembling
at noises,
Even as lotus leaf, unstrained
by the water,
Do thou wander alone, like
the rhinoceros.")

ఇంకను 'రాజతరంగిణి' మొదలగు గ్రంథములలో కాశీ ప్రశంస గలదు. "పవిత్రమైన 'కాశీ'యని, అచటికి పోవుటకు సమస్తమును వదలు కొందునని, ఇత్యాది వచనములు కాన్పించును. 'మాతృగుప్తుడు' కాషాయవస్త్రములు ధరించి' సమస్తము సన్యసించి, ఆయన యతి యాయెను. నేను అంతిమ దశలో కాశీ కేగుదును."

(Ranjit Sitharam Pandit) — Raja tharangini — P. 82 "Therefore by going to hallowed Benares eagerly looking for the bliss of repose, I propose to renounce everything, as is meet for a twice born man . III—297)

83 P. "Then going to Benares Mathru Gupta assumed the ochre brown garment and having renounced everything that good man became a Yati" (III—320)

265 P "After completing the founding of the city and, throwing the yoke of Government on the I propose to go to Benares or to Nandikshetra perchance" (VII-646)

" He gave up charge and journeyed to Benares" (VII-1007)

అల్బెరూని కూడ కాశిని గూర్చి వ్రాసెను. "బారినుండి 20 ఫర్సకులలో, ప్రఖ్యాతి గాంచిన 'బనారసి' కలదు. ఉత్తరమునుండి చూచిన, ఇది హిందూ దేశమునకు 'ముఖద్వారము.'

ఈ ప్రకారము క్రీ. పూ. 15 వ శతాబ్దమునుండి క్రీ. శ. 12 వ శతాబ్దము వరకు గల వాఙ్మయములో కాశీ ప్రశంస కాన్పించుచున్నది.

# కాశీపై దండయాత్రలు

కాశీనగరి నిర్మాణానంతరము, ప్రప్రథమమున రెండు మూడు పర్యాయములు, వేదకాలములో 'హైహయుల' దండయాత్రలు జరిగియుండెను. వీనివలన నగరము కొంతవరకు ధ్వంసమాయెను. తిరిగి నూతన నగరము కొంచెము దక్షిణముగా నిర్మించబడెను. తర్వాత క్రీ. శ. 6 వ శతాబ్దము వరకు, కాశీపై దండయాత్రలు కాన్పించవు. ఈ శతాబ్దములో శ్వేతహూణుల నాయకుడును శైవుడునగు 'మిహిరకులుని' కాలములో, నేల ఈనినట్లు వచ్చిన అసంఖ్యాక హూణుల దుష్ట హస్తములలో, బౌద్ధులు చంపబడుటయేగాక సారనాథులోని పంచకూట బౌద్ధ స్తూప, విహార, సంఘారామములకు గొప్ప దెబ్బ తగిలెను. అనేక మందిరములు శిథిలములాయెను. 'ఫాహియాను' కాలములో లేని హిందూ దేవాలయములు, 'హౌను త్సాంగు' వచ్చునప్పటికి నూరు నిర్మింపబడుటచేత అవి హూణుల దండయాత్రానంతరమే నిర్మించ బడినవని, కొందరు విద్వాంసులు ఊహించుచున్నారు. జైన లేఖకుడైన 'గుణభద్రుడు', ఈ 'మిహిరకులుని' నరహంతకునిగాను, దుష్టులలో మొదటి వానినిగాను చిత్రించి యుండెను. రోజుకు మూడు గొర్రెలను భుజించిన "నెపోలియను" అన్న ఐరోపియనుల కెంత భయమో ఇతని పేరువిన్న భారతీయుల కంత భయముగా నుండెడిది.

హూణుల దండయాత్ర తర్వాత, నూత్న బౌద్ధ విహారాదులు నిర్మించబడినది, శిథిల మందిరముల బాగుచేయించినది తెలియదు.

అంధకార యుగములో హిందూమత విజృంభణము సాగిన కాలది, బౌద్ధులు నానావిధ హింసలకు గురియైరి; వారి శిల్పము, విగ్రహ వైభవము, మందిరాదులు హిందువుల తీవ్ర క్రోధానలమునకు గురియాయెను, ఆఖరుదెబ్బ మహమ్మదీయరాజుల హస్తములతో జరిగెను.

జయచంద్రుని వధించిన తర్వాత, 'మహమ్మద్‌ఘోరీ' క్రీ. శ. 1193 వ సంవత్సరములో 'అసీకోట'లో దాచబడిన విశేష ధనసంచయముల గైకొని, 'కాశీనగరము'న కేగెను. అతని సేనానాయకుడు "కుతుబుద్దీన్ ఐబక్" ఆ నగరమును దోచి, అనేక ఆలయముల సంఘారామముల నేలమట్టముగావించి, 'ఢిల్లీనుండి కాశీపురము' వరకు గల ప్రదేశమంతయు స్వాధీనపరచుకొనెను. అప్పటి నుండి ఇది ముస్లిముల పాలనలోనుండెను. (B. Majumdar — A guide to Saranath. P 22, "His general Kutubuddin Aibak entered

Benares, sacked the city and destroyed numerous temples. It is quite possible that the invader did not spare the monasteries and temples of Saranath.")

'ఔరంగజేబు' మహమ్మదీయ మతావేశ పరవశుండై, అనేక హిందూ దేవాలయముల నేలమట్టముగావించి, కొన్నిటిని మశీదులుగా మార్చివైచెను. ఈ నష్టమునుండి హిందువులు మరల నెన్నడును కోలుకొనియుండలేదు. వారణాశీ నగరము తిరిగి ప్రాచీన హిందూ దేవాలయ శిల్పసంపదను నోచుకొన దాయెను. 'ఔరంగజేబు' మరణానంతరము అరుగురు, బలహీనులగు మహమ్మదీయ రాజులు పాలనచేసిరి. మొగల్ రాజ్య పతనానంతరము, అయోధ్య నవాబు సాఫర్ద్‌జంగ్ 'అధీన ములో నుండెను. ఇతని మనుమని కాలములో అనగా క్రీ. శ. 1776లో 'బ్రిటిషువారు' 1775 సంధిప్రకారము ఈ పురమును తమ రాజ్యములో గలుపుకొనిరి. రాజకీయ ముగా, మతసంబంధముగా, ననేక దండయాత్రలు జరిగినను, హిందూవులు తమ ప్రాచీనులనుండి వంశపారంపర్య రీత్యాకైకొన్న ఆచారములు, సనాతన ధర్మములు, పూజాపునస్కారములు. ఆర్యధర్మ నియమముల వీడలేదు.

ఈ మూడు దండయాత్రలను సాక్షిమాత్రముగానుండి, చూచిన రెండు మూడు మందిరములు అటులనే ఈ నాటికి నిల్చియున్నవి. రెండు స్థూపములు ఆరు శతాబ్దముల కాలము చెక్కుచెదరక నిల్చియున్నవి. కాశీనగర ప్రాచీన వైభవమును, కళాసంపద నీ స్థూపములు చాటుచున్నవి.

—o—

# కాశీ నగర పరిశ్రమలు

కాశీనగరము శ్రీమంతులైన వర్తకులకు ప్రసిద్ధి. ఈ నగరము అనేక విధములగు వర్తక వాణిజ్యాదులకు ప్రసిద్ధి గాంచియుండెను. అనాదినుండి పట్టు వస్త్రములకు చీరలకు ప్రసిద్ధి చెందినది. 'మెకాలే' అను విఖ్యాత ఆంగ్లలేఖకుడు దీనిని గురించి ఇట్లు వ్రాసెను. "కాశీమగ్గములనుండి పోయిన అతి సున్నితమైనపట్టు వస్త్రములు, 'సెంటు జేమ్సు' వర్సేయిల్సు నగరముల చతుశ్శాలల కేగుచుండెను." (Macaulay — "From the looms of Benares went forth the most delicate silks that adorned the halls of St. James and Varsailles.")

క్రీ. పూ. 2 వ శతాబ్దమునాటి గ్రంథమగు 'మిలిందపన్హా'లో సాగలనగర వర్ణనముగలదు. ఆ నగరము 'యవనుల వాణిజ్య వ్యవసాయములకు కేంద్రమని, 'కాశీ, కొడుంబరాది స్థానములనుండి చేయబడిన వస్త్రముల పెద్ద దుకాణములు గల్గియున్నదని' ఉండుటచేత, కాశీ వస్త్రముల ప్రసిద్ధి, ఆ కాలమున అన్నిచోట్ల గలదని తెలియుచున్నది.

శ్రేష్ఠి పుత్రుడు, యశుడనువాడు, హేమంత, గ్రీష్మ, వర్షములను మూడు ఋతువులకు మూడు మేడలు కాశీలో గట్టుకొని యుండెను. ఈ యశ బుద్ధునిచెంత కేగి సన్యసించెను. అతని మిత్రులు నల్గురు శ్రేష్ఠి కులజులు కూడ బౌద్ధ ధర్మమును స్వీకరించిరి. తరువాత కాశీనగర వాసులు 50 మంది బౌద్ధ ధర్మము స్వీకరించిరి. వీరెల్లరు అనేక వ్యాపారములు చేయు శ్రేష్ఠికులజులుగా గాన్పించుచున్నారు. దాన ధర్మములకు, పుణ్యకార్యము లాచరించుటకు భారత వర్షములో వైశ్యులు సుప్రసిద్ధులు. శ్రీరంగ పట్టణములో 'టిప్పుసుల్తానుకు' కూడ మూడు రాజభవనము లున్నట్లు కాన్పించును. కోటలోని రెండు భవనములు నేడు శిథిలములైనవి; ఊరిబయట నున్న 'దరియా దౌలత్', వేసంగి భవనము (Summer palace) కానవచ్చును.

'తుండిల జాతకము'ను బట్టి 'వారణాశి'కి ముట్టుప్రదేశముల ప్రత్తిచేలు విశేషముగా గలవని, (కప్పసక్షేత్రములు) ప్రత్తి వస్త్రములు కాశీలో లభ్యమగుచుండెనని తెలియుచున్నది. బౌద్ధవాఙ్మయములో 'కాసెయ్యక వస్త్రములు' విశేషముగా ప్రశంసించబడెను. వారణాశి వస్త్రములుకూడ శ్రేష్ఠతమములై యుండెను. ఈ వస్త్రము లేవిధమైన తైలమును గ్రహించనంత, సన్ననివై యుండెను. గుఱ్ఱపు వర్తకులు తమ గుఱ్ఱములతో నుత్తరదిశనుండి వచ్చి, 'వారణాశి'లో తమగుఱ్ఱముల నమ్ముకొను చుండిరని, జాతక కథలలో నుల్లేఖింపబడియున్నది.

'టావర్నియర్' మొగలాయిరాజుల కాలములోవచ్చి, భారతవర్షమును గాంచి యుండెను. 'కాశీ' నగరములోని వస్త్రములగూర్చి, ఈ విధముగనిట్లు వ్రాసెను. "రాజా గారి కొలువు కూటము మధ్యలో రెండు గాలరీలున్నవి. అచటవారు ప్రత్తి, కాలికో, పట్టుగుడ్డలు, ఇతరవర్తక సరకు విక్రయించెదరు. అచట ఈ వస్త్రములను నేమాడు చేసిన పనివాండ్రే, ముమ్మందుగా ఈ సరకుల నమ్ముచుందురు; కాని ప్రథమముగా, కంట్రాక్టు తీసికొన్న వారిచెంతకేగి, 'అభిజ్ఞాన ముద్రలను' వేయించుకొని వచ్చి విదేశీయుల కమ్ముకొందురు. ఈ ముద్రలు లేకుండ ఏ వస్త్రమేని విక్రయింపబడినచో, వారి కధికార్లు జరిమానా విధించి, కొరడాలతో దెబ్బలు కొట్టుచుండిరి."

(Tavernier — Travels in India P 97) బుద్ధుని కాలమునకూడ వస్త్రముల పరిశ్రమ అభివృద్ధిలోనున్న ఆధారములు గలవు.

ఈ వస్త్రములతో బాటు, ఇత్తడి, నానావిధ చిత్రములు, లతలుగల్గి అంచులతో సుందరమైన, పట్టు వస్త్రములు ఇచట లభించుచుండెను.

గౌతముడు 'మహాభినిష్క్రమణము' జేయుటకు పోవునపుడు, తాను భిక్షుకుడగుటచేత 'కాశీ వస్త్రములు' యోగ్యములు కావని తలంచి వానిని వదలివేసెను. బుద్ధుడు ధరించినవి కాశీ వస్త్రములని స్పష్టమగుచున్నది. ఈనాడీ పట్టువస్త్రముల పరిశ్రమ యంతయు మహమ్మదీయ సాలీల చేతులలోనున్నది. 'మహమ్మద్ బిన్ తుగ్లక్' 14 వ శతాబ్దములో ఢిల్లీలో 500 మంది సాలీలనుంచి, కైకొని తమ భార్యల చేత బంగారు పట్టువస్త్రముల ధరించునట్లుచేసి, వానిని బహుమతులుగా పంచి పెట్టుచుండెను. రెండవ పరిశ్రమ లోహసంబంధమైనది. ఇత్తడి, రాగి విగ్రహములు, చెంబులు, వంటపాత్రలు గంగనీటికి లోటాలు మున్నగునవి ముఖ్యములు. ఈ విషయములు 'హావెల్' కూడ వర్ణించియుండెను. ఆంగ్లేయ విజ్ఞాన సర్వస్వము కూడ దీనినే చెప్పుచున్నది. (Ency. Brita, 392 P. "Its chief manufactures are silk brocades, gold and silver thread, gold figure work, German silver work, embossed brass vessels, and lacqured toys.")

—o—

## ౨
## కాశీ దిగ్దర్శనము

చారిత్రకముగా కాశీనగరమును, రాజ్యమును గూర్చి నేర్చుకొని యున్నాము. ఇప్పుడు 'కాశీనగరము' లో జూడవలసిన ఘట్టములు, ఆలయములు, ప్రదేశముల గూర్చి నేర్చుకొందము. కాశీలో గంగాస్నానము ముఖ్యమైనదని, పుణ్యమైనదని, పాపహారియని హిందువులు భావించెదరు. పుష్కర కాలములోను, కుంభమేళ సమయములోను, సూర్యచంద్రగ్రహణ సమయములలోను అసంఖ్యాక తీర్థయాత్రికులు వెళ్ళి స్నానము చేయుచుందురు. దక్షిణ హిందూస్థానమునుండి లక్షలాది వృద్ధులు కాశీకివెళ్ళి అచటనే మరణించి యుండిరి. 'కాశీకిపోయిన కాటికిపోయిన తిరిగిరారన్న సామెత కలదు. కాశీలో మరణించిన మాత్రమున శివసాయుజ్య

మును జెందుదురని వీరి విశ్వాసము. కాని జననమరణ రాహిత్యస్థానమును బొందిన వేమనయోగి మాత్రము "కాశికిని బోయినను లంజ గతిలరాదు" అని చెప్పినాడు.

కాశిలో నాల్గుమైళ్ళ గంగానది పొడవున 80 స్నానఘట్టములు గలవు. ఘట్టము అనగా 'స్నానమునకు దిగు మెట్లు' అని అర్థము. ఈ ఘట్టములలో 16 మాత్రము ముఖ్యమైనవి. దక్షిణమునుండి ఉత్తరమునకు అవి యిట్లున్నవి.

## (ఎ) ఘట్టములు

### 1. అస్సీఘట్టము :

అస్సీనది గంగలో గలియుచోట (అస్సీ సంగమము) యిది యున్నది. ఈనాడు 'అస్సీ' నది ఎండిపోయినది. 'వరుణ — అస్సీల' మధ్యభాగమే 'వారణాశి'. వారణాశియొక్క దక్షిణపు హద్దు యిదియే. దీని కొంచెం దూరములో 'తులసీదాసు' ఘట్టము గలదు.

### 2. తులశీఘట్టము :

రామానందుని నుండి శిష్య పరంపరలో ఏడవవాడు 'తులసీదాసు' (1532—1623) తొమ్మిదికోట్ల ఉత్తర భారతీయు లీయనను 'గురువు' గా దలంచెదరు. క్రీ. శ. 1574 ప్రాంతములో నీయన యిచట నివసించి చాల కాలముండి తరువాత మరణించెను. తాను ఫలాన తేదీన, కాలమున, స్థలమున చనిపోయెదనని తన శిష్యులతో నీయన చెప్పుచుండెడివాడు. హిందీ కవులలో ముఖ్యుడు. ఈయన పేరుతో ఈఘట్టము వెలసినది. ఈకవి జ్ఞాపకార్థము, ఈక్రింది విహ్నములుపైన భద్రపరచబడి యున్నవి.

1. చేతితో గీయబడిన తులసీదాసు పటము.
2. ఈయన తొడిగిన ఒకజత కొయ్య పావుకోళ్ళు.
3. తులసీదాసుకు ఇష్ట దైవమైన, అభిమాన పాత్రమైన, జీవిత కాలమంతయు పూజించినట్టి 'హనుమంతుని' చిన్నరాతి విగ్రహము.
4. గంగానదిపై తిరుగుటకు 'తులసీదాసు' ఉపయోగించిన, నావలోని ఒక చిన్నముక్క.

మును జెందుదురని వీరి విశ్వాసము. కాని జననమరణ రాహిత్యస్థానమును బొందిన వేమనయోగి మాత్రము "కాశికిని పోయినను లంజ గతికరాదు" అని చెప్పినాడు.

కాశీలో నాల్గుమైళ్ళ గంగానది పొడవున 80 స్నానఘట్టములు గలవు. ఘట్టము అనగా 'స్నానమునకు దిగు మెట్లు' అని అర్థము. ఈ ఘట్టములలో 16 మాత్రము ముఖ్యమైనవి. దక్షిణమునుండి ఉత్తరమునకు అవి యిట్లున్నవి.

## (ఎ) ఘట్టములు

### 1. అస్సీఘట్టము :

అస్సీనది గంగలో గలియుచోట (అస్సీ సంగమము) యిది యున్నది. ఈనాడు 'అస్సీ' నది ఎండిపోయినది. 'వరుణ — అస్సీల' మధ్యభాగమే 'వారణాశి'. వారణాశియొక్క దక్షిణపు హద్దు యిదియే. దీని కొంచెం దూరములో 'తులసీదాసు' ఘట్టము గలదు.

### 2. తులశీఘట్టము :

రామానందుని నుండి శిష్య పరంపరలో ఏడవవాడు 'తులసీదాసు' (1532—1623) తొమ్మిదికోట్ల ఉత్తర భారతీయు లీయనను 'గురువు' గా దలంచెదరు. క్రీ. శ. 1574 ప్రాంతములో నీయన యిచట నివసించి చాల కాలముండి తరువాత మరణించెను. తాను ఫలాన తేదీన, కాలమున, స్థలమున చనిపోయెదనని తన శిష్యులతో నీయన చెప్పుచుండెడివాడు. హిందీ కవులలో ముఖ్యుడు. ఈయన పేరుతో ఈఘట్టము వెలసినది. ఈకవి జ్ఞాపకార్థము, ఈక్రింది చిహ్నములుపైన భద్రపరచబడి యున్నవి.

1. చేతితో గీయబడిన తులసీదాసు పటము.
2. ఈయన తొడిగిన ఒకజత కొయ్య పావుకోళ్ళు.
3. తులసీదాసుకు ఇష్ట దైవమైన, అభిమాన పాత్రమైన, జీవిత కాల మంతయు పూజించినట్టి 'హనుమంతుని' చిన్నరాతి విగ్రహము.
4. గంగానదిపై తిరుగుటకు 'తులసీదాసు' ఉపయోగించిన, నావలోని ఒక చిన్నముక్క.



వాల్మీకి రామాయణము ననుసరించకుండ, స్వతంత్రముగా తులసీదాసు, 'రామచరిత మానసము' అను పేరున క్రీ. శ. 1623 లో రామకథను వ్రాసెను. ఇంకను 11 యితరకృతుల కూడ వ్రాసెను. ఈయోగి కొంతకాలము గృహస్థాశ్రమములో నుండెను. ఆయన ఏకైక కుమారుడు చనిపోవుటచేత, వైరాగ్యభావ ముదయించగా సన్యసించి తన జీవితమంతయు నిచటనే గడిపి, మరణించెను. నోరులేని కోటాను కోట్ల జనుల కొరకీ యతి, వాఙ్మయమును సృష్టించి, వారిని సంబోధించి, వారితో జీవించి, వారిని ప్రార్థించి, బోధించి, వారి కష్టములలో సుఖములలో బాల్గొని, మహనీయులతో సాంగత్యమును నెరపి, ఆచంద్ర తారార్కమగు ఖ్యాతి గడించెను. అందుచేత ప్రజలీయనను 'మమ్మెరిగిన మహాత్ము డిచట గలడు; మా ఉపదేశకునిగా ఆయనను మేము ఎన్నుకొందుము' అని నుడువ సాగిరి. ("Here is a great soul that knows us. Let us choose him for our guide.") ఇట్టి అమరజీవులు నివసించిన, మెట్టిన ప్రదేశములు పుణ్యతీర్థములే కదా!

### 3. చేతసింగు ఘట్టము (శివలా ఘట్టము) :

ఈ ఘట్టము కాశీరాజైన, 'చేతసింగు' పేరుతో వెలయుచున్నది. శిథిలావస్థలో నున్న ఈ రాజుకోట, భవనము ఈనాటికిని గలవు. ఇందనేక మంది సాధువు లున్నారు. వీరు క్రీ. పూ. 700 ప్రాంతమున నున్న కపిలుని శిష్యపరంపరలోని వారు. 103 ఏండ్లు, 150 ఏండ్లు వయస్సు గల ఇరువురు సాధువులతో 'హావెల్' మాటాడగా, నందొకడు 'చేతసింగు'ను 'వారన్‌హేస్టింగ్సు'ను స్వయముగా జూచితినని చెప్పెను.

వాకిటిలో, చేతసింగు మంత్రులలో నొకడు, ఇచటనున్న మఠస్థాపకుడు అగు 'లక్ష్మీబాబా' యనువాడు చనిపోగా, వాని నిచట ఒకమామిడి చెట్టుక్రింద పాతిపెట్టిరి; అది నేటికి కాన్పించును. ఈ చేతసింగునుగూర్చి అనేక విషయములు చరిత్ర ఉల్లేఖించుచున్నది.

భారత వర్షములో 'వారన్ హేస్టింగ్సు' (1772—1785) రాజ ప్రతినిధిగా నుండెను. మైసూరు, మహారాష్ట్ర యుద్ధములలో కంపెనీవారి బొక్కసము ఖాళీ యాయెను. 1770 లో పెద్ద కాటకము కల్గెను. 'హేస్టింగ్సు'కు ధన మవసర మగుట చేత, 'కాశీరాజు'ను బొఫ్పీగమును ధనమిమ్మని కోరెను. 1773 లోని

రాజీ ప్రకారము 'కాశీరాజు' కంపెనీవారిని ప్రభువుగా నంగీకరించి, ప్రతి వర్షము సుంకము చెల్లించుటకు ఖరారుపడెను. క్రమక్రమముగా కాశీరాజు ధనవంతు డాయెను. 'హేస్టింగ్సు' కాశీరాజును కప్పముగాక, మరి ఐదు లక్షల రూపాయలు అదనముగా యిమ్మని కోరెను. 'చేతసింగు' ఆ మొత్తమును చెల్లించెను. తర్వాత వేయి గుర్రపు దళమును యిమ్మనికోరగా ఆయన దానిని ఇచ్చుటలో నాలస్య మాయెను. ఆలస్య మగుటచేత 'హేస్టింగ్సు' ఆయనకు ఏబది లక్షలు జరిమానా విధించెను. బ్రిటిషువారి శత్రువులతో ఉత్తర ప్రత్యుత్తరములు జరిపి వారితో లాలూచి ఐనాడని 'చేతసింగు'పై నేరారోపణ చేయబడెను. అందుచే స్వీయముగా శిక్షించుటకు కలకత్తానుండి నావపైన 'హేస్టింగ్సు' కాశీకి 1781 జులై 7 న బయలుదేరెను. 'బక్సారు' వద్దచేతసింగు ఆయన దర్శనము కోరగా 'హేస్టింగ్సు' నిరాకరించెను. 'చేతసింగు' యిచ్చిన సంజాయిషీ అతనికి నచ్చనందున 'హేస్టింగ్సు' అతనిని కాశీలోనే అరెస్టుచేయుటకు 1781 ఆగస్టు 16 న అధికార పత్రమును జారీచేసెను. సైనికులు 'చేతసింగు'ను కోటనుండి బయటకు రాకుండ అరెస్టు చేయబోయిరి. కాని చేతసింగు సైనికులు 2000 మంది వచ్చి బ్రిటిషు సైనికులను చిత్రవధ చేసిరి. బ్రిటిషువారి యొద్ద మందుగుండు సామానులేదు. (G W Hastings — A vindication of Warren Hastings, P 139 "Unfortunately they were sent with out ammunition. A large body of armed men from the fortress of Ram Nagar crossed the river suddenly and massacred the whole party. Cheit Singh escaped to the fortress of Luteefgarh and never again entered Benares. Warren Hastings for a short time was in imminent peril.")

'వారన్ హేస్టింగ్సు' యొక్క ఏడు ఏండ్ల విచారణకు కూడ యీ చేతసింగు తగాదా ఒక ముఖ్యకారణమని హావెల్ వ్రాసినాడు. హేస్టింగ్సు తప్పిదములు విన్నంతనే 'బర్కు' యొక్క రక్తనాళములు ఉడుకెత్తి పోయెనని 'మెకాలే' వ్రాసెను. (Ency Brit — Vol IV P 418 — "The story of Hasting's crimes, as Macaulay says, made the *blood* of Burke *boil* in his veins ,,)

అపుడు వర్షాకాలము. గంగానది వరదల మూలముగా కోటపై భాగమువరకు నీరుప్రవహించసాగెను. కోటకు పైభాగమున మూడు కిటికీలుగలవు. అందొక దానిగుండ, చేతసింగు. తల పాగాలు వరుసగా త్రాడువలె కట్టించి, వాని సహాయ మున, గంగానదిలోని పడవలోనికిదూకి, అపడవమీద భాగీరథికి ఆవలిఒడ్డుననున్న 'రామనగరమునకు పోయి, అటనుండి, "లటీఫు నగరము"నకు పలాయనమై

రాజీ ప్రకారము 'కాశీరాజు' కంపెనీవారిని ప్రభువుగా నంగీకరించి, ప్రతి వర్షము సుంకము చెల్లించుటకు ఖరారుపడెను. క్రమక్రమముగా కాశీరాజు ధనవంతు డాయెను. 'హేస్టింగ్సు' కాశీరాజును కప్పముగాక, మరి ఐదు లక్షల రూపాయలు అదనముగా యిమ్మని కోరెను. 'చేతసింగు' ఆ మొత్తమును చెల్లించెను. తర్వాత వేయి గుర్రపు దళమును యిమ్మనికోరగా ఆయన దానిని ఇచ్చుటలో నాలస్య మాయెను. ఆలస్య మగుటచేత 'హేస్టింగ్సు' ఆయనకు ఏబది లక్షలు జరిమానా విధించెను. బ్రిటిషువారి శత్రువులతో ఉత్తర ప్రత్యుత్తరములు జరిపి వారితో లాలూచి ఐనాడని 'చేతసింగు'పై నేరారోపణ చేయబడెను. అందుచే స్వయముగా శిక్షించుటకు కలకత్తానుండి నావపైన 'హేస్టింగ్సు' కాశీకి 1781 జులై 7 న బయలుదేరెను. 'బక్సారు' వద్దచేతసింగు ఆయన దర్శనము చేసిగా 'హేస్టింగ్సు' నిరాకరించెను. 'చేతసింగు' యిచ్చిన సంజాయిషీ అతనికి నచ్చనందున 'హేస్టింగ్సు' అతనిని కాశీలోనే అరెస్టుచేయుటకు 1781 ఆగష్టు 16 న అధికార పత్రమును జారీచేసెను. సైనికులు 'చేతసింగు' ను కోటనుండి బయటకు రాకుండ అరెస్టు చేయబోయిరి. కాని చేతసింగు సైనికులు 2000 మంది వచ్చి బ్రిటిషు సైనికులను చిత్రవధ చేసిరి. బ్రిటిషువారి యొద్ద మందుగుండు సామానులేదు. (G W Hastings — A vindication of Warren Hastings, P 139 "Unfortunately they were sent with out ammunition. A large body of armed men from the fortress of Ram Nagar crossed the river suddenly and massacred the whole party Cheit Singh escaped to the fortress of Luteefgarh and never again entered Benares. Warren Hastings for a short time was in imminent peril.")

'వారన్ హేస్టింగ్సు' యొక్క ఏడు ఏండ్ల విచారణకు కూడ యీ చేతసింగు తగాదా ఒక ముఖ్యకారణమని హావెల్ వ్రాసినాడు. 'హేస్టింగ్సు తప్పిదములు విన్నంతనే 'బర్కు' యొక్క రక్తనాళములు ఉడుకెత్తి పోయెనని 'మెకాలే' వ్రాసెను. (Ency Bri — Vol IV P 418 — "The story of Hasting's crimes, as Macaulay says, made the *blood* of Burke *boil* in his veins ,,)

అపుడు వర్షాకాలము. గంగానది వరదల మూలముగా కోటపై భాగమువరకు నీరుప్రవహించసాగెను. కోటకు పైభాగమున మూడు కిటికీలుగలవు. అందొక దానిగుండ, చేతసింగు, తల పాగాలు వరుసగా త్రాడువలె కట్టించి, వాని సహాయమున, గంగానదిలోని పడవలోనికిదూకి, అపడవమీద భాగీరథికి ఆవలిఒడ్డుననున్న 'రామనగరమునకు పోయి, అటనుండి, "లటీపు నగరము"నకు పలాయనమై



పోయెను. (William Daniell – The oriental Annual – "Sivali Ghat He let himself down by turbans tied and went to Lutteefpoor")

'చేతసింగు' పలాయనమునకు ఏర్పాట్లు గావించిన వీరుడు 'నహర్‌సింగు పైన 17 సార్లు తుపాకిగుండ్లు ప్రేల్చబడెను. వీనితో నాయన ప్రాణము వీడెను. ఈ 'నహరసింగు' చేతసింగు తల్లి 'పద్మ' యొక్క కొలువు కూటములో మొదటి నుండి ఉండి, వారి ఉప్పుపులుసుల త్రావి, వారి కుటుంబము కొరకే తన యసువుల బాసిన వీరాధివీరుడు; స్వామిభక్తి పరాయణుడు; చరిత్ర వీరిని మరచిపోజాలదు.

పిమ్మట 'చేతసింగు' దండు, రాజువెళ్ళిన తర్వాత ఆంగ్లేయ సైనికుల కెదురు తిరిగెను. 'హేస్టింగ్సు' ప్రాణమునకేముప్పు వాటిల్లెను. ప్రాణరక్షణార్థము భయభ్రాంతుడైన హేస్టింగ్సు 'చునార్' నగరమునకు రాత్రివేళ తన సైనికులతో పారిపోయెను. అచటనుండి ఆంగ్లేయ సైన్యములువచ్చి, చేతసింగు సైన్యముతో పోరాడి, వారినోడించి, కోటను, రాజభవనమును, కాశీ రాజ్యమును స్వాధీనపరచుకొని, ఇంకను అధికమైన కప్పముయిచ్చునట్లు ఏర్పాటు చేసికొని, చేతసింగు మేనల్లునికి కాశీరాజ్య పట్టాభిషేకముచేసిరి. కాని చేతసింగు, వెళ్ళినతరువాత, "మైళ్ళకొలది వ్యవసాయముచేయని భూమికలదని, ప్రజలు పరిపాలన జూచి విసుగుజెందిరని," కాశీ కమీషనరు వ్రాతలవలన దెలియుచున్నది.

## 4. హనుమాన్ ఘట్టము :

ఇచట పెద్ద హనుమంతుని దేవాలయ మున్నది. 'తులసీదాసు' వలెనే, వైష్ణవ గురువైన 'వల్లభాచారి' ఇచట జీవించి, తన జీవితయాత్ర నిచటనే చాలించెను. దక్షిణ దేశీయులు ఎక్కువగా దీని దగ్గరనే నివసించుచుందురు. 'మైసూరు' అతిథి గృహము (Guest house) కూడ దీనిదగ్గరనే ఉన్నది. ఈ వల్లభాచారి క్రీ. శ. 16 వ శతాబ్దిలోనివాడు. కృష్ణుని భక్తుడు; ఈయన మధుర దగ్గరగా నివసించుచు, కృష్ణుని దేవునిగా బూజించుచు, భక్తునివలె గానము చేయుచు వివిధదేశ పర్యటనము గావించెను. కృష్ణపూజను విపుల ప్రచారములోనికి దెచ్చిన దీయనయే.

## 5. హరిశ్చంద్ర ఘట్టము (Burning ghat) :

శవముల దహన మిచట జరుగుచుండును. ఇది 'కాశీ' నగరమునకు దక్షిణపు వైపున నున్నది. ఇది 'సత్యహరిశ్చంద్రు'ని పేరుతో వెలయుచున్నది. అతని

కుమారుడు 'లోహితాస్యుడు' సర్పకాటు వాతబడి, కాశీలో చనిపోవుటచేత, అతని నిచట దహనము చేసిరట. ఈనాటికి కూడ దీనిని, శవదహన ప్రదేశముగా సామాన్యులు వాడుచుందురు. ఈ ఘట్టము వరకు పెట్టరోడ్డు వేయబడియున్నది.

## 6. కేదారఘట్టము :

శివుని వాసమును కేదారనాథము అందురు. ఆయన పేరున ఇచ్చట, కేదారేశ్వరస్వామి ఆలయమున్నది. ఇది హిందువుల పుణ్యక్షేత్రము. మెట్లదగ్గర 'గౌరీకుండము' అను నీటి రిజర్వాయరు కలదు. దీనికి ప్రక్కనే ఉన్న కుమారస్వామి మఠాధిపతులు, దీని కధికార్లు. ఈ మఠమునకు మూలపురుషుడు భారతీయ యతి శ్రీ కుమారగురు (1625—1688) అని తెలియుచున్నది. ఈయన 'తులసీదాసు' సహకాలీనుడు; అందుచేత 'కాశీ'లో వీరుభయులు పలుమార్లు సమావేశమైనట్లు తెలియుచున్నది. ఈయన ఒక పర్యాయము మృగరాజును వాహనముగా గైకొని, మొగలాయి చక్రవర్తి అయిన 'ఔరంగజేబు' దర్శనార్థమేగి, అతనిని దర్బారులో జూచెను. 'శ్రీ కుమారగురు' యొక్క మధురభాషణమును, వివిధ శాస్త్రాదులందలి అసమాన పాండిత్యమునుగాంచి, ఆమందానంద కందళిత హృదయార విందుడై, 'కేదారఘట్టము' లోనున్న పలువిధములైన స్థిరచరాస్తుల నతని వశముచేసి, తిరిగి ఎన్నడు వానితో జోక్యము పెట్టుకోనని వాగ్దానముచేసెను. దాని ప్రకారమా పాదుషా ఎన్నడు జోక్యము కల్గించుకోలేదు. ఇపుడున్న స్వామి పేరు 'అరుళనంది తాంబిరాన్' మఠాధిపతి. గొప్పదాత; గతించిన కొద్ది సంవత్సరములలో అనేక లక్షలు ధర్మముచేసెను. తత్త్వ, సిద్ధాంతాది శాస్త్రములందు అసమాన పాండిత్యము గలవాడు.

## 7. అహాల్యా ఘట్టము :

ఈ ఘట్టమును, మణికర్ణికా ఘట్టమును, ప్రస్తుతమున్న 'విశ్వనాథ ఆలయమును,' 'ఇందోరురాణి' అయిన 'అహాల్యాబాయి' క్రీ. శ. 1776 లో తన కుమారుని మరణానంతరము రాజ్యపాలన చేయుచు కట్టించెను. అందుచే నివి ఇందోరు హోల్కారు కుటుంబమునకు జెందినవని చెప్పవచ్చును ఈ ఘట్టము దగ్గరగా 'సీట్లాజీ ఆలయము కాన్పించుచున్నది.

## 8 దశాశ్వమేధ ఘట్టము :

ముఖ్యమైన ఘట్టములలో నిది రెండవది. 'బ్రహ్మ' దశాశ్వమేధ యజ్ఞములు చేసెనని, అందుచే దీనికీ పేరు వచ్చినదని పురాణ ప్రసిద్ధి. ఎప్పుడు చూచినను

కుమారుడు 'లోహితాస్యుడు' సర్పకాటు వాతబడి, కాశీలో చనిపోవుటచేత, అతని నిచట దహనము చేసిరట. ఈనాటికి కూడ దీనిని, శవదహన ప్రదేశముగా సామాన్యులు వాడుచుందురు. ఈ ఘట్టము వరకు పెట్టరోడ్డు వేయబడియున్నది.

## 6. కేదారఘట్టము :

శివుని వాసమును కేదారనాథము అందురు. ఆయన పేరున ఇచ్చట, కేదారేశ్వరస్వామి ఆలయమున్నది. ఇది హిందువుల పుణ్యక్షేత్రము. మెట్లదగ్గర 'గౌరీకుండము' అను నీటి రిజర్వాయరు కలదు. దీనికి ప్రక్కనే ఉన్న కుమారస్వామి మఠాధిపతులు, దీని కధికార్లు. ఈ మఠమునకు మూలపురుషుడు భారతీయ యతి శ్రీ కుమారగురు (1625—1688) అని తెలియుచున్నది. ఈయన 'తులసీదాసు' సహకాలీనుడు; అందుచేత 'కాశీ'లో వీరుభయులు పలుమార్లు సమావేశమైనట్లు తెలియుచున్నది. ఈయన ఒక పర్యాయము మృగరాజును వాహనముగా గైకొని, మొగలాయి చక్రవర్తి అయిన 'ఔరంగజేబు' దర్శనార్థమేగి, అతనిని దర్బారులో జూచెను. 'శ్రీ కుమారగురు' యొక్క మధురభాషణమును, వివిధ శాస్త్రాదులందలి అసమాన పాండిత్యమునుగాంచి, ఆమందానంద కందళిత హృదయారవిందుడై, 'కేదారఘట్టము' లోనున్న పలువిధములైన స్థిరచరాస్తుల నతని వశముచేసి, తిరిగి ఎన్నడు వానితో జోక్యము పెట్టుకొనని వాగ్దానముచేసెను. దాని ప్రకారమా పాదుషా ఎన్నడు జోక్యము కల్గించుకోలేదు. ఇపుడున్న స్వామి పేరు 'అరుళనంది తాంబిరాన్' మఠాధిపతి. గొప్పదాత; గతించిన కొద్ది సంవత్సరములలో అనేక లక్షలు ధర్మముచేసెను. తత్త్వ, సిద్ధాంతాది శాస్త్రములందు అసమాన పాండిత్యము గలవాడు.

## 7. అహల్యా ఘట్టము :

ఈ ఘట్టమును, మణికర్ణికా ఘట్టమును, ప్రస్తుతమున్న 'విశ్వనాథ ఆలయమును,' 'ఇందోరురాణి' అయిన 'అహల్యాబాయి' క్రీ. శ. 1776 లో తన కుమారుని మరణానంతరము రాజ్యపాలన చేయుచు కట్టించెను. అందుచే నివి ఇందోరు హోల్కారు కుటుంబమునకు చెందినవని చెప్పవచ్చును ఈ ఘట్టము దగ్గరగా 'సీట్లాజీ ఆలయము కాన్పించుచున్నది.

## 8 దశాశ్వమేధ ఘట్టము :

ముఖ్యమైన ఘట్టములలో నిది రెండవది. 'బ్రహ్మ' దశాశ్వమేధ యజ్ఞములు చేసెనని, అందుచే దీనికీ పేరు వచ్చినదని పురాణ ప్రసిద్ధి. ఎప్పుడు చూచినను



జనసమ్మర్దము విశేషముగానుండును. నదిపైన విహరించుట కిచట నావలు లభ్యమగును. ఉదయము యాత్రికులు స్నానార్థ మేతెంచుదురు. సాయంత్రము విహారస్థలముగా భావించి, షికారు చేయుచుందురు. 'చునార్' నుండివచ్చు రాతి నిచట దిగుమతి చేయుదురు. 'వారణాశి' భవనములు ఈ రాతితోనే నిర్మాణమగుచున్నవి. 'హావెల్' కూడ దీనిని వ్రాసెను. ఈ ప్రదేశములలో నదీవ్యాపారము కూడ హెచ్చుగా సాగుచుండును. విదేశయాత్రికు లిచటనే, ఏయే ఘట్టములు చూడవలెనో, ఎన్ని ఘట్టములు గలవో, ఈ విషయములు తెలిసికొని ఆయా ఘట్టముల జూచుటకు. నావలను కిరాయికి మాటాడుకొను చుందురు. ఏటి ఒడ్డునగల ఈ ఘట్టము లన్నిటిని, నావపైనపోయి చూచి రావచ్చును.

## 9. మనమందిర ఘట్టము. (మీర్ ఘాట్) నక్షత్రగణితశాల :

దీని కెదురుగానున్న రాజభవనము వారణాశిలోని అతి పురాతనమైన మందిరములలో నొకటి. ఈ భవనము క్రీ. శ. 1600 ప్రాంతములో 'రాజా మానసింగు'చేత నిర్మించబడినది. అతని వంశీకుడు, 'జైపూరు' నగర మూల స్థాపకుడు అయిన 'సావై జయసింగు' కాలమున నిది నక్షత్రగణితశాలగా నుపయోగించబడెను. చక్కని శిల్పముతోను రాతి కూర్పుతోను ఈ భవనము సర్వాలంకార శోభితంబై అందము గొల్పుచున్నది. ఇందు చాలభాగము శిథిలము కాగా దానినంతయు తిరిగి మరమత్తు చేసికొనిరి. 'రాజా జయసింగు' (1693—1710) ప్రఖ్యాతి గాంచిన ఖగోళ శాస్త్రవేత్త. ఈరాజు యిదికాక మరినాల్గు గణితశాలలను 'ఢిల్లీ, మథుర, ఉజ్జయిని, జయపూరు' నగరములలో నిర్మించెను. ఈనాడివి సరియైన క్రమపద్ధతిలో లేక మరమత్తును గోరుచున్నవి ఈ భాగములో నిట్లు వ్రాయబడియున్నది.

(ఎ) దక్షిణోభిత్తి యంత్రము :

ఈ యంత్రముతో మధ్యాహ్న సమయమున ఉన్నతాంశము తెలియబడుచున్నది. (The altitude of the heavenly bodies when on the meridian is known by this instrument ఇస్ యంత్రసే మధ్యాహ్నకే ఉన్నతాంశ్ జానే జాతేహై) ఈ యంత్రముపైన కొల్తల గుర్తులున్నవి. ఉన్నతాంశ 90 నుండి నతాంశ '0' నుండి వేయబడియున్నది. పైన రెండు ఇనుపమేకులున్నవి. ఈగోడ ఒక అడుగుమందము, నాల్గుగజముల ఎత్తు, మూడు గజముల

వెడల్పు కల్గియున్నది. గోడ మీద రెండవసారి పై గుర్తులే ఉన్నవి.

(బి) చక్రయంత్ర :

(This instrument is for measuring the declination of the sun, moon and stars and their distance in time (hour angle) from the meridian.) ఇట్లు వ్రాయబడి యున్నది.

రెండు గోడల మధ్య వృత్తాకారము గలదు.

(సి) సమ్రాట్ యంత్రము :

(For finding time and declination and hour angle of the heavenly bodies)

రెండవసారి —భిన్నాంకము గలదు.

(డి) నాడీవలయ దక్షిణపోర్ ఉత్తరగోళ :

(The use of this instrument is to find whether the heavenly bodies are in the northern or southern hemispheres. It give time also) పై విధముగా వ్రాయబడియున్నది.

(ఇ) This observatory originally constructed by Maharaj Sawai Jai singji of Jaipur in A. D. 1710, was restored in A. D. 1911 by Sai Sawai Matho Singji—

ఈనక్షత్ర గణితశాల క్రీ. శ. 1710 లో జయపూరు మహారాజగు 'సావై జయసింగు'చే నిర్మించబడి, 1911 లో శ్రీ సావై మధోసింగజీ చేత: నిలుపబడినది. దీనికి ప్రక్కనే 'దల్భ్యేశ్వర' ఆలయము కలదు.

## 10. నేపాలిఘట్టము :

ఇది 'మణికర్ణికా ఘట్టము' నకు దక్షిణమున నున్నది. కొయ్యమీద శిల్పముగల నేపాళీయుల దేవాలయ మున్నది. శిల్పమంతయు నేపాళీయుల ఆచార సాంప్రదాయముల కనువుగా నున్నది. నేపాళీయు లనేకు లీఘట్టములో నివసించు చుందురు. ఘట్టము పైనుండి నేపాళీ ఆలయమునకు త్రోవపోవును. ఈ ఆలయములో 'పశుపతినాధుని' పూజ నిత్యము జరుగుచుండును. కొయ్య, ఇటుకలతో నీ యాలయము నిర్మించబడినది. కొయ్య తలుపులు మున్నగువానిమీద కొకోక్త శాస్త్రము (రతి రహస్యము) లోని పటములు గలవు.

## 11. మణికర్ణికా ఘట్టము :

స్నానము చేయుటకు ముఖ్యమైన వానిలో నిది మూడవది. అన్నిఘట్టముల కిది కేంద్రము. దీనిని రెండు భాగములుగా విభజింపవచ్చును దక్షిణ భాగములో శవదహనమునకు, ఉత్తర భాగములో స్నానమునకు ఉపయోగించుచున్నారు. 'అహల్యాబాయి' దీనిని నిర్మించెనని వెనుకనే చెప్పినాము. ఈ ఘట్టముపైన 'చక్రతీర్థము' అను పేర బరగు చిన్న తటాకము గలదు. అతి పురాతనమైన దీనిని మహావిష్ణువు, తన చక్రముతో త్రవ్వెనని, దాని ప్రక్క ధ్యానించుచుండగా, 'మహాదేవుడు' కాన్పించి దానిని 'మోక్షక్షేత్రమని' పేర్కొనెనని అపుడు 'మహాదేవుని' ఒక చెవిపోగు నేలమీద పడెనని, అందుచేత దీనికి 'మణికర్ణిక' అను పేరు వచ్చినదని, ఇది చాల పుణ్యమైనదని కొందరు హిందువులు పల్కుచుందురు. ఇచ్చోట ప్రత్యేకముగా ద్విజులు మాత్రము దహన క్రియలు జరుపుట పుణ్యమని తలంచి, శవదహనము చేయుచుందురు. చక్రతీర్థము చాల విచిత్రమైనదిగా భావించబడుచున్నది. ఇచట గుర్తింప వలసినవి ఇవి.

1. చరణ పాదుక :

విష్ణుపాదుకలు, చాల పవిత్రమైనవని పూజింపబడు చున్నవి.

2. పవిత్ర స్థలము :

చరణపాదుకకు ప్రక్కనే, ప్రత్యేకమైన ఒక మూలలో, గొప్పవారి శవములను దగ్ధము చేయుదురు.

3. మణికర్ణికా కుండము :

ఇచటకూడ స్నానము చేయుదురు.

4. అమెతిరాజు దుర్గాలయము ;

అందమైన గోపురము, లోపల సుందరమైన స్వర్లోక వేశ్యాంగనల, గంధర్వ, స్వర్గలోక గాయకుల, అప్సరసల బొమ్మలు గలవు.

## 1 క్రొత్తసింధియా ఘట్టము ;

పాతఘట్టముపైన ఇంజనీర్లు, క్రొత్త అధునికప్లానులో క్రొత్తఘట్టము నిర్మాణ మొనర్చిరి శిథిలములమీద కాన్పించు సాధువుల బొమ్మలనుబట్టి, అనేక శతాబ్దములనుండి అచ్చటకు వచ్చిన సాధువులను తెలిసికొనవచ్చును. గ్వాలియరు

లోని హిందూ ప్రభుపుభార్య 'బైజాబాయి' ఒక రాజభవనమును, స్నానఘట్టమును నిర్మించెను.

## 13-14. గ్వాలియరు భోన్స్లా ఘట్టము :

ఆకర్షణీయమైన ఈ రెండు ఘట్టములు, 'నాగపూరురాజు' చేత నిర్మించబడినవి.

బాజీరావ్ ఘాట్ 'అని' ఘోస్లఘాట్ అని దీనిని హావెల్ పేర్కొనెను.

## 15. పంచగంగ ఘట్టము :

ముఖ్యమైన ఘట్టములలో నిది నాల్గవది. ఇది 'కాశీ' మునిసిపల్ బోర్డువారి ఆధీనములో ఉన్నది. ఇచటనే 'ఔరంగజీబు కట్టించిన మశీదు స్తంభములున్నవి. ఇచట నాల్గు జలప్రవాహములు గంగానదిలో గలియుచున్నవి; కాని అవి ఈనాడు కాన్పించవు. మశీదును, ఔరంగజీబు కట్టించిన స్తంభములును ధూమశకటముపై నుండగనే కాన్పించును. కాశీలో రెండవ పెద్ద దేవాలయముని పేర్గాంచిన 'వేణిమాధవ' (బిందుమాధవ) ఆలయము యిచటనే వున్నది. 'హౌనుత్సాంగు' వర్ణించిన 'మహదేవ ఆలయము' యిదియే కావచ్చునని విద్వాంసుల ఊహ. "ఈ ఆలయము నూరు అడుగుల ఎత్తున్నదని, భయానకముగా నున్నదని, రాయి, దారువులతో సుందరముగా నున్నదని" పై చైనీయ లేఖకుడు వ్రాసెను. ఈ ప్రాచీన దేవాలయము ప్రస్తుతమున్న మశీదు స్తంభము ఎత్తున వుండెడిది. దాని పైన నిల్చుండి చూచిన కాశీనగరమంతయు గంగానదితో బాటు కాన్పించుచుండును. 'ఔరంగజీబు' దీనికి పోటీగానే అంత ఎత్తున శిఖరములతో మశీదు నిర్మించెను. తమ ఇస్లాము మతము హిందూమతముకంటె ఉన్నతమైనదని తెల్పుటకే ఎత్తయిన స్తంభముల నిర్మించెనని విద్వాంసుల ఊహ.

'ఔరంగజీబు' కాశీలో నాశనము చేసినవానిలో రెండు ముఖ్యములైనవి. 1. విశ్వనాధ ఆలయము—గ్యానవాపివద్దయున్న గొప్ప మశీదు, విశ్వనాధాలయమున్న చోట కట్టబడినది. 2. వేణిమాధవ ఆలయము — దీనిని ధ్వంసముచేసి, దీనిపైన రెండు మశీదు స్తంభములు, ఔరంగజేబు కట్టించి, దీనిని మశీదుగా జేసినాడు. ఇందలి ఒక స్తంభము 1949 లో పడిపోయెను. మరల దాని నిపుడు కట్టించుచున్నారు. ఇచట పోలీసు కాపలావున్నది. ఈ లేఖకుడు గమనించిన

విషయముల తనచిత్తు పుస్తకముపై వ్రాసికొనుచుండెను; సందియములు గల్గగా, నిచటి పోలీసువారు వానిని నివృత్తి చేసిరి.

## 16. ఆదికేశవ ఘట్టము :

ఇచట 'వరుణానది' గంగానదిలో గలియుచున్నది. పూర్వపు 'వారణాశి'కి ఇది ఉత్తరపు హద్దు. ఈ సంగమ స్థలములో స్నానముచేసిన పుణ్యమని హిందువులు తలంతురు. 'వారణాశి'కి ఉత్తరముగా ఉన్న ఘట్టములలో నిదియే ఆఖరుది. దీనికి దగ్గరగా 'ఆది కేశవ' ఆలయము గలదు. పంచతీర్థములని పేర్గాంచిన వానిలో నిదియొకటి.

కాశీలోని పంచతీర్థములు యివి :

1. అస్సీ సంగమము 2. దశాశ్వమేధ ఘట్టము 3. మణికర్ణికా కుండము 4. పంచగంగ ఘట్టము 5. వరుణ సంగము (ఆదికేశవ ఘట్టము) ఈ ఐదును ముఖ్యములని, వీనిలో స్నానము చేసిన పుణ్యమని తలంచెదరు. రైలు వంతెనకు ఉత్తరమున ఈ వరుణానది 'భాగీరథి'లో గలియును. దీని మీదగా కాశీరోడ్లు రెండు తావులలో బోవును.

## (బి) ఆలయములు - మశీదులు - విగ్రహములు

### 1. విశ్వనాథ ఆలయము :

దీనిని 'విశ్వేశ్వర ఆలయము' 'స్వర్ణదేవళము'అను పేర్లతో బిల్చుచుందురు. ఇది చాల ముఖ్యమైనది. ఇది క్రీ. శ. 490 లో మొదటిసారి నిర్మించబడినది. ముస్లిము లనేకసార్లు దీనిని ధ్వంసముచేసిరి తిరిగి హిందువులు మరమ్మత్తు చేయించుకొనుచుండిరి. ఆఖరు పర్యాయము క్రీ. శ. 1585 లో 'నారాయణభట్టు' ఆయన పోషకుడైన 'రాజా తోడర్‌మల్లు' అక్బరుకు నమ్మినబంటు, మంత్రి దీనిని పునర్నిర్మాణ మొనర్చిరి. క్రీ. శ. 1669 సెప్టెంబరు 2 వ తేదీన ఔరంగజేబు ఈ ఆలయమును ధ్వంసముచేసి దానిపైన ఒక మశీదును నిర్మించెను. ఈనాటికి కూడ శిథిలములు నిల్చియున్నవి. దాదాపు ఒక శతాబ్దకాలము వరకు 'కాశీనగరము'లో విశ్వనాథ ఆలయము లేదు. ఒకనాటి రాత్రి భర్తురాలైన 'ఇండోరు రాణి' అహల్యాబాయికి విశ్వనాథుడు కలలో గాన్పించి తన లింగమును కాశీలో స్థాపించి ఆచంద్ర తారార్కమగు కీర్తిని గడించుమని, ఆలయములేని కొరతను తీర్చుమని చెప్పగా క్రీ. శ.

1775 లో నిపుడున్న ఆలయమును ఆమెనిర్మించెను. మొగలు రాజ్యము విచ్ఛిన్నమై పోయిన తర్వాతనే ఆమె ఈ ప్రదేశమును గైకొని ఆలయ నిర్మాణము చేసినది. పై శిఖరాదులు రాగిమీద గిల్టుపూతతో కప్పుటచేత దీనికి స్వర్ణ ఆలయమని పేరు వచ్చినది. వీనిని సిక్కుల ప్రభువగు 'రంజిత్‌సింగు' బహూకరించెను, హావెల్ ఈ విషయమునే యిట్లు వ్రాసెను. (E. B. Havell — Benares - The sacred city P 163 - "It is called the golden temple from the facts of its dome and spires being covered with gilt repousse copper work, a gift of Ranjith Singh of Lahore.")

విశ్వనాథమందిరము మొత్తము నాల్గుసార్లు కట్టబడినది. మొదటి మందిరము 'విశ్వేశ్వర గంజియొద్ద నేడు మశీదుగలచోట ఉండెను. కొన్నాళ్లు 'ఆది విశ్వేశ్వరు'డున్న చోటనుండెడిది. తరువాత, జ్ఞానవాపిలో నుండెడిది. ఈ మందిరమును 'ఔరంగజేబు' నేలద్రోయించగా, ప్రస్తుతమున్న దేవాలయమును, 'అహల్యాబాయి' కట్టించినది. స్త్రీలనేక విద్యాలయములు, సంఘారామములు, దేవాలయములు, సర్వకళాశాలలు, విహారములు, ఘట్టములు స్థాపించిన యుదంతములు చరిత్రలో పెక్కులు కలవు. "ముదితల్ నేర్వగరాని విద్యగలదే ముద్దార నేర్పించినన్" అని ఒక కవి నుడివిన వాక్కు సత్యమే.

ఈ ఆలయము చిన్నది. ముఖ్యాలయము 0 అ. చతురస్రముగానున్నది. పండా బ్రాహ్మణులు ఒక శతాబ్దము క్రితము దీనిని స్వాధీన పరచుకొని, పూజా పునస్కారము లన్నియు జరిపించుచున్నారు. అందరు హిందువులు వచ్చి విశ్వనాధస్వామిని దర్శించుకొని పోవుచుందురు. దినమునకు దాదాపు పదివేలమంది వచ్చి దర్శించి పోవుచుందురు. మూడు వేళల పూజలు, అభిషేకములు జరుగుచుండును. 1860 వ సం. లో దక్షిణ హిందూస్థానమునుండి వచ్చిన ఒక 'వైశ్య నాటుకోటిశెట్టియారు, సంఘము'చే ఈ పూజ ఆరంభించబడెను. ఇచటనుండి 'దశాశ్వమేధ ఘట్టమున'కు ఒక రోడ్డు అవసరమని పలువురు వ్రాయుచున్నారు.

ఈ ఆలయములో 'శివలింగము' ఒక చతురస్రాకారముగల రిజర్వాయరులో పెట్టినారు. ఇది పైకి కనబడదు. చేతితో తాకి చూడవలెను. ఒక పైపున స్తంభము గలదు. వచ్చిన భక్తులందరు గంగానది జలమును తెచ్చి, చెంబులతో నిందు పోయుదురు. క్రింద మురుగు కాల్వ ఉండుటచేత, లక్షలాది జనులు పోసిన నీరు, మురుగు కాల్వగుండ, సంతతము ప్రవహించుచుండును. లింగము నీరు తక్కువగా నున్నపుడు కాన్పించును. విదేశీయులు లోనికి వచ్చుటకు వీలులేనందున

దేవాలయము తూర్పు భాగమున నున్న గోడలోని కంతగుండ విదేశీయులు విశ్వనాథుని జూచుచుందురు. ఆలయ ద్వారము ఉదయము 4 గంటలనుండి రాత్రి 11 వరకు తెరవబడి యుండును.

2. దుర్గాలయము :

దీనిలో కోతులు హెచ్చుగా నుండుటచేత, దీనికి 'మర్కటాలయము' (Monkey temple) అని కూడ పేరుగలదు. భక్తులిచ్చు పదార్థముల తిని, అవి యిచటనే తిరుగుచుండును. ఈ గుడిలో దుర్గకు మేకలను బలియిచ్చు ఆచారము గలదు. ఒక్క వ్రేటుతో నరికి, ఆరక్తమును దేవతకు యిచ్చి, కళేబరములను భక్తులు గైకొని పోవుదురు. ఈ ఆలయము నగరమునకు దక్షిణమున నున్నది. ఇచట మున్సిపల్ సరిహద్దు ఆఖరగును.

3. గౌరీబాయి ఆలయము :

దుర్గాలయమునకు పడమరగా ఒక ఫర్లాంగు దూరములో నిదికలదు. ఇచటకు కూడ యాత్రికులు పోవుచుందురు.

4 భాస్కరానందుని గోరీ :

దుర్గాలయమునకు దగ్గరగా, భాస్కరానందుని శిష్యులు, ఒక తోటలో అతని విగ్రహమునుబెట్టి, తెల్లని చలువరాతితో గోరీని కట్టించిరి. స్వామివారి ధారణ, యోగ, సమాధిశక్తులనువిని, రష్యాజారు చక్రవర్తివచ్చి అతనితో మాటాడెనని, శిష్యులు చెప్పుదురు. శిష్యులు గురువు పేరుతో 'భాస్కరేశ్వర' అను శివలింగమును బెట్టి పూజింతురు. గురువు చనిపోయిన తర్వాత శివునిలో లీనమై పోయెనని శిష్యులు నమ్ముదురు.

5. హనుమాలయము :

ఈ ఆలయమును భక్తాగ్రేసరుడు 'తులసీదాసు' 300 ఏండ్ల క్రితము నిర్మించెను. ఇది విశ్వ విద్యాలయమునకు దగ్గరగా ఉన్నది ప్రతి మంగళవారము వేలకొలది యాత్రికులువచ్చి, ఇచట పూజించు చుందురు.

6. ఆలంగిర్ మశీదు (ఔరంగజీబు మశీదు) :

ఇది ముఖ్యమైనది. పూర్వపు విశ్వనాథ ఆలయమున్నచోటనే నిర్మింపబడినది. వెనుకటి శిథిల మందిర భాగములనే 'ఔరంగజీబు' దీనికి వాడెను.

పూర్వపు స్తంభములు కూడ కాన్పించుచున్నవి. మశీదు వెనుక భాగమంతయు, పూర్వపు విశ్వనాథ ఆలయముయొక్క భగ్నావశిష్ట భాగమై యున్నది. పడమర నున్న గోడ, పడమటి తలుపు, మండపము, అన్నియు ధ్వంసావశేషములై వున్నవి. 'ఆలంగిర్' పేరుతోనే ఈ మశీదు నిర్మించ బడినది. నగర మధ్య భాగమునకు బోయిన నిది కాన్పించును.

7. జ్ఞానవాపి :

ఆలంగీరు మశీదు, విశ్వనాథ ఆలయము మధ్యలో చతుష్కోణా కారముగల 'జ్ఞానవాపి' కలదు. ప్రప్రథమములో నీ బావి పూర్వపు విశ్వనాథ ఆలయమునకు చెందినది. ఒక బ్రాహ్మణు డిట కూర్చుండి పవిత్రమైన, నిర్మలమైన, జలమును యాత్రికుల కొసంగుచుండును. 'ఔరంగజీబు' విశ్వనాథ ఆలయమును ధ్వంసము చేయనున్న విషయమును వెనుకటి రాత్రియే దర్బారర్థిగా విని, ఒక పండా బ్రాహ్మణుడు, యితరుల హస్తములలో బడినచో 'లింగము అపరిశుద్ధ మగునని ఎంచి ఆ రాత్రి లింగమును దీసి ఈ బావిలో పడవేసి రక్షించెను. లింగమును దాచిన ఈవాపి జలము పవిత్రమైనదని హిందువులు దీనిని తీర్థముగా గైకొని త్రాగుచుందురు.

ఒకసారి కాశీలో 12 ఏండ్లు కరవువచ్చెనని, యిందు నీరు వచ్చెనని, ఒక హిందూయోగి యిచట వుండెనని అందుచేత నిది పవిత్రమైనదని కొందరు వ్రాసిరి

8. నంది విగ్రహము :

దీనిని నేపాలుదేశపురాజు 19 వ శతాబ్దములో నొసంగెను. అన్ని శివాలయములలో నంది విగ్రహము లింగమున కెదురుగా నుండును; కాని యిచట నంది, మశీదు కెదురుగా నుండును. యాత్రికులు అనేకులు వచ్చి చూచిపోవుచుందురు.

9. అన్నపూర్ణ ఆలయము :

కరువు కాటకాదుల సమయములో 'అన్నపూర్ణ' పాలు, నియ్యము, ఆహార మిచ్చి, కాశీప్రజల రక్షించెనని చెప్పుదురు. వేలకొలది భిక్షకులు ఇట ప్రసాదము గైకొని పోవుచుందురు. ఈ ప్రసాదముగైకొన్న, ప్రజలు అన్నము లేక మరణించరు, అని నమ్ముదురు. దీపావళికి మూడు దినములు అన్నకోటి జరిపి, నాల్గవదినము ప్రసాదముగా పంచిపెట్టుదురు. ఈ ఉత్సవ సమయములో అన్నపూర్ణ, విశ్వనాథ, లక్ష్మి, పృథ్వీమాతల విగ్రహముల జూపుదురు. అన్నపూర్ణ రాతి విగ్రహము గుడిలోగలదు. నిత్యము పూజింతురు. బయట స్త్రీలు, భజనలు

చేయుచుందురు. కాశీలో భిక్షదొరకకుండ ఈ 'అన్నపూర్ణ' చేయుటచేత, వ్యాసుడలిగి, కాశీని శపించెనని, కాశీ ఖండము తెల్పుచున్నది.

10. ఈ ఆలయము ప్రక్కనే మరియొక ఆలయముగలదు. కాశీలోని భాగ్యవంతుడైన వర్తకుడొకడు దీనిని నిర్మించెను. చలువరాతితో అనేక దేవతల విగ్రహములు తయారు చేసినవి కలవు. వీనిని జూచుటకు వేలకొలది యాత్రికులు వచ్చుచుందురు.

11. ధుండిరాజ గణేశుడు :

విశ్వనాథ ఆలయము ముఖద్వారమున ఈ విగ్రహముగలదు యాత్రికులు దీనిని పూజించెదరు.

12. సాక్షివినాయక ఆలయము :

కాశీలో మొత్తము ప్రయాణము చేయవలసినది 50 మైళ్ళు. దీనిని 'పంచకోశ రోడ్డుయాత్ర' అందురు. కాశీలోని అన్నిప్రదేశములు చూచుటకు ఏడు దినములు పట్టును. 'మణికర్ణికా ఘట్టము' నుండి భక్తుడు యాత్ర ఆరంభించును. ప్రతిరోజు సాయంత్రము వరుసగా, 'ఖాండవ', ధూపచండి, రామేశ్వర, శివపుర. కపిలధార, ఆనందగుహ, అనుస్థలములలో నాగి ఏడవ దినమున వరుణసంగమునకు జేరును. అచటనుండి 7 ఘట్టములు చూచుకొనుచు 'మణికర్ణిక'కు చేరును. యాత్రయంతయు పూర్తిఅయిన తర్వాత, యాత్రికుడు ఈ ఆలయమునకు వచ్చి తాను జరిపిన యాత్రా వృత్తాంతమును పండాచేత, వినాయకునికి చెప్పించును. వినాయకుడు సాక్షిమాత్రుడుగా ఉండి, ఈ వృత్తాంతమును వినుచుండునట. జైపూరు రాజా కాశీలో లక్షదేవాలయముల కట్టుటకు ప్రమాణము చేసెనని, అట్లే ఒక్కనాడే కట్టించెనని చెప్పుదురుకాని ఇది సత్యముగా గన్పించదు.

13. భారతమాతా మందిరము :

తెల్లని చలువరాతిపైన 'జాతీయ భారతమాత' పటముఉన్నది. హిందూ దేశములో నింక నెచ్చట ఇట్టిది లేదు. ఈ పటమును నిర్మించినవారు 'శ్రీ దుర్గా ప్రసాదు' 1936 లో ఈ ఆలయమును గాంధిమహాత్ముడు తెరచెను.

14. రామకృష్ణ మిషనువారి ఆలయము :

రామకృష్ణ పరమహంస పేరుతో 'బీదల ఉపయోగార్థము' 1900లో ఒక భవనమును, మిషనువారు నిర్మించిరి. లోపల చక్కని ఆలయమున్నది. ఇచట బీదల కన్నదానము జరుగుచుండును. ఒక ఉచిత వైద్యశాల కూడ ఉన్నది.

ఇచట 200 మంది రోగులకు మంచముల ఏర్పాటు కలదు. ప్రతి నెల రు 7000 ఖర్చగును. ఈ ద్రవ్యమంతయు చందాల ద్వారా వసూలగు చుండును.

15. బుద్ధాలయము :

మహాబోధి సంఘమువారు 'సారనాథు'లో దీనిని స్థాపించిరి ప్రస్తుత కాశీకి, ఈ దేవాలయము, హిందూ విశ్వవిద్యాలయము పేరు తెచ్చినవి. ఈ దేవాలయ నిర్మాణమునకు కొన్ని లక్షలు ఖర్చయినది.

## (సి) విద్యాలయములు

1. హిందూ విశ్వవిద్యాలయము :

ఇది గంగానది కెదురుగా అస్థిచంద్రా కారముగా నున్నది. పండిత మదనమోహన మాళవ్యా దీనిని స్థాపించెను. ఈ విశ్వవిద్యాలయము దాదాపు 2 చ. మైళ్ళు లేక 1300 ఎకరముల స్థలము నాక్రమించినది. రెండు కోట్లు ఖర్చుపెట్టి కళాశాలలు, వసతిగృహములు నిర్మించిరి. దాదాపు 7000 మంది విద్యార్థు లిచట విద్యగడించుచున్నారు. ప్రాచీన విశ్వవిద్యాలయములైన జంబూద్వీపములో ప్రసిద్ధి గాంచిన నాలందా, తక్షశిలలవలె ఈ విద్యాలయము సర్వవిధముల ప్రసిద్ధ గాంచి యున్నది. ఇది జాతీయ విద్యాలయము. కేంద్ర ప్రభుత్వము దీనికి ధనసహాయము చేయును.

డా॥ భగవానుదాసు, డా॥ అనిబిసెంటు అనువారు ప్రథమముగా కేంద్ర హిందూకళాశాలను స్థాపించిరి. ఇదియే ఈ విశ్వవిద్యాలయమునకు బీజము, పండిత మదనమోహన మాళవ్యా' దీనిని విస్తరింపచేసి, విశ్వవిద్యాలయము చేసెను.

1916 వ సంవత్సరము ఫిబ్రవరి 4 న భారతదేశమునకు రాజప్రతినిధిగా వున్న 'లార్డు హార్డింజి' ఈ విద్యాలయమునకు శంకుస్థాపన చేసెను; శిలాన్యాస ఉత్సవ సందర్భమున అలంకరణ నిమిత్తమై వ్యయపరచిన వ్యయమును గూర్చి పలుకుచు జమీందార్లు, రాజాధిరాజుల వంకజూచి మహాత్మాగాంధీ ఈ విధముగా ఉపన్యసించెను.

"శ్రీమంతులారా ! మీరు శరీరములనుండి. ఈ రత్నాభరణములను దీసి వేయుడు; దీనులైన, అన్నాతురులైన ఆ రైతుబిడ్డల కొరకు వీనిని వ్యయము చేయుడు. ఆ రైతులు ప్రజాబాహుళ్యములో నూటికి ఎబ్బది అయిదు మందికలరు. వారి కాయకష్టముచే గల్గిన సంపాదన యొక్క ఫలమేయివి. ఈ రత్నాభరణములు

మీ యలంకారార్థముకావు. కష్టసమయమునకై వారు మీయొద్ద నిల్వయుంచిన మూలధనము వంటివి."

మాళవ్యా తండ్రి దీనికి మొదట రు 101—0—0 లు విరాళమొసగెను. తన ఆశీస్సుల నొసంగెను. దీనికి మాళవ్యా 1919—1939 వరకు ఉపాధ్యక్షుడు. 1939 నుండి 1948 వరకు శ్రీ యస్. రాధాకృష్ణ ఉపాధ్యక్షుడు. అనేక నరేంద్రుల దగ్గర నుండి మాళవ్యా లక్షలాది ద్రవ్యమును వసూలుచేసెను. బిర్లా వద్ద పదిహేను లక్షల రూపాయలు కైకొనెను. కాయకల్ప చికిత్సపొందిన మాళవ్య, ఇచటనే మరణించెను. మాళవ్యా నివసించిన భవనముకూడ ఈ ఆవరణములోనే యున్నది.

ఇచ్చట చెప్పు విషయములు నానా శాఖలకు జెందియున్నవి. కళలు, విజ్ఞాన శాస్త్రము, న్యాయశాస్త్రము, సంస్కృతము, ప్రాచ్యభాషలు, సంగీతము, ఆయుర్వేదము, ఇంజనీరింగు, గనుల పరిశ్రమ, గాజుపరిశ్రమ మున్నగునవి ఇచ్చట బోధించుచుందురు. భారతదేశములోని అన్ని సంస్థానములనుండి ఇచట విద్య నభ్యసించుటకు, విద్యార్థులు, విద్యార్థినులు వచ్చుచుందురు. ఆయుర్వేద కళాశాలకు ప్రక్కనే 'సుందరలాల్' వైద్యశాల కలదు.

2. మాంటిసోరి పాఠశాల :

'మాంటిసోరి' అను ఆమెఏర్పరచిన పద్ధతిలో ఇది కలదు. ఇది గురుకులము మాదిరిగా ఉండును. 'రాజఘాటు'లో నున్న ఈ పాఠశాల, కళాశాలకూడ ఇట్టి పద్ధతిలోనేఉన్నవి.

3. కాశీ విద్యాపీఠము :

ఇది జాతీయ విద్యామందిరము. యువకులను జాతీయమార్గములో తయారు చేయును. ఇది 'విద్యాపీఠరోడ్డు' ప్రక్కనే కలదు. సహాయ నిరాకరణము జరుగు దినములలో 1921 లో నిది స్థాపించ బడినది.

4. కేంద్ర హిందూకళాశాల :

'కామాచ'లో ఈకళాశాల కలదు. ఇచటనే స్త్రీల కళాశాలకూడ ఉన్నది.

5. రాణి కళాశాల :

'కాశీ'లోని అతిపురాతనమైన సంస్కృత కళాశాల. 1847—52 లో 13000 పౌనుల ఖర్చుతో దీనిని నిర్మించిరి. భారతదేశములో బ్రిటిషువారు ఏర్పరచిన మొదటి సంస్కృత కళాశాల ఇదియే (1791). ఈ కళాశాల ఆవరణములో గుప్తరాజుల కాలమునాటి స్తంభము కలదు. దీనిని 1853 లో ఘాజిపూరుదగ్గర

ఉన్న 'పష్టాదిపురము'లో దెచ్చి, ప్రభుత్వమువారు దీనిని 1854 లో నిచట స్థాపించిరి. దీని ప్రక్కనున్న 'సరస్వతి భవనము'లో సంస్కృత భాషలోని అనేక వ్రాత ప్రతులు లభించును. ప్రపంచములోని గొప్ప గ్రంథాలయములలోనిది యొకటి.

6. దివ్యజ్ఞాన సమాజము — వసంత కళాశాల (రామాచ) :

చెన్న పట్టణములోని 'అడయారు'లో వలె, ఇచట 'అనిబి సెంటు' ఒక సమాజ భవనము నేర్పరచెను. దీనిలోనే 'బాబూ భగవాన్‌దాసు', 'అనగా మదరాసు' గవర్నరు గారైన శ్రీ ప్రకాశగారి తండ్రి 1898—1921 వరకు ఇచటనే నివసించి యుండెను. దీనిలోనే 'స్త్రీలకు' వసంతకళాశాల కలదు.

## (2) కాశీలో జూడదగిన ఇతర ప్రదేశములు

1. నాగకులన్ లేక విషసర్పరూపము :

ఇది 'జైతపుర' పోలీసుస్టేషనుకు ప్రక్కనే ఉన్నది. హరిశ్చంద్రుని కుమారుడగు 'లోహితాస్యుని' త్రాచుపాము ఇచటనే కరచెనని, హరిశ్చంద్ర ఘట్టములో దహన క్రియలు జరిగెనని, నేటికి నీ ప్రజలు చెప్పుకొనుచుందురు.

2. చౌక్ బజారు :

ఈ ప్రదేశములో 'హరిశ్చంద్ర మహారాజు' సత్యవాక్య పరిపాలనార్థము, తన్ను తానే వేలముపేసి కొనెనట. ప్రజలీ విషయమును చెప్పుచుందురు. ఇది చాల ముఖ్యమైన వీధి.

3. భారతకళా భవనము :

ఇది జనరల్ పోష్టుఆఫీసు కెదురుగా ఉన్నది 1920 లో నిది స్థాపితము. ఇందులో చిత్రవస్తు ప్రదర్శనశాల కలదు. 'నాగరీ ప్రచారిణీ సభ' యను పేర్గాంచిన, హిందీ పుస్తకముల విక్రయశాల కలదు ఒక గ్రంథాలయము, ఒక పఠనాలయము కలవు.

4. అనాధాలయము :

ఇందులో దిక్కులేని నిరుపేదలైన బాలబాలికలను పెంచుచున్నారు. ఈ సంఘమువారి సేవ ప్రశంసనీయమైనది.

5. విజయనగరము రాజావారి భవనము :

విజయనగరరాజుల వంశమువారు దీనిని నిర్మించిరి. శ్రీ విజయాగారు కాశీకి వచ్చిన వారికందరికి ఆతిధ్య మిచ్చుటలో పేరొందినవారు. వీరు ఉదార చరిత్రులు;

దానధర్మములలో పేర్గాంచినవారు. వీరు చేసిన దానధర్మములు లెక్కకు మిక్కుటములు. క్రికెట్ ఆడుటకు ఆటస్థలముకూడ కలదు.

6. పురమందిరము :

దీనికి 'అల్బర్టు హాలు' అని పేరుకలదు. 1876 లో ప్రిన్సు ఆఫ్‌వేల్సుగా మనదేశమునకు వచ్చిన సప్తమ ఎడ్వర్డు దీనిని తెరచియుండెను. విజయనగరము రాజాగారు దీనిని నిర్మించియుండిరి. ఇచట పురప్రముఖులు సమావేశములు జరుపుచుందురు. శ్రీ విజయాగారు యిచట మహాత్మాగాంధి విగ్రహమును ప్రతిష్ఠించిరి.

7. సిపాయి కలహమును దెలుపు స్మారకచిహ్నము :

ఈ స్మారకచిహ్నము, చెట్‌గంజి పోలీసుస్టేషనుకు సమీపములో నున్నది. 1857—1858 లో భారతవర్షములో సిపాయి కలహము వచ్చెను. 'సావర్కారు' మున్నగు వారు దీనిని భారతస్వాతంత్ర్య సమరమని పేర్కొనిరి. ఆ సమయములో అనేకమంది ఆంగ్లేయులను హత్యచేసిరి. దీనికి బదులుగా ఆంగ్లేయులుకూడ అనేక దురంతముల జరిపిరి. బ్రిటీషువారు దీనిని నిర్మించిరి.

8. మైదాగినతోట :

కాశీలో 6 తోటలున్నవి. అందులో ఈ తోట అతిముఖ్యమైనది, రమణీయమైనది.

9. సిటీ రిజర్వాయరు :

సీటి పంపులద్వారా, గంగాజల మిచటికి తెప్పించి, ఆటనుండి వడపోయించి, కాశీనగరమునకు పంపుదురు. పరిశుద్ధమైన గంగా జలము మరింత నిర్మలముగా నుండును.

10. ముఖ్యమైన వంతెనలు :

మాళవ్యా పేరున 1947 లో ఒక వంతెన 78 లక్షలు ఖర్చుచేసి, కట్టించినారు. 1885 లో 48 లక్షలు ఖర్చుచేసి, మరియొక వంతెనను కట్టి రాజప్రతినిధి యగు 'డఫరిన్ ప్రభువు' చేత తెరిపించినారు. ఇది తర్వాత శిధిలముకాగా తిరిగి క్రొత్తదానిని నిర్మించిరి. 'కాశీ-మొగల్‌షరాయి' స్టేషనుల మధ్యగా నీ వంతెన మీదగా, బండినడచును.

11. కాశీ స్టేషను :

ఈ స్టేషనుకు ఉత్తరభాగమంత పురాతన 'కాశీ'. ఈ స్టేషనును 1947 లో పునర్నిర్మాణ మొనర్చిరి.

12. బాబట్పూర విమానాశ్రయము :

ఇది నగరమునకు 16 మైళ్ళ దూరములో ఉన్నది. ఇచ్చటనుండి కలకత్తా, లక్నో, ఢిల్లీ, బొంబాయిలకు విమాన మార్గములు కలవు.

13. నందీశ్వర భవనము :

కాశీ మహారాజుది. గొప్పవారు అతిధులుగా వచ్చినచో నిచట యుందురు. ఇది ఒకప్పుడు 'కాశీ దండవిధాయి (Magistrate) యగు 'డేవిస్' వాసస్థలము. 1799 జనవరి 14 న, విప్లవ కారుడు 'నవాబ్ వజీర్ అలి' 200 మంది విప్లవ కారులతోవచ్చి, ఎదుర్కొని చెర్రిని, ముగ్గురు ఆంగ్లేయుల చంపెను.

'డేవిస్', ఒక్కడే చేతిలో బాకు ధరించి, తన్ను, భార్య పిల్లలను రక్షించు కోగల్గెను. 1819 లో డేవిస్, ఇంగ్లాండులో చనిపోయెను.

1781 లో హేస్టింగ్సు కాశీలో 'పోలీసు పద్ధతి నేర్పరచి యుండెను. కాని పోలీసు వారి సహాయము 'డేవిస్'కు లభ్యముకాలేదు.

—o—

# 3
# రామనగరము (కాశీ సంస్థానము)

ఇది గంగానది కావలి ఒడ్డున, కాశీకి ఎదురుగా నున్నది

## 1. కోట - రాజభవనము :

గంగానదికి కుడివైపు ఒడ్డున, కాశీనగరమున కెదురుగా ఒక రాజభవనము గలదు. అది కోటవలె వుండును. దీని కెదురుగా ఒక ఘట్టముకూడ కలదు. ఈ రాజభవనము కాశీరాజుకు చెందినది.

రైలు వంతెనకు దగ్గరగా ప్రతి ఏడు నీటిమీదతేలు వంతెన నిర్మించబడు చుండును. దీనిని వేసంగిలోగట్టి, మాన్సూను కాలములో రద్దుచేయుచుందురు. కొన్ని దినములు కాశీనుండి రామనగరుకు బండ్ల ప్రయాణముసాగును. రామనగరుకు 'వ్యాసకాశి' యని కూడ పేరు కలదు.

ఇప్పటి కాశీరాజుల వంశము 1730 లో 'మహారాజమన్సారాము'తో ఆరంభము. 1750 లో ఆయన కుమారుడు 'మహారాజా బల్వంతసింగు' ఈ కోటను

నిర్మించెను. ప్రస్తుతమున్నరాజు 'హెచ్. హెచ్. విభూతి నారాయణసింగుజీ. ప్రస్తుతము ఈ ప్రదేశమంతయు ఉత్తర ప్రదేశ్‌లో జేరిపోయినవి. ఈ కోటలో 'వేదవ్యాస ఋషి ఆలయము' కలదు. యీ 'వేదవ్యాసుడు' యిచటనుండి రెండున్నర మైళ్ళ దూరములోనున్న ఒక గ్రామములో నివసించుచుండెను. ఈయన పేరుతోనే ఈ 'రామనగరమును' 'వ్యాసకాశీ' అని పిల్తురు. కోటలో అతిధిశాల, ఆయుధశాల, గ్రంథాలయము, ప్రాచీన భారతీయ చిత్రములు, దంతపు పనులు కాన్పించును. గ్రంథాలయములో బొమ్మలుగల 'తులసీదాసు రామాయణము' ప్రతిగలదు. కోట గోడల చెంత వ్యాసుని, మహాదేవుని, గంగాదేవి ఆలయములు గలవు.

## 2. దుర్గాలయము (సుమేరు ఆలయము) :

కోటకు ఒక మైలు దూరములో నీ ఆలయము కలదు. ఇది చాలా సుందర మైనది. దీనికి ప్రక్కనే స్నానము చేయుటకు తటాకము గలదు. దీనిని చేతసింగు త్రవ్వించెను. రామనగరరాజా పూర్వులు ఈ ఆలయమును నిర్మించిరి. రాజా చేతసింగు దీనిని ఆరంభించినట్లు తెలియుచున్నది. వేదవ్యాసుడున్న స్థలమును జూచుటకు పోవు యాత్రికులు మార్గ మధ్యమున ఈ ఆలయమును జూచి పోవుచుందురు.

## 3 రామబాగ్ :

కాశీ మహారాజు తోట. ఇచట పెద్దవారికి ఆతిధ్య మొసగుచుందురు.

## 4. వ్యాసకాశీ :

కోటకు 5 మైళ్ళ దూరములో నిది కలదు. కాశికి వేదవ్యాసుడు భిక్షకురాగా, పార్వతీదేవి కాశిలో ఒక్క మెతుకు కూడ లభ్యము కాకుండ చేసెనట. వ్యాసు డుగ్రుడై 'శివకాశీ'ని శపించెను. అంతట పార్వతి ప్రతిశాప మొసంగెను. వ్యాస కాశిలో జనిపోయినవారు గాడిదయై పుట్టుదురని శపించెను. అందుచేత ఎవరు నచటకు పోకుండిరి. అపుడు పార్వతి జాలి దలచి, 'వ్యాసకాశీ' మాఘమాసములో మాత్రము తీర్థయాత్ర కనుకూలముగా నుండునట్లు చేయుచు శాపమును మార్చెను. అప్పటినుండి మాఘమాసములో నిచట ఉత్సవము జరుగుచుండును. దీనివలన 'గాడిదయై' పుట్టు దోషము పోవునట.

—o—

# సారనాథ్ దిగ్దర్శనము

## 1. సారనాథ్ ఉత్పత్తి :

కాశీలోని ఒక భాగమునకు ఋషి పట్టణమని పేరుగలదు. పాళీలో దీనిని 'ఇసిపట్టణమందురు'. 'ఫాహియాను' దీని అర్థమును ఒక విధముగా వ్రాసెను. 'మహావస్తువు' అను బౌద్ధగ్రంథములో, కాశీకి ఐదున్నర యోజనముల దూరములో నొక అరణ్యముగలదని, 500 మంది ప్రత్యేక బుద్ధులు ఇచట తపము చేసికొనిరని, వారు తమశక్తిచేత గగనమున కేగిరని, అచటవారు నిర్వాణము చెందిరని, వారి భౌతిక శరీరములు నేలపై పడినవని, ఈ కారణమున, ఋషిపతనమని పేరువచ్చిన దని, లిఖింపబడినది. ఈ ప్రాంతములో 500 మంది ఋషులు తపముచేసి యుండుట చారిత్రక సత్యము కావచ్చును. ఈ ఋషిపతనమునకు దగ్గరగా 'మృగదావము' అను సుందరవనము కలదు (లేళ్ళతోట) బుద్ధుడు తన పూర్వజన్మలో నొకసారి, రాజుతో లేళ్ళను వేటాడవద్దని, చెప్పెనని, రోజుకొక లేడిని మాత్రము వేటాడు మని చెప్పెనని, ఒక నాడు ఒక ఆడలేడి వంతువచ్చెనని అది బోధిసత్వుని సహాయ మర్థించెనని, తాను చనిపోయినచో రెండు జీవులకు ప్రాణనష్టమని చెప్పెనని, అపుడు బోధిసత్వుని మధ్యవర్తిత్వమున ప్రాణరక్షణ యాయెనని జాతక కథలు తెల్పును. బుద్ధునికి సారంగనాధుడని పేరుగలదని, ఇదియే కొన్నాళ్ళకు 'సారనాధు'గా మారెనని, 'కన్నింగుహాము' మున్నగు విద్వాంసుల అభిప్రాయమై యున్నది.

శివునికి 'సారంగము' అని కూడ పేరుగలదు. సారనాథునకు తూర్పుగా అరమైలు దూరములో 'మహాదేవ ఆలయము' గలదని, శివునికి సారంగనాథుడను విశేషణము గలదని, అందుచేత దీనికి 'సారంగనాథ లేక సారనాథ' అను పేరు వచ్చినదని కొందరు వ్రాసిరి. ఈ మహాదేవ ఆలయము పురాతనమైన ఆలయము కాదు, కాన ఇది సత్యము కాజాలదు. ఇచ్చట ఋషులు తపము చేసికొనిరని, వారి యొద్ద ఋష్యాశ్రమములో మామూలుగా లేళ్ళుడున్నట్లు ఇచ్చటకూడ లేళ్ళుండెడివని, అందుచేత దీనికి ఋషి పతనములోని 'మృగదావము' (Deer park సారనాథ్) అనిపేరు వచ్చినట్లు మనమూహింప వచ్చును. ఈ 'మృగదావమే' సారంగనాథ్ లేక సారనాథ్ అయినది. ఈ విధముగా ఈ పేరు గల్గినది.

## 2. బౌద్ధ వాఙ్మయములో 'సారనాథ్ ప్రశంస' :

బుద్ధుని కొరకు, అతని శిష్యుల కొరకు 'నందీయ' అను వర్తకుడు ప్రథమముగా నిచట నొక విహారమును నిర్మించెను. బుద్ధుని కాలములో నొక శెట్టి 'వారణాశి' లో నివసించెను. అతని కుమారుడు 'నందీయుడు'; అతని తలిదండ్రులు 'రైవతి' యను కన్యను వివాహముచేయనెంచిరి; కాని యతడు నిరాకరించెను. అతని తల్లి ఆ బాలికను బిలిచి బౌద్ధ భిక్షువులకు శుశ్రూష చేయుచుండుమని కోరెను. ఆమె విహారములోనే భుజించుచు, బుద్ధుని వాగమృత ధారలను వినుచు, భిక్షువులకు శుశ్రూషచేయుచు నచటనే గడపసాగెను. ఈమె గుణమును శీలసంపత్తిని కన్నులార వీక్షించి 'నందీయు' డామెను పరిణయమాడెను. శెట్టి మరణించుటతో 'నందీయ' వారసుడాయెను. 'ఇసి పట్టణము'లో ఒక విహారమును, మహావిహారము చెంత యీ సత్కార్యమునకుగాను బుద్ధుని కొరకు, శిష్యులకొరకు నిర్మించెను. ఈ రెండు విహారములు ఈనాటికి తెలియలేదు.

ఈ 'సారనాథ్' హిందూ, బౌద్ధ, జైనులకు పుణ్యక్షేత్రము. బుద్ధుడు పూర్వ జన్మలో కశ్యపుడై జన్మించెనని, ప్రథమ ధర్మోపదేశము చేసెనని, ప్రథమ వర్షా కాల మిచటనే గడిపెనని బౌద్ధ గ్రంథములు చెప్పుచున్నవి. దీనికి దగ్గరగా ఉన్న 'సింఘపురము'లో 'జైనతీర్థంకరుడు' నిర్యాణము పొందెను. మహేశ్వరాది ఆలయములుండుట చేత నిది హిందువులకు కూడ పుణ్యక్షేత్రమై వెలయుచున్నది. ఈ క్షేత్రమనేక విధముల పవిత్రమైనది. 'గయ'లో బుద్ధుడు బోధివృక్షముక్రింద నిర్వాణము పొందిన తర్వాత, తనను వీడిపోయిన ఐదుగురి శిష్యులకు బోధించుటకు ఒంటరిగా గాల్నడకను బయనమై బహుళ పదకొండు దినములలో 288 మైళ్ళు నడిచిగయనుండి సారనాథుకు జేరెను. ప్రథమ ధర్మోపదేశము చేసెను. బౌద్ధుల నాల్గు పుణ్యక్షేత్రములలో నిది యొకటి. బుద్ధుని జన్మస్థలము కపిలవస్తు; బుద్ధత్వము చెందిన తావు బుద్ధగయ, క్రీ. పూ. 477 లో బుద్ధుడు నిర్వాణము చెందినతావు 'కుశినర'; సారనాథుతోబాటు ఇవి పుణ్యస్థలములు. కాశిచరిత్రతోబాటు సారనాథు చరిత్ర కూడ నడచుచున్నది.

పైనజెప్పిన 'బుద్ధగయ'లోనే వైశాఖ పూర్ణిమా దినంబున 'సుజాత' యను తన్వి పుత్రవతియై మ్రొక్కు తీర్చుటకు పాయసకలశముతోవచ్చి, గౌతమునికి సమర్పించెను. ఆయన 'నిరంజనా' నదిలో స్నానమాడి పాయసమును 49 కబళములు చేసి భుజించి, స్వర్ణపాత్రను నీటిలో బారవేసెను. తూర్పు ముఖముగా

నశ్వద్ధవృక్షముక్రింద కూర్చుండి. 49 దినములు అన్నము తినకుండ, స్నానమాడకుండ, ముఖము కడుగకుండ గూర్చుండి, ఇట్లు శపథము చేసెను. "నాయీ అస్థులు, నరములు, చర్మము గుల్లయైపోవుగాక ; రక్తమాంసములు శోషించిపోవుగాక, పరమజ్ఞానమును పొందకుండ, నేసీ ఆసనమునుండి, కాలుమెదల్పను."

("If on this day, I am to become a Buddha. let this vessel ascend the stream, if not let it go down" "Though my skin, my nerves and my bones waste away and though my life blood be dried up. yet I will not leave this seat before I have attained unto perfect knowledge.")

ఇట్లు దృఢనిశ్చయమనస్కుండై యున్నంత, నాటి రాత్రి దివ్యజ్ఞానోదయము, బుద్ధత్వప్రాప్తి, పూర్వ జన్మజ్ఞానము గల్గెను. జగతిలోని మానవకోటికి ధర్మము ఆదర్శమైనది.

సారనాథు చాలపూజ్యమైనది మానవకోటికి సత్యము, అహింస' శాంతిని బోధించిన 'గౌతమబుద్ధుడు 'తన ప్రథమధర్మోపదేశమును క్రీ. పూ. 522 ఆషాఢ (జూన్—జులై నెలలు) శుద్ధ పౌర్ణమి సంధ్యా సమయములో ఐదుగురు శిష్యులైన 1 కౌండిన్య, 2 దశబల కాశ్యప, 3 వప్ప, 4 అశ్వజిత్. 5 భద్రిక అనువారికి ప్రథమధర్మోపదేశము చేసెను. 'లలితవిస్తారము'లో 'దశబల'కు బదులు 'మహానామ' అను పేరుకలదు. 'ఉరువిల' అరణ్యములో ఆరు ఏండ్లు బ్రాహ్మణులతో గలసి ఉగ్రమైన తపస్సు చేసికొనెను. చివరకు ఉపవాసాదులు నిరర్థకములని వానిని త్యజించెను. అపుడు మధ్యమార్గమును గనిపెట్టెను. గయలో అశ్వత్థవృక్షము క్రింద కూర్చుండి, నిర్వాణ మార్గమును గనిపెట్టెను.

సారనాథులో బుద్ధుడు పది ఏండ్లు గడిపెను. క్రీ. పూ. 567 లో బుద్ధుని జననము, క్రీ. పూ. 538 లో వివాహము, క్రీ. పూ. 528 లో సన్యాసమారంభము, క్రీ. పూ. 477 లో మరణము అని తెలిసికొనవచ్చును; ఇచట ధర్మచక్ర ప్రవర్తనము, జరిగినది. యశకుల పుత్రుని తండ్రి బుద్ధ, ధర్మ, సంఘములకు శరణుచొచ్చెను. బుద్ధుడు శిష్యులతోగూడ ప్రథమ వర్షావాసముచేసెను. ధర్మప్రచారము నిమిత్తము శిష్యుల నిచటినుండియే బుద్ధుడు పంపియుండెను. అశోకుడు, కనిష్కుడు, కుమారగుప్తుడు, కుమారదేవి మున్నగువారు నిర్మించిన స్తంభములు, మందిరములు, స్థూపములు, విహారములు ఇందున్నవి. పాహియాను, హౌనుత్సాంగు, ఇత్సింగు, కాయిసంగ్, ఆది చైనీయయాత్రికులు తమ భ్రమణ వృత్తాంతములలో దీనిని

గూర్చి వ్రాసిరి ఇచట మొత్తము 25 శాసనములు లభించినవి. (A S: I — Annual reports 1906—07)

సార్నాధులో నొక స్తంభము లభించినది. దానిపైన నాల్గు సింహముల బొమ్మలు చెక్కబడి యున్నవి. వీని మధ్య పెద్ద శిలాచక్రమున్నది. ఇదియే ధర్మచక్రము. దీనిలోని కొన్నిభాగములు మాత్రము చిత్రవస్తు ప్రదర్శన శాలలో నున్నవి. ఒక మద్దెల ఆకారముగల రాతిపై సింహ విగ్రహములున్నవి. మద్దెల పైన సింహము, ఏనుగు, ఎద్దు, గుఱ్ఱము వీని విగ్రహములు, నాల్గు చక్రముల మధ్య ఏర్పరచబడి యున్నవి. ఇంతకంటె నైపుణ్యము గల్గిన, స్వాభావికమైన జంతుశిల్పము ఎచట కానరాదు.

తెలుగులో నిచట శిలాశాసనము యొక్క భావము వ్రాయుచున్నాను. 1. దేవానాం ప్రియుడగు ప్రియదర్శిరాజు 2. చెప్పుచున్నాడు 3. పాటలీ పుత్రములో గాని. ఇతర నగరములోగాని, ఎవరు సంఘమును విడదీయరాదు. 4. భిక్షుకుడుకాని, భిక్షుకికాని సంఘమును విడదీసిన, వారికి తెల్లబట్టలు కట్టించి వేరే యొకచోట వాసము చేయునట్లు చేయవలెను. 5 ఈ యనశాసనమును భిక్షుకుల, భిక్షుణీ సంఘములకు తెలియ జేయవలయును. 6. దేవానాం ప్రియుడిట్లు పల్కుచున్నాడు. 7. ఈ యనుశాసనము యొక్క ప్రతిని ఈ కార్యాలయములోను, మరియొక ప్రతిని ఉపాసకుల గృహములో నుంచవలయును. 8. ఈ ఉపాసకు లీ యనుశాసనమందు విశ్వాసము గల్గియుండుటకు ఉపవాస దినములలో నొకచోట కూర్చుండవలెను. ఈయనుశాసనమందు విశ్వాసము గల్గి, బోధించుటకు మహామాత్రులు కూడ ఉపవాస దినములలో నచటికి పోవలయును. 9. మీ రాష్ట్రి మెంతవరకున్నదో అంత వరకు ఒక ఉద్యోగస్థుని ఈ ధర్మాను శాసన ప్రకారము మీరు పంపుచుండ వలయును. 10. అట్లే ఈ క్రింది ఉద్యోగస్థులు కూడ దగ్గర ప్రదేశములో ఈ ధర్మాను శాసనమును వినిపించుటకు వారి క్రింది ఉద్యోగస్థులను బంపుచుండవలెను.

అశోకుడిట్లు స్తంభములపైన వ్రాయించెను. దీనిని 'భిక్షువుల'కు హెచ్చరిక చేయు శిలాశాసనము అని విద్వాంసులు పిల్చుదురు. (Monks' warning post) దీని వలన అశోకుని దూరదృష్టి విదితంబగుచున్నది.

## 3. సారనాధులోని శిధిలమందిర భాగములు బయల్పడిన విధానం:

కాశీరాజైన 'చేతసింగు' దివానైన, జగత్‌సింగు క్రీ. శ. 1794 జనవరిలో తన పౌరులతో, 'కాశీనగరము'లో నొక గంజి లేక బజారు నిర్మించదలచియుండిరి.

(జగత్ గంజ్). తన మనుష్యులతో 'సారనాథు' వెళ్ళి, అచట ఇటుక రాళ్ళతో నిర్మించబడిన కట్టడమును పునాదితో కూడ త్రవ్వించెను. దీని వ్యాసము 110 అ. ఇది సారనాథులో బౌద్ధప్రభువైన అశోక మహారాజు చేత నిర్మించబడిన 'ధర్మ రాజిక స్థూపము', అతి ముఖ్యమైనది. 'జగత్‌సింగు' త్రవ్వుటలో ఇసుకరాయి, చలువరాతితో నిర్మించబడిన రెండు పాత్రలు ఒకదానిలో నొకటి ఉన్నట్టివి, లభ్యమాయెను. చలువరాతి పాత్రలో మనుష్యుని అస్థికలు, ముత్యములు, బంగారు రేకులు కాన్పించినవి. ఒక గౌతమబుద్ధుని విగ్రహముకూడ లభ్యమాయెను. దాని పైన సంవత్ 1083 అని వ్రాయబడినది. అస్థులు బహుశః గౌతమబుద్ధునివై యుండవచ్చును. చారిత్రక సంపదవిలువ తెలియని 'జగత్ సింగు' వానిని భాగీరథీ జలంబుల పాలుచేసెను. మహమ్మదీయుల దండయాత్రా కాలమునాటికి, బౌద్ధ విహారములతోబాటు హిందూ ఆలయములు కూడ ఉన్న ఆధారములు కలవు. ఈ విషయములు ఇచట పరిశోధించిన 'సాహనీ, ఓర్టల్' మున్నగు విద్వాంసుల వ్రాతలవలన తెలియుచున్నది. ఒకానొక సంఘారామములో మట్టిపాత్రలో లభ్యమైన రాయధాన్యములు, వండిన యన్నము మున్నగు వానిబట్టి దండయాత్ర అకస్మిక ముగా జరిగెనని, అందుచేత వారు వండిన యన్నముకూడ భుజించకుండ పారి పోయిరని తెలియుచున్నది. లామాతారానాధుని వ్రాతలప్రకారము, ఇచటి భిక్షువులు కొందరు టిబెటు, నేపాళములకు పారిపోయిరని, కొందరు బ్రాహ్మణమత స్వీకారము చేసిరని తెలియుచున్నది. సారనాథ్ ధ్వంసమాయెను. విహార, చైత్య, దేవాలయాదులు నేలమట్టమాయెను. కన్యాకుబ్జేశ్వరుడగు 'గోవింద చంద్రుని' రాణియగు 'కుమారదేవి' నిర్మించిన విహారమచట నున్న కట్టడములలో చిట్ట చివరిది. ఈ గోవిందచంద్రుడు, సంయుక్త తండ్రియగు జయచంద్రుని తాత. తురుష్కులు దీనిని ధ్వంసము చేసిరి. క్రీ. శ. 1794 వరకు, అనగా ఆరు శతాబ్ద ముల కాలము వీని వృత్తాంత మెవరికి తెలియదు. సారనాథులోని యీ భగ్నావ శేషములను త్రవ్వి పరిశోధించినవారు 'డంకన్, కలనల్ మెకంజి, కన్నింగుహామ్, కిట్టూ, ఓర్టల్' మున్నగువారు చిరస్మరణీయులు.

1891 లో జపానీయ బౌద్ధ భిక్షువులతోగలసి 'అంగరిక ధర్మపాలుడు' సారనాథుకువచ్చి ధమ్మేఖస్థూపము, జైన ఆలయము శిథిలావస్థలో నుండుట గాంచెను. తర్వాత 1914 లో 'మూలగంధకుటి ఆలయము' ను నిర్మించెను. అప్పటి నుండి ఇది గొప్ప తీర్థస్థలమై వెలయుచున్నది. ప్రాచీన 'సారనాథు' యొక్క పేరుప్రతిష్ఠల సంపాదించు కొనుచున్నది.

'హౌనుత్సాంగు' ఒకానొక స్థూపముపైన బంగారు మామిడిపండు కలదని వర్ణించియుండెను. అది ఈనాటికిని కాన్పించలేదు. కన్పించు ఆశలుకూడ లేవు.

## 4. చూడదగిన ధ్వంసావశేషములు :

1. చౌఖండి స్థూపము :

సారనాధుకు వచ్చునపుడు ఎడమ వైపున నొకస్థూపము కాన్పించును. బుద్ధుడు గయలో బుద్ధత్వము జెందిన తర్వాత, యతిపంచకమును గలసికొనెను. ఇది మొదట 200 అడుగుల ఎత్తుండెడిదట. కాని పైన ఇంటితో గూడ నేడు 84 అడుగులు మాత్రమున్నది. పైన అష్టాకారముగల గోపురము గలదు. 'అక్బరు' క్రీ. శ. 1588 లో తన తండ్రి 'హుమాయూను' సారనాధు ఆగమన వృత్తాంతము జ్ఞప్తిచేయుటకు నిర్మించెను. పారశీక లిపిలోనొక శాసనమును గూడ వ్రాయించెను. దీనిని 'హుమాయూను' గోపురము అనుచుందురు. పై నెక్కినచో కాశీ, సారనాధు లన్నియు గాన్పించును. క్రీ. శ. 1835 లోను 1804-5 లోను లోపల ఏమైన లభ్యమగు నేమోనని ఒక బావి త్రవ్వింరి. అందు ఏమి లభించలేదు. ఈస్థలము నెవరు నిర్మించిరో, పేరు తెలియదు. యతి పంచకను మొదట బుద్ధునికి ప్రత్యుద్థానాభి వాదనములు చేయ దలంచలేదు. తర్వాత బుద్ధుని దివ్యతేజస్సును గాంచి గౌరవింప సాగిరి. దీనికి పూర్వము బుద్ధుడు ఇద్దరు వర్తకులకు 'తపస్సు మల్లికులను వారికి' బౌద్ధధర్మ దీక్ష యొసంగెను.

'హుమాయూన్' ఎందుకు వచ్చెనో తెలియదు. హుమాయూను కాని, అక్బరు కాని, ఇచట స్థూపమునకు మరమ్మత్తులుచేసి యుండలేదు. వారిరువురి కాలములోను 'ధమ్మేఖ స్థూపము', జగత్‌సింగు ధ్వంసముచేసిన స్థూపమువుండెను. మిగతవి మట్టిలో గప్పబడి యున్నవి ఈ స్థూపముపైన వ్రాయబడిన పద్య భావమిది. "ఏడుదేశములకు భూపాలుడైన స్వర్గవాసి 'హుమాయూన్' ఒకనాడు ఈ స్థానమునకు వచ్చి కూర్చుండెను. ఈ ప్రకార మాయన సూర్యప్రకాశమును మరింత తేజోవిలసిత మొనర్చెను. అందుచేత ఆయన పుత్రుడు దీనుపైన 'అక్బరు ఆకశమును స్పృశించు ఒక ఉన్నత స్థానమును నిర్మించుటకు సంకల్పించెను. హిజరీ 776 లో ఈ సుందర భవనమును నిర్మించెను."

చౌఖండీ స్థూపముపైన శాసనము. పారశీకి ఇంగ్లీషు అనువాదము.

"Allah is great.

(1) Since here the king Jannat Ashyani, Humayun the ruler of 7 climes.

(2) Came one day and sat on the throne, rendering (the spot) thereby like the rising place of the resplendent sun

(3) It came to the mind of this humble creature, Govarthan, a house born slave of King Akbar

(4) To erect, as a sacred memorial a magnificient dome resembling the blue firmament.

(5) The year was 996 when this elegent edifice came into existence "

ఇందలి గోవర్ధనుడు 'రాజా తోడరుమల్లు' కుమారుడుగా గాన్పించుచున్నాడు. పైన హిజరీసంవత్సరము తప్పుగా పడినది.

'చౌఖండీ స్థూపము' పైకి ఎక్కుటకు మెట్లు కలవు. సమస్తము కాశీ యంతయు గాన్పించును. క్రిందిపైపున నొక బావికలదు అచటనే కాళీ విగ్రహము (ఓంకార్వేర్) కలదు. గ్రామస్థులు మేకలను కాళి కిచట బలియిచ్చు చుందురు. బౌద్ధ జైనులు అహింసావ్రతధారులు; వారి కప్రతిష్ఠ గల్గుటకు ఇది తర్వాత నిర్మించబడి యుండవచ్చును.

2. చిత్రవస్తు ప్రదర్శనశాల :

ఉదయము, సాయంకాలము తెరచుచుందురు. ఇచ్చట లభ్యమైన భగ్నావశేషము లనేకములు చూడవచ్చును. క్రీ. పూ. 250 నాటి అశోక స్తంభముమీద సింహపీఠి, బుద్ధుని, బోధిసత్త్వుని విగ్రహములు, రాతి గొడుగు, చక్రము, మధ్య కాలీన గుప్తకాలమునాటి బౌద్ధజైన విగ్రహములు, బుద్ధుడు బోధించు విగ్రహము, అవలోకితేశ్వరుని విగ్రహము, బుద్ధచరిత్రమును దెల్పు రాతి విగ్రహములు బౌద్ధమైత్రేయ విగ్రహములు, వేరు వేరు కాలములనాటి దేవతలయొక్క, పగిలి పోయిన బొమ్మలు, పెద్రకోట సీళ్ళు, రాతిపలకలపై చెక్కబడిన చిత్రపుపనులు, కుమ్మరిసామానులు, మట్టి పాత్రలు, భిక్షువుల మట్టిపాత్రలు, సీసాలు, జాడీలు, సారనాధులో లభ్యమైన సామగ్రి యంతయు ఇందు భద్రపరచబడియున్నది.

3. ఆరు, ఏడు సంఘారామములు :

చిత్రవస్తు ప్రదర్శన శాలను మధ్యనున్న రోడ్డునుదాటి పైకిపోయి నచో, 'కిట్టూ' 1851 సం. లో కనిపెట్టిన బౌద్ధ సంఘారామము కాన్పించును. 6 వ

నెంబరు సంఘారామము అగ్నిచేత దగ్ధమాయెను. ముస్లిముల దండ యాత్రలో నిది దగ్ధమాయెను. బౌద్ధభిక్షువులు భుజించుచుండ, ఆకస్మికముగా దండయాత్ర జరుగుటచేత, వారు అన్నము వదలిపెట్టి పారిపోయిరి. రెండు గదులలో, వండిన అన్నముగల పాత్రలు దొరకినవి. గోధుమ రొట్టెలు, అన్నము కాన్పించినవి. ఇచట నొక ఇటిక బావికలదు. అందునీరున్నది. బౌద్ధులు దీనిని పుణ్యమైనదని తలంతురు.

7 వ నెంబరు సంఘారామమునకు కూడ అదే గతిపట్టినది. దీనిదగ్గర కూడ నీళ్ళుగల బావి కలదు. వీనికి ప్రక్కగా హిందూదేవతల ప్రతిమలుగల ఒక శాల కలదు. 'ఓర్టల్' తాను కనిపెట్టిన విగ్రహములు తాత్కాలికముగా నిందుంచెను. తర్వాత చిత్రవస్తు ప్రదర్శన శాలకు జేర్చిరి. ఈ శాలలో నిపుడు హిందూ, జైన విగ్రహములు కలవు. (Brahmanical sculpture shed)

4. జైన దేవాలయము :

ఈ శాలకు కుడిప్రైపుగా కొంచెము దూరము నడచినచో, జైనాలయము కాన్పించును. ఇది 1824 లో నిర్మించ బడినది. 11 వ జైనతీర్థంకరుడు శ్రీ అంశనాధుని పేరుతో నిది నిర్మించ బడినది. ఇది 'కిట్టూ' కనిపెట్టిన సంఘారామమునకు ఒక ప్రక్కగా నున్నది. 'అంశనాథుడు' ఇచటికి మైలుదూరములో నున్న 'సింఘపురము'లో తీర్థంకరత్వము బొందెను.

5. జగత్‌సింగు స్థూపము లేక ధర్మరాజిక స్థూపము :

ఆరు ఏడు సంఘారామములు దాటిన తర్వాత 'ధర్మరాజిక స్థూపము' కాన్పించును. దీనిని బౌద్ధ ప్రభువైన 'అశోకుడు' నిర్మించెను, తరువాత దీనిని ఏమి పర్యాయములు పురస్కృత్తు చేసిరి. ఆఖరుసారి క్రీ. శ. 11 వ శతాబ్దములో జరిగెను. క్రీ. శ. 1794 లో 'జగత్‌సింగు' తన గంజి కొరకు దీనిని త్రవ్వించి, అందలి ఇసుకరాళ్ళ నుపయోగించి తన గంజిని నిర్మించెను. ఇచట రెండు పాత్రలు లభించెను. వీనిలో అస్థులు, ముత్యములు, స్వర్ణరేకులు లభించినవి. ఈ అస్థులను, ముత్యములను, అమూల్యమైన ఈ చారిత్రక సంపద విలువ తెలియని 'జగత్‌సింగు' గంగలోబోసెను. అవి తథాగతుని ఎముకలు కావచ్చును. తర్వాత పరిశోధకు లింకను త్రవ్విరి. ఇది సారనాథ్ స్థూపములలో ప్రధానమైనది, పవిత్రమైనది. దీనికి దగ్గరగా చిన్న చిన్న స్థూపము లున్నవి. అనేక విగ్రహములు కూడ లభించినవి.

## ఇచటదొరకిన సామగ్రి

1. పచ్చని చలువరాతి పాత్ర

దీనిలో అస్థులు, ముత్యములు దొరకినవి. 'జగత్‌సింగు' వీనిని గంగలో పారబోసెను. ఇవి తథాగతుని ఎముకలు,

2. రాతిపాత్ర :

ఇది 'కలకత్తా' లోని వస్తుప్రదర్శన శాలలో నున్నది.

'జగత్‌సింగు' వీని చారిత్రక విలువ నెరుగడాయెను. ఈ స్తూపము ఎత్తు 100 అడుగులు ఉన్నదని 'హౌనుత్సాంగు' వర్ణించి యుండెను.

అశోకుడు నిర్మించినవి ఈ ప్రదేశములో మూడుఉన్నవి. 1 పైన చెప్పిన స్థూపము 2 అశోక స్తంభము 3 ఇనుపకమ్మి.

6. ప్రధానమందిరము :

(Main shrine — Commerative stupa with umbrella post, surrounded by Monolithic Mauryan railing. 3 rd century B. C )

దీనిని 1918—19 లో కనిపెట్టిరి. ఇచ్చటనే బుద్ధదేవుడు యతి పంచకము నకు తన ప్రథమ ధర్మోపదేశమును జేసెను. ఈ మందిరముయొక్క గోడలు చాల మందముగా నున్నవి. ఇచ్చటనే మొదట, బుద్ధాలయము గలదు. దీనికి నాలుగుపైపుల ప్రవేశద్వారములు చిన్నగదులు కలవు. ముఖ్యద్వారము తూర్పు వైపుననున్నది. ఈ గోడలమందమును జూచి ఇది చాల ఎత్తయిన మందిరమై ఉండవచ్చునని పరిశోధకు లూహించుచున్నారు. పురాతత్వశాస్త్రజ్ఞులు దీనిని 'గంధ కుటి' యనుచున్నారు. దీనిమీదనే కూర్చుండి 'గౌతమబుద్ధుడు' 'ధర్మచక్ర ప్రవర్తనమును' చేసి యుండెను. ఇచ్చటనే వర్షాకాలము గడిపియుండెను అందు చేత అశోక మహారాజాదులు ఈ పవిత్రస్థలమునందు హెచ్చుగా ధ్యానముంచి, ఇచ్చటకు దగ్గరనే అశోక స్తంభాదులు నిర్మించిరి.

ఇది క్రీ. శ. 11 వ శతాబ్దములో నిర్మించబడినది. 'ధర్మరాజిక స్తూపము'తో బాటు దీనిని జీర్ణోద్ధారము చేసిరి. ఈ మందిరమునకు దక్షిణపు గదిలో అశోకుని కాలమునాటి దైన రాతితో చేయబడిన 'ఖంచిత వేష్టని, (Railing-గ్రాది) కలదు. ఇది అంతయు మెరుగుచేయబడి ఒక్క రాతితోనే నిర్మించబడినది. ఇది మొదట అశోకస్తంభముచుట్టూ ఉండెడిదని తరువాత ఇచ్చటికి చేర్చిరని తెలియు చున్నది. దీనిపైన వ్రాయబడిన వ్రాతలనుబట్టి 'సవాహికా'అను పేరుగల ఉపాసికుడు దీనిని నిర్మాణముచేసి యుండెనని తెలియుచున్నది. ఈ వేష్టని, సాంచి,

ద్వార్వాత్తులలోని వానివలె నున్నది. ఈ మందిరములో ననేక విగ్రహములు కలవు. ఇందలి సింహపీఠి మున్నగు వాటి నన్నింటిని 'హౌనుత్సాంగు' వర్ణించి యుండెను. దీని లోపల ఇటుక రాతితో చేయబడిన ఒక స్తూపము కాన్పించును. ఇచ్చటనున్న వేష్టని ఒక్క రాతినుండియే చెక్కబడినది. ఇది 8 అ. 4 అం. పొడవు గలిగి చతురస్రాకారముగా నున్నది. దీని ఎత్తు 4 అ. 9 అం. ఉన్నది. మధ్యఎట్టి కీలును కాన్పించదు. ఇది సగము విరిగిపోయి యున్నది, దీని మూలస్థాన మెద్దియో దీని నెందు కేర్పాటు చేసిరో తెలియకున్నది.

ధర్మచక్రవిహారము :

(On the site where our Lord Buddha preached his first sermon 2524 years ago. May all beings share our merits equally with us. 2479 B. E, 1936 A D.

(శాసనములో ఇట్లున్నది. "Homage of the masters of the Sarvastivadin".)

## ధర్మచక్ర ప్రవర్తనము

ఈ ప్రధాన మందిరములో బుద్ధుడు ప్రథమధర్మోపదేశము చేసెను. అది ఇట్లున్నది. "ఆ సమయమున బుద్ధ భగవానుడు మనసులో నేను ముందు ఎవరికీ ధర్మోపదేశము చేయవలెను ? ఈ ధర్మోపదేశమును శీఘ్రముగా గ్రహించు వారెవరు ? అని ఆలోచించెను. మరల 'ఆలార కాలామపండితుడు' చాల మేధావి, చిరకాల నిర్మల చిత్తుడు, నేను ప్రప్రథమముగా ఆలారకాలామునికి ధర్మోపదేశ మేల చేయరాదు ? అతడు ఈధర్మమును వెంటనే గ్రహించగలడు అని బుద్ధ భగవానుడు మనసునతలంచెను. అపుడు 'గుప్తదేవత' బుద్ధ భగవానునితో, నిట్లు వచించెను. "భంతే ! (పాళీభాషలోని పూజ్యసంబోధనము) ఆలారకాలము పండితుడు వారము దినముల క్రితమే మరణించెను." బుద్ధదేవునికి కూడ అట్లే గోచరించెను. తదుపరి బుద్ధ దేవునకు, 'ఉద్దకరామ పుత్రుడు' అనుపండితుడు, చతురుడు, మేధావి, నిర్మలచిత్తుడు, అట్టివానికి నేను ప్రథమముగ, ధర్మోపదేశ మేల చేయరాదు ? అతడు ఈ ధర్మమును, అతిశీఘ్రముగ గ్రహించగలడు." అని తోచెను. అపుడు గుప్తదేవత. "భంతే ! ఉద్దకరామ పుత్రుడు, గత రాత్రియే మరణించినాడు." అని బుద్ధునితో చెప్పెను. బుద్ధుడు ఆలోచింపగ అదితథ్యమని జ్ఞానదృష్టికి దోచెను. "మరల పంచవర్గీయ భిక్షువులు ఇంతకు పూర్వము నాకనేక విధముల సేవాశుశ్రూషలు చేసి, సాధన సంపత్తి గల్గియుండిరి. అట్టి వారికి నేను

ముందుగా ధర్మోపదేశ మేలచేయరాదు?" వారిప్పు డెచట విహరించు చున్నారాయని మనంబున తలంచి, అమానుష విశుద్ధ దివ్యదృష్టిని విలోకించగా, పంచవర్గీయ భిక్షువులు 'వారణాశి'లో 'ఋషిపతన మృగదావము'లో విహరించుచున్నట్లు గోచరించెను.

బుద్ధదేవుడు 'ఉరువేలా'లో స్వేచ్ఛగా విహరించుచు, వారణాశికి బయనమాయెను. అపుడు, 'ఉపక అజీవుడ'ను సాధువు, బోధి వృక్షమునకు గయకు మధ్యగా పోవుచున్న బుద్ధభగవానుని జూచి, యిట్లు ప్రశ్నించెను. "అయుష్మంతుడా! నీ యింద్రియములు ప్రసన్నములు. నీకాంతి పరిశుద్ధ తేజోవంతము, నీ వెవరిని గురువుగ నెంచి ప్రవ్రజితుడవైతివి? నీ గురువు నామమేమిట్టి? నీవు ఏధర్మ సంప్రదాయము ననుసరించు చున్నావు?" యట్లడుగగా, బుద్ధదేవుడు ఆ సాధువుతో నిట్లనెను. "నేను అన్నిటిని జయించువాడను. అన్నిటిని ఎరిగినవాడను. అన్ని ధర్మముల నంటని వాడను. సర్వత్యాగిని. తృష్ణారహితుడను. నేను స్వయముగ ఎరింగి, ఉపదేశ మిచ్చువాడను. నాకు గురువులేడు; నావంటి తేజోవిలసితుడు లేడు; దేవతలలో సహితము, లోకమందెచ్చటను, నాకు సాటియైన పురుషుడు లేడు. నేను ప్రపంచమున అర్హతుండ, అపూర్వ ఉపదేశకుడను; సమ్యక్ సంబుద్ధుడను, శాంతి నిర్వాణముల బొందిన వాడను, ధర్మచక్ర ప్రవర్తనకై కాశీపుర మేగుచున్నాను. అంధకార బంధురములోనున్న ప్రపంచమున అమృతదుందుభిని మ్రోగింతును."

సాధువిట్లనెను. "అయుష్మంతా! నీవు వచించినట్లు, నీవు అనంత జినులకు తుల్యమగుదువేమో!" బుద్ధదేవుడిట్లనెను! "నావంటి వారే నిర్మల చిత్తులైన జినులగుచున్నారు. నేను పాపముల జయించితిని. కాన ఉపకా! నేను నిజముగా జినుడనే," బుద్ధదేవుని పల్కు లాలించి, 'ఉపక', అను సాధువు, నీ వాయుష్మంతుడ వగుదువు గాక"యనిపల్కి. తనదారిని బోయెను.

## వారణాశి

ఇట్లు యాత్రచేయుచు, 'వారణాశి' యందలి 'ఋషిపతన మృగదావము' అను ప్రదేశమునకు జేరెను. అచటనే పంచవర్గీయభిక్షువులుండిరి. పంచవర్గీయ భిక్షువులు, వచ్చుచున్న బుద్ధదేవుని దూరముగానే చూచి, పరస్పర మిట్లు నిశ్చయించుకొనిరి. "ఆయుష్మంతులారా! సాధనాభ్రష్టుడు, దేశద్రిమ్మరియగు శ్రమణ గౌతముడు వచ్చుచున్నాడు, అతనికి ఎదురేగి అహ్వానించరాదు; నమస్కరింప

జనదు: సత్కరించరాదు. కేవలము ఆసీనుడగుటకు ఆసన మిచ్చెదముగాక ! ఇష్టమున్న కూర్చుండును, లేకున్న లేదు."

'బుద్ధదేవుడు' పంచవర్గీయ భిక్షుకుల సమీపమున కరుదెంచిన కొలది, భిక్షుకులు, తమ ప్రతిజ్ఞలపై నిలబడలేక పోయిరి. చిట్టచివరకు ఒకడు బుద్ధదేవుని చెంతకేగి ఆహ్వానించెను. మరియొకడు ఆసనము నమర్చెను. మఱియొకడు పాదోదకమును, పాదప్రక్షాళనము చేయుటకై యొక పీటయుదెచ్చెను. బుద్ధదేవుడు ఆసనము నలంకరించెను. పాదములను కడిగికొనెను. అపుడు వారు, బుద్ధుని ఆయుష్మంతా ! అని సంబోధించిరి. ఇట్లు చేయగా, భగవానుడు, "భిక్షువులారా ! తథాగతుని పేర్కొని, ఆయుష్మంతా ! యని పిలువకుడు. తథాగతుడు అర్హంతుడు; సమ్యక్ సంబుద్ధుడు. మీరు నేజెప్పు పల్కుల నాలకించుడు; నే నార్జించిన అమృత సందేశముల మీకు అందించెదను. నా ఆజ్ఞానుసారముగా, ఆచరించిన, ఏ నిరుప మానమైన బ్రహ్మచర్య ఫలమునకై, కులపుత్రులు ఇండ్లు వాకిండ్లు వదలి, సన్యసించుచున్నారో అట్టి అనుపమానమైన బ్రహ్మచర్య ఫలమును, అతిశీఘ్రముగా ఈ జన్మయందే పొంది, విహరించగలరు సుమా !" అని పల్కెను.

బుద్ధుడిట్లుచెప్పగా, పంచవర్గీయ భిక్షుకులు, ఆయుష్మంతుడా ! గౌతమా ! అనాడు నీవు సాధన సంపత్తినంది, ఘోరమైన తపమాచరించియు ఆర్యుల జ్ఞాన దర్శనముయొక్క పరాకాష్ఠను ఉత్తర మనుష్య ధర్మమును పొందజాలక పోతివి. నేడు సాధన భ్రష్టుడవై, సంగ్రహాపేక్షివై ఎట్లు పొంద గలవు?"

అపుడు పంచవర్గీయభిక్షువులతో, బుద్ధదేవుడు, భిక్షువులారా ! తథాగతుడు సంగ్రహాపేక్షి కాడు, సాధనాభ్రష్టుడు కాడు. అర్హంతుడు, సమ్యక్ సంబుద్ధుడు" అని పల్కెను.

ఇట్లు ముమ్మారు తన్ను ఆక్షేపించిన వారికి, ముమ్మారును సమాధాన మొసంగి, తిరిగి భగవాను డిట్లు ప్రశ్నించెను. "ఇంతకు పూర్వము నేను ఎన్నడైన యిట్లు మాటాడి యుంటినా?"

వారు "భంతే ! లేదు" అని సమాధాన మిచ్చిరి. అపుడు భగవానుడు పంచవర్గీయ భిక్షువులకు సరియైన సమాధాన మిచ్చి, వారిని ధర్మశ్రవణ కుతూహలాయత్త చిత్తులజేసెను.

## ధర్మచక్ర ప్రవర్తన సూత్రము :

భిక్షువులారా ! సాధువులీ రెండు అతుల వర్జింపవలెను. అవి ఏవియన 1. మొదటిది హీనములు, గ్రామ్యములు, అయోగ్యములు, అనార్యములు, అనర్థ

యుక్తములగు కామ వాసనలయందు, ఆసక్తుడగుట. 2 రెండవది దుఃఖమయ మును అనార్య సేవితమును, అనర్థయుక్తములగు ఆత్మపీడనములందు సొల్పుచుట. ఈ అతి వర్తనముల రెంటిని తథాగతుడు వీడి, మధ్యమ మార్గమును వెదకి గ్రహించినాడు. అదియే జ్ఞానమును, శాంతిని, అభిజ్ఞను, పరిపూర్ణ జ్ఞానమును, నిర్వాణమును కూడ పొందించునది. ఈ మధ్యమ మార్గమును తథాగతుడు, వెదకి నాడు. అది ఆర్యఅష్టాంగిక మార్గము. అవి సమ్యక్ దృష్టి, సమ్యక్ సంకల్పము, సమ్యక్ వచనము, సమ్యక్ కర్మ, సమ్యక్ జీవికా, సమ్యక్ ప్రయత్నము, సమ్యక్ స్మృతి, సమ్యక్ సమాధి. భిక్షువులారా! ఇది మధ్యమార్గము.

ఓ భిక్షువులారా! దుఃఖము ఆర్యసత్యము, జన్మ, జరా, వ్యాధి, మరణ ములు దుఃఖములు, అప్రియసంయోగము దుఃఖము. ప్రియ వియోగము దుఃఖము. కోరినవస్తువు లభించనిచో దుఃఖముగల్గును. సంక్షేపముగా చెప్పినచో, ఉపాదాన స్కంధములైదును దుఃఖములు. (రూప, వేదన, సంజ్ఞా, సంస్కార, విజ్ఞాన ములు.) భిక్షువులారా! దుఃఖకారణము ఆర్యసత్యము. అదియే తృష్ణయనబడును. కామతృష్ణ, భవతృష్ణ, విభవతృష్ణ మొదలైనవి. దుఃఖనిరోధము కూడ ఆర్యసత్యమే. ఇదియేతృష్ణా విరాగము, తృష్ణాత్యాగము. దుఃఖనిరోధగామినీ ప్రతిపదము నాల్గవ ఆర్యసత్యము. ఇది దుఃఖనిరోధమునకు తోడ్కొని పోవు మార్గము, ఇదియే ఆర్య అష్టాంగిక మార్గము.

భిక్షువులారా! ఈ దుఃఖము ఆర్యసత్యము, అది పరిజ్ఞేయము, పరిజ్ఞాతము. ఇట్టి అశ్రుత పూర్వమగు ధర్మములందు నాకునూతనాలోకము గలిగినది. దుఃఖ సముదయము కూడ ఆర్యసత్యమే. అది త్యాజ్యము: ప్రహీణమైనది. (వదలినది) జ్ఞానము కల్గినది, దుఃఖనిరోధముకూడ ఆర్యసత్యమే. దీనిని సాక్షాత్కారింప చేసి కొనవలయును. ఈ దుఃఖనిరోధ ఆర్యసత్యము నాకు సాక్షాత్కారమైనది. ఇది దుఃఖ నిరోధగామినీ ప్రతిపదమను ఆర్యసత్యము. దీనినికూడ భావనచేసి కోవలయును. దీనినికూడ భావనచేసికొంటిని.

భిక్షువులారా! పైన చెప్పినట్లు మూడు మూడు విధములగు నాల్గు ఆర్య సత్యములను, పంన్రెండు రూపములతో గూడిన యదార్థశుద్ధ జ్ఞానదర్శనము నాకు లభించనంతవరకును, నేను దృఢముగా జ్ఞానముపొందితినని చెప్పజాలకుంటిని. దేవతలు, మారుడు, బ్రహ్మసహితముగా నన్నిలోకములలోను, దేవమనుష్యులతో కూడ సాధుబ్రాహ్మణ సహితముగా, అన్ని ప్రాణులలోని, అనుపమ పరమజ్ఞానమును

నేను సాక్షాత్కరించుకొంటిని. మూడు మూడు విధములైన నాల్గు ఆర్యసత్యముల యొక్క 12 రూపములను యదార్థముగ దర్శించిననాడు, దేవతల సహితముగా నేను ఎరింగితినని, జ్ఞానమును గాంచితినని, నాముక్తి అచలమైనదని, ఇది నాయంతిమ జన్మమని, జననమరణ రాహిత్య స్థానము జెందితినని దృఢముగా జెప్పుచున్నాను.

పంచవర్గీయ బ్రాహ్మణులు భగవానుని ఈ భాషణమునువిని, సంతుష్టాంతరంగులై, యాయన నభినందించిరి. ఈ విచార ప్రసంగ సమయములో 'ఆయుష్మాన్ కౌండిన్యునకు' కారణ స్వభావమంతయు, 'నాశ స్వభావమే' యనెడి విమల ధర్మ చక్షు వుత్పన్నమైనది. అపుడు దేవతలు భూమివైపు తిరిగి శబ్దము చేసిరి. బుద్ధుడు కౌండిన్యునిజూచి, "కౌండిన్యుడెరుంగ గల్గెను — ఎరుంగగల్గెనని" పల్కుటచే 'కౌండిన్యునకు అజ్ఞాత కౌండిన్యుడను పేరుఏర్పడినది. (ఎరుంగ గల్గెను.) అపుడు ధర్మ సాక్షాత్కారమును బొందిన, సంశయ, వివాదరహితుడైన, బుద్ధధర్మ విశారదుడైన 'అజ్ఞాత కౌండిన్యుడు', భంతే! 'భగవానునినుండి నాకు ప్రవ్రజ్య లభించెను. ఉపసంపదలభించెను" అని పల్కెను. భగవాను డిట్లనెను "భిక్షూ! రమ్ము. ధర్మము స్వాఖ్యాతమైనది. ఆత్యంతిక దుఃఖ నివృత్తికై బ్రహ్మచర్య వ్రతమును పాలించుము." ఇదియే కౌండిన్యునకు 'ఉపసంపద' యైనది. భగవానుడు వారికి తర్వాత ధర్మ సంబంధమగు కథల నుపదేశించెను. ఇట్లను శాసించుచుండ ఆయుష్మంతులగు 'వప్ప, భద్దియులకు 'సముదయ ధర్మమంతయు నిరోధ ధర్మమే' అనెడి విమల ధర్మచక్షువు ఉత్పన్నమాయెను. ధర్మ సాక్షాత్కారమును జెంది వారు భగవానునితో నిట్లనిరి. "భంతే! భగవానుని దగ్గర మాకు 'ప్రవ్రజ్య', 'ఉపసంపద' లభ్యమైనవి అనిరి. భగవానుడు వారితో నిట్లనెను. "ఓ భిక్షువులారా! రండు ధర్మము స్వాఖ్యాతమైనది. ఆత్యంతిక దుఃఖనివృత్తికై బ్రహ్మచర్యమును పాలింపుడు". యిదియే వారికి 'ఉపసంపదయైనది."

అప్పటినుండి ముగ్గురు భిక్షువులు దెచ్చిన భిక్షాన్నమువలన ఆర్గురును తృప్తులగుచు కాలము గడుపుచుండిరి. బుద్ధుడు వారికి ధార్మిక కథలద్వారా ఉపదేశించుచుండెను. అపుడు 'ఆయుష్మాన్ మహానామునికి', 'ఆయుష్మాన్ అశ్వజిత్తుకు' కూడ జ్ఞానోదయ మాయెను. అదియే వారికి ఉపసంపద యాయెను. తథాగతుడు పిమ్మట భిక్షువుల నిట్లు సంబోధించెను. "భిక్షువులారా! రూపము అనగా భౌతిక పదార్థము, అనాత్మ. రూపమునకు (పురుషునకు) ఆత్మఉన్నచో, ఆ రూపము పీడాదాయకము కాదు; మరియు రూపములో "నా రూపమిట్లుండును," నా

రూపమిట్లుండదు. అను విషయము గోచరమగును. కావున ఓ భిక్షువులారా! రూపము అనాత్మ, కావుననే రూపము బాధాకరమగును. మరియు ఆ రూపములో 'నారూపమిట్లుండును, నారూపమిట్లుండదు,' అను భేదముండదు.

భిక్షువులారా! వేదన అనాత్మ, సంజ్ఞా, సంస్కారములు సంతియే. విజ్ఞానము కూడ అనాత్మయే. విజ్ఞానమునకు అనగా (అభౌతిక పదార్థమునకు) ఆత్మయున్నచో, విజ్ఞానము బాధాకరము కాదు. మరియు విజ్ఞానములో 'నా విజ్ఞానమిట్లుండును, నా విజ్ఞానమిట్లుండదు' అను భేదములుండవు. అయితే, భిక్షువులారా! రూపము నిత్యమని తలంచుచున్నారా? లేక అనిత్యమనియా?

"భంతే! అనిత్యములు."

"అనిత్యములైనవి, దుఃఖకరములా లేక సుఖప్రదములా!"

"భంతే! దుఃఖప్రదములు."

ఏవి అనిత్యమైతే దుఃఖప్రదమో, వికారమును పొందునో, అట్టిదానినై 'ఇది నాది, ఇది నేనేయైయున్నాను, ఇది నా ఆత్మయైయున్నది' అని తలంచుట తగునా?

"భంతే! తగదు"

అయినచో భిక్షువులారా! వేదన నిత్యమని తలంచుచున్నారా? లేక అనిత్యమని తలంచుచున్నారా? సంజ్ఞ, సంస్కారము, విజ్ఞానములు కూడ అట్టివేనా? కావున భిక్షువులారా! భూతభవిష్యత్ వర్తమాన కాలములకు సంబంధించినట్టి, అంతర్ బహిర్గతములైనట్టి స్థూలము లేక సూక్ష్మము. మంచి లేక చెడ్డ, దూరము లేక సామీప్యమునకు సంబంధించిన రూపములన్నియు నావి కావనియు, నేను కాననియు, నాయాత్మ కాదనియు ఎరుంగవలయును. ఈవిధముగా పరికించి యెరుంగ వలయును.

భిక్షువులారా! ఇట్లాలోచించి విద్వాంసులు, ఆర్యశిష్యులు రూపము, వేదన, మరియు సంజ్ఞలనుండి ఉదాసీనులైరి. సంస్కారమువలన ఉదాసీనత కల్గును. విజ్ఞానమువలన ఉదాసీనత కల్గును. ఉదాసీనుడైనచో విరాగము గల్గును; విరాగము వలన ముక్తుడగును, ముక్తుడైనచో, నేను ముక్తుడనను జ్ఞానముగల్గును: అపుడతడు ఆవాగమనములు నశించునట్టి వనియు, బ్రహ్మచర్యవాసము పూర్తియైనదనియు చేయవలసినదంత చేసితిననియు ఇపుడు చేయనున్న దేమియు లేదనియు ఎరుంగును.

ఇట్లు భగవానుడు చెప్పెను. భగవానుని ఈ భాషణమును విని' పంచవర్గీయ భిక్షువులు అభినందనము లాచరించిరి. ఈ ఉపదేశ మొసంగునపుడు, పంచవర్గీయ

భిక్షువుల చిత్తములు మలినమునుండి విముక్తిచెందినవాయెను. ఆ సమయము వరకు ఆర్గురు మాత్రమే అర్హతులుండిరి.

(మహావగ్గము — వినయ పిటకము హిందీ. పుట. 79—83)

7. అశోక స్తంభము :

ప్రస్తుత మిది చిత్రవస్తు ప్రదర్శన శాలలో నున్నది. దీనిని క్రీ.పూ. 250లో అశోకుడు నిర్మించి యుండెను. ఇది ప్రధాన మందిరము దగ్గరగా ఈ స్తంభము మూడు ముక్కలై సురక్షితముగా నున్నది. సింహాశీర్షయుక్త అశోక స్తంభము దీనికి దగ్గరనే లభించు చున్నది. మునల్మానులు దీనిని ఖండించి యుండవచ్చునని ఊహించు చున్నారు. ఈ స్తంభమును గూర్చి వెనుకనే వర్ణించి యున్నాము. 'హౌనుత్సాంగు' ఇది 70 అడుగుల ఎత్తుండెనని వ్రాసెను. కాని ఇది 50 అ. మాత్రమున్నది. కాన కొంత భాగమువిరిగి యుండవచ్చును. 1904, 1905 లో 'ఓర్టల్' అను విద్వాంసుడు దీనిని పరిశోధించెను. విరిగిపోయిన ముక్క 17 అ. ఎత్తున్నది. క్రింది భాగమున దీని వ్యాసము 2 అ. 6 అం. ఉన్నది. క్రింద 7½ అ. స్తంభ భాగము నేలలో నున్నది. పైనున్న సింహపీఠితో గలసి అంతయు 50 అ. మాత్రమున్నది. మిగతా 20 అ. భాగము విరిగిపోయి ఉండవచ్చును. మౌర్యుల కాలమునాటి ఈ రాతి చెక్కడపు పనిని చూచి 'హౌనుత్సాంగు' విశేషముగా ప్రశంసించెను. అద్దమువలె ప్రకాశించునట్టిది కాంతివంతమైనటువంటిది మంచు వలె నున్నగా నున్నది, బుద్ధుని ఛాయవలె తేజోవిలసితమైనది అని, దీని తలమును 'హౌనుత్సాంగు' వర్ణించియుండెను. బ్రాహ్మి లిపిలో వ్రాయబడిన ఈశాసన భావమును జూచినచో అశోకుడు దూరదృష్టితో బౌద్ధులకు రానున్న తగాదాలను గమనించి హెచ్చరికచేసి యుండెనని స్పష్టపడుచున్నది.

(The monks' warning post — "Thus saith the beloved of the Gods, the church is not to be divided, but whosoever, monk or nun shall break up the church shall be made to don white garments and dwell in a place which is not a residence for the clergy Thus must this edict be announced in the order of the monks and in the order of the nuns." Mr. Sahni) దీని అనువాదము వెనుకనే చేసియున్నాను.

8. అశోక స్తంభము దాటిన తరువాత నంబరు 1, 2, 3 సంఘారామములు, తరువాత మిగతా సంఘారామములు కాన్పించును.

## ధర్మచక్ర జినవిహారము

పై సంఘారామముల భగ్నావశేషములు మనకు కాన్పించును. వీనిని దాటి పైకిపోయిన ధర్మచక్రజిన విహారమును చూతుము. ఇది 1126—1154 మధ్య కాలములో నిర్మించబడినది. 'మహమ్మదు ఘోరీ' సేనాని దీనిని 1194 లో, నాశనముచేసెను. ఈ విహారమును 'కనోజ్ రాణియును, గోవింద చంద్రుని' భార్యయును అయిన 'కుమారదేవి' నిర్మించెను. దీనికొక మూల బావియున్నది. ఈ బావివాడుకలో లేదు. దీనికి మెట్లులేవు. బావిదగ్గర స్నానసమయములో గుడ్డలుంచుటకు రెండు రాతి స్తంభములు కాన్పించుచున్నవి. ఇప్పటనున్న 1, 2, 3 సంఘారామముల నిర్మాణము 'కుషాన్‌రాజుల' కాలమున జరిగినది. వీనికి ప్రక్కనే 4 వసంఘారామముయొక్క ధ్వంసావశేషములు కాన్పించును. ఇచ్చట ఒక శివ విగ్రహముకూడ లభించినది. (Monastery No 2-Shrine with sub terram passage)

9. ప్రాచీన సరస్సు :

పైన చెప్పబడిన సంఘారామముల వెంటనే సారనాథ్ ఉత్తర ప్రాంతమునకు పోగానే ఒక సరస్సును చూచెదము. అది ఉత్తరపు వాడునున్నది. ఈ సుందరమయిన సరస్సు చెంత యోగులుండుటకు అనుకూలముగా నున్నది. 'హూయాన్‌త్సాంగు' ఈ సరస్సును బహువిధముల వర్ణించియుండెను. ఇది నిర్మలమయిన సరస్సని, నీళ్ళు లోతున కలవని, నీరు నిర్మలమైనది, తియ్యనిది అని ఈ నీరు హెచ్చదని, తగ్గదని బుద్ధుడు తన పూర్వజన్మలో ఇచ్చట స్నానమాడి, భిక్షాపాత్రను కడుగుకొని గుడ్డలను ఉతుకుకొని యుండెడివాడని పై లేఖకుడు వ్రాసెను.

10. దమ్మెక స్తూపము (ధర్మేక్షస్తూపము) :

ఇది భూమిపైనుండి 104 అ. ఎత్తున్నది. భూమిక్రిందనుండి 143 అ. ఎత్తున్నది. దీని వ్యాసము 93 అ. పైనంతయూ ఇటుకరాయితో కట్టబడినది. జగత్‌సింగు కొన్ని రాళ్లను దీనినుంచికూడ తీసుకొనెను. దీనిని వేరు వేరు కాలములలో పెంచబడినది. ఇది ఒక్కటే ఈనాటికి కూడ నిల్చియున్నది. ఏమైనా వస్తు సంచయములు లభించునేమోయని ఒక బావిని త్రవ్వి చూచిరి. కాని ఏమియు కనుపించలేదు. ఈ ధర్మముఖ స్తూపము బుద్ధ మైత్రేయుని గౌరవార్థము గుప్తరాజుల కాలములో నిర్మించ బడినది. ఇది క్రీ. శ. 2, 3 శతాబ్దములలో, తిరిగి 7 వ శతాబ్దములోను వృద్ధిచేయబడినది. ఇప్పుడు నిల్చినది 7 వ శతాబ్దము

నాటిదని విద్వాంసు లూహించుచున్నారు. ఈ స్తూపము అన్ని దండయాత్రలను కల్హార చూచినది. 'హుమాయూను, అక్బరు ఈ స్తూపమును చూచియే యుందురు. దీనికి దగ్గరగా లభించినవస్తు జాలమును బట్టి ఇచ్చట ఒక ధర్మ వైద్యశాల ఉన్నట్లు ఊహలు గల్గుచున్నవి. యాత్రికులు దీనిని పూజింతురు ఇది 5 వ నంబరు సంఘారామమునకు ప్రక్కగా నున్నది.

క్రీ. శ. 1885 లో 'జనరల్ కన్నింగ్‌హామ్' అను పరిశోధకుడు ఈ స్తూపములోగుండ పైనుండి ఒక బావిని త్రవ్వించెను. క్రీ. శ. 7 వ శతాబ్దమునాటి శిలాలేఖనము ఇందులో బయల్పడినది. ఇది నేడు 'కలకత్తా భారతీయ సంగ్రహాలయము' లోనున్నది. దీనిభావమిది. "హేతువునుండి ఉత్పన్నమగు వారికెట్టి ధర్మము కలదో, వానికి కారణము తథాగతుడు బోధించియున్నాడు. వానికి ఏ నిరోధముగలదో వారికి కూడ చెప్పియున్నాడు. ఇది మహాశ్రమణుని వాదమై యున్నది."

బావి త్రవ్వినపుడు అన్నిటికంటె క్రింద అశోక మహారాజు కాలమునాటి ఇటుక రాళ్లు కాన్పించినవి, దీనవల్ల ఇది అనేక సంస్కారములు కల్గినతరువాత నిర్మించబడినట్లు తెలిసికోవచ్చును. ఇది ప్రాచీనకాలమునుండి ఆకర్షణీయముగా నున్నది. నేటికి నిది సారనాధునకు శోభను గూర్చుచున్నది.

11. మూలగంధకుటీ విహారము (Chief fane మూలగంధకుటి) :

'ధమ్మేఖ స్థూపమును' దాటి తూర్పుగా పోయినచో అచట 'మూలగంధకుటి' కాన్పించును. అంగరీక ధర్మపాలుడు "మేరీ ఎలిజబత్తు ఫాస్టరు" సహాయమున 1931 లో దీనిని నిర్మించెను. ఇందు గౌతమ బుద్ధుని బంగారు విగ్రహము గలదు. గచ్చుగోడలపైన అనేకరకములయిన బొమ్మలు గీయబడినవి. బుద్ధుని ఎముకల పాత్రకూడ వున్నది. ఈ విహారమునకయిన ఖర్చు ఒక లక్ష ఏబదివేల రూపాయలు. ఒక్కొక్క చిత్తరువు 3000 చొప్పున 23 చిత్తరువుల ఖరీదు 69000 రూ. లయినది. బుద్ధుని ఎముకలుగల యీ పాత్రను యిండియా ప్రభుత్వమువారొసగిరి. ఇద్దరు జపానీయ చిత్రకారులు ఈ చిత్తరువులను గీచిరి. 'ఫాస్టరు' ఈ ఆలయము నకు చాల ద్రవ్య మొసంగెను. ఇచట దొరికిన ఫలకముపైన 'మూలగంధకుటి' అని వుండుటచేత దీనికీ పేరొసంగెను. బుద్ధుడుండుటకు కట్టిన యింటిని 'గంధకుటి' యందురు. బుద్ధుడు మొదటి వర్షాకాలమును యిచ్చటనే గడిపెను. 'సుఖమాన' యను భిక్షుణి చేసిన ధర్మము యిచ్చట దొరికిన యొక ఫలకముపైన వ్రాయబడినది.

1. గోడలపైన చిత్రములు :

దక్షిణపు గోడ తుషితస్వర్గములో నుండి గౌతముడు దేవతలతో సెలవు చెప్పుచున్నాడు "నేను ప్రపంచమునకు సహాయము చేయబోవుచున్నాను."

2. మహామాయ స్వప్నము :

మాయాదేవి నిద్రపోవుచుండగా తెల్లని ఏనుగు రూపములో అగుపడుచున, బుద్ధుడు ప్రవేశించుట.

3. లుంబిని వనములో బిడ్డను కనుట :

శుభశకునము, అద్భుతములు, బిడ్డపుట్టినపుడు కాన్పించుట.

4. బిడ్డపుట్టినపుడు ధర్మము చేయుట :

5. అశిత అను హిమాలయ యోగి వచ్చుట :

32 శుభ లక్షణములు గాంచి, ఈయన బుద్ధుడగును: కాని నేను చూడలేను అని పలికి వెళ్ళిపోవుట.

6. బీజావాపనోత్సవము :

ప్రతి ఏడు శాక్యులు దీనిని జరుపుచుందురు. సిద్ధార్థుని తీసికొనిపోయిరి. జంబూ వృక్షము క్రింద ఆయన ధ్యాన నిమగ్నుడగుట. ధ్యానము ఆరంభము.

7. వీడ్కోలు :

బుద్ధుని నిశ్చయము: "నేను నిశ్చయించుకొంటిని, సత్యము నెరయువరకు వెనుకకురాను." అని తలంచి యశోధర చెంతకేగి బిడ్డ శరీరము మీద చేయివేసి కొన్న ఆమెను చూచి కొంచెము నెమ్మది వ్యథ చిత్తముతో సత్యాన్వేషణ కొరకు బయలుదేరుట.

## పడమటిగోడ

8. బుద్ధుడు వెళ్ళిపోవుట. బంగారు చెరసాలయైన రాజభవనము వీడి 'కాంతక' అను గుర్రముపై నెక్కి 'చెన్నుని' సహాయమున అర్ధరాత్రి వేళ బయలుదేరి వెళ్ళుట. సన్యాస మారంభము.
9. సత్యాన్వేషణము, బ్రాహ్మణ ఋషుల వెంటనేగుట. 'ఆలార కాలామ పండితునితో' మాటాడుట.
10. యతి పంచకమును శిష్యులుగా చేసికొనుట.
11. సుజాత పాయసాన్నము గొనంగుట.
12. మారుని జయించుట. బుద్ధత్వప్రాప్తి.
13. సారనాథులో బుద్ధుడు యతి పంచకమును కలిసికొని ధర్మచక్ర ప్రవర్తనమును చెప్పుట.

14. బింబిసారునికి బుద్ధుడుపదేశించుట.
15. కోసలలోని అనాథ పిండకుడు; జేతవనవిహారమును నిర్మాణము చేయుటకు అనాథ పిండకుని యొక్క దానము.

## తూర్పు గోడ

16. బుద్ధుడు రోగియైన ఒక భిక్షువుచెంతచేరి ఆతని కుపచారములుచేయుట, రోగికి నయముచేయుట (Who so ever serves the sick and the suffering, serves me.")
17. నీటికొరకు యుద్ధముచేయ బోవుచున్న శాక్యకోలీయులకు బుద్ధుడు ఉపదేశ మొసంగి రాజీచేయుట (Buddha said, "Your blood costs more than the water")
18. 7 సం. ల తరువాత భిక్షుసంఘముతోకలసి బుద్ధుడు కపిలవస్తుకేగుట. తండ్రి శుద్ధోధనుడు, కుమారుడు రాహులుడు ఆయనకు స్వాగత మొసంగుట.
19. స్వర్గలోకములో నున్న తల్లికి బోధించి తిరిగి బుద్ధుడు భూమిపైకి దిగుట.
20. 'అంగులిమాల' అను దొంగమనసు మార్చుట.
21. దేవదత్తుడు, అజాత శత్రుడు కలసి బుద్ధునికి విరుద్ధముగా కుట్రచేయుట, కాని చివరికి లొంగిపోయిరి.
22. ఆనందుడు, మాతంగకన్య — మాతంగకన్య ఆనందునికి నీళ్లొసంగుట.
23. 'కుశీనగరము'లో బుద్ధదేవుని మహాపరి నిర్వాణము: రెండు రకములుగా మనుష్యులు కనబడుట. ఆరంభకులు తలలువంచి దుఃఖించుట, దుఃఖ నివారణ ఎరిగినవారు తలలెత్తి ఉండుట.

ఈ చిత్రముల నన్నిటినిచూచి, మందిరమునకు బయటనున్న జపానీయ గంటను చూడవలెను. తరువాత తూర్పు దిక్కుగాపోయి బోధివృక్ష శాఖను చూడవలెను. క్రీ. పూ. 288 లో ఈ శాఖను అశోకుని కూతురైన సంఘమిత్ర సింహళమునకు తీసికొనిపోయి అనూరాధ పురములో నాటించెను. తిరిగి 1931 నవంబరు12 న ఈ చెట్టులోని ఒక శాఖను తీసికొనివచ్చి యిక్కడ నాటిరి. అది ఈనాడుచెట్టుగా వృద్ధి నొందుచున్నది. ఈ చరిత్రకారు డొక్కింత తడవు ఈ చెట్టుక్రిందకూర్చుండెను.

## అన్యదర్శనీయ స్థలములు

1. బర్మీయుల బౌద్ధ విహారము :

అశోక స్తంభమునకు పడమరగా పోయిన బర్మీయుల బౌద్ధ విహారము కలదు. దీనికి ఆర్య సంఘారామమని పేరు. 'భిక్షుమహావీరుడు' దీనిని స్థాపించెను. ఇచట సుందర మందిరము, పుస్తకాలయము, యాత్రికు లాగుటకు ధర్మశాల కలవు.

2. ఉత్తరీ విహారము, స్తూపము :

ఆర్య సంఘారామమునుండి తిరిగి అశోక స్తంభము ప్రక్కగా పోయిన స్తూపములు, విహారముల నష్టావశేషములు లభించును. వాయువ్య మూలలో అనేక స్తూపములు బయల్పడినవి. ఈ నష్టావశేషములలోని అనేక విగ్రహముల చిత్రవస్తు ప్రదర్శన శాలలో నుంచిరి. మార్గములో విగ్రహములు స్తూపావశేషములు కాన్పించును. దీనికి దగ్గరగా "ధర్మచక్రజిన విహారము" కలదు.

3. చంక్రమణ భూమి :

ప్రధాన మందిరము దగ్గరగా చిన్న చిన్న స్తూపములు, ధ్వంసావశేషములు, ఒక సింహాసనము కలదు. దీనిపైన భైరవీ విగ్రహము' కలదు. దీనికి దగ్గరగా నం. 5 సంఘారామము కలదు. ఇదొక ఔషధాలయమై యుండవచ్చునని పరిశోధకుల అభిప్రాయము. ఇది క్రీ. శ. 9 వ శతాబ్దములో నిర్మాణమైనది. దీనికి దగ్గరగా దక్షిణపు వైపున నవీన భవనములు, జైన మందిరాదులు గలవు. 11 వ తీర్థంకరుడు అంశనాథుని విగ్రహము కలదు. 1875లో ఈ ఆలయమును నిర్మించిరి.

4. చైనీయ మందిరము :

'మూలగంధకుటీ విహారము' నుండి తూర్పుగా పోయిన 'చైనీయ మందిరము' కాన్పించును. మహాబోధి కాలేజి, ఔషధాలయము, శివమందిరాదులను జూచి వెనుకకు పోవచ్చును. శివాలయము అరమైలు దూరములోనున్నది. వార్షికముగా నిచట ఉత్సవములు జరుగుచుండును. తిరిగి వచ్చునపుడు "శిల్ప విద్యాశాలను" జూడవచ్చును. 1936 లో తంత్రి పేరుతో నిది నిర్మాణమైనది. ఈ విద్యాశాలకు పడమర, సారనాథ్ పోస్టు ఆఫీసు కలదు. దగ్గరనే మహాబోధి కార్యాలయము, పుస్తకాలయము, విక్రయశాల, ధర్మదూత కార్యాలయము కలవు. ఇంకను పడమట జైన ధర్మశాల కలదు. తరువాత చిత్రవస్తు ప్రదర్శనశాల చూడవచ్చును ఇచట దొరకిన అనేక వస్తు సంచయములు ఈ శాలలో గలవు. మహాబోధివారి పుణ్య పాఠశాలకూడ మార్గములో జూడవచ్చును.

5. బర్మీయ ధర్మశాల :

మ్యూజియము దాటి పడమరగా పోయినచో 'బర్మీయ ధర్మశాల' కాన్పించును. ఇది రెండు అంతస్థుల మేడ. దీనిలో ననేక గదులు గలవు. బుద్ధుని బొమ్మలు కూడ కలవు.

కాశీనగరము ఇరుకైన సందు గొందులలో కొన్నిచోట్ల అసహ్యముగా ఉండును. అచట బండ్లు కూడ పోజాలవు. జన సమ్మర్దము హెచ్చు. 1921 జనాభా లెక్కల ప్రకారము ఇందు 198, 447 మంది కలరు. కాశీజిల్లా 1008 చదరపు మైళ్ళ వైశాల్యము గలది. ఇచట బార్లి, వరి, గోధుమ పండును. 1803 లో 582000 జనాభా ఉన్నదని, హేబర్ వ్రాసెను. 5 లేక 6 అంతస్థులుగల మేడలు గలవని, గ్రుడ్డి, కుష్టువారు అసంఖ్యాకములని, పై లేఖకుడు వ్రాసెను. ఈ నగరములో గోవులు స్వేచ్ఛగా దిరుగుచుండును. నిరుపేదలు చిన్న ఆలయముల నిర్మించుకొని, వానిమీద జీవించుచుందురు.

చారిత్రక కాశీ క్షేత్రము సంపూర్ణము

ఈ సంపుటము నావిష్కరించిన సందర్భమున

## డా॥ కొడాలి వీరయ్య చౌదరి యం. బి. బి. యస్, గారి ప్రశంస

సీ॥ ఘనతరమౌ కీర్తిగాంచెను పేర్నీడు బాహుజుల సభల బహుళముగను
రామభూపతియు ధరాతలమున గాంచె నూతక్కిలోన సన్నుతులమున్న
దేవరకోటలో ధీశక్తిమెరయ కొడాలి వార్వెలసిరి దంబుమీగ
వాసిరెడ్డీంద్రుల వరకొల్వులందు యశముగాంచిరి కొడాలి సంతువారు
వీరెళ్లకనుమలో ఘోరాహవంబున బాలుగొనిరి యీ కొడాలివారు

గీ॥ వారివంగడ మందున వరలినావు రాజవైద్యుడవై సీవు పూజలంది
నావు ఖండ ఖండాంతర నాడులందు, తెన్నలి యగ్రహారముకు ముత్తెంబువయితి
అఖిలవిద్యావిశారద ! అభివొందు.

సీ॥ అధ్యక్షుడవయి సీవలరితి ప్రమోంపట్టు హైస్కూలు దోనార్పు అభినుతించ
కాలేజికమిటిలో గడుదక్షత నెరవేర్చెదు పైను ప్రెసిడెంటు పదవిపొంది
రోటరీ క్లబ్బుకు రుచ్యంబుగామీరు అధ్యక్షులైనాడు యలరినారు
రాజవైద్య సమితి రహిమెరయగ మీరు సభ్యులై హితవులొసంగినారు
ఇమ్ముగా బొందిరి యింగ్లాండునందున శస్త్రగురువుల ప్రశంసలెన్నొ

ఆంధ్రయూనివర్సిటియందు యతులితమగు సెనెటు సభ్యత్వమునుబొంది దినదినంబు
కాలెజీసేవయందున గడపుచుంటి సేవబీజము లేర్పడె చిన్ననాడె
కీరితిని సదావాంఛింతు వీరయార్య ! బహుళ వర్షముల్ సేవలొసగున్నదవగు.

# శ్రీయుత యడ్లపాటి వేంకట్రావు యం. యల్. ఎ. గారి ప్రశంస

తే॥గీ॥ సకలసౌభాగ్యరాశికి జన్మభూమి బోడపాడట వసియించె బోడలుమున్ను
జైనమత ప్రబోధకుడునై సొలగ్గొని అతనితర్వాత బోడపాడయ్యె ఘనిక.

తే॥గీ॥ సప్తసంతానములయందుఁ జాలప్రీతి గలదు చేపిల్ల కెలను సత్కాలమందు
గట్టిశైవాలయంబు నాగ్రామమందు సమరలింగస్వామి ప్రతిష్ట యొనరనర్చె
నెడ్లపాటి వేంకట్రాయుఁడేలునాడు.

ఉ॥ పుట్టితివీవు బోడపురి, పోఁడిమి యొప్పఁగ నాంగ్లవిద్యనున్
గట్టిగనేర్చి గుంటపురి కాలెజియందున డిగ్రిపొందియున్
చట్టమునేర్వ చెన్నపురి సాగితి, తెచ్చితి డిగ్రియచ్చటన్
మెట్టితి తెన్నలిన్ ప్రతిభమీఱ వకీలువరుండవై భళీ ।

గీ॥ మేధయును గర్వమును నేడు శోధనంబు సల్పితివి శూన్యముగుట గోచరమునాయె,
ప్రజలసేవకుఁ గడఁగితి ప్రజ్ఞమూర్తి । శాస్త్రహేతువాదంబులన్ సంభరించు
ఆంధ్ర శాసన సభ సభ్యుఁడగుట కతన.

సీ॥ పట్టినపట్టును బరికించి భల్లూకము వెనుకాడును సిగ్గు మునియఁబడఁగ
నీపట్టుకోలును నేలతేడగు 'బ్రూసు' గాంచి నంతనెలక్ష్య గ్రమ్ముకొనును
నీదుపట్టుదలను నీలకంఠుడుచూచి కైలాసగిరినుండి కదలఁ [illegible]
నీదుపట్టును 'శాస్త్రి' నిందారఁగాంచిన చక్రోడమును మఱచిచనఁ [illegible]

గీ॥ కర్తమారంభ మొనరించి వర్తనంబు చేయఁడుత్తముఁడని 'హరి' చెప్పెమున్ను,
అట్టిసూక్తియే మనమందు హత్తికొనెను యడ్లపాటి కులమణీ భాగ్యమునిదె.

ఉ॥ బంగళదేశ ధీమణియు భారతదేశపు మౌఢ్యముల్ గనెన్
సంగతెఱింగియే పలికె శాస్త్రపుసంస్కృతి ముఖ్యమౌనిటన్
చంగలమంది నారలయ ఛాందస పండిత కోటియున్ కటా
భంగముచేయ బూనిరట, భాగ్యముగల్గను హూణభాషకున్
సంగరమాయెనిద్దరకు సంస్కృతభాషకు గల్గెనోటమిన్
యంగదతోడ నేతలును ఆంగ్లము వీడుదురేమి పాపమో ।

## గుంటూరుజిల్లా గ్రంథాలయ సంస్థ అధ్యక్షులు

# శ్రీయుత కొత్తపల్లి ఉమామహేశ్వరరావుగారి ప్రశంస

సీ॥ ఏరైతు నేతయే యింబు మీరగ హాలికుల కొనరించె నిచ్చలును మేలు
ఏయిజారాదారు సాయంబొనర్చెను కర్షకులకెపుడు కల్పతరువు
ఏప్రభువుశ్వేత ఎకిమీడుల ప్రశంస ఘనముగా బొందెను కర్జములను
ఏసామి కోట్లాది యిటుకల గాల్పించితోతె మత్స్యపురికాలోలముగను

గీ॥ అట్టినరపతి క్రొత్తపల్యప్పనయును కాంచె కీరితి జగ్గన్న కాలమందు
పోటుమగడు కాంద్రేగుల కోటయందు మెప్పుబొందె, నట్టికులమిుమీఁదిఆర్య ।

సీ॥ తీర్చిదిద్దితినాడు తెన్నాలి సమితిని యధ్యక్ష పీఠిని యలరుచుండి
తనరితి ఏండ్లు గర్తపుర గ్రంథనిలయ సంస్థకు బెద్దవై సన్నుతముగ
నేలితి రాపూరు నిమ్మగా సర్పంచి పదవిని బొందియుఁ బ్రబలదీక్ష
తెచ్చితి హైస్కూలు మెచ్చఁగ పౌరులు ప్రజల సర్కారున బల్కుబడిని

గీ॥ పల్కుదెపుడు నసాధ్యమా పనియునాదు డిక్షనరీయందు లేదంచు, డీలుపడక
ఫ్రాన్సు ప్రభువు నెపోలియన్ భంగిగాను పట్టమెవరు కట్టిరొ? నీకు ప్రాజ్ఞవర్య!

గీ॥ గుళ్లపెక్కంటి ముహమదు కూల్చివైచె, జీర్ణదేవళముల బాగుచేసినారు
దైవభక్తిగల్గిన నరుల్ ధాత్రిమున్న వారి పక్కని ముందంజవైచినావు.

గీ॥ జీర్ణగ్రంథాలయోద్ధార ! జిల్లయందు, గ్రంథనిలయముల్ మూయుటగాంచలేక
తెరచితిరి మీరు పెక్కంటి, మరవబోము మీదుసేవల నేప్రొద్దు, మిత్రవర్య ।

గీ॥ కోటిసూర్యుల దీప్తికి దీటునైన మహితదివ్యాత్మ హృదయంపు మధ్యనుండి
పూర్ణమైనయాయువు, సిరుల్ పొనగనొసగు ప్రజలసేవను జేయంగరాత్రిఁబవలు.

మోపఱ్ఱులోని శ్రీనాథ గ్రంథాలయమును గుంటూరుజిల్లా గ్రంథాలయ
సంస్థకు అప్పగించు సందర్భమున దాతయగు

# శ్రీ క్రొత్తపల్లి వీరరాఘవయ్యగారి ప్రశంస

సీ॥ కట్టించితివి నీవు కడు మాతృభక్తితో బహువైద్యశాల మోపఱ్ఱునందు
నిర్మించితివి నీవు నిర్మలమతిని స్వరాజ్యభవనమును రంజకముగ
వితరణ శీలివై విత్తంబునిచ్చుచు కరుణార్ద్రమతి వీదనములకెలమి
నొసగితి ధనము సరసకరుణించిన యాత్రిజనాళికి యనవరతము
సాయంబొనర్చితి సాధుజనాళికి దివ్యయాత్రలలోన పెనుపమీర

గీ॥ వివిధకార్యములందు పవిత్రుడవైతి, వైభవోపేతుడవగుచు వాసిగాంచి
వెలసితివి నీవు పృథ్విని, వీరరాఘవయ్య । ఆశీస్సులందుకోవయ్య ఆంధ్ర
భూతలము సందునను మీదు, పూజ్యనీయ ।

చం॥ చదివితి, సద్వివేకమును సాధనజేసితి బాల్యమందునే
కదలితివీవు దప్పులకు, కల్కటయందున విద్యపూర్తిచే
సి దమముమీర తిర్గితివి, సీమలయందున కీర్తిఁబొంది స
మ్మదమున బుద్ధదేవువలె పూజలనందితి వీరరాఘవా ।

గీ॥ సకలసద్గుణ నిధురాంబ జగతియందు నీదు యర్ధాంగియగుట పుణ్యంబుసుమ్మ
కాసు, ధాన్యంబు, పాడియుగలవుమెండు వంశమది నిల్పు భాగ్యంబు సంశయంబు
నాయె, పరమాత్మకరుణ ఏమాయెనొకొ.

గీ॥ కలిమియదియెంతొ నిండారగలదుమీకు దానలగను భాగ్యము నోచుకొనకపోతి
సంగదాయె నిపుడు జగదాంబవెంతొ నీదు హాతిస్పృహాతికి నిజముసువ్వె.

గీ॥ గ్రంథనిలయంబు గాఢాదరయముతోడ ముందడుగువేసితిరి మీరు పుణ్యమూర్తి
అనమునిల్చును చంద్రుడున్నంత దనుక హృదయ మధ్యాంతరంబున దొడలుచున్న
పురుషుడొసగ ప్రార్థింతుము, పూజ్యనీయ । ప్రజల నిర్ధాయు రారోగ్య
భాగ్యములును.

## గౌ॥ మంత్రి వర్యులు కాకాని వేంకటరత్నముగారి ప్రశంస

(ఉయ్యూరు సభ)

సీ॥ దుండగీడులబాధ దుప్పరమగువేళఁ దిరిగితి పిస్తోలు కరముదాల్చి
ముండలవోడ్డును మానుగానేలితి పంజాబుహరి ఏలుఫక్కిగాను
నిర్భీతిఁదిరిగితి నిశివేళలందున ప్రజల భద్రతను గాపాడుకొరకు
నిశ దొరసానియే నేస్తంబుగాగను విహరించితివినీవు వీడువీడు

గీ॥ గండడవు ఎల్లతరి, వింతగాథ నీది, ధైర్యమిహికాద్రి బోలిన దణివి నీవు
చిన్నగాను వచ్చితి వీవు చెల్లుబడికి ప్రజలరాజ్యమేలఁగ నేరుపరివిగమ్మ

సీ॥ ముఖ్యమంత్రికితోడు ముందటనిల్చుంటి ప్రళయకాలరుద్రుని భంగిగాను
తెలుగునాడును దీర్చిదిద్దితి రాష్ట్రి కాంగ్రెసుపాలనంబును గేలబట్టి
కైదువులేకయే కైకొంటిశాసన సభ్యత్వమెలమిని సమ్మదమున
సైరికుని శిరశాఖలగై కొంటి పాడిపంటల వృద్ధిబరగుటకును.

గీ॥ జన్మబంధముల్ మనకేమొ చాలగలవు నామపూర్వులది కొడాలి నయముమీర
మీదు పూర్వులు కాకాని మెలఁగినారు తెలిసికొనుమయ్య మీరిదిధీరవర్య!

ఉ॥ గద్దెలనెక్కియున్ నరులుగానరు లోకమునంధులౌదురే
ముద్దుగపాలనంబలర ముందటచేసి రశోకహర్షులున్
ఒద్దికమీరగన్ చరిత యొప్పిద మొప్పఁగ దల్చువారలన్
సద్దులేక యేలుమిల సజ్జనులౌ ప్రభులన్ తలంచియున్.

సీ॥ విడిపించితిరి మీరు వీరభారతభూమి శ్వేతముఖుల నౌడువెసనుదోలి
సత్యాగ్రహివగుచు సాధ్వసమువదలి గండారునెన్నాళ్లొ గడపినావు
ప్రజలసేవను మీరు ప్రాజ్యంబని తలంచి సంసార బాధల సరకుగొనవు
మొదటి సొమ్ము నిరోగము అనిపల్కిరి బుధుల్ దానినెన్నండును దలచబోవు
కారువచ్చిన, యుపకర్తృంబు గలదు మీకు, పేరుగడించితి లోకసేవ
తత్పరత, మను వర్షశతంబుమీర నాయురారోగ్య భాగ్యంబులలరునట్లు

గీ॥ ధనము, రాజ్యయోగముకంటె మనుజసేవ ధరనుహెచ్చని పల్కెతథాగతుండు
చేతలందును జూపుమీనేతవర్య! మనుజసేవ సతతము నిమగ్నుడవగు.

## ఇతిహాస పరిశోధకమూలకు రాజపోషకులు

వీరి ఔదార్యములకు మా పరిశోధన సంపుటములు పదిపరునగా నివ్వబడుటయే కాక, వీరి చరిత్రలు వెలుగులోనికి తేబడును.

### 1. శ్రీ ముంత్లపూడి తిమ్మరాజుగారు

జన్మస్థలము తణుకు. జనన తేది ది 10—10—1901 విద్య – తణుకు జాతీయ పాఠశాలలో 5 వ ఫారమువరకు ఆంగ్ల విద్యాభ్యాసము. 1921 సత్యాగ్రహ సమయములో పాఠశాల వదలుట.

రాజకీయము – తణుకు పంచాయితీ ప్రెసిడెంటు, తణుకు తాలూకా బోర్డు ప్రెసిడెంటు, పశ్చిమ గోదావరిజిల్లాబోర్డు సభ్యులు.

సాహిత్యగోష్ఠి – విశేష ధన సంచయములు గల జమీందారైనను, సాహిత్య ప్రియుడు. 'రాబర్టు సదె'వలె వీరు బహుళ గ్రంథ పరిశోధనచేసికొనుచు, తన గ్రంథముల మధ్య (Among my books) నిరంతరము కూర్చుండియుండెదరు. తాను స్వయముగా చరిత్ర కారుల యొద్దకేగి కావలసిన బోగట్టాను సేకరించు కొనివచ్చెదరు. విగర్వచూడామణి. విద్యావినయ సంపత్తిగలవ్యక్తి. అకాలమృత్యు వాతపడిన ఆయన కుమారుడు శ్రీనరేంద్ర నాథునిపేర ఒక సాహిత్యమండలి స్థాపించి, అనేక గ్రంథముల ముద్రించెను. అనేక కబ్బముల కృతిపొందెను. విస్మృత గ్రంథము లనేకములు ముద్రించి ఆంధ్రుల కెనలేని సేవచేసెను. అందు ముఖ్యములు. 1. జాయపసేనాని నృత్తరత్నావళి 2. ఏకాంబ్రనాదుని 'ప్రతాపరుద్ర చరిత్ర' 3. జగ్గకవి సోమదేవ రాజీయము 4. బద్దెనకవి నీతి శాస్త్ర ముక్తావళి 5. క్షేమేంద్రుని 'ఔచిత్యవిచారచర్చ' మొదలగునవి.

### చేబ్రోలు హనుమయ్యగారు

జన్మస్థలము గుంటూరు. జననము ది 20—4—1924 విద్య గుంటూరు ఉన్నత పాఠశాలలో 6 వ ఫారములోపు చదువుకొని మానుకొనినారు.

రాజకీయము – 1941 లో గాంధిగారి క్విట్ ఇండియా ఉద్యమము ఆరంభ మైనది. వీరు ప్రజాసేవ చేయసంకల్పించి రాజకీయములో ప్రవేశించిరి. పట్టణ కాంగ్రెసు సభ్యులు, అధ్యక్షులు. పిమ్మట పురపాలక సంఘసభ్యులు అధ్యక్షులైరి. అగర్వ శ్రీమంతులైన హనుమయ్యగారికీ ఆపదవి సులభమే Macaulay – Where wealth is, there power must in evitably be') కొన్ని

వర్షముల కాలము ఛేంబర్ ఆఫ్ కామర్సుకు అధ్యక్షులు. సత్కార్యములు : గర్త పురములోని ప్రముఖ పొగాకు వ్యాపారస్థులలో నొకరు. ఉదార బుద్ధిగల ఈ పొగాకు వ్యాపారుల వలన దాదాపు మూడు లక్షల మంది నిరుపేదలు జీవించుచున్నారు. తిక్కనాది మదాంధ్ర దిగ్గజేంద్ర విహారసారభూతలమైన గుంటూరు పట్టణముకు శ్రీ హనుమయ్యగారు మంచినీటి వసతి నేర్పాటుచేసిరి. గుజ్జనగుళ్ల ప్రాంతముకు లారీలమీద మంచినీటిని దెప్పించుచుండిరి. కాని ఆనీరు చాలుటలేదు. మంచినీటిటాంకు నేర్పాటుచేసి, నీటికొరతను నివారించిరి. ఇచట రాత్రిపూట అంధకార బంధురంబై భయోత్పాతము గల్గించెడిది. కరెంటు వేయించి వెల్తురు గల్గించుటచేత అమవస నిశిలోగూడ జనులు నిర్భయముగా సంచరించెదరు. మారుమూలలకు సిటీబస్సులు వేయించి రాకపోకల సౌకర్యము గల్గించిరి. అనేక ధర్మసంస్థలకు విరాళము లొసంగిరి. డిపాజిట్లకు ధనములేని రాజకీయ వేత్తలకు డిపాజిట్లు చెల్లించిరి. తన సర్వస్వమును తను మన ధనంబుల జనులకు వినియోగించుచున్నట్టి, అజాతశత్రుని బోలిన హనుమయ్య గారికి 1972 సం. ఎన్నికలలో నపజయముగల్గినది. కారణమేమిటో గుంటూరు ప్రజలకే తెలియును.

## 3. శ్రీ గోగినేని కనకయ్యగారు

జననము తాడికొండ. జననతేది ది 4-1-1917 విద్య-తాడికొండ ప్రాథమిక పాఠశాలలో 5 వ తరగతి వరకు చదువు. తర్వాత 'అమృతలూరు'లో భాషా ప్రవీణకు జదివినారు డిగ్రీ — బి. విద్వాన్ II Clas (మద్రాసు విశ్వ విద్యాలయము) రాజకీయము :— ప్రజాహిత కార్యములు గ్రామ పంచాయితీ సర్పంచి 5 సంవత్సరములు, తాడికొండ సమితి అధ్యక్షులు 7 సంవత్సరములు, రూరల్ కో-అపరేటివ్ బ్యాంకి అధ్యక్షులు 3 సంవత్సరములు, తాడికొండ యస్. వి. వి. ఉన్నత పాఠశాలకు 26 సంవత్సరములు సెక్రటరీ. పాటిబండ్ల సీతారామయ్య హైస్కూల్‌కు జాయింటు సెక్రటరీగా 'మోడల్ ఎలిమెంటరీ పాఠశాల శక్రటరీ' జిల్లా భారత్ స్కౌట్సు అండ్ గైడ్సు వైస్‌ప్రెసిడెంటు 7 సంవత్సరములు, ఏడు పబ్లికు రేడియోలు ఆరంభించి, వీనికి ప్రారంభోత్సవము శ్రీ యస్. కె. డే గారిచే చేయించిరి. జీర్ణ దేవాలయ పునరుద్ధరణ కార్యక్రమము క్రింద తాడికొండ దేవాలయ పునరుద్ధరణ చేయించిరి. వీరిపేరుతో తాడికొండలో యల్. యఫ్. డిస్పెంసరీకి భవన నిర్మాణము జరిగినది. రూరల్ హెల్తు

సెంటర్ తాడికొండలో స్థాపించబడినది. ఆంధ్రప్రదేశ్‌లో ఇవి నాల్గు మాత్రమే కలవు. దీనిని వైద్యకళాశాలా విద్యార్థుల శిక్షణ నిమిత్తము ప్రభుత్వము తీసికొన్నది. ఈ సెంటరు 'హౌస సర్జన్సు' కెంతయో ఉపయోగకారి. తాడికొండలో ఓరియంటల్ కాలేజి నిర్మాణములోను, మూడు జిల్లాలకు ఉపయుక్తముగు 'రీజనల్ క్యాంపింగు సెంటరు'కు భవన నిర్మాణములోను, పశువైద్యశాల నిర్మాణములోను, గుంటూరులోని జాగర్లమూడి కుప్పుస్వామి కాలేజి స్థాపనలోను పాటిబండ్ల సీతారామయ్య హైస్కూలు నిర్మాణములోను చిలకలూరిపేట, అమరావతి కాలేజీల నిర్మాణములోను ఈయన విశేషముగ కృషిసల్పెను. విద్యలేనిచో ప్రజాస్వామికము సఫలముకాదు, అనునమ్మిక విద్యావేత్త (The aim of education is to foster democracy in U. S. A.') సాహిత్యాభిమాని.

## 4. శ్రీ కొల్లా సుబ్బారావు యం. ఏ. నాగులపాలెం

జననం ది 8-7-1928 జన్మస్థలం నాగులపాలెం చీరాల తా॥ విద్యాభ్యాసం. యుపీవ్యాలి- చీరాల, గుంటూరు, మద్రాసులలో; రాజకీయము కొంతకాలము గ్రామ పంచాయితీబోర్డు ప్రెసిడెంటు సమితి సభ్యులు — తాలూకా యువజన సంఘాధ్యక్షులుగా యువతరాన్ని ఉత్తేజపరచడానికి కృషిచేసారు. విద్యార్థి దశనుండియే యం. యన్. రాయ్, కవిరాజు త్రిపురనేనివంటి భావాల మేలి సీసలలో విజ్ఞత గడించటానికి శ్రమించినారు. హ్యూమనిస్టు ఉద్యమ సమీక్ష పత్రికా సంపాదక వర్గ సభ్యుడు అఖిలభారత రినైజన్సు ఇన్‌స్టిట్యూటులో జీవిత సభ్యులు. రాడికల్ హ్యూమనిష్టు అసోసియేషను సభ్యులు. ఎ. యస్. హైస్కూలు (జాగర్లమూడి) కార్యనిర్వాహకులు సంస్కరణ దృష్టి, హేతువాద సాహిత్య సృష్టి ఆశయాలు. రచనలు - హ్యూమనిష్టు విద్యావిధానము ఇతరవ్యాసాలు

బుద్ధభగవానుని హేతువాదము, విభజ్యవాదమునందు నమ్మకము గలవాడు. Buddha–No one should believe anything unless it accords with reason') విభజ్యవాదము అనగా Why and how అను ప్రశ్నలు వేసి సమాధానములు రాబట్టుటే. బుద్ధభగవానుని హేతుబద్ధమైన సరళిపోయి నేడు సనాతనుల మూఢనమ్మకములు, మతమౌఢ్యము వ్యాప్తియగుచున్నది. ఇది విచారకరము. నవీన యుగలక్షణమగు 'సెక్యులారిజమ్' మంటగలియుచున్నది. దీనిని విజ్ఞులు జాగ్రత్తగా గమనించవలయును.

5. శ్రీ దావులూరి రామమోహనరావుగారు

జననము 1932. జన్మభూమి ఎలవఱ్ఱు. విద్య : తురుమెళ్ళ, ఇంటూరు, తెనాలి. ఉన్నత పాఠశాలలలో 6 వ ఫారము వరకు చదువు. ప్రజాసేవ : ప్రజలకు సేవచేయు సంకల్పముతో రాజకీయములో ప్రవేశించిరి. యలవర్రు పంచాయతీలో వైస్‌ప్రెసిడెంటు. నేడు అమృతలూరు పంచాయతీ సమితి అధ్యక్షులు. ఈసమితిలో కొన్ని సంస్కరణముల ప్రవేశపెట్టిన యువకుడు. ఎవరికే పనికావలసిన పదిపైసలకార్డు వ్రాయండి; ఆపనిచేసి పెట్టెదను, ఎవరు ఆఫీసుకు 'రావలదు' అనిచెప్పు రాజకీయవేత్త. నెపోలియన్‌వలె దృఢదీక్ష, పట్టుదల, కార్యాచరణము గల యువకుడు. 'నా నిఘంటువు'లో అసాధ్యమనునదిలేదు. అనిపల్కు వీరుడు (Napoleon Impossible is not to be found in my dictionary) ఏపార్టీవారైన ప్రజాసేవ కిట్టివారు అర్హులు

6. శ్రీయుత యలవర్తి హనుమంతరావుగారు - బోడపాడు

జననము ది 3—10—1937 బోడపాడు. విద్య – తురుమెళ్ల, నిడుబ్రోలు ఉన్నత పాఠశాలలో యస్. యస్. యల్. సి. కాలేజి చదువు పి బి. యన్. కాలేజి నిడుబ్రోలు, ఆలిఘర్ విశ్వవిద్యాలయములో బి. ఏ. వరకు చదివి మధ్యలో మానెను. సత్కార్యములు–బీదలయందు అభిమానము. శ్రీమంతుడైన రైతు. అనేక బస్తాలు ధాన్యము ధనము ధర్మమొసంగుదాత పాతవిద్యార్థి సంఘ సభ్యుడు. నిస్వార్థపరుడై రాజకియ రంగమునజేరి ప్రజాసేవ చేయదలంచెను. (Gandhi – And as I Cannot render this service without entering politics I find myself in them) ఇది సహజవాంఛయే.

7. శ్రీ జాలాది గోపాలకృష్ణమూర్తిగారు మోపర్రు

జననము ది 22—4—1934 మోపర్రు. 6 వ ఫారము వరకు జి. సి. బి హైస్కూలు తురుమెళ్ల. కోయంబత్తూరు యల్. ఏ. ఇ. 3 ఏండ్లు చదువు ఉద్యోగము ఆరంభము 1955 మోటార్ వెహికిల్సు ఇన్‌స్పెక్టరు ప్రొద్దుటూరు, పార్వతీపురము విజయవాడ – విశాఖపట్టణము – కాకినాడ ప్రస్తుతము 'ఏలూరులో ఉద్యోగము. సత్కార్యములు – జీర్ణ దేవాలయ నిర్మాణములో చందాలు, బీదపిల్లలకు సహాయము. మోపఱ్ఱు పాతవిద్యార్థి సంఘ సభ్యుడు. సాహిత్యమునందు అభిమాని. ఉద్యోగము తన జీవిత లక్ష్యమని (Be all and end all of life) భావించనివ్యక్తి. తన పరిధిలో ననేకమందికి

సాయపడిన ఉదారులు. (Duty first, pleasure next) అను సిద్ధాంతము నందు నమ్మికగలవారు. స్వధర్మ నిర్వహణము చేసికొనుచు బీదలకు సాయపడిన వ్యక్తి.

## 8. శ్రీయుత పాలడుగు బాపయ్యగారు - మోపఱ్ఱు

జననము — ది 10—6—1928 మోపఱ్ఱు. విద్య — మోపఱ్ఱు ప్రాథమిక పాఠశాల, తురుమెళ్ల ఉన్నత పాఠశాల. గుంటూరు — ఇంటర్ మీడియట్. వాల్తేరు — యూనివర్సిటీ కాలేజి వాల్తేరు ఉద్యోగము — కో-ఆపరేటివ్ సీనియర్ ఇన్‌స్పెక్టరు కో-ఆపరేటివ్ సబ్ రిజిష్ట్రారు — బ్లాక్ డెవలెప్‌మెంటు ఆఫీసరు. ఉదయగిరి. ప్రస్తుతము తెనాలి బి. డి. ఓ. అభిరుచులు — సాహిత్య పోషకులు మోపఱ్ఱు పాత విద్యార్థి సంఘ సభ్యుడు, నిరాడంబరజీవి, పరోపకార పరాయణుడు, ఉద్యోగ ధర్మముల నిర్వహించుచు తన పరిధిలో ననేకమందికి సాయపడిన ఉదారుడు.

## ఇతిహాస పరిశోధకమాలకు పోషకులు

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీమతి పద్మజ అనసూయ | ప్రిన్సిపాల్ | స్త్రీల కళాశాల గుడివాడ |
| 2. | శ్రీ ఎర్నేని వెంకటేశ్వరరావు | ,, | ఏ. యన్. ఆర్. కాలేజి గుడివాడ |
| 3. | ,, లక్ష్మీకాంతరావు | ,, | వి. యస్. ఆర్. కాలేజి తెనాలి |
| 4. | ,, — | ,, | కాలేజి గన్నవరము |
| 5. | ,, — | ,, | కాలేజి చిలకలూరిపేట |
| 6. | ,, యస్. సుందరమ్ | ,, | భావనారాయణ కాలేజి బెజవాడ |
| 7. | ,, పా. వేంకట్రామయ్య | ,, | హెడ్మాష్టరు మోపఱ్ఱు హైస్కూలు |
| 8. | ,, సత్యనారాయణ | ,, | ,, ఉండ్రాజవరము |
| 9. | ,, నారాయణరావు | ,, | ,, సంగంజాగర్లమూడి |
| 10. | ,, ఘంటా సాంబశివరావు | ,, | ,, యం. యన్. హెచ్. యస్. గూడవల్లి |
| 11. | ,, — | ,, | జి. ప. హైస్కూలు పామఱ్ఱు |
| 12. | ,, — | ,, | ,, గరల్సుహైస్కూలు గన్నవరం |
| 13. | ,, యం. మధుసూదనప్రసాద్ | ,, | ,, వేటపాలెము |
| 14. | ,, కొడాలి వేంకటేశ్వరరావు | ,, | ,, ఎడ్లపల్లి |

| | | | |
|---|---|---|---|
| 15. ,, వేంకటేశ్వరశర్మ | ,, | ,, | పసుమర్రు |
| 16. ,, కొడాలి పరశురామయ్య | ,, | ,, | దుగ్గిరాల |
| 17. ,, పూల రామారావు | సర్పంచి | | చెరుకుపల్లి |
| 18. ,, సోం. శివరామకృష్ణయ్య | ,, | | అమృతలూరు |
| 19. ,, ఆ. సూర్యము | ,, | | గోవాడ |
| 20. ,, జా. లక్ష్మయ్యబాబుగారు సాహితీప్రియ | | | కారంచేడు |
| 21. ,, శ. వేంకటసుబ్బమ్మగారు | ,, | | ,, |
| 22. ,. కొ. మల్లికార్జునరావు | ,, | | వీరన్నపాలెము |
| 23. ,, గ. వేంకటకృష్ణయ్య | ,, | | అమృతలూరు |
| 24. ,, నామగిరి గంగరాజు | ,, | | నిడదవోలు |
| 25. ,, క్రొ. శ్రీరాములు | ,, | | ,, |

## భారతీయ సంస్కృతిపై అభిప్రాయములు

'చారిత్రక శిరోమణి' శ్రీ కొడాలి లక్ష్మీనారాయణ వ్రాసిన ఈ గ్రంథం నేటి యువతరానికి అత్యావశ్యకం ............ శ్రీ వాసవ్య—జనసందేశ్ ది 20—5—69

'.... .... .... .... .... .... .... .... భారతీయేతిహాస పరిశోధనలు చేస్తున్న శ్రీ కొడాలి వారు ఇదివరలో అనేకములైన అమూల్య గ్రంథాలను రచించి ప్రకటించారు. వీరి రచనలు విద్వద్విమర్శకుల మన్ననలను, మెప్పులను పొందాయి. అట్టి రచనలలోనిదే ఈ భారతీయ సంస్కృతి. సంస్కృతి శబ్దానికి పలువురు పలురకాలుగా అర్థం చెబుతున్నారు. "సంస్కృతి అన్నను మతము అన్నను, నిజమైన విద్య అన్నను ఒకటిగానే కాన్పించుచున్నది." అని రచయిత అభిప్రాయము. ఈయన సంస్కృతిని 4 విధాలుగా విభజించారు. ఆధ్యాత్మిక సంస్కృతి, శారీరక సంస్కృతి, మానసిక సంస్కృతి, సారస్వత సంస్కృతి అని, వాటినిగురించివివరాలు, ఆసంస్కృతులలో భారతదేశం స్థానం ప్రాచీన కాలంనుంచి వివిధరంగాలలోని సంస్కృతి వివరణ తెలుపబడినది. మత విషయక సంస్కృతిని వివరించేపట్ల వేమనయోగిని ఆదర్శంగా గ్రహించి, ఆయనజీవిత విశేషాలు వివరింపబడ్డాయి.

సంస్కృతి భాగాలయిన వాస్తు, శిల్ప, గాన, నృత్యకళలను గురించిన్నీ కూడ చెప్పబడింది. అక్కడక్కడ విషయస్పష్టతకోసం, ప్రామాణికతకోసం ఆంగ్ల భాగాలు ఉపహరించబడినవి. వివిన్నరూపాలలో ఉన్న భారతీయ సంస్కృతిని గురించి తెలుసుకొనుటకు ఈ పుస్తకము బాగా ఉపయోగిస్తుంది. ఇది రచయిత పరిశోధనలకు మచ్చుతునక. అందరు చదవతగినది.

సాహిత్యప్రియ — ఆంధ్రజ్యోతి, ది 6—10—1968

Total - 218



# BIBLIOGRAPHY

E. B. Havell - Benares, the sacred city
- Aryan rule in India
Thomas - India, land of the black Pagoda
Archelogical survey of India -
Annual reports, 1906 - 1907.
Dr. Edward C. Sachau - Alberuni's India.
Encyclo Brita Vols.
Imperial Gazetteer - Volume II.
Reginal Heber - Narration of journey through
the upper provinces of India Vol I.
William Daniel - The oriental Annual.
William Howard Russell - My diary in India, Vol. I
Ranjit Sitharam Pandit - (Tr) Rajatharangini.
B. Majundar - A guide to Sarnath.
Beal S - Buddhistic records of the western world
Cowell E. B. - The Jataka tales.
Kern H - Manual of Buddhism.
A. A. Macdonall - India's past.
- A history of Sanskrit literature.
R. C. Dutt - Ancient India
S Ch Pradhan - Ancient Indian chronology.
Hemachandra Rai Choudry - Political history
of Ancient India.
J. Takakusu - A record of the Buddhist religion
as practised in India.
S stevenson - Heart of Jainism
K. R. Subrahmanyam - Andhra history
Rhys Davids - Buddhist India
V. A. Smith - Early history of India
- Oxford history of India
- Asoka
G W Hastings - A vindication of Warren Hastings
S. N Veerappan - The holy Benares in Pictures
Pandit Sheo Narain - Saranath
B. N Roy - Benares and Saranath
James Legge - Travels of Pahiyan.
T Watters - On Yuan Chwang's travels (2 Vol.)
Samuel Beal - Life of Hiuen Tsiang
R N. Mehta - The Buddhist India etc.

# సంపుటములుగా ముద్రించనున్న గ్రంథములు

1 వ సంపుటము : చారిత్రక శ్రీశైలము – భారతీయ సంస్కృతి – చారిత్రక కాశీ క్షేత్రము.

దేవాలయ గ్రంథాలయములకు కొన్ని రికమెండు చేయబడినవి. చూడుడు - L. Dis. No. J 3/2096/71 దేవాలయ కమీషనరుగారి ఉత్తరు ది 12–1–71

2 వ సంపుటము : వాల్మీకిరామాయణ విమర్శనము, మహాభారత విమర్శనము, భారతీయ సమాజముపై ఆంగ్ల విద్యాప్రభావము.

3 వ సంపుటము : భారత విదుషీరత్నములు – నాగార్జున చరిత్ర – ఆర్యదేవుని చరిత్ర – అశ్వఘోషుని చరిత్ర – బసవేశ్వరుని చరిత్ర – తెనాలి రామలింగని చరిత్ర – ప్రాచీన గణితశాస్త్ర వేత్తలు – నాగలింగము చరిత్ర – నన్నెచోడుడు – అల్లూరి సీతారామరాజు – ముసునూరి వీరులు – కృష్ణదేవరాయలు – ప్రాచీన యోగులు – రామానుజాచార్యులు – రాయభట్టు వీరరాఘవకవి చరిత్ర.

4 వ సంపుటము : ఆంధ్రుల చరిత్ర - ప్రాచీన ఆంధ్ర గ్రంథాలయ చరిత్ర - ప్రాచీన భారతీయ గ్రంథాలయ చరిత్ర.

5 వ సంపుటము : విస్మృత ఆంధ్రనాయకుల చరిత్ర - సూర్యదేవర రాజన్య చరిత్ర - ప్రాచీన ప్రజాస్వామికములు - సామాజిక పథకములు - వివాహముల చరిత్ర.

6 వ సంపుటము : అన్ని ఇంగ్లీషు పుస్తకములు 7, 8, 9, 10 సం. లు - మిగత వ్యాసములు, పుస్తకములు.

ఇట్లు
ప్రొప్రయిటరు ఇతిహాస పరిశోధకమాల
మోపర్రు
తెనాలితాలూకా-ఆంధ్రప్రదేశ్

